# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

ఆగస్టు 1962

సంపుటము 39 : : సంచిక 8

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1962

# వేదనా వాసుదేవము

శ్రీ నాయని సుబ్బారావు

నీ సకలమ్ము కొల్చి వరణీయపు పద్దెములన్నగా దెలన్
బోసెద నిండుగా ననుచు పూని యహోమయ మానసమ్మునం
దో సకలేశ! చిక్కువడు నూహల చిక్కుల జిక్కియేమి యీ
మోసము వచ్చె! నిన్ గొలుచు పూనిక తానొక పిచ్చమానికై!

సులభుడవంట భక్తులకు చూడగ నేర్చినవారికెల్ల విం
తల గుడి యీ చరాచరమునన్ ప్రతివస్తువునందు చిక్కగా
కలవడియుండువంట నినుకట్టుట యెంతని విఱ్ఱవీగు నా
తలపుడివోవ మాయల నిధానము తీసెదుపో జగత్పతీ!

ఇదె యిదె నాదు దొడ్డదొర యింతట నంతట దాపురించె నా
యెద పదిలింతునంచు వెలయింతు నిరంతర పద్యబంధమా
పదవిధి దోచు నే శిథిలబంధము సందున నో మదాశయ
మ్మదవదగాగ దూసికొనెదక్కట! టక్కులమారి దొంగవై!

నా తలపెల్ల శూన్యమయి నా కనుగోనల శోకబాష్పముల్
నూతులు త్రవ్వ నీకయిన నూతనమత్కృతిబద్ధభక్తిమ
ద్గీతములన్నియున్ వికల గీర్వాలనమ్ముల కప్పదాటులై
రీతులు తప్పి నా బ్రతుకు రేకలు కీడ్చెడు పిచ్చిగీతలై!

నా జనకుండు సర్వసుజన స్తవనీయపవిత్రవర్తన
శ్రీ జయధాము డెల్లపుడు చిత్తమునన్ భవదీయమూర్తి సం
యోజనమై తరించిన మహోదయు డాయనభక్తియెల్ల ని
ర్వ్యాజత నన్ను పట్టదిరా! నినుపట్టెదరా! యెటైనన్

నా జనయిత్రి దీనజననందిని భాస్కరమండలాంతర
భ్రాజితు నిన్ను గన్గొనక పారణ సేయని నిత్యభక్తి దీ

ఆ జయలక్ష్మి తద్విమల గర్భమునన్ చిరపుణ్యపాకమై
యీ జని విచ్చె భవ్య భవదీయ పదార్చన కొక్కపూవుగాఁ !

పదములు నాభియుఁ గనులు బాహుముఖమ్ములు దివ్యపద్మముల్
మది కమలాక్ష మీ పనికిమాలిన చిల్లరగడ్డిపూవు నా
యెద కిదియేమి యించునని యెంచక నన్ను కృతార్థుజేయవే!
యిది తమమేనక్రొవ్వలపులీనును లే! యిది విష్ణుకాంతమై.

వారు మహాత్ములైన కవివర్యులు సారమతిప్రభావులై
కూరుచు నొక్కపద్యమున కొల్వొనరించి మదీయపద్య సం
భారమునన్ రవంత కనుపట్టక చాటయిపోదు వీ తిర
స్కారము నీకు కావ్యరసకంధికి మేలటవే! జగత్కవీ!

పదములు తొట్రిలఁ హృదయభావము లౌచితి యొప్పగా రసా
భ్యుదయముగాగ నీకు నయి పూని వెలార్చెడు దారిలో భవ
త్పదములు పట్టుకొల్పగల భక్తి కొఱంతయి నాకు నీ మహా
పద గడవంగబెట్ట ప్రభావా! మరి యెవ్వరు నీవు దక్కగన్!

# ఆర్యదేవుని చరిత్ర

శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ

బౌద్ధులకు నాల్గు దార్శనిక సాంప్రదాయములు గలవు. అవి (1) సౌత్రాంతిక, (2) వైభాషిక, (3) యోగాచార, (4)మాధ్యమిక మార్గములు. మొదటిరెండును హీనయానశాఖకు జెందినవి. చివర రెండును మహాయానశాఖకు జెందినవి. సౌత్రాంతిక మతస్థాపకుడు కుమారలబ్ధుడు క్రీ. శ. 200 ప్రాంతపు వాడు.[1] మాధ్యమిక మత స్థాపకుడు అశ్వఘోషుడను బ్రాహ్మణ విద్వాంసుడని కొందరు వ్రాసిరి. కాని అంతకుపూర్వమే దాని బీజములు బౌద్ధమతములో గాన్పించుచున్నవి. మాధ్యమిక మతమునకు ముఖ్యమైన దర్శనశాస్త్రము 'మూలమాధ్యమకారిక' 'నాగార్జునుడు' అను మరియొక బ్రాహ్మణ విద్వాంసునిచేత రచించబడియున్నది. ఈ గ్రంథమునకు 'చంద్రకీర్తి' టీక రచించుచు, నిందు 'శతక చతుష్టకము, శతకశాస్త్రము, ఆర్యదేవపాదీయము అను 'ఆర్యదేవ' రచితములైన గ్రంథములను బేర్కొనెను. ఈ 'ఆర్యదేవుడు' నాగార్జునుని శిష్యుడే. మాధ్యమిక మతమునకు మరియొక ముఖ్యమైన దర్శనశాస్త్రము, పైన దెల్పిన 'శతకశాస్త్రము, లేక చతుశ్శతకము'. 'ఈయన 15 వ మహాయాన మతాచార్యుడని (15 th Patriarch) దేవబోధిసత్వ, ఆర్యదేవ, నీలనేత్ర, కాణదేవ నామములతో విలసిల్లెనని, నవగ్రంథ నిర్మాతయని 'ఐటల్' (Eitel) అను విద్వాంసుడు వ్రాయుచున్నాడు.[2]

ప్రాగ్దిశలో అశ్వఘోషుడు దక్షిణమున ఆర్యదేవుడు, పశ్చిమమున 'నాగార్జునుడు', ఉత్తరమున 'కుమారలబ్ధుడు' అనువారలు భాను చతుష్టయముగా 'హౌనుత్సాంగు' అను చైనీయ యాత్రికుడు వ్రాయుచున్నాడు.[3] 'ఎవాన్సు వెంట్సు' అను విద్వాంసుడు, మహాయానశాఖకు జెందిన ఆరుగురు ప్రఖ్యాత బౌద్ధమతాచార్యులలో 'ఆర్యదేవుడు' ఒకడు అని, నాగార్జునుడు స్వయముగా శిక్షణ నొసగిన శిష్యుడని వ్రాసెను[4]. నాగార్జునుని, సౌత్రాంతిక మత స్థాపకుడగు 'కుమారలబ్ధ'ని, వారి సమకాలీనులగు 'ఆర్యదేవ, అశ్వఘోషు' లను గూర్చి, 'కెరన్' ప్రశంసించెను.[5] ఖండ ఖండాంతర ఖ్యాతినిగన్న అశ్వఘోష, నాగార్జున, (ఆర్య) దేవుల చరిత్రలు చైనీయభాషలోనికి క్రీ. శ. 387—418 మధ్య కాలమున చైనాదేశములో గడపిన 'కుమారజీవుడ'ను బౌద్ధభిక్షువు మార్చెను. క్రీ. శ. 405 లో నీ యనువాదము జరిగియుండెనని 'వింటర్‌నిట్జ్' అను విద్వాంసుడు 'ఇత్సింగు' వ్రాతల నాధారము చేసికొని వ్రాయుచున్నాడు. ఇది సత్యముగానే కాన్పించుచున్నది. జంబూద్వీపములో నాదికాలమున 'నాగార్జున', దేవల, అశ్వఘోషులనువారు ప్రఖ్యాతిగాంచిరని 'ఇత్సింగు' వ్రాసెను.

("They become famous in Jambudwipa—Such were Nagarjuna, Deva, Aswaghosa"). అట్టి ఆర్యదేవునిగూర్చి తెలిసికొందము.

## ఆర్యదేవుని పేర్లు

దేవ, ఆర్యదేవ, కాణదేవ, నీలనేత్ర, కంద్రకిష్టి, దేవబోధిసత్వ మున్నగు పేర్లన్నియు యిమ్మహానీయునికి జెందుచున్నవి. 'ఈయన నిజమైనపేరు 'కంద్రకిష్టి' యని ఆయన బుగ్గల మీద రెండు మచ్చలున్నవని, అవి కండ్ల వలె నుండెనని, అందుచేత 'నీలనేత్ర' యని పిల్చుచుండిరని 'ఏకాక్షి' యగుటచేత కాణదేవుడనుచుండిరని, ఇత్సింగువ్రాతలు, 'నాంజియో' తెల్పుచున్నవి.'[6]

---

1. A. B. Keith—Kumaralabdha is a contemporary of Nagarjuna (A. D. 200).

2. E. J. Eitel—A Hand book of Chinese Buddhism. p. 43.

3. Watters—On Yuan Chuang. p. 286- "Aswaghosa in East, Deva in South, Nagarjuna in west, Kumaralabhdha in the north, were called the four shining suns."

4. W. Y. Evans Wentz—Tibetan Yoga and Secret Doctrines. "Aryadeva is one of the six most illustrious patriarchs of the Mahayana school of Buddhist·Philosophy. He was a disciple under the personal direction of the great sage 'Nagarjuna.'

5. H. Kern—Manual of Indian Bud dhism. p. 124. "The reputed founder of the Madhyamika school is 'Nagarjuna', where as his contemporary 'Kumaralabdha' is said to be the originator of the 'Southrantika System.' As two other celebrated Con. temporaries figure 'Aryadeva and Aswaghosha,"

6. Itsing—Translated by Takakuru—'Kanadeva because he was one eyed—(Record of the 23 Patriarchs-Vol. VI) or Neelanetra. He had two spots like eyes on his cheeks, but his real name was 'Kandrakisti'—Also see 'Nanjio.'

మరణించుటకు కొలదికాలముముందే 'మహేశ్వరుని ఒక ఉత్సవ సమయములో గలిసికొని, ఆయన కొక కన్ను లోపమును గుర్తించి, తన నేత్రము నొకదాని నొసగెనని, అప్పటినుంచి ఈయనను 'కాణదేవుడు' అని పిల్చుచుండిరని, ఈయన వెళ్ళిన రాజ్యములో 'మహేశ్వరుని' స్వర్ణ విగ్రహము గలదని, అది 6 అడుగులు పొడవు, 2 అడుగులు వెడల్పు, 9.2 అంగుళములు మందముండెనని మరియొక విద్వాంసుడు వ్రాయుచున్నాడు[7]. క్రీ. శ. 2 వ శతాబ్దములో 'మహేశ్వరుని స్వర్ణ విగ్రహము గల రాజ్య మేదియో తెలియకున్నది. 'ధేర దేవ, ఆర్యదేవులు' భిన్నులని, ధేరదేవుడు సింహళవాసియని, వీ రిరువురికి వాదనలు జరిగెనని కొందరు వ్రాసిరి. కాని, ఇది సత్యముగా గాన్పించదు. క్రీ. శ. 209 ప్రాంతమున సింహళ రాజుగానున్న 'టిస్స' కాలములో 'ధేరదేవుడు' నివసించెనని ఒక విద్వాంసుడు వ్రాసెను. (209 A.D.—It was in his reign that the Dhera Deva, whom we had occasion to mention, was living"). నాగార్జునుని (క్రీ. శ. 134—194) శిష్యుడైన 'ఆర్య' (దేవు) డిప్పటివాడే, కనుక, ఉభయులు ఒకరేయని నమ్ముచున్నాను.

## జన్మభూమి–కాలము–కులము–విద్యాభ్యాసము

ఈయన జన్మస్థలము దక్షిణ హిందూస్థానమని, వైశ్యుడని, నాగార్జునుని శిష్యుడని, కపిల, పాటలీపుత్ర ప్రాంతముల సంచరించెనని, భిన్న మతావలంబకుల బద్ధవిరోధియని 'ఐటల్' వ్రాసెను.[8] ఈ వ్రాతను జూచియే, నేను రచించిన నాగార్జున చరిత్రలో నీయన దక్షిణదేశీయుడని వ్రాసినాను. ఈయన సింహళద్వీపమునుండి వచ్చినట్లు 'హూ౟నుత్సాంగు' వ్రాయుటచేత, జన్మభూమి అదియే కావచ్చునని ఊహ గల్గుచున్నది. ("Devapusa came from "Senghala" to this monastery in order to have a discussion with Nagarjuna ). 'హ్యూలీ' (Hueli) అను 'హూ౟నుత్సాంగు' జీవిత చరిత్రకారుడుకూడ ఈ విషయమునే వ్రాసియుండెను. (Also Hueli-p.135).కనుక 'ఆర్యదేవుడు లేక ధేరదేవుడు' సింహళవాసియని నాగార్జునితో వాదము సల్పుటకు ఆంధ్రభూమికి వచ్చెనని చెప్పవచ్చును.

నాగార్జునబోధిసత్వనికాలము క్రీ. శ. 134—194 అని అస్మదీయ విరచిత నాగార్జున చరిత్రలో వ్రాసినాను. కనిష్కుని సభ జరిగిన సంవత్సరమున నీయన జన్మమని కొన్ని బౌద్ధ గ్రంథముల ఆధారమున తెలియుటచేత, కనిష్కుసభ కూడ క్రీ. శ. 134 ప్రాంతముననే జరిగియుండవచ్చును, నాగార్జునుడు స్వయముగా శిక్షణ నొసగిన శిష్యుడగుటచేత, ఆర్యదేవుడు' కూడ క్రీ. శ. రెండవ శతాబ్దమునాటివాడే యగుట ఖాయము. కుమారజీవుని వ్రాతలనుబట్టి 'నాగార్జునుడు' క్రీ. శ. 113—213 మధ్యవాడని, ఆర్యదేవుడు క్రీ. శ. 163—263 మధ్యవాడని, 'హరివర్మన్' అను కుమారలత శిష్యుడు క్రీ. శ. 260 లేక 270 ప్రాంతపువాడని 'వింటర్‌నిట్జ్' తన భారతీయ సారస్వత చరిత్ర రెండవ సంపుటములో వ్రాయుచున్నాడు. 'ఆర్యదేవుని' చిత్తవిశుద్ధిప్రకరణములో రాశి, వారక అను పదములు గలవని, యవన జ్యోతిషము క్రీ. శ. 2 వ శతాబ్దినాటికి భారతభూమిలో వ్యాప్తిలోనున్నదని, అందుచేత నాగార్జునునికాలము క్రీ. శ. 200 ప్రాంతమని కీత్ (Keith) అను పాశ్చాత్య విద్వాంసుడు వ్రాయుచున్నాడు.[10] 'ఆర్యదేవుడు, ధేరదేవుడు' భిన్నులని నాకు నమ్మకము గల్గలేదు. ధేరదేవుడు 'తిస్స' కాలములోని వాడగుటచేత, ఆయన క్రీ. శ. 209 ప్రాంతపువాడగుటచేత ఆర్య'దేవు'ని కాలముకూడ నదియే కావచ్చును. నాగార్జునియొద్దకు వచ్చునాటికే, ఆర్యదేవుడు సంస్కృతభాషలో గొప్ప పండితుడై, బౌద్ధం దర్శన శాస్త్రములన్నియు సమగ్రముగా జదివిన వాడుగానే కాన్పించుచున్నాడు. ఈ కారణముచేతనే, నాగార్జునునితో వాదించుటకు శ్రీపర్వతమని పేర్గాంచిన 'నాగార్జున' కొండకు బయలుదేరెను. మొత్తముమీద ఈయనకాలము క్రీ. శ. 150—225 అని చెప్పవచ్చును.

(ఆర్య)దేవుడు, వైశ్యకులమునకు జెందినవాడని 'ఐటల్' విద్వాంసుని వ్రాతల ఆధారమున వ్రాసినాను. కాని 'ల్యాల్' వ్రాసిన వ్రాతలనుబట్టి 'ఆర్యదేవుడు' దక్షిణ హిందూస్థానపు బ్రాహ్మణ కుటుంబమునకు జెందినవాడని తెలియుచున్నది.[11] ఈ విషయమింకను భారతీయ విద్వాంసులు పరిశోధించి, మేధస్సుకు పని గల్గించుకొని, ఆయన కుల గోత్రములను దేల్చెదరని నమ్ముచున్నాను.

---

7. "As he had before this time, given one of his eyes to 'Maheswara' when he met him at the festival, he remained blind of an eye and was surnamed 'Kanadeva'—Golden image of Maheswara—Deva went—He pulled one of them out.

8. E. J. Eitel—A Handbook of Chinese Buddhism p. 69—A native of South India, a Vaisya by birth, a disciple of Nagarjuna—A great opponent of heretics.

9. C. S. Srinivasachari—A History of India, p. 114 "Nagarjuna was born at the time of Kaniskha's council and became the greatest promoter of Mahayanism"

10. A. B. Keith—Buddhist Philosophy in India and Ceylon, p, 229.

11. Miss E. Lyall—'Deva (Aryadeva) was descended from a Brahmin family of South India.'

'ఆర్యదేవుని' విద్యనుగూర్చిన విషయము లేవియు దెలియకున్నవి. ఈయన గీర్వాణ భాషలో బండితుడని, అనేక శాస్త్రముల జదివినవాడని, మూర్ఖ నమ్మకముల ఖండించువాడని చెప్పవచ్చును. "ఒకానొక బ్రాహ్మణుడు లక్ష గాథల గ్రంథము వ్రాయగా, దానిని విశదీకరించుట కష్టతమమై యుండగా, నాగార్జును డొకసారి వినుటతోడనే గ్రహించగల్గెనని, 'కాణదేవుడు' రెండుసార్లు వినుటతోడనే గ్రహించగల్గెనని. ఎడ్కిన్సు వ్రాయుచున్నారు.12 దీనినిబట్టి, 'నాగార్జునుడు' ఏకసంథాగ్రాహి యని, ఆర్యదేవుడు ద్విసంథాగ్రాహియని చెప్పవచ్చును. క్రీ. శ. 660 లో జనిపోయిన, వామనునితోబాటు 'కాశికావృత్తి' రచించిన 'గాయాదిత్యుడు' రెండుసార్లు చెప్పించుకోకుండా ఒక్క పర్యాయమే విన్నంతమాత్రమున అర్థము చేసికోగల్గుచుండెనని 'ఇత్సింగు' అను చైనీయలేఖకుడు వ్రాసెను. ('He understood things which he had heard once not requiring to be taught twice"). వివేకానందస్వామికి కూడ నిట్టి శక్తి గలదు. ఇట్టి జ్ఞాపకశక్తి గల్గుటకు కారణము, వారి బ్రహ్మచర్యము, యోగము, బీజశ్శక్తి యని తెలిసికొనుడు. ఆంగ్లేయులలో 'మిల్టన్' రచిత Paradise Lost మున్నగు గ్రంథముల నప్పగించగల్గిన 'లార్డు మెకాలే'కు, 'గ్లాడ్ స్టను' ప్రధానమంత్రికి, అద్భుతమైన జ్ఞాపకశక్తి (Prodigious memory) గలదు. దీనికి కారణము వారి నియమ, నిష్ఠలలో గూడిన బ్రహ్మచర్యమే.

## ఆర్యదేవుడు, నాగార్జునుడు

నాగార్జునునిగూర్చి, ఆయన విద్యాలయమును గూర్చి విని, 'ఆర్యదేవుడు' దక్షిణదేశమునుండి, నాగార్జునునితో వాదించుటకు బయలుదేరెను. ఇట్టి మతసంబంధమగు వాదనలు ఆ కాలమున ననేకచోట్ల భారత వర్షములో జరుగుచుండెను. 'అశ్వఘోషుడను' బ్రాహ్మణ విద్వాంసుడు 'పూర్ణయశస్సు' అను బౌద్ధపండితునితో వాదించి, సర్వశూన్యము లేక శూన్యాత్ అను సిద్ధాంతము నంగీకరించి, పాటలీపుత్రములోనుండి ఆ మత ప్రచారము చేయుచు యోగియై (Mendicant) జీవితమును గడపెను.

'హూౌనుత్సాంగు' ఆర్యదేవుని రాకనుగూర్చి ఇట్లు వ్రాసెను. 'ఆర్యదేవుడు' నాగార్జునునితో వాదనలు సల్పుటకువచ్చెను. నాగార్జునుడు (ఆర్య)దేవునివద్దకు ఒక జలపూరితభాండమును బంపెను. (ఆర్య)'దేవు' డందులో ఒక సూదిని వదిలెను. దీనినిజూచి నాగార్జునుడిట్లు వచించెను: "ఆయన వివేకజ్ఞానము గలవాడు. (He is a wise man"). నాగార్జునుని శిష్యుడు అట్లేల చెప్పితివని యడుగగా, ఆ జలపూరితభాండము తన విశ్వ సంబంధమగు సంపూర్ణజ్ఞానమును సూచించునని,('ఆర్య)దేవు'డు దానిలోసూదిని విడుచుట, ఆ సర్వజ్ఞానము నాయన గ్రహించినట్లు సూచించునని తెల్పెను." ("Nagarjuna replied that the bowl full of water typified his own universal knowledge and the dropping of the needle signified Deva's comprehension of all knowledge"). తరువాత బౌద్ధమత రహస్యములనుగూర్చి వాదించుటకు (ఆర్య)దేవుని బిలిపించెను. (ఆర్య)'దేవు'డు వాదించుటకు ప్రయత్నించి విఫలుడాయెను. అంతట ఆయనను శిష్యుడుగా స్వీకరించి, బౌద్ధమత గూఢ రహస్యముల బోధించెను. నాగార్జునునివద్ద సమస్త విద్యలు, కళలు, శాస్త్రములు, దర్శన శాస్త్రములలోని మర్మముల (ఆర్య)'దేవు'డు నేర్చి, ఆయన అనుమతితో 'మగధ' లోని తీర్థకులతో వాదించుటకు బయలుదేరెను. 13

## మగధలో తైర్థికులతో వాదము

'హూౌనుత్సాంగు' పాటలీపుత్రములోని కుక్కుటారామమును వర్ణించి, అచట 100 బౌద్ధ సంఘారామములుగలవని, సత్ప్రవర్తన, పాండిత్యముగల భిక్షువులుండిరని, తీర్థకు లణచబడిరని, క్రమముగా బౌద్ధ సంఘము నశించెనని, వంశాను క్రమముగా క్షీణతగల్గెనని, తీర్థకులు గురు శిష్య పరంపరగా విద్య నొసంగుచుండిరని, అది యొక వృత్తిగా జేసికొనిరని, వ్యతిరేక పక్షమువారు పిలుపబడినపుడు వేలకొలది చేరిరని, గంటలు మ్రోగించుడని నినాదములు చేసిరని, పండితులను పిల్వుడని అరచు చుండిరని, నిరాడంబరులు అచటికి చేరుచుండిరని, గంటలు విపరీతముగా మ్రోగించిరని, తీర్థకుల ప్రార్థనమీద రాజా బహిరంగ సమావేశ మేర్పచెనని, తీర్థకులు గెల్చినచో బౌద్ధ సంఘారామములలో గంటల మ్రోతతో సభలను బిల్వరాదని, బౌద్ధులోడిరని, ఈ బాధ ద్వాదశవర్షము లనుభవించిరని, అపుడు (ఆర్య)దేవు'డను నాగార్జునుని శిష్యుడు, దక్షిణ దేశవాసి, పాటలీపుత్రమునకు బోయి తీర్థకులతో వాదించుటకు గురువు ఆజ్ఞను బొందెనని, (ఆర్య)'దేవు'డు పాటలీపుత్రము చేరెనని, అతని ఖ్యాతి నగరమంతటా వ్యాపించెనని, తీర్థకు లతని రాకనుగూర్చి విని, ఏ విదేశీయ భిక్షువు నగరములోనికి రాకుండ, ద్వారపాలకులచేత తలుపులు మూయించిరని, (ఆర్య)దేవుడు ప్రచ్ఛన్నవేషముతో వచ్చి, అరేయి సంఘారామములో నిద్రించి మరునాడు నగర ప్రవేశము గావించి, ఉదయమే సంఘారామములోని గంటను మ్రోగించెనని, తీర్థకుల కాందోళన గల్గెనని, (ఆర్య)'దేవు'డు

12. Joseph Edkins—"Chinese Buddhism. p. 78. "When a certain Brahmin wrote a work of 100000 Gathas, extremely difficult to explain, Nagarjuna was able to understand the whole at first hearing and Kanadeva, at the second hearing."

13. Watters—Yuan chwang Vol. 11—p. 200.

బహిరంగ సమావేశములో నెవరి వాదనల వారు తెల్పవచ్చునని కోరెనని, పండ్రెండు దినములు వాదించి, (ఆర్య)దేవుడు, తీర్థకుల నోడించెనని, రాజు మంత్రులు సంతోషితస్వాంతులైరని, దీని జ్ఞాపకార్థముగా పవిత్రమైన 'కుక్కుటారామమును' పాటలీపుత్రములో నిర్మించిరని 'హౌనుత్సాంగు' వ్రాసెను. (Watters-Vol II - p. 100). ఈ తీర్థకుల నోడించుటకు, నాగార్జునుడే స్వయముగా పాటలీపుత్ర నగరమునకు బయలుదేరెనని 'Fangchik' అను గ్రంథము తెల్పుచున్నదని విద్వాంసులు వ్రాసినారు.

("It may be noticed that in the 'Fangchik' it is Nagarjuna who goes to Pataliputra to con-front the Thirthakas").

కాని విద్వాంసుడైన నాగార్జునునిక్రింద శిక్షణ బొందిన 'ఆర్యదేవుడే' ఈ పని చేసెనని బహు విద్వాంసుల అభిప్రాయమై యున్నది.

'లామా తారానాథుడు' ఆర్యదేవుడు అశ్వఘోషుని మాంత్రిక విద్యంచేత నోడించెనని ("Aryadeva defeated Aswaghosa by magical arts ) వ్రాసెను. కాని ఇది చారిత్రక సత్యముగా గాన్పించుటలేదు. కనిష్కుడు, వృద్ధుడైన అశ్వఘోషుని ఆహ్వానించునాటికి ఆయనకు 60 ఏండ్లు ఉండవచ్చును. 'నాగార్జునుడు' క్రీ. శ. 134 ప్రాంతమున జన్మించుటచేత, ఆయన పర్యటన 20 వ సంవత్సర ప్రాంతమున నారంభించినచో అశ్వఘోషుని క్రీ. శ. 155 ప్రాంతమున గాశ్మీరములో గలసియుండవచ్చును. పర్యటన ముగించి ఈయన ఆంధ్రదేశములో సంఘారామమును నిర్మించి శ్రీపర్వతముపైన శిష్యులకు సమస్త శాస్త్రములు బోధించు విశ్వవిద్యాలయమును స్థాపించెను. ఈ విద్యాలయములోనే నాగార్జునుని ఆర్యదేవుడు గలసెను. తర్వాత ఈయన తీర్థకులతో వాదించుటకు పాటలీపుత్రము పోయినప్పటికి, 'అశ్వఘోషుడు' పాటలీపుత్రమున లేడు. ఆయన అప్పటికే కాశ్మీరమున వృద్ధుడై జీవితశేషమును గడపుకొనుచుండవచ్చును. కనుక 'ఆర్యదేవుడు' పాటలీపుత్రములో తీర్థకుల నోడించిన విషయము, అశ్వఘోషునికి ముడిపెట్టియుండవచ్చును. కనుక ఆర్యదేవుడు అశ్వఘోషుని ఓడించుట చారిత్రకసత్యముగా లేదు. కల్హణ రాజతరంగిణినిబట్టి, బోధిసత్వ 'నాగార్జునుడు' హుస్క, జుస్క, కనిష్కుల కాలములో కాశ్మీరములో నున్నట్లు చెప్పవచ్చును. ("Bodhisatwa Nagarjuna was the only lord ot the land in 'Kashmira' at the period ot the kings 'Huska, Yuska, and Kanishka'). నాగార్జునుడు అశ్వఘోషుని కాశ్మీరములో గలసియుండవచ్చును. కాని, ఆర్యదేవ, అశ్వఘోషుల కలయిక లేక వాదనలు సత్యముగా గాన్పట్టవు. అశ్వఘోషునివంటి శక్తిసంపన్నుడు ఆ కాలమున మరిఎవ్వరును గాన్పించరు. కాబూలుదేశపురాజగు 'కాత్యాయనీపుత్రుడు' కూడ 'అభిధర్మమను' పిటకముపై 'మహా విభాష' యను భాష్యము వ్రాయుటలో నశ్వఘోషుని సాయమును బొందియున్నట్లు తెలియుచున్నది. అట్టి అసమాన పాండితీ గరిమ గల మహనీయుని 'ఆర్యదేవుడు' ఓడించుట అసంభవము. కనుక పైది సత్యముకాదు.

'స్థవిరపార్శ్వ' యను గురువు అశ్వఘోషుని, 'ప్రతివారు సుఖముగా నుండుటకు, కష్టములు, దుఃఖములనుండి శాంతితో చిరకాలముండుట కేమి చేయవలెను?' అని అడిగినపుడు తీర్థకులు నిశ్శబ్దముగా నుండిరని, అపుడు 'పుణ్యవచస్సు' "మేము ప్రేమ, కరుణతో గూడిన ధర్మమును బోధించెదము" అని చెప్పెను. అపుడు 'అశ్వఘోషుడు' తన మధురస్వరంబుతో బాడెను. ఈ శ్రావ్యమైన స్వరమును విని, 500 మంది రాకుమారులు సంసార సాగరమునువీడి, బోధి ధర్మమును స్వీకరించిరి. 14 అట్టి శక్తి సంపన్నుడైన 'అశ్వఘోషుడు' ఆర్యదేవునితో నోడిపోయెననుట అసంభవము. తంత్రశాస్త్రము మాత్రము గురు శిష్య పరంపరగా బోధించబడెనని తారానాథుడు వ్రాసెను కాని, దీనిని ధ్రువపరచుట కాధారములులేవు."

## కాణదేవుని సిద్ధాంతములు

కాణదేవుడు నిత్యము మూడు సిద్ధాంతముల జెప్పసాగెను.

(1) ఋషులందరిలో బుద్ధుడు ఉత్తమోత్తముడు.

(2) బౌద్ధసిద్ధాంతములో నే సిద్ధాంతము సాటిరాదు.

(3) బౌద్ధభిక్షువుతో సాటియైనవాడు భూమండలముపై నెవరునులేరు. 15

---

14. Teitaro Suzuki—'The Awakening of Faith. p. 28-"The Sthavira Parswa then said, "What shall we have to do, in order to keep the Kingdom in perfect peace, to have the king live long, to let the people enjoy abundance, and prosperity, all free from evils and catastrophies."

The Thirthaka was silent not knowing what to reply. Aswaghosha was obliged to bow—p. 30.

Punyavachas — "We teach a doctrine of love and compassion." p. 36.

Aswaghosha sang—"500 princes abandoned their worldly life and took refuse in the Bothi."

15. Joseph Edkins—Chinese Buddhism. "Kanadeva professed three theises. 1. Buddha is the most excellent of sages. 2. No Law can compare with the law of Buddha. 3 There is no happening on earth equal to that of the Buddhist monk.

ఈ మూడు సిద్ధాంతములనుగూర్చి 'నాతో ఎవరైన వాదించి, నన్నోడించినచో, నా శిరచ్ఛేదన చేయుట కంగీకరించె దను." వాదనలలో నోడిపోయిన మతమూర్ఖుడొకడు కాణ దేవుని ఎదుర్కొని, ఖడ్గముతో బొడిచివేసెను. అపుడు 'కాణ దేవుడు' ఒక ఖండన గ్రంథమును వ్రాయుచుండెనని ఒక విద్వాంసుడు, ధ్యాననిష్ఠాగరిష్ఠుడై యుండెనని మరియొక విద్వాంసుడు వ్రాసిరి. 16

ఈ హత్యా సందర్భములోనే శిష్యులందరు దుఃఖాతిశయంబున బరుగెత్తుకొనివచ్చిరి. ఆర్యదేవుని ఆఖరు వాక్కులిట్లున్నవి: "అన్ని పద్ధతులు, దర్శనములు శూన్యము. నేను లేను. నేను గాయపడజాలను. ప్రేమగాని, ద్వేషముగాని నేను పొందను. నా పూర్వ జన్మకు ప్రతిఫలమే ఇది. ఇది నేనేకాను" ఈ ప్రకారము పల్కుచు ఒక రెక్కల పురుగు ప్రాణము వీడి నట్లు ప్రాణము కోల్పోయెను. ("All methods and systems are empty. I do not exist and cannot be injured. I do not receive love or hatred from any. What that man has injured is the form of retribution for my past. It is not I myself."—He cast off the body, as a cicada does its outer covering—Edkins Chinese Buddhism. p. 78.)

ఈ ప్రకారము 'ఆర్యదేవుడు' యసువుల బాసెను. సింహళ ద్వీపవాసియైన ఈయన భారతదేశములో గడిపెనని ఈయన అస్థులుగల పాత్ర గుంటూరు మండలములో లభ్యమైనదని, 'గోపాలాచారి'గారు వ్రాసిరి.

## ఆర్యదేవ రచిత గ్రంథములు

'ఆర్యదేవుడు' సాంఖ్య, వైశేషికులనేగాక, ఇంకను 20 ఇతర మత శాఖలను 'లంకావతార సూత్రముల'లో పేర్కొన బడిన భిన్న మతావలంబకులను 'నిర్వాణ వివరము'అను గ్రంథములో నెదుర్కొనెను. ఈయన రచించిన 9 గ్రంథములలో మూడు గ్రంథములు 'టిబెట్'లో గలవు. మొదటివగు శతక శాస్త్రము (శతశాస్త్రము) నకు, 'శతక చతుష్టయ'మని చతుశ్శతకయని పేర్లు కాన్పించుచున్నవి. ఇవిగాక, హస్తబాలప్రకరణము, చిత్త విశుద్ధి ప్రకరణము, ఆర్యదేవుని కృతులని, 'కీత్' పండితుడు వ్రాసెను. భ్రమప్రమథనయుక్తిహేతుసిద్ధి, మాధ్యమిక భ్రమఘటనామము అనునవి 'ఆర్యదేవుని' కృతములని తెలియుచున్నది. (ఆర్య)దేవుడు రచించిన 'శతక శాస్త్రమును' జపానులో బౌద్ధులు కంఠస్థము చేయుచుండిరని విద్వాంసులు వ్రాసిరి17. దీనిని 'కుమారజీవుడు' చైనీయభాషలోని కనువాదము చేసెను. నాగార్జునుడు, నీలచక్షుసు (Blue eyed), అను 'ఆర్యదేవుడు' కలసి మాధ్యమిక శాస్త్రమును రచించిరి. ఇందులో 'ఆర్యదేవుడు 500 సిద్ధాంతములకు వ్యాఖ్య రచించెను. 'ప్రాణ్యమూల శాస్త్ర టీక'లో గూడ నాగార్జున, నీలనేత్రులు నిర్వాణప్రకరణమును రచించిరి. 'మాధ్యమిక భ్రమ ఘటనామ' మనునది జంబూద్వీపరాజు ప్రార్థనపై రచింపబడెనని, ఉపాధ్యదీపంకర శ్రీ జ్ఞానునిచేత క్రీ.శ. 980 లో టిబెటీయ భాషలోని మార్చబడెనని తెలియుచున్నది.

## ఆర్యదేవుని శిష్యులు

వైభాషిక భదంతుడు ఆర్యదేవుని శిష్యుడు. సుర, శాంతిదేవు లనువారు కూడ శిష్యులుగా పేర్కొనబడినారు. క్రీ. శ. 200 ప్రాంతపువాడగు 'ధర్మత్రాత' యనువాడు ఆర్యదేవుని శిష్యుడని 'కీత్' వ్రాసెను. 18 ఈ శిష్యులు వ్రాసిన గ్రంథములు తెలియుకున్నవి.

ఆర్యదేవునికి 'నాలందా' విద్యాలయముతో సంబంధము గలదని, తారానాథుడు వ్రాసియుండెను. కాని పాహియాను మన దేశమునకు వచ్చునాటికి, అది నిర్మాణములో నుండుటచేత 'తారానాథుని' వ్రాత సత్యదూరముగా నున్నది. కనుక క్రీ. శ. 4 వ శతాబ్దమునాటికి లేని నాలందా విద్యాలయము క్రీ.శ. 2 వ శతాబ్ది నాటికి వర్ధిల్లుచుండెనని వ్రాయుట సబబుకాదు. 'కెరకన్' అను విద్వాంసుడు కూడ ఆర్యదేవునికి నాలందా విశ్వ విద్యాలయముతో సంబంధము సత్యముగాదని వ్రాసెను.

గురువు బోధించిన 'శూన్యతను' ఈయన వ్యాప్తి చేసెను. చైనా, జపానులలో ఈ 'శూన్యత' నిశ్చయమైనసర్వాధికారిగా (Positive absolute) మార్చబడినది. ("Nothingness of Nagarjuna is transmuted into a very positive absolute in China and Japan.")

## ఆర్యదేవుడు భావవిప్లవకారుడు

ఆర్యదేవుడు ఆకాలపు సమాజములోని అంధవిశ్వాసములను, మూర్ఖ నమ్మకములను ఖండించెను. గంగానదిలో స్నానము చేసిన మోక్షము గల్గునని హిందువులు నమ్ముచుండిరి. ఆర్యదేవుడు 'చిత్తశోధన ప్రకరణము'లో వీని నిట్లు ఖండించెను.

---

16. "Deva composed the...hundred fold meditation and Ci bo Lune (400 Gathas) for the overthrow of error but a Thirthaka laid open the stomach and he died."

17. Sir Charles Eliot—Hinduism and Buddhism, Vol. III—p. 305. "The Satasastra of Deva is recited in Japan."

18. A. B. Keith—Buddhist Philosophy in India and Ceylon, p. 154.

ప్రతరన్నపి గంగాయాం
నైవశ్యం శుద్ధి మర్హతి
తస్మాద్ధర్మా ధియాం పుంసాం
తీర్థ స్నానంతు నిష్ఫలం॥

తా. గంగానదిలో మునుగు శునకము పవిత్రమైనదిగా దలంచబడలేదు. కనుక పవిత్ర పురుషులు పవిత్ర స్థలములని చెప్పబడువానిలో స్నానము చేయుట నిరర్థకము.

ధర్మోయది భవేత్ స్నానాత్
కైవర్తానాం కృతార్థతా
నక్తం దివం ప్రవిష్టానాం
మత్స్యాదీనాంతు కా కథా॥

తా. స్నానమే గుణమును గల్గించినచో బెస్తవాండ్రు యోగ్యతగలవారై యుండవలెను. ఇక చేపల సంగతి. రేయింబవళ్లు నీటిలో దిరుగు జంతువుల విషయము చెప్పనేల?

పాపక్షయోఽపి స్నానేన
నైవ స్యాదితి నిశ్చయః
యతో రాగాది బుద్ధిస్తు
దృశ్యతే తీర్థ సేవినాం॥

తా. ఎంతోకాలమునుండి జరిగిపోవుచున్న ఈ స్నానము వ్యర్థమని భావించబడకపోవటము సత్యము. ఏలననగా తీర్థయాత్రలు చేయు మనుజులు మోహము, ద్వేషము ఇంకను ఇతర దుర్గుణములచేత నిండియున్నారు.

బౌద్ధులు చాలాచోట్ల హిందువుల సిద్ధాంతముల, వర్ణ ధర్మముల, హిందూ దేవతల విమర్శించియున్నారు. సాధనమాల, వజ్రసూచి, తత్వసంగ్రహము, దోహాకోశము మున్నగు గ్రంథములలో హిందువుల మూఢ నమ్మకములను బౌద్ధులు ఖండించినారు. అట్టి విమర్శకులలో ఆర్యదేవు డొకడు. ఈశ్వర చంద్ర విద్యాసాగరుడు కూడ "నా దేశీయులు శాస్త్రములకు కట్టుబడి యున్నారనుట పొరపాటు; వారికి కావలసినది స్వార్థ పరత్వమే" అని పల్కెను. ఆర్యదేవుని చతుఃశతకమునుండి రెండు శ్లోకములు వ్రాయుచున్నాను.

ఆత్మైవ యది నిర్వాణం
జ్ఞానం పూర్ణం భవో భవేత్
తదభావైహి సంసారే
భావనాపి న విద్యతే॥

తా. ఆత్మనే నిర్వాణమని పరిపూర్ణ జ్ఞానమని సంసారమునకు హేతువని తలంచుచున్నారు. అది లేనినాడు సంసారమురాదు. దాని భావన పొడసూపదు.

అంతరాత్మా యదా న స్త్రీ
న పుమాన్ న నపుంసకం
తదా కేవలం అజ్ఞానాత్
భావస్ తే హం పుమాన్ ఇతి॥

తా. అంతరాత్మకు స్త్రీ, పురుష నంపుసక భేదము లేదు. నీ అజ్ఞానమువలన స్త్రీ పురుషు నపుంసక భేదమును సృష్టించుకొనుచున్నావు.

ఆర్యదేవుడు గొప్ప విద్వాంసుడు. సంఘసంస్కర్త. తన ప్రాణములనైన లెక్కచేయకుండ అంధ విశ్వాసములను ఖండించిన మహనీయుడు. అట్టి మేధావి 'జాన్సను' చెప్పిన కష్టముల నెదుర్కొనెను. ఆయన ఇట్లు చెప్పెను. "విద్వాంసుని జీవితము ఏ యే చెరుపులతో ముట్టడించబడునో గమనించుడు. శ్రమ, అసూయ, లేమి, పోషకుడు, కారాగారవాసము వీని నన్నిటి నాయన ఎదుర్కొనును 19. ఆర్యదేవుడును వీనిలో జాల భాగము నెదుర్కొనవలసి వచ్చెను. చివరకు ప్రాణములనే కోల్పోయెను. కాని అశ్వఘోష, నాగార్జున ఆర్యదేవులకు పోషకుల లోటులేదు. ఆకాలపు రాజులు, చక్రవర్తులు, యజ్ఞశ్రీ శాతకర్ణి, కనిష్కుడు మున్నగువారు పై విద్వాంసుల ననేక విధముల నాదరించిరి.

---

19. Johnson—"But mark what ills the scholar's life assail, Toil, envy, want, the patron and the jail."

# కనకాభిషేకము

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

### పాత్రలు

కేతినాయుడు — సూత్రధారుడు

రంగాజమ్మ — విజయరాఘవ నాయకుడు.

### భూపాలరాగం - ఆటతాళం

ఏలుకో శ్రీ దంతి వదన
ఏలుకో శ్రీ పార్వతీ సుత
ఏలుకో బృందారకార్చిత
ఏలుకోవయ్యా.

సకల మునులును సంస్తుతింపగ
శివుడు పార్వతి ముద్దు నెఱపగ
ప్రమథగణములు కొలువు తీరగ
ప్రభువవై విఘ్నముల నేలుచు
సర్వ లోకము లేలు స్వామీ
ఏలుకో శ్రీ దంతి వదనా . . . .

వివిధ నాట్యములందు
నేర్పరి వీవటంచును
శ్రుతులు చెప్పెడు
సవిధమున కేతెంచి మాకథ సాగనీ
విఘ్నేశ్వరాంక . . . . ఏలు

శ్రీ లెల్లప్పు డొసంగి యీ సకల ధా
త్రీ చక్రమున్ బాహు పీ
ఠీలగ్నంబుగ జేయ దిగ్విజయ మీ
డీకొన్న చందాన నే
వేళన్ సీతయు లక్ష్మణుండు దను సే
వింపంగ విల్ పూని చె
ల్వౌ లీలన్ తగు రాము డీ తెలుగు నే
లన్ ప్రేమ పాలించుతన్.

**కేతినాయుడు :** ఎవరు నువ్వు ? ఇక్కడికి వచ్చి ఏమిటి అల్లరి చేస్తున్నావు ?

**సూత్ర :** అయ్యా మేము ఎక్కలగాణలం.

**కేతి :** ఎక్కాలు—గణితం—రెండూ ఒక్కటే....

**సూత్ర :** అయ్యా ! మీరు పండితులవలె నున్నారు. నేను ఎక్కాలు అనలేదు. గణితం అనలేదు. మా కులంపేరు చెప్పాను. మేం ఎక్కలగాణలం.

**కేతి :** కులం పేరా .... కులాలు, గిలాలు మాకు పనికిరావు. ఇక్కడనుంచి పో.

**సూత్ర :** అయ్యా—మేం నాటకా లాడతాం .... ఇక్కడ ఒక యక్షగానం ప్రదర్శిద్దామని శ్రీ రాజేంద్ర ప్రసాదుల వారి ఆజ్ఞ మూలంగా వచ్చాం.

**కేతి :** అట్లాగా .... అయితే మేమూ వింటాం. మేం ఎవరో తెలుసా నీకు ?

**సూత్ర :** తెలియదు స్వామీ .... మీ పాండిత్యము ఇంతకు ముందు తెలుసుకొన్నాను. మీ వేషము చూస్తే ధార్షీట కపు పంతులల్లే ఉంది . . . .

**కేతి :** ఏయ్, వళ్ళు దగ్గర పెట్టుకు మాట్లాడు. నే నెవ్వరను కొంటున్నావు .... తంజావురం రాజ్యం ఏలే మహా ప్రభువులైన శ్రీ విజయరాఘవ నాయకులుంగారి ఆస్థానంలో అనేకమంది మహాకవులు వ్రాసిన యక్షగానా లాడిన సమయాల్లో కటికాధికారిని.

**సూత్ర :** తెలుస్తూ ఉన్నది స్వామీ—మీరు చాలా కటికవాళ్లని తెలుసుకుంటున్నాం.

**కేతి :** ఓయీ, మాకు చాలా పేర్లున్నవి. కటికి, కట్టియం, కట్టికీడు, కోలకేతడు, కేతినాయుడు, బాగుదారు, చోపుదారు, బరాబరి ఇవన్నీ మా పేర్లు.

**సూత్ర :** మరి స్వామీ, ఇంతకాలంలోంచి, ఇంతదూరాన్నించి యిక్కడికి ఎల్లా వచ్చారు ?

**కేతి :** ఇవ్వాళ యిక్కడ యక్షగానం చేస్తున్నారని తెలిసింది. కాలాన్ని చీల్చుకొని దూరాన్ని వాల్చుకుని వచ్చాం.

**సూత్ర :** మేము ఇక్కడ అయిత్వారాలల్లో యక్షగానాలు చేస్తున్నాం. తమరు విజయం చేయటం మాకు ఉభయ తోపట్టుగా ఉంది.

**కేతి :** ఓయీ, నీవు గొప్ప సూత్రధారుడులా ఉన్నావు. నీకు బాగా యక్షగానాల పరిభాష తెలుసల్లే ఉంది. అయిత్వారాలంటే ఆదివారాలు. ఉభయతోపట్టు అంటే ఉభయ తోముఖంగా ఆవును దానం పట్టటం .... మంచివేళకు వచ్చాం.

సూత్ర : అయితే కూకుండు, మేము కూత్తు కాయత్త పడ్తాం.

కేతి : మరి యిప్పుడేమి కూత్తు చేయబోవుచున్నావు ?

సూత్ర : శ్రీ విజయరాఘవ నాయకులుంగారు రంగాజమ్మ గారికి కనకాభిషేకం చేశారు. ఆ కూత్తు సేయబో తున్నాం.

కేతి : అయితే నీ కేరి చెప్పు.

సూత్ర : మా నివాసస్థానం చెప్పమంటున్నారా ..... మాది అనాదిలో కన్నడదేశం. పిఱుంద ఓరుగల్లు వచ్చాం ....

కేతి : అవును విన్నాం. మిమ్మల్ని గురించి క్రీడాభిరామంలో వల్లభామాత్యుడుగారు .... వ్రాశారు.

సూత్ర : తరువాత మేం తంజావూరు చేరాం. అది శాశ్వతంగా మా కేరి అయింది.

కేతి : ఎక్కలగాణాలు అంటున్నావేమి ?

సూత్ర : స్వామి, యక్షశబ్దం జక్కుల శబ్దం అయింది. జక్కుల శబ్దమే ఎక్కల శబ్దం అయింది. మేము జక్కుల మైగానం చేస్తాం గనుక మేము ఎక్కలగాణలం అయాం. మేము యీ ప్రబంధం వ్రాయబోయేటప్పుడు తమరు రావటం చాలా సంతోషం.

కేతి : ఎక్క నారాయణుం డెక్కడనో, తోక నారాయణుం డక్కడనే. ఇంతకు మన నాట్యానికి కడలాలిదోషం వచ్చింది. మన కిది ఉరాటం అయింది. మనకు ఉరతణీ రోజులు పో.

సూత్ర : అయ్యా, కటికంగారూ, మన మాటలు మాటాడితే యిప్పటి వారలకు తెలియవు. కడలాలిదోషమంటే వైధవ్య దోషం. ఉరాటమంటే ఉరిత్రాడు. ఉరతణి అంటే సత్కారం. కనుక మనం యీ కాలానికి తగినట్లుగా మాట్లాడాలి, ఆడాలి.

కేతి : నాకా మాటలు నాలిక్కి హవణిస్తై. ప్రమాదంగా, నేనా మాటలంటే నీ వర్థం చెప్పు.

సూత్ర : ఇదిగో నాటకం మొదలుపెడుతున్నాం. వాయదకాండ్లు వచ్చారు. మంచి నెట్లాటుగా ఉంది. దొరాదొరలు కూడిఉన్నారు. ముడుగు మొదలు పెడ్తున్నాము. అంతట శ్రీ విజయరాఘవనాయకులుంగారు ఇట్లే సభకు విచ్చేస్తున్నారు. ఎట్లనగా .... ?

త్రిపుట. లలితగాత్రుడు శుభచరిత్రుడు
దళితశత్రుడు సుజనమిత్రుడు
నళిననేత్రుడు విజయరాఘవ నాయకుండు

భూతలేశుడు సాధువర్యుడు
పృథుల శౌర్యుడు మేరు ధైర్యుడు
పండితార్యుడు విజయరాఘవ నాయకుండు

ధృతివిశాలుడు గానలోలుడు
సుకవిపాలుడు ధర్మశీలుడు
నతదయాలుడు విజయరాఘవ నాయకుండు.

కేతి : పరాకు స్వామి శ్రీ రాజగోపాల సేవా ధురీణ! సీమంతినీ మోహన పంచబాణ! విజయరాఘవ మహీపాల! విజయ లక్ష్మీ విశాల! పరాకు. దత్తావధానుండవై వినుము.

సూత్ర : యీరీతిగా విజయరాఘవ నాయకులుంగారు గాచారం దిట్టత కలిగియుండగా సభకు వేంచేసిన తరువాత వారి దివ్యాస్థానంలోని కవులు ఒక్కరొకరే విచ్చేస్తున్నారు. మొదటివారు కాళకవిగారు.

## అర్ధ చంద్రికలు

చదువులు పండిన సత్పండితుడున్
కదురులు నేర్చిన కార్య నిపుణుడున్
సదమల బుద్ధికి సౌరేజ్యుండున్
ముదిత మనస్కుడు పూజ్యగుణుండున్.

కేతి : ఏమయ్యా, వా రేమేమి గ్రంథములు వ్రాశారో చెప్ప వాయెను.

సూత్ర : కటికంగారూ, కాళికవిగారు మన్నారుగుడి క్షేత్ర మాహాత్మ్యం వ్రాశారు. దానిపేరు రాజగోపాల విలాసం.

కేతి : ఏమిటా గ్రంథం గొప్ప ?

సూత్ర :

## త్రిపుట

కృష్ణదేవుని యష్టభార్యల
అష్ట నాయిక లట్లు నెఱిపెను
ఇష్టముగ శ్రీ విజయరాఘవ
నృపతి ముదమందన్

అతని రచనా దివ్య నైపుణి
అద్భుతంబుగ సభలు మెచ్చగ
విపులకీర్తి విశాలుఁడై ధరణి
జనంబులు మెచ్చగన్ . . .

కేతి : సరేనయ్యా, మరి యింకా యెవరెవరు కవులు వచ్చారో చెప్పవేమి ?

సూత్ర : అదుగో కోనేటి దీక్షితులుగారు దయచేస్తున్నారు. అది యెట్లనగా—

## ఆది తాళం

పరిపంథి కవులకు నెల్లన్
సరికీర్తి జోకులు వెల్లన్

వ్రాసిన రచనల పద సమూహములు
దూసినట్టి సురవృక్ష ప్రసవములు.

కేతి : ఓయి సూత్రధారుడా, యీ కోనేటి దీక్షితులుగారు ఏమేమి గ్రంథములు వ్రాసిరయ్యా.

సూత్ర :

విజయరాఘవ కల్యాణ విదితమైన
యొక మహా ప్రబంధము వ్రాసి యొక్క సుదతి
మదనమంజరి యన్నది మదనతాప
మున జేసి విజయరాఘవ నాయకుని జూచి
ప్రసవబాణునిచేతా బాధాలు కడు పొంది
విజయరాఘవ నృపతి వెలదీని దయచూడ
పెండ్లి య్యైనట్టి యా ప్రియమైన
కథ వ్రాసె మదనా తాపమునన్.

కేతి : మరి యింకెవరు వచ్చారయ్యా ?

సూత్ర : కామర్స్ వెంకటపతి సోమయాజి వచ్చారు. వారు పట్టపు కవి. వారు ఎల్లా వస్తున్నారంటే—ఎల్లా వస్తున్నారో కామర్స్ పదం చెబుతాను.

## కాంభోజి రూపకం

రాజా సత్కృప నిండియుండగ
రాజితమ్ముగ నా
రేయి కన్నుల తొంగిచూడా
నాడ నీయాదూ
నడచునపుడూ ధరణి మిగుల
వడకాడునూ
ఈ పుడమిరేనికి అతనిమీదా
కరుణ గల్గునూ
కట్టిన ధోతి ధరణీతలము
ముట్టే నంటేనూ
పెట్టిన భూషనతు
ఇరుగూ పొరుగు పంచల
నిట్టలముగ వ్రేలగ
ఈ రేని వంకనూ
గట్టిగ భక్తి మెరపుచుండా
వారలు వచ్చిరి.

కేతి : మరి వారేమి గ్రంథాలు వ్రాశారయ్యా.

సూత్ర :

### జంపె

విజయరాఘవ చంద్రికా విలాసము వ్రాసె
మివుల నద్భుతమైన వ్యాదులతా సీమా
చిగురు వెన్నెలలోన శ్రీ విజయరాఘవుడు
మిగిలి విహరించు కథ భావనాసీమా
ఉరక వెన్నెలలోన నుర్వీకళత్రుండు
తిరుగునాళ్లే యింత కథగాగ వ్రాసెన్
లేత వెన్నెలలు వాలిన వెన్నెలలు
జారు వెన్నెలలు క్రొంజాలు వెన్నెలలు
తరపి వెన్నెల లందాన వెన్నెలలు
సుందర చంద్రికలు ధరాధవు మీద వ్రాలును
కేళకుళులును వోలె, కీలు జడలును వోలె,
వ్రాలు మబ్బులవోలె, వ్రాలు సంజల వోలె
ధరణిధవు మేనిపై, ధరణిధరు నొసలిపై
ధగధగల మిలమిలల తలతలల
మెఱయుగతి సుకవి యెంతో వింత సమకూర్చు
తెచ్చెన్.

కేతి : మరి యింకా యెవరు వస్తున్నారయ్యా.

సూత్ర : మన్నారుదేవుడు యువరాజుగారు విచ్చేస్తూ ఉన్నారు.

విజయరాఘవాభ్యుదయమ్మను విమలకావ్యమును
వ్రాసినవీరుడు
మఱి హేమాబ్జనాయిక పెండ్లి యమర్చిన కవి
లోకశిఖామణి
తెలుగు దువ్వలువ చెంగులువారగ చిపురుజోదు
వాహ్యాళి వచ్చెనాన్
నవరస రసికుడు నాయకసింహము నలినాక్షు డా
చనుదెంచిన గతి
కాసె, కుత్తినీ, కోక, చల్లడము, పగడపట్టు,
బురుసా, ధరియించుచు

కేతి : ఇంతేనా, ఇంకెవరైనా కవులు వస్తున్నారా ?

సూత్ర : ఇంకా చాలామంది కవులు వచ్చారు. వాయిదకాండ్లు సన్నాయి పాడుతున్నారు.

కేతి : అది సరేకాని, ఎక్కలగాణ నాయకా—అసలావిడ రాలే దేమయ్యా.

సూత్ర : ఆవిడ వేషం ధరిస్తున్నారు గాబోలు.

కేతి : ఇంతకూ ఆవిణ్ణిగూర్చి ఒక ప్రశ్న వేస్తాం.... ఆవిడకు కనకాభిషేకం ఎందుకూ ? పూర్వ మెప్పుడో శ్రీనాథు నికి చేశారుట. ఈవిడకూడ శ్రీనాథుడంత గొప్ప కవిత్వం వ్రాస్తుందా ?

సూత్ర : ఆవిడ రసభావములకు నిధయ్యా ! ఆవిడ అష్టభాషా కవితా సర్వంకష మనీషా విశేష విశారద. సంగ్రహ భారతం, సంగ్రహ భాగవతం, సంగ్రహ రామాయణము, ఉషాపరిణయం, మన్నారుదాసవిలాసం వ్రాశా

రటు. ఇవన్నీ ప్రబంధాలు. ఈ మన్నారుదాస విలాసం కూడా ప్రబంధమే. దాని నావిడ యక్షగానంగా వ్రాసింది.

కేతి : మరి అయితే ఆవిడ రసభావములకు నిధి అన్నావే నా కేమైనా అది చెప్పగలవా ?

సూత్ర : చెపుతాను. మహారాజు ఆవిడకు వశుడైనాడు. దానికి పట్టమహిషి కోపించి ఆవిణ్ణి తూలనాడింది. అప్పు డావిడ ఇట్లా అన్నది.

ఏవనితల్ మముం దలప నేమి పనో
తమ రాడువారుగారో
వలపించు నే ర్పెరుగరో
తమ కౌగిలిలోన నుండగా
రా వది యేమిరా
విజయరాఘవరాయ యటంచు బల్మినై
తీవరకత్తెనై సెనగి
తీసుకు వచ్చితినా తలోదరీ .....

కేతి : ఓహో ఓహో ఏమిటి ఈ సొగసు. ఏమి అందము, ఏమి పొంకము, ఒప్పుకున్నాం. ఆవిడ కనకాభిషేకానికి అర్హురాలేనయ్యా. సరేగాని మహారాజు ఆవిడకు అంత వశు డెట్లా అయినాడయ్యా !

సూత్ర : ఆమె గాణబయకారు. అనగా వాగ్గేయకారకు రాలన్న మాట. ఆవిడ విందాళంలో అంటే ఒడిలో రసాధిదేవత కూర్చున్నది. ఆవిడకు చేతుల్లో, కాళ్లల్లో చంకచక్కి లాంటి అంటే శంఖచక్రాలు గలిగిన ధీర— మన్నారు విజయరాఘవుడు వశమైనాడు.

కేతి : పట్టపురాణి అంత విషాదగాథలు త్రవ్వినది గాబోలు.

సూత్ర : అవును. ఈర్ష్యాగాథలు త్రవ్వింది. ఆవిడిది పట్టీ పత్న్యాధావర్గముది బుద్ధి.

కేతి : అవునయ్యా. భర్త పరస్త్రీవశుడైతే నేర్పు ఉండాలి కాని ఏడిస్తే ఏం లాభం. తీరు తీరు గుడ్డలు కట్టి తిరు నాళ్లకు పోతే వూరికొక గుడ్డ వూడిపోయిం దన్నట్లు ఇంతకూ రాజు ఆవిడకు ఎట్లా వశుడైనా డంట ?

సూత్ర : ఓ కేతినాయుడుగారూ, ఒక స్త్రీకి ఒక పురుషుడు వశమైనాడంటే ఆవిడ కళ్లు అల్లాంటి వన్నమాట. అంత భావభరితమైన చూపులు చూస్తుందన్నమాట.

కేతి : అయితే ఆవిడ కటాక్షము అంత గొప్ప వంటావా ?

సూత్ర : అవును,

చిత్తజు డల్గి తూపు మొన
చేసిన చేయగనిమ్ము పై ధ్వజం
బెత్తిన నెత్తనిమ్ము వచి
యించెద కల్గిన మాట గట్టిగా
అత్తరళాయతేక్షణ క
టాక్ష విలాస రస ప్రవాహముల్
కుత్తుకబంటి తామరల
కున్ తలమున్కలు గండుమీలకున్.

కేతి : ఇది విజయ విలాసంలో పద్యం గాదయ్యా, చేమకూర వేంకట కవిది. ఇదిగో నేను గుడుగుడుపవాడల్లే మాట్లా డ్తున్నా ననుకోబోకు. రామ కోణంగిని గాను. చేమకూర వేంకటకవి యంతటి కవి ఆ దక్షిణాంధ్ర దేశంలోనే ఇంకోడు లేడయ్యా.

సూత్ర : ఆ చేమకూర అమృతం పోసి పెంచిన చేమకూర.

కేతి : ఆవిడ కటాక్షము అల్లాంటి వంటావూ .... మన్మ ధుడు బాణం వాడి చేసినా సరే, ధ్వజ మెత్తినా సరే— ఆవిడ కటాక్ష ప్రవాహాలు తామరలకు కుత్తుకబంటా? గండు చేపలకు తలమున్కలా ? వాడి తస్సాగొయ్యా, ఆ మన్మధుడి బాణాలు తామర పువ్వులుగా; అవి ఎప్పుడూ నీళ్లలో తేలే ఉంటవయ్యె. అందుచేత కుత్తుకబంటి అన్నాడు. మన్మధుడు మీనకేతను డయ్యె. అవి నీళ్లలో మునిగి ఉంటవయ్యె. అందుచేత తలమున్క లన్నాడు .... బలేగా అన్నాడు.

సూత్ర : అరుగో రంగాజమ్మగారు విచ్చేసినారు. వాకిట్లో కాల నీళ్లు తీస్తున్నారు.

కేతి : ఓహో, కాలనీళ్లంటే దిష్టితీసిన నీళ్లు కాబోలు.

సూత్ర :
అందె లుంగరములు కంఠసరి కంటె
ఒంట్లు వడ్డాణంబు కంకణములు
దండ కడియాలు కమ్మలు మేలు కడియాలు
కింకిణులు కుతికంటు నొప్పు బిళ్లలును
గజ్జలు గాజులు గొడసరాలు
చెంపకట్లును చౌకట్లు దండ
తాళిబిళ్ల తురాయి పాపిడిపిందెలు
పోగులు పోచీలు బాజాబందులును
బావిళ్లు బవిలు బాజుబందులు పురులు
బొగడలు బేసరి బొ చ్చికాయలును
ముంగర మట్టెలు మొగపులతీగ
సరిపేస్తు సరిపెణ రేబణిబిళ్ల

మొదలైన ఆభరణాలతో శ్రీ రంగాజమ్మగారు ఏమం టున్నారంటే,

రంగా : అయం కిల సకల మహీపాల మకుటోపలాలిత చరణకమల యుగళో విస్ఫేవ విశ్వంభరస్య— విజయసారథి భాగ ధేయో విజయరాఘవ నామధేయో రాజాయమధి వసతి రాజధానీం—

సూత్ర : ఈరీతిగా రంగాజమ్మగారు, విజయరాఘవ నృపాలుని గూర్చి చూర్ణిక చెప్పిన తరువాత ఆమె ఏమంటున్నారంటే

రంగా :

### త్రిపుట

లలితగాత్రుడు శుభ చరిత్రుడు
దళిత శత్రుడు సుజనమిత్రుడు
నళినవేత్రుడు రఘూనాథా నాయకుండు

రామచరితము నలచరిత్రము
అచ్యుతాభ్యుదయమ్ము వ్రాసిన
యలఘు చరితుడు సుకవిపాత్రుడు
రఘూనాథా నాయకుండు.

సపశత గ్రంథములు వ్రాసిన
నవ్య సాహిత్యైకవీరుడు
నళినవేత్రుడు సుకవిపాలుడు
రఘూనాథా నాయకుండు

సుకవి పుత్రుడు శూర పుత్రుడు
సుజన మిత్రుడు సుకవి మిత్రుడు
కవిజగన్మకుటాయమానుడు
రఘూనాథా నాయకుండు.

కేతి : ఏమయ్యా .... ఆవిడ యెవరిని పొగడుతున్నది .... ?

సూత్ర : విజయరాఘవ భూపాలుని తండ్రిగారైన రఘునాథ భూపాలుని పొగడుతోందయ్యా.

కేతి : వారు గూడా గొప్ప కవులా ఏమిటి ?

సూత్ర : గొప్ప కవులా ? వారు వంద గ్రంథాలు వ్రాసారు. రామాయణం, వాల్మీకి చరిత్ర మొదలైనవి. చేమకూర వేంకటకవి వారి ఆస్థానంలోవాడే. కృష్ణాధ్వరి, యజ్ఞ నారాయణ దీక్షితులు మొదలైన సంస్కృత కవులను పోషించినారు.

కేతి : అట్లా చెప్పు .... ఆ రఘునాథ భూపాలుని కడుపున పుట్టారన్న మాట యీ విజయరాఘవ భూపాలుడు. తుపాకి కడుపున ఫిరంగి పుట్టినట్లు పుట్టారయ్యా.

సూత్ర : అప్పుడు రంగాజమ్మగారు ఏమంటున్నారంటే ?

రంగా : జగజ్జేగీయమాన కీర్తి కలశపాథోనిథానములైన అటువంటి మహారాజు గర్భమునందుదయించిన శ్రీ విజయరాఘవ నాయకులకు; నమస్కారములు

శ్రీ వాసున్ శ్రీ కరుని పండితాదిసేవ్యుని
సదానందుడైనవాని
శ్రీవారిజనేత్రుని కొల్చువాని
శ్రితజన యశస్కరుని ధారుణీశున్
శ్రీవాసవాభ సంపదలకు చెల్వుగ
మహోలయము లైనవాని
శ్రీ వారిజేక్షణుని విజయరామశేఖరుని
కొల్చెదను చిత్తమందూ.

సూత్ర : ఇట్లు రంగాజమ్మగారు ప్రౌఢ వచనము పలికి మళ్లీ యిట్లు హెచ్చరిక చెప్పుతూ ఉన్నారు.

రంగా :

### సావేరి - రూపకం

శ్రీరాఘవ సురవైభవ శివమంగళ రూపా
చామీకర సింహాసనవాసా హెచ్చరికా
సరసీరుహసన్నిభముఖ సురపూజనధీకా
ధరణీధవనుతపాదాంభోజా, హెచ్చరికా
రఘునాయకతనయా కవిరాజీవవివస్వన్
అఘసంతతినిర్మూలనహార్దా హెచ్చరికా.

కేతి : ఏమయ్యా, సూత్రధారుడుగారూ, రంగాజమ్మగారు చాలా గ్రంథాలు వ్రాసిన దన్నావుగదా. అందులో ఒక్క పద్యమైనా పాడదేం ?

సూత్ర : తొందరపడతావేం ? పాటమీద దేవరకు కూటిమీదే లోకం అని ఇంత శోభాయమానంగా సభ జరుగుతుంటే నీకు పద్యం విందామనీ, పాట విందామనే గాని వేరేదీలేదు. ఆగు. విజయరాఘవనాయకులుగారు ఏదో చెబుతూ ఉన్నారు.

కేతి : ఇంతకూ రంగాజమ్మగారి యక్షగానంలోంచి ఏమైనా వినిపిస్తుం దంటావా ?

సూత్ర : ఇది ఏమయ్యా బ్రతకనివ్వవు. నాకు మాత్రం ఏం తెలుసు ? నాకు తెలియకుండా నీకేం జెప్పను ? మూల పెరుమాళ్లు ముష్టి యెత్తుతూ ఉంటే ఉత్సవ పెరుమాళ్లు దద్యోదనం అడిగాడట. అదుగో విజయరాఘవ నాయకులవారు ఏదో అనుగ్రహించబోతున్నారు.

విజయ : ఓ రంగాజమ్మగారూ,

కేతి : ఇదేమయ్యా ! ఇదేమయ్యా ! రంగాజమ్మగారు విజయరాఘవ నాయకుని ఉంపుడుకత్తె కదా, ఆవిణ్ణి 'గారూ' అని పిలుస్తారేమిటి ?

సూత్ర : తప్పు తప్పు. వాళ్లు ఉంపుడుకత్తెలటయ్యా .... కులముచేత వారకాంతలుగాని మహాపతివ్రతలు. ఆమె విదుషీమణి. శ్రీ విజయరాఘవ నాయకులంగారి యెడ్లదు ఏకైకవ్రత. ఘహారాణిగారికీ ఆమెకీ ఏమీ భేదం లేదు. పూర్వం మన దేశంలో ఇల్లాగే ఉండేవాళ్లు. వాళ్ల శీలం సర్వకాలానికి శిరోధార్యం. వాళ్లు వేయించిన సత్రాలు, కట్టించిన దేవళాలు, చేసిన దానధర్మాలతో దేశం మెరిసిపోయిందయ్యా.

కేతి : సత్రాలంటే జ్ఞాపకం వచ్చింది. ఈ సభకు అందరూ వచ్చారుగాని తంజాపుర అన్నదాన మహానాటకం వ్రాసిన పురుషోత్తమ దీక్షితులుగారు రాలేదేమి ?

సూత్ర : వస్తారు. వస్తారు. ఎందుకురారూ, వచ్చేఉంటారు. ఎక్కడో కూర్చొని ఉంటారు. ఆయన అందరికి మల్లే బడాయిగా రారు. నీవు మాటిమాటికీ ప్రశ్నలు వేస్తూ నానా హైరాణి చేస్తున్నావు.

విజయ : ఓ రంగాజమ్మగారూ, మీరు గొప్ప కవయిత్రులని మేము మీకు కనకాభిషేకం చేయగా వాంఛిస్తున్నాము.

కేతి : ఏమయ్యా సూత్రధారీ, ఆవిడంత గొప్ప కవయిత్రి. ఈయన యింత గొప్ప రాజు. కనకాభిషేకం చెయ్యట మేం, రత్నాభిషేకం ఎందుకు చేయగూడదు ?

సూత్ర : బంగారంలో తేజస్సు ఉంది. రత్నాలు వట్టి రాళ్ళు. కనకంతో అభిషేకం చేయటం అంటే తేజస్సుతో అభిషేకం చేయటం అన్నమాట. . . . అదుగో విజయ రాఘవ నాయకులుంగారు చెప్పబోతున్నారు.

విజయ : అందుచేత మీ విద్య మాకు తెలిసినా మీ కనకాభిషేకం ముందర మే మావిద్యను కొంత చూడవలె నని అనిపించుచున్నది.

కేతి : ఇప్పు డావిడ తన విద్యను చూపిస్తుం దన్నమాట.

సూత్ర : అదిగో శబ్దజతి మొదలుపెట్టింది.

రంగా :

తధణధణ కిట్తక తధణధణతా
కుధరధర హరి మధుమదాపహ
ప్రధనశూరా నిధువనప్రియ
మధురవేణు నినాద మోహన
బుధజనావన తధణధణతా
తీరుగా పులిగోరు పతకము
మీరి యురమున జేరి యాడగ
సారెకును నాభీరకాంతల
జేరి క్రీడల గేరుచున్
తధణధణతా తక్కిణాంతక.

కేతి : దీని నేమంటారు ? శబ్దజతి అంటారూ.

సూత్ర : మధ్య మాటలు పెట్టకు వినుగు వస్తుంది. మళ్లీ విజయరాఘవు లేదో అడుగుతున్నారు.

విజయ : రంగాజమ్మగారూ, తమరు ఒక రాసప్రబంధం విని పిస్తే విందామని ఉంది.

రంగా : చిత్తము.

### ఆ ది — జ ం ఝా టి

ఆనంద మానందము
హరి రాసవిలాస మానంద మానందము ॥పల్లవి॥
నానా గానాభినయ నాట్యమండల
తానమానస్వర తాళాంచితము ॥బ్రహ్మానంద॥
॥అనుపల్లవి॥

కేతి : దీనిపే రేమిటయ్యా ? రాస ప్రబంధమా ? యీ యక్ష గానాల్లో యిలాంటి వెన్ని రకాలుంటాయి అంటావు ?

సూత్ర : అబ్బో ఎన్నో ఉంటవి. లఘువులు, డిండిమము, అష్టకము, ఆలపాట, సాంగత్య పదాలు, ఏలపాటలు, వెన్నెల పదాలు, తాళాలు, శారదపద్యాలు, కురవంజిదరువు, కురవంజి గజ్జెలు ఎన్నో విధాలు ఉంటాయి.

కేతి : బాగానే ఉన్నది గాని ఆ కురవంజిదరువు లేమిటో కురవంజిగజ్జె లేమిటో విందామని ఉందయ్యా !

సూత్ర : నాకూ ఉంది. కాని మనం ఏం చెయ్యగలం ? ఇప్పుడు నే నెల్లా ఉన్నానంటే సాటి ఏరాలు సరిపెట్టుకుంటే లోటి ఏరాలు ఉరిపెట్టుకున్నదట. నేనేం చెయ్యను ?

కేతి : ఓయి సూత్రధారీ, నీ సంగతి నీవు మరచిపోతున్నావు. యీ నాటకమంతా నీ చేతిలో ఉంది. నీవు ఇప్పుడు రంగాజమ్మగారు కొరవంజిగజ్జె పాడబోతున్నది అని అనెయ్యి. సభ అంతా దానికోసం ఎదురుచూస్తూ ఉంటారు. . . ఆవిడ కొరవంజి దరువు పాడుతుంది. సరిపోతుంది.

సూత్ర : ఆఁ. మంచి సలహా చెప్పావు. నేను చెప్పిన సామెత నిజమవుతుంది. విజయరాఘవ భూపాలునికి నామీద కోపం వస్తుంది. నాకు నిజంగానే ఉరి పెడ్తారు.

కేతి : పెడ్తే పెట్టనియ్యి. ఒక్క నిముషం బ్రహ్మానందం అనుభవిస్తాము. తరవాత చస్తేనేం ?

సూత్ర : బాగావుంది. యత్ర జంగం తత్ర భిక్షం అన్నాడట. ఓ సభాసదులరా ! ఇప్పుడు రంగాజమ్మగారు కొరవంజి దరువు పాడబోతున్నారు.

రంగా :

### మాళవి (తివడి) త్రిపుట

జింక పొక్కిటి యసటదేరిన
చిన్ని తిలకము మించగా
సంకు కడెములు నూరు
వజ్రపు సందెదండలు మెఱియగా
వచ్చె నెఱుకత వచ్చె.
ఆరజముగా నెరికవోసిన
సారిది చీర చెఱంగులు
పాదముల జీరాడగా వచ్చె.
గుబ్బ చన్నులమీద జేర్చిన
గోవ కెంపుల పేరులు
గబ్బిగా గురిగింజ పూసల
కంట సరులై మించగా వచ్చె

కేతి : సూత్రధారుడా ! సూత్రధారుడా ! బలేపని చేసావయ్యా! బలేపని చేసావు.

సూత్ర : నీ సొమ్మేమి పోయింది రామకోణంగి! ఓయి ! బసవ శంకరం, నా కుత్తుక మీదికి వస్తుంది.

కేతి : అవునయ్యా, రాజా ఉరితీయిస్తే ఒక్కసారే ఉరితీస్తాడు గాని రెండుసార్లు ఉరి తీయించడు గదా.

సూ : అందుచేత ఏం చెయ్యమంటావు ?

కేతి : రంగాజమ్మగారు వ్రాసిన మన్నారుదాస విలాసంలో కొర వంజి గజ్జె ఒకటి ఉన్నది. ఇప్పు డావిడ పాడుతుందని చెప్పు.

సూత్ర : తరువాత మన పని మంగళమే.

కేతి : నాటకం చివర మంగళం ఎప్పుడూ ఉంటుందిగదయ్యా.

రంగా :

ఎరుఖాడు గెరుఖాడు
గెరుఖాడు గెదుండి
నీవు తలంచిన తలంపు
నీవు తలంచిన తలంపు
నిజముగా సెప్పెన్లే
నిజముగా సెప్పెన్లే
అమ్మాయమ్మ అమ్మాయమ్మ
శేయిసూపు శేయిసూపు
శేయిసూపనేదుండి
దనముగల శేయ్యే
దానముగల శేయ్యే,
బంగారు శేయ్యే,
బాగ్గెములశేయ్యే
దుండి కండ్లంటే తోడు,
కడుపంటె కొడుకు,
కంటంటే మగండు, వొండేలెండే వొండు.

సూత్ర : కురవంజిగజ్జె విన్నావు గదయ్యా .... ఇప్పుడేమి చేద్దాం ?

కేతి : కనకాభిషేకం జరుగుతుందని చెప్పి .... వెంటనే మంగళం పాడివేద్దాం .... మనమీ తంజావూరు వదలి పారిపోదాం.

సూత్ర : సభాసదులారా .... ఇప్పుడే విజయరాఘవ నాయకులుం గారు రంగాజమ్మగారికి కనకాభిషేకం చెయ్యబోతున్నారు. సావధానులుగా ఉండండి.

కేతి : నీవు మంగళం పాడెయ్యి .... తరువాత మన దారిని మనం లేచిపోదాం.

సూత్ర : ఎక్కడికి పోదాం ?

కేతి : నేను చెబుతాగా మంగళం పాడు.

సూత్ర : నాకు గుండె ఆడటంలేదు.

కేతి : రెండు మూడు కీర్తన్ల మొదళ్లు అనేసెయ్యి.

సూత్ర :

1. జయ జానకీరమణ
జయ విభీషణ శరణ
జయ సరోరుహ చరణ
జయ రమా రమణా

2. నారాయణ తే నమో నమో
నారదసన్నుత నమో నమో

3. మురహర నగధర ముకుంద మాధవ
గరుడ గమన పంకజనాభా.

సూత్రధారనాటక మైపోయింది. విజయ రాఘవ నాయకులుంగారు వెళ్లిపోయినారు. సభాజను లందరూ నిష్క్రమించారు. ఓ కేతినాయడా, మన మింక ఈ వూళ్లో బ్రతకలేం .... ఎక్కడకు పోదాం ?

కేతి : హైదరాబాదు పోదాం. అక్కడ సకల భారత ప్రజా స్వామ్య పరిష దధ్యక్షులైన డాక్టరు రాజేంద్రప్రసా దుంవారి కొలువు చేరుదాం.

సూత్ర : అయితే పద .... తొందరగా పద.

కేతి : వచ్చాం .... ఇదే హైదరాబాద్. అయితే సరేగాని— దక్షిణాంధ్ర వాఙ్మయం ఇంతటితో అయిపోయిం దంటావా ?

సూత్ర : అబ్బే ఏమి అయిపోయింది ? మధుర రాజ్యం అయి పోయిం తర్వాత మహారాష్ట్ర రాజ్యం వచ్చింది. మైసూరులో పుదుక్కోటలో యీ ఆంధ్ర సాహిత్యం ఎంతో పెరి గింది. సవరపు చిననారాయణబాబు కువలయాశ్వ చరిత్రం వ్రాశాడు. తరువాత ఎంతో వచన వాఙ్మయం వృద్ధి పొందింది. అది అంతా చెప్పటానికి ఏమి వీలు ?

కేతి : సరేకాని క్షేత్రయ్య పదాలను గురించి చెప్పనే లేదేమి ?

సూత్ర : నీవు నా కంఠంమీదికి కత్తెర తెచ్చిపెట్టి అది చెప్ప లేదే, యిది చెప్పలేదే అంటే ఎలాగా ? ఇదిగో క్షేత్రయ్య పదం.

## ఎఱుకల కాంభోజి — ఆది

సుదినమాయెనే యీ ప్రొద్దు సుదినమాయెనే యీ
మదనావతారుని సేవ మనకు గల్గెగా
ప్రొద్దుట నిల్వుటద్దము పొడగన్న ఫలము యితని
ముద్దు మోము చూడగల్గె ముద్దులగుమ్మా ....

కేతి : ఇదిగోనయ్యా .... ఒక్కమాట తోస్తున్నదయ్యా నాకు. ఈ దక్షిణాంధ్ర వాఙ్మయము నా కెట్లా తోస్తున్న దంటే పచ్చకర్పూరమల్లే ఉందయ్యా.

సూత్ర : మహా బాగా అన్నావు. రామనాథ మండలంలో శివపురీ ప్రాంతం ఏలే రాజు గోళ్ల పెదరామప్ప. అతని తమ్ముడు బసరామప్ప. ఆయన పచ్చకప్పురపు తిరువెంగళప్ప అనే కవిచేత చొక్కనాథ చరిత్రం ద్విపదలో వ్రాయిం చారు. అది యీ దక్షిణాంధ్ర వాఙ్మయానికి మొదలు. మరి పచ్చకప్పురపు తావి గుబాళించటం న్యాయమే. కొలికిపూసమాట అన్నావు.

# క్రీడాభిరామ పద్యములలో చరిత్రాంశములు లేవా?

## శ్రీ కె. హెచ్. వి. శర్మ

పూజ్యులు శ్రీ బండారు తమ్మయ్యగారు వెనుక నేను వ్రాసిన 'క్రీడాభిరామ పద్యంలో చరిత్రాంశాల'ను వ్యాసమునకు సమాధానముగ భారతి 1962 జనవరి సంచికలో 'క్రీడాభిరామ పద్యములలో జరిత్రాంశము లున్నవా? యని ప్రశ్నాత్మకమైన వ్యాసము నొకదానిని బ్రకటించిరి. అందు వారు నా వ్యాసము గొన్ని వింత వింత విషయములకుఁ దావలముగ నున్నదనియు, నేను వృథా భ్రమించి పాఠకులను దిగ్భ్రమ గలిగించితినేగాని నేను పేర్కొనిన క్రీడాభిరామ పద్యమున జరిత్రాంశము లేమియు గర్భితము కాలేదనియు, నట్టివి కవ్యభిప్రేతముగూడ కావని దెల్పియున్నారు. క్రీడాభిరామ వీథి నాటక నాయకుఁడు గోవింద మంచనశర్మ ఓరుగంటియందలి మధుమావతి యను వేశ్యనుగూర్చి తన వయస్యుడు టిట్టిభసెట్టితో నామె భూత, వర్తమాన, భవిష్యజ్జన్మలను, జాతులను వివరించి వర్ణించిన "అల కాపురంబున నంగార వర్మ్యఁడస్" యను సీసపద్యము, దాని తర్వాతదియగు కడిమి కత్తులయమ్మ సౌందర్యమును వర్ణించు "కడిమి కత్తులమ్మి నిడువాలుఁ గన్ను"లను పద్యమును నిట బ్రసక్తములు. ద్వితీయ పద్యపు తృతీయ, చతుర్థపాదములగల 'ధారా సురత్రాణ కటక కుంభి కుంభ కలహకారి' యనుటలో ధారాసురత్రాణునకు కటకమురాజధానిగ బాలించిన గజపతి కపిలేశ్వరునకు జరిగిన యుద్ధవార్తను కవి గర్భిత మొనర్చినాడని నాయభిప్రాయము. శ్రీ తమ్మయ్యగారు నైఘంటి కార్థములనుబట్టి, 'కటక' శబ్దమునకు బ్రధానమైనది 'రాజధాని' యనియు, 'కుంభి కుంభ' మనగా కేవలము 'గజకుంభము'లేగాని వేఱొండు కాజాలదనియు స్త్రీకుచములకు బీవరత్వ విషయమున గజకుంభములతో సాదృశ్యమును గూర్చుట కవి సమయమనుట సర్వజన విదితమే గావున నిందెట్టి చరిత్రాంశములేదనియు, నట్టివి కవ్యభిప్రేత మెంతమాత్రము కాదని నిర్ణయించిరి. ఆనా డనేక రాజులుండగ నీ ధారాసురత్రాణుని గజమునే యేల పేర్కొనెననెడి యాక్షేపమును గూడ వారే శంకించి, బహుశః ఆ నా డాతని పట్టపు టేనుగు బలిష్టతకుఁ బేర్వడియుండవచ్చును, లేదా యతిభిక్షకయి యాదృచ్ఛికముగనే కవి ధారా సురత్రాణ పదమును బ్రయోగించి యుండవచ్చునని సమాధానముజెప్పి సంతృప్తి జెందిరి. నిజమున కిచ్చట గూడ 'ధారా సురత్రాణు'డనగా 'భోజ మహారాజ'ని సాహిత్యపరముగ నేదియో కూర్చుకొనిన ఆ చిక్కు కూడ యుండెడిదికాదేమో!

క్రీడాభిరామ కర్తృత్వ కాలములు రెండును వారు చెప్పినట్లిప్పటికిని వివాదగ్రస్తముగనే యున్నవి. వల్లభరాయ వంశ వర్ణనాత్మకముగను, స్తుతిపూర్వకముగను 32 వ పద్యము చివర వరకునున్న యవతారికాభాగము, గ్రంథాంతమున వల్లభరాయాశీర్వాద పూర్వకముగ రచితమయిన "ముదమున ముక్కంటి పుర మోహన శైల' అను 29 వ పద్యము, గ్రంథమధ్యమున భీమేశ్వర పురాణ, శాలివాహనసప్తశతులనుండి గ్రహింపఁబడిన కొలఁది పద్యములు, పద్యపాదములు గూడ కవి సార్వభౌముఁడగు శ్రీనాథ విరచితమేనని శ్రీ తమ్మయ్యగారును అంగీకరించియున్నారు. ఇక ఏ ఏ పద్యములు, పద్యపాదము లెంతెంతవఱకు శ్రీనాథునివియో సరిగా నిర్ణయించుటకు మన కెట్టి ఆధారములును లేవు. అట్టి కవి సార్వభౌముఁడగు శ్రీనాథుఁడే కానిండు, లేదా యాతని సహాయమున రచియించిన వల్లభరాయుడుగాని "ధారా సురత్రాణ" పదమును కేవల యతిభిక్షకయి యాదృచ్ఛికముగనే ప్రయోగించెననుట సమంజసము గాబోలు!

అసలు ధారాసురత్రాణునకు గజపతి కపిలేశ్వరునకు ఎప్పుడెచ్చట యుద్ధము పొసగెనను విషయమున నాకే దృఢ విశ్వాసమున్నట్లు లేదనియు, నా విషయమును సప్రమాణముగ నేనే నిర్ణయింపజాలనైతి ననిరి. గజపతి కపిలేశ్వరుని వెలిగలని, ఆతని పుత్రుడు హంవీరదేవుని చిఱ్ఱవోలి, తామ్ర శాసనములలోని "హంపాకంపమగాత్త దాధిక ధరా ధారాచ ధారాతుర, ద్వారా కల్బెరగా విముక్త తురగా ఢిల్లీ చ భిల్లీ వృతా" యను శ్లోకమునుబట్టి కపిలేశ్వరుడు హంపీ,ధార, కల్బెరగ, ఢిల్లీ నగరాధీశులను జయించినట్లు తెలియుచున్నది. అట్లే యాతని గోపీనాథపుర శిలా శాసనమునగూడ ఈ దిగ్విజయములన్నియు మరల పేర్కొనబడినవి.

"కర్ణాటోర్ఘూ న సింహః కలవరగ జయీ
మాలవధ్వంస లీలా జంఘాలో
గౌడమర్ది భ్రమరవర నృపో
ధ్వస్త ఢిల్లీంద్ర గర్వః"

ఇదేః శాసనమున కపిలేశ్వరుని గూర్చి 'కృత్వాసంయతి మాలవేంద్ర జయినం' అని యభివర్ణింపబడినది. మాళవదేశమునకు రాజధానియే 'ధారా' నగరము. ఆనాడు తురుష్క పాదుశాహ లచట నుండి రాజ్యముసేయుచుండిరి. పై శాసన ప్రామాణ్యమను మాళవ దేశాధీశ్వరుఁడగు ధారాసురత్రాణునకు కటకాధిపతియగు గజపతి కపిలేశ్వరునకు యుద్ధము బొసఁగినట్లు, నందు గజపతియే విజయము గాంచినట్లు సుస్పష్టముగ తెలియుచున్నదిగదా. క్రీ.శ.

# క్రీడాభిరామ పద్యములలో జరిత్రాంశములు లేవా?

1458 నాటి కపిలేశ్వరుని వెలిగలని తామ్ర శాసనమున నీ యుద్ధ ప్రస్తావన మొట్టమొదటిమారు గాన్పించుటచే నంతకుపూర్వమే యాతఁడు ధారాసురత్రాణుని యోడించియుండెననుట నిశ్చయము. ఈ శాసనాధారములనుబట్టియే గజపతికిని ధారాసురత్రాణునకు క్రీ. శ. 1458 పూర్వము యుద్ధము జరిగినట్లు అందు గజపతి విజయము నొందినట్లు వెనుక దెల్పియున్నాను. ఇంతకంటె ఆ యుద్ధము బొసగెననుటలో దృఢ విశ్వాసము, సప్రమాణముగ నిరూపించుట యన నెట్టిదో నాకు దెలియుట లేదు. ఇక క్రీడాభిరామ పద్యములో నీ చరిత్రాంశము గర్భిత మైనను గాకపోయినను పై నుదహరించిన శాసనములనుబట్టి కటకగజపతి ధారాసురత్రాణుల కలహవార్త మాత్రము సునిశ్చితము. శ్రీ తమ్మయ్యగా రీ సందర్భమున మరియొక వింత విషయమును సూచించిరి. శ్రీనాథుని కాశీఖండమును గృతినందిన వీరభద్రారెడ్డి తమ్ముఁడు దొడ్డారెడ్డి కంకితముగా నిశ్శంకుల కొమ్మనామాత్యుఁడు రచించిన శివలీలావిలాసము నందు రెడ్డిరాజుల తండ్రి యల్లాడరెడ్డి పరాక్రమాదికముల వర్ణించుచు, నాతఁడు "ధారా సురత్రాణుఁ బోర నిర్జితుఁజేసి కొల్లవట్టించెఁ దద్ఘోటకముల"నని చెప్పినాఁడు గాన కటకగజపతి ధారాసురత్రాణు నోడించినది నిశ్చయమయినను, గాకున్నను గాశీఖండ రచనమునకు మున్నే రెడ్డిరాజు లాసులతానును నిర్జించియుండుట నిక్కమని తలంపనగునని దెల్పిరి. అల్లాడరెడ్డి ధారాసురత్రాణు నోడించిన విషయమును వారెందుల కీ సందర్భమున దెచ్చిరో నా కవగతమగుటలేదు. శ్రీనాథ, కొమ్మనామాత్యులచే బ్రశంసించబడిన అల్లాడరెడ్డి ధారాసురత్రాణుల యుద్ధమునే బహుశః నేను నా దిగ్భ్రములో గజపతికపిలేశ్వరున కంటగట్టినట్లు వా రభిప్రాయపడియుందురు. తదనుగుణముగనే అల్లాడరెడ్డి పుత్రుల శాసనములు కళింగ దేశాంతర్గతమైన విశాఖపట్టణ మండలములోని సింహాచల క్షేత్రమున క్రీ. శ. 1434 నాటివి గానవచ్చుటచే నప్పటి కా ప్రాంతము రెడ్డిరాజుల పాలనములో నుండెననియు, నా మఱుచటి సంవత్సరమునగాని కపిలేశ్వరుఁడు కటకమున బ్రతిష్ఠితుడు కాలేదనియు వచించిరి.

అల్లాడరెడ్డి జయించిన ధారాసురత్రాణుడు వేరు; గజపతి కపిలేశ్వరుఁడు నిర్జించిన ధారానగరాధీశ్వరుడు మరియొకడు. అల్లాడరెడ్డి జయించిన ధారాసురత్రాణుఁడు దిలావర్‌ఖానుని పుత్రుఁడగు అల్ఫఖానుడు. గజపతి జయించిన ధారానగరాధీశ్వరుఁడు రెండవ మహమ్మదు షాహ్. అల్లయ వేమారెడ్డి వేమవరదాన శాసనమున నల్లాడరెడ్డి జయించిన ధారాసురత్రాణునిగూర్చి "జిత్వా నల్ప వికల్ప కల్పిత బలం తం చాల్ఫఖానం రణే" యని స్పష్టముగ పేర్కొనబడియున్నది. తండ్రి యనంతరము క్రీ. శ. 1405 ప్రాంతమున నీ యల్ఫఖానుఁడు ధారానగర సింహాసనము నధిష్ఠించెను. శ్రీనాథుడు వీరభద్రారెడ్డి కంకితముగా నిచ్చిన గాశీ ఖండమున "ధారా పట్టణ సార్వభౌమ సురధాణ్దర్పాపహారక్రియా దౌరంధర్య పటిష్ఠ నిష్ఠుర భుజాదండోళి సంరంభ' యని, 'ధారాసురధాణ దర్ప ధరణీధ్ర పవి" యనియు పలుమారులు దీనినే బ్రశంసించినాడు. దొడ్డారెడ్డి, కంకిత మొనర్చిన శివలీలావిలాసమున, నిశ్శంక కొమ్మనామాత్యుడు గూడ పైన వివరించిన యుద్ధమునే "ధారాసురత్రాణుఁ బోర నిర్జితుఁజేసి కొల్ల వట్టించెఁ దద్ఘోటకముల'నని వర్ణించినాడు. రెడ్డిరాజుల ఆశ్రయమున వారికాలమున రచించబడిన కాశీఖండమున నల్లాడరెడ్డి ధారాసురత్రాణుల యుద్ధమును ప్రస్తావించినట్లే కటకగజపతుల పరిపాలనమున కపిలేశ్వర ధారాసురత్రాణులకు జరిగిన యుద్ధవార్తను కవి సార్వభౌముఁడు తానేగాని, లేదా తన సాయమున రచించబడిన పై క్రీడాభిరామ పద్యమున గర్భిత మొనరించినా డనుటలోగల దోషమేమి?

శ్రీ తమ్మయ్యగారు క్రీడాభిరామ రచనాకాలమునుగూర్చి శ్రీనాథుడు గౌడ డిండిమభట్టు నోడించుటకయి ప్రౌఢ దేవరాయల యాస్థానమున కేగునపుడు, మార్గమధ్యమున విజయనగర రాజుల యుద్యోగి వినుకొండ వల్లభరాయని, వినుకొండ యందో, మోపూరునందో సందర్శించి, క్రీడాభిరామ రచనమునఁ గొంతవర కాతనికి సహకరించియుండుననియు, కావున క్రీడాభిరామ రచనాకాలము క్రీ. శ. 1430, 1435 మధ్యనని వారింతకుముందే నిస్సందేహముగ నిర్ణయించియున్నామని దెల్పిరి. శ్రీనాథునకు వల్లభరాయనితో క్రీ. శ. 1430 ప్రాంతమున తాను విజయనగర యాస్థానమునకుఁ బోవు మార్గమధ్యమున పరిచయము గలిగియుండవచ్చును గాని యప్పుడే యాతనికి వెంటనే క్రీడాభిరామ రచనమున దోడ్పడినట్లు గల నిర్ణయమేమి? మరియు కథాకాలమునాఁటికున్న మధుమావతి మఱికొన్ని జన్మములలోఁ గడిమికత్తులమ్మిగా నవతరించెడి వర్ణనములో నంతకు మున్నెన్నఁడో జరిగిన ధారాసురత్రాణ గజపతుల పోరాటము గర్భితమయినదని తలంచుటలో సామంజస్యము శూన్యము. అట్టిది కవి యప్రౌఢతకు నవివేకమునకు దార్కాణమగునుగాని, ప్రౌఢతకుఁ గాఁజాలదు. ఇట్టి రచనమును శ్రీనాథున కారోపించుట మరింత యసంభావ్యమని నిరసించిరి.

క్రీడాభిరామము రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామము ననుసరించి రచించబడినదని యందేగలదు. శ్రీనాథుఁడు లేక వల్లభరాయనినాటికి ఓరుగంటియందు మధుమావతి యెవతయు లేదు. వారి కాలమునకు సుమా రొకటిన్నర శతాబ్దములకు బూర్వము కాకతి రెండవ ప్రతాపరుద్రుని కాలమున నామె యోరుగల్లులో నుండినట్లు వర్ణించబడినది. తదుపరి 150 సంవత్సరములలో నామె దక్షారామమునఁ జిన్నపోతి యను వేశ్యగను, మరల చెంచులకులమున గడిమి కత్తులమ్మిగా యవతరించుటలోగల యసంభావ్యమేమి? సంస్కృత కావ్యముల అనువాదమున తెనుఁగు కవు లాయా కాలమునాఁటి సాంఘిక, చారిత్రక, సామయికాచారముల నెట్లు తమ తమ గ్రంథములలో స్వతంత్రముగ ప్రతిబింబింపఁజేసిరను విషయ మందరికిని తెలిసినదియే. అనువాదములగాని, స్వతంత్ర రచనలగాని తనకాలపు సాంఘికయాచార, ప్రజాజీవనములను స్ఫురింపఁజేయని రచన నిరర్థకమే యగును. అట్టిది యెన్నటికిని ప్రజాదరణము పొందలేదు. మరియు క్రీడాభిరామము త్రిపురాంతకుని ప్రేమాభిరామమున కెట్టి తెలుగు సేతయో మన కింతవఱకుఁ దెలియదు. నిజమునకు ప్రేమాభిరామమున మధుమావతిని గూర్చిన ఇటువంటి

పద్యము కలదో, లేక వల్లభరాయుఁడే దనకాలమునగల ఏ చెంచులమ్మినో ఆనాటి మధుమావతికి ముడి వెట్టుట కీ పద్యము నొకానొక చొక్కపుజోగి రచించెనని గర్పించి తన గ్రంథమున చేర్చెనో స్పష్టము గాదు.

భీమఖండకృతికర్తయగు బెండపూడి యన్నామాత్యుఁడు దన కులదైవమైన దక్షారామ భీమేశ్వరుని యాలయమున క్రీ. శ. 1428 లో గోపుర మంటపాదికముం నిర్మించినట్టు లాయాలయ స్తంభములపైఁగల శిలా శాసనములు, ఆ ధర్మకార్యములనే శ్రీనాథుఁడు సరిగా భీమఖండావతారికలో 'దక్షవాటికయందుఁ దరుణేందు మౌళికి' యను పద్యమున బ్రశంసించియుండుటనుబట్టి భీమఖండ రచన క్రీ. శ. 1430 ప్రాంతముననియు; అట్లే వీరభద్రారెడ్డి కంకిత మొనర్చిన గాశీఖండమున నాతఁడు కర్ణాటాస్థానమున గావించిన విబుధ రంజనము, గౌడ డిండిమభట్టు డిండిమ విభంజనము, ప్రౌఢ దేవరాయ ప్రదత్త కనకాభిషేక సత్కారము, కవి సార్వభౌమ బిరుద సమార్జనము నుద్ఘాటించుకొనియుండుట, ఆ గ్రంథపు అవతారికాశ్వాసాంత పద్యములలో వేమ, వీరభద్రారెడ్లు లొనరించిన కళింగదేశ యాత్రా విజయము లుదాహృతములై యుండుటచే నది క్రీ. శ. 1435 ప్రాంతమున రచించఁబడినదిగాన విజయనగర యాస్థానమున కరుగు సందర్భమున మార్గమధ్యమున మోపూరునందో, లేక వినుకొండయందో తొలుత వల్లభరాయనితో పరిచయము కల్గి, ఆమధ్యకాలము ననగా క్రీ. శ. 1430–1435 మధ్యన క్రీడాభిరామ రచన జరిగియుండవలెనని నిస్సందేహముగ నేర్పడగలదని వచించిరి. ఇది యంతయు కేవలము వారి యూహా మాత్రమే. కాశీఖండమునగాని, మరి యెచ్చటను గాని శ్రీనాథుఁడు తనకు వల్లభరాయనితో పరిచయ మెప్పుడు గల్గినదియు, లేక క్రీడాభిరామ రచన నాతని కెట్లు సాయ మొనర్చినదియు తెల్పలేదు. మరియు క్రీడాభిరామము ఒక్క సమయమున నొక్కని చేతిమీదుగ రచించబడినట్లు గన్పట్టదు. రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామ స్వరూప మెట్టిదియో దానిననుసరించి వ్రాయబడిన దీనికి క్రీడాభిరామమని పేరెందులకు మార్చవలసి వచ్చెనో మన కింకను స్పష్టముగ తెలియుటలేదు. వల్లభరాయుఁ డా యా సన్నివేశములను సందర్భములను బట్టి తన రచన కనుగుణమైన బద్యములను శ్రీనాథుని గ్రంథముల నుండియు, చాటువులనుండియు యథాతథముగనో, లేక కొలది మార్పులనుజేసియో గ్రహించినట్లే, మరికొంతమంది నాటి ప్రసిద్ధ కవుల రచలనుండియు పద్యముల నిందు కూర్చిపెట్టినట్లు గన్పట్టును. 'అలకాపురంబున నంగారవర్మఁడ'ను సీసపద్యమే ఒకానొక చొక్కపుజోగి రచించినట్లందే చెప్పబడినది. ఇట్టి రచనల నాంగ్లమున 'Anthology' అని యందురు. ఏది యెట్లున్నను గ్రీడాభిరామ రచన వారు చెప్పినట్లు నిస్సందేహముగ క్రీ. శ. 1430—35 ప్రాంతమున రచించబడె ననుటకు మన కాధారములు గానరావు.

శ్రీనాథుని జీవిత పరిమితినిగూర్చి కూడ శ్రీ తమ్మయ్యగారు ముచ్చటించిరి. భీమఖండావతారికలో శ్రీనాథుఁడు 'కనకక్ష్మాధరధీరు వారిధితటీ కాల్పట్టణాధీశ్వరున్' అను పద్యమున దనతాత కమలనాభామాత్యునిగూర్చి యాతఁడు కాకతి సార్వభౌముని యాస్థానమున నుండినట్లు వర్ణించుటచే శ్రీనాథుని జన్మకాలము క్రీ. శ. 1365 కన్నఁ గ్రిందికి రాజాలదనియు, అనవేమారెడ్డిని జిన్నతనమున సందర్శించి "అనవేమ మహీపాల! స్వస్త్యస్తు తవ బాహవే" అను చాటు శ్లోకమును జెప్పి సత్కారమందిన యార్వేల నియోగి శ్రీనాథుడేయని యనుశ్రుతముగ దెలియుచున్నదనియు, శ్రీనాథుని యవసాన చాటువునందలి "భాస్కరుఁడు మున్నె దేవునిపాలికరిగె' అను పాదములోని దాతయగు రాయని భాస్కరుని యాశ్రయము కూడ అతనికి జిన్నతనమున నుండెనని తోఁపఁగలదని; రాయని భాస్కరుఁడవ వేమారెడ్డివలన నగ్రహారాదికముల నందినట్లు లాతని వంశజుఁడు చింతగుంట కోదండరామకవి రచించిన సునందా పరిణయమువలనఁ దెలియుచుండుట ఇత్యాది కారణములచే శ్రీనాథుని జీవిత పరిమితి క్రీ. శ. 1365—1445 అయియుండునని తలంచుటయే సంగతమనియు, నీ నిర్ణయమును వారిదివఱకే 1925 ప్రాంతముననే శృంగార శ్రీనాథ విమర్శనమున గావించినట్లు తెల్పిరి. తన తాత కమలనాభామాత్యుని గురించి శ్రీనాథుఁడు పై పద్యమున నాతడు గాకతి-సార్వభౌముల సామంతుడనిమాత్రమే వర్ణించెను. ఆ సార్వభౌముడు రెండవ ప్రతాపరుద్రుడే కావచ్చునని శ్రీ తమ్మయ్యగారే తెల్పియున్నారు. కాకతీయుల వద్ద నాతఁ డెట్టి పదవిలో నుండెనో నిశ్చయముగా నిర్ణయించుటకు మన కెట్టి శాసనాధారములును లేవు. కమలనాభామాత్యుడే నిజముగ కాకతీయుల కొలువులో నుండెనో, లేక యాతని వంశము వారెవ్వరైనను గాకతి రాజుల మాండలికులుగనే చిన్న ప్రాంతమునకయిన నధిపతులుగ నుండుటచే శ్రీనాథుఁ డాతనినిగూర్చి యట్లు వర్ణించియుండవచ్చును. అనవేమారెడ్డి కాలమున ఆర్వేల నియోగి శ్రీనాథుఁడు చెప్పినట్లు గల 'అనవేమ మహీపాల! స్వస్త్యస్తు తవ బాహవే' యను చాటువు తూర్పు గాంగవంశజుఁడగు నరసింహునిగూర్చి ఎవరో భట్టు చెప్పిన "నరసింహ మహీపాల! స్వస్త్యస్తు తవ బాహవే"—యనుదానినే అనవేమునకు ముడిపెట్టబడినట్లు నేను పెద్దలవలన వింటిని. మరియు శ్రీనాథుఁ డా వయస్సున పెదకోమటి వేమారెడ్డి ఆశ్రయుండగుటచే నాతని జ్ఞాతులు, బద్ధశత్రువులగు అనవేమాదులను దర్శించి సత్కారములనందుట యసంభవము. శ్రీనాథుని యవసాన చాటువునందు బేర్కొనబడినదాతయగు రాయని భాస్కరుడు కాటయవేమారెడ్డి యాస్థానమున నుండెననుటకీ క్రింది శ్రీనాథుని చాటుపద్యమే సాక్ష్యము కాగలదు.

'కలయఁ బసిండి గంటమునఁ గాటయ వేమ
సమక్షమందు స
త్ఫలముగ రాయని ప్రభుని బాచఁడు
వ్రాసిన వ్రాల ప్రోఁతలున్
గలు గలు గల్లు గల్లురన గంటక మంత్రుల
గుండె లన్నియున్
జలు జలు జల్లు జల్లురనె సత్కవివర్యులు
మేలు మేలనన్."

# క్రీడాభిరామ పద్యములలో చరిత్రాంశములు లేవా?

ఇక నాతఁడు యువపాన కాలమున జెప్పిన 'కాశికా విశ్వేశుఁ గలిసె వీరారెడ్డి' యను చాటువునుబట్టి శ్రీనాథుఁడు వేమ, వీరభద్రారెడ్ల రెడ్డిరాజ్య మంతమొందిన తుదివఱకును జీవించి యుండెననుట నిశ్చయము. అట్లే తాను బొడ్డుపల్లెను గుత్తకు గొని ఏడునూర్ల టంకములను జెల్లించలేకపోవుటచే నాటి ఆ ప్రాంతమును బాలించు ప్రభువులు తనను పెట్టిన బాధలను "కవిరాజు కంఠంబు కౌఁగిలించెనుగదా' అను సీస పద్యమున దెల్పి వాకొనినాడు. ఇట్టి కష్టములు కవిసార్వభౌమున కాతని స్వాములైన రెడ్డిరాజుల పాలనమునగాని, లేదా వారి మంత్రుల యధికారమునగాని కలిగెనని తలంచుట సర్వథా అసంభవము. అట్లే తాను కనకాభిషేకాది సత్కారములను బొందిన విజయ నగర రాజుల పరిపాలనమున సంభవించెననుటయు సరికాదు. మరియు క్రీ. శ. 1455 ప్రాంతమునాటి అచటి శాసనము లనుబట్టి కపిలేశ్వర గజపతి మంత్రులు రఘుదేవనరేంద్ర, గాణ దేవమహాపాత్ర, హంవీరదేవాదులు దక్షిణదేశము నంతటిని జయించి పరిపాలించుచుండినట్లు స్పష్టముగ దెలియుచున్నది. నిజమునకు వారు కూడ హిందూరాజులు; దక్షిణ దేశమునందలి సింహాచలము, ద్రాక్షారామము, కోటిపల్లి, శ్రీశైలము, శ్రీరంగము మున్నగు ననేక పుణ్యక్షేత్రములను దర్శించి అపార దానము లొసంగినవారే. కపిలేశ్వరుఁడు, నాతని పుత్రులు, మంత్రులు కూడ ఆంధ్ర విద్వాంసులకు వెలిగలని, చిఱుప్రోలి, రఘుదేవపురము, దోరపాలెము, చావలి మున్నగున నేక గ్రామముల నగ్రహారములుగ దానమిచ్చిరి. అయినను అట్టి గజపతి రాజపుత్రులు కవిసార్వభౌముఁడగు శ్రీనాథుని విద్వత్తు నేల ఆదరించకపోయిరో తెలియదు. ఈ సందర్భమున నొక విషయము గమనించదగినది. విజయనగర సాళువ నరసింహరాయలకాలము క్రీ. శ. 1471—73 నాటి ఆర్కాడు జిల్లాలలో దొరికిన యనేక తమిళ శాసనములలో (Annual Reports on Epigraphy 1905 సం. 1; 1906 సం. 93; 1919 సం. 310; 1928 సం. 287; 1934—35 సం. 111; 1936-37 సం. 262; 1937—38 సం. 416) 'ఒడ్డియన్ గలభై' యని సుమారు పది సంవత్సరముల క్రితము ఒడ్డె రాజుల దండయాత్రా ఫలితముగ ననేక దేవాలయములందు పూజా నైవేద్యాదులు లేక పాడుపడియుండగా మరల నరసింహ రాయల కాలమున పునరుద్ధరింపబడినట్లు పేర్కొనబడియున్నది. గంగానది మొదలు శ్రీరంగము వరకును గల రాజ్యమంతటిని జయించి దానిని సుప్రతిష్ఠితము జేసికొను కట్టుదిట్టములలో గజపతులు సాహిత్య విద్యా వినోదములయందు, దేవాలయ పూజా నైవేద్యాదులయందు తాత్కాలికమైన అశ్రద్ధ వహించిన ట్లగపడుచున్నది. కావుననే శ్రీనాథున కాసమయమున నాంధ్రదేశమున నెచ్చటనుగాని, కర్ణాటదేశమునగాని ఆశ్రయము నిచ్చు రాజులు లేక మంత్రులు లేరైరి. గజపతులు వారి నూతన సామ్రాజ్యపు గజిబిజిలో నుండిరి. ఇట్టి పరిస్థితులలో గత్యంతరములేక. శ్రీనాథుఁడు కృష్ణాతీరమునగల బొడ్డుపల్లెను గుత్తకుఁగొని స్వయం కృషి చేయ నారంభించియుండును. శ్రీనాథుని బావమఱదియు శిష్యుఁడు నగు దగ్గుబల్లి దుగ్గన, కమ్మలచింతల చెన్నమరాజు, తెలుంగురాయఁడు మున్నగువారి గ్రంథములను శాసనములనుబట్టి విపులముగ చర్చించి శ్రీ ప్రభాకరశాస్త్రిగారు "శ్రీనాథుని జన్మ కాలమును క్రీ. శ. 1385 కంటెఁ దర్వాతి కాలమునకుఁ గొని వచ్చుట కానుకూల్యము గనిగియున్నదేగాని, పూర్వమునకుఁ గొని పోవుట కేమాత్రమును నవకాశమిచ్చుట లేద'ని తీర్మానించి యున్నారు. శ్రీనాథుని పై యువపాన చాటువునుబట్టి వీరభద్రా రెడ్డి మున్నగువారి కాలనిర్ణయమునుఁ జక్కగాచేసి, బ్రహ్మశ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారును అతఁడు గజపతుల పరిపాల నారంభమున క్రీ. శ. 1455 ప్రాంతము వఱకును జీవించి యుండెనని అంగీకరించియున్నారు. ఇట్లన్ని ప్రబలమైన ఆధారము లుండగా, శ్రీనాథుఁడు గజపతియొక్క పెనుగొండ శాసన కాలమగు క్రీ. శ. 1448 సంవత్సరమునకు మునుముందే శివ లోకమున కేగియుండుననియు, క్రీ. శ. 1455 నాఁటికి కైలాస మునఁ బ్రాతకాపయి యుండుననియు శ్రీ తమ్మయ్యగారు వ్రాయుట మిక్కిలి శోచనీయము.

'అలకాపురంబున నంగారవర్మఁడ'ను సీసపద్యమున మధువా వతినిగూర్చి యామె పూర్వజన్మమున గంధర్వజాతి నుద్భవించిన దనియు, నికముందు దక్షారామమునఁ జిన్నిపోతి యను వేశ్యగా నవతరించి చిరకాలము సదాశివునితో గూడి విహరించగలదని వర్ణించబడినది. భీమఖండమున శ్రీనాథుడే దక్షారామ భీమేశ్వరుని సేనా నియుక్తులైన సానులందఱు గంధర్వజాతివారనియు, శ్రీ భీమనాథోపభోగయోగ్యలనియు పలుమారు లిట్లు ప్రశంసించి యున్నాడు.

సంభవించిరి గంధర్వజాతి ననిన
గలితనం బేల పెన్నాటకంబు సేయ
ననఁగ భీమేశ్వరుని గొల్తు రప్పురమున
సానులను పేరి యప్సర శ్చంద్రముఖులు

మరియు దక్షారామమునఁ బరమేశ్వరునకు వేశ్యారూపిణియగు మాణిక్యాంబ భార్యయనిగూడ నాతడే "వేశ్య యనుమాట కొక్కింత వెలితిలేదు భార్య యనుమాట కేమియుఁ బఱపులేద"ని తెల్పియున్నాడు. అనితల్లి కలువచేరు శాసనమున "శ్రీ దక్షవాటీ పతిః, భీమేశః సురకామినీ సహచరః" అని వర్ణించబడిగలదు. ఇట్లే క్రీడాభిరామపద్యమున వర్ణించబడిన యంశములు శ్రీనాథుని భీమఖండము, అనితల్లి కలువచేరు శాసనములనుబట్టియు విదిత మగుచున్నవి. ఆ పద్యపు శయ్యా సౌభాగ్యము, పదసంయోజన మునుబట్టి యెవ్వరైన నది శ్రీనాథునిదేయని దెలియగలరు.

ఇట్లు గజపతి ధారాసురత్రాణులకు కలహము సంభవించెనని శాసనాధారములనుబట్టి స్పష్టముగ దెలియుచుండుట, గజపతుల పరిపాలనారంభమున శ్రీనాథుఁడు జీవించియుండినట్లనేక ప్రబల ప్రమాణములచే నిరూపితమగుటచే నాతని సమయమున వల్లభరాయనిచే రచించబడినదే కానిండు క్రీడాభిరామ పై పద్యమున "ధారాసురత్రాణ కటక కుంభి కుంభ కలహకారి" యను దానిలో నా చరిత్రాంశమును గర్భిత మొనరించి నాఁడని నేను వ్రాయుట వృథా భ్రమించి పాఠకులను దిగ్భ్రమ కలిగించుట కగునో లేక శ్రీ తమ్మయ్యగారు చెప్పునట్లా యా పదములు యలిభిక్షకయి యాదృచ్ఛికముగనే కేవల మట్లు ప్రయోగించబడిన వనుటలో సామంజస్యము గలదో సహృదయు లరయుదురుగాక.

# కవితాప్రవాసి

శ్రీ బొడ్డు బాపిరాజు

చిర విరహశూన్య హృదయమందిరము మరల
శ్రీ పదన్యాస రమ్యరోచిస్సుధర్మ
చేయుమో కవితాసఖీ! శిశిర శిథిల
వల్లిని వసంతనవపల్లవమ్ము వోలె

పలుకరింపదు సాంధ్య జలధరశ్రేణి మం
దాకినీ సైకతస్థలవిహారి
పిలువదు దక్షిణానిల పరిష్వంగ వి
శ్రాంత వేణువనాంత రమ్యగీతి
చూపదు ఋతురాజ శుద్ధాంత వల్లికాం
తర చరత్ ప్రౌఢ మందారబాల.
వినిపింపవు విషాద విశ్వవీణామూర్ఛ
నలు మహాబ్ధి తరంగ నాట్యకేళి

నీవు వెలిసేయ నో కవితావధూటి!
నిఖిలసౌందర్య దేవతా నృత్యదంఘ్రి
నూపుర ఝణంఝణర్ఝణా నూన మధుర
శబ్ద శూన్యమ్ము మన్మనశ్చంద్రశాల

నీవె నన్నువరించివచ్చి రసికశ్రేణీ సముల్లాసవాక్
ప్రావీణ్యంబు ఘటించి కూర్చితి యశోలక్ష్మి న్స్వయంగా హా; మే
లా వైముఖ్య, మసఖ్య మిప్పు డిటులేలా ప్రతారింపులున్
దేవీ! నీ సఖు కీర్తివార్ధిపికునిన్ జేయన్ వినోదంబటే?

మౌక్తికము లేనిశుక్తి, వియుక్త తంత్రి
యగు విపంచిక, ప్రతిఫలనావసన్న
దర్పణమ్ము, నిర్గళితరత్నాంగుళీయ
మో సఖీ! నేడు కవితాప్రవాసి వీడు

# కవితా ప్రవాసి

నీవు హృదంకశాయివయి నెయ్యమునించి మనోజ్ఞ రాగశే
ఖావికసన్మధూదయముగా బ్రదుకెల్లను నిండిపోవ నే
పూవులు పూసినాననుట పో మిగిలెన్ కలగా; త్వదీయ హే
లావని యీయెడంద కనరాదిపు డొక్క పదాంకలేశమున్ !

పాడు మటంచు నెంత బలవంతము చేసిననేమి! గొంతు రా
పాడుటకాక, లో నిలిచి భవ్యమరంద ఝరుల్ వెలార్చు నీ
పూడనిబాడ పాడువడియున్న దివాణము, చిల్కలేని యీ
గూడిక తేనియల్ గురియునో మురిపించునొ తేటిమొత్తమున్ !

వరహేమంత దినాంత బంధితగళద్వారమ్ము, నిర్వాసిత
స్వరవంశమ్ము, వనప్రియమ్ము నిటు సంబాధింప నేలా గత
స్మరణల్ పూర్వయశఃపునశ్చరణముల్ సాగించి; పాడింప నె
వ్వరి శక్యం బిపు డామ్రపల్లవ నవప్రాగ్భార శూన్యావనిన్?

చీకటివేళ నెన్నడో వచింపక సుంతయు తోటమాలి తా
నేకతమేగ వాకిలి బిగించి దృఢమ్ముగ; పూల సజ్జలన్
గైకొని యీ యహర్ముఖమునన్ జనుదెంచు సుహృజ్జనాళికి
వాకిలి మూగగొంతు కలవార్తల నేమని దెల్పు సిగ్గునన్?

వ్రజకుమారుని అధర సంస్పర్శ కెడసి
మానస విషాద మౌన సమాధి నున్న
వేణుదండమ్ము తా నాలపించు నెట్లు
భువనమోహన శృంగార ముగ్ధగీతి?

అరవిందసుందరీ తరుణారుణ కపోల
సౌకుమార్య మొకింత సంగ్రహించి
శరదిందుమండలాంతర సుధాహ్లాదవీచి
మాధుర్య మొకయింత మన్తరించి
రసజగన్నిశ్రేణి శిశుమందహాస రో
చిః ప్రసాద మొకింత సేకరించి
నవవధూలజ్జా వినమ్రమ ఫాల పవిత్ర
తిలకకాంతి యొకింత యలవరించి

ఉంచితివి లేఖనీ రసనాంచలమున
చేయని తపమ్ము సిద్ధించె లే యటంచు
మురియుచున్నంతలో కను మొరగిపోతి
వేమి యపరాధమొదవె దేవీ! త్యజింప?

ఎన్నడో పరీమళము వాసియున్న విరిని
ఎడనెడను చెల్మిమై పల్కరించు తేంట్లు
వోలె, నిదురించు నా గుండె నోలగించు
నవవసంత శరదృతు నాయకములు—

పిలువక వచ్చి కావ్యపదవీ నదవీయసు జేసి నామెదన్
నిలిచి యళింద నందనవనీ హరిచందన సుందరాకృతిన్
లలితనవోపగూహనములన్ వెలయించినదాన విప్పుడీ
సొలయిక లేలనే మొగము చూపవు నేనయి ఎంత పిల్చినన్?

బాలాంగుళీక తాండవ
లీలా కలికించితములు లేక విషాద
వ్యాలోలమైన వీణియ
కీ లో నొక సుప్రభాత మే తెంచు న టే!

# కేంద్రములలో శుక్ర వరుణ వేధ


## శ్రీ రాళ్ళపల్లి గోపాల కృష్ణమాచార్యులు


ప్రశాంత మనోహరమగు ఒక మాఘమాసపు దిన మది. అరుణోదయ రాగరేఖలు పూర్వ దిశాముఖమును అలంకరించు చుండినవి. చుట్టుప్రక్కల నున్న మల్లెపొదలతో మంతనము లాడి వచ్చుచున్న ప్రత్యూష పవనాంకురముల సుఖస్పర్శ హాయి గొలుపుచుండెను. పుష్పవర్షము కురియుచున్న తరుణ తిలక వృక్షము క్రింది శిలాఫలకముపైన దంతధావన సామగ్రి చేత పట్టుకొని కూర్చుండి యుంటిని. నిర్మల నీలాకాశ మధ్యమున మహాకవి వాల్మీకి సెలవిచ్చినట్లు, సముద్రములో తేలియాడు రాజహంసవలె, స్వాతీ నక్షత్రము తళతళ మెరయుచుండినది. భూభాగముపై తన బంగారు కాంతులు వెదజల్లుచు ఆచార్య బృహస్పతి ఆ ప్రాంతమందే ప్రకాశించుచుండినాడు. ఎంతో రమణీయమైన దృశ్య మది.

నేత్రపర్వముగా ఆ దృశ్యమును చూచుచుండగా, ఎందుకో కాని, ఆ బృహస్పతి యున్న స్థానము నా దశమ కేంద్ర మధ్య మందే యని స్ఫురణకు వచ్చినది. భావస్వప్నమునుండి మేలు కొలిపినట్లయినది. జన్మాదిగా ఆ గ్రహ మట్లు వచ్చుటకు, అది అయిదవసారి. కడచిన పర్యాయములలో అట్టి గోచారము వృత్తిలో ముఖ్యముగా, జ్యోతిష వ్యాసంగ విషయములో, నాకెంతో సౌకర్యమును సమకూర్చినదని నా భావన. మరి యిప్పుడేమి చేయగలదు ? వృత్తి విరామము వార్జించి, పని పాటల గొడవలేక, ప్రశాంతముగా కాలము కడపుచుండిన దినము లవి. యథాసౌకర్యముగా, వ్యాసంగము మాత్రము, ఏదో కొంత జరుగుచుండినది. ఆ మార్గమందే ఇతోధికముగా సౌకర్యములు కలుగవచ్చునేమో ? ఏదో, ఉత్సాహము కలిగెను. కాని, ఈ ఊహలు పగటి కలలు కావుకదా ?

ఆ నాటికి నా దైనిక జాతక మెట్లుండెనో, పరిశీలింత మని తోచినది. త్వరగా కాల్యకృత్యములు ముగించి కుండలి గుణించితిని. ఆ చక్ర మిది.

| | | | |
|---|---|---|---|
| | చ 4-53 | | వ 13-20<br>రా 27-35 |
| శు 17-40<br>ర 16-36<br>బు 12-51 | (సాయనము)<br>—<br>తేదీ:- 5/6-2-1946<br>కాలము:- 5-15 A. m.<br>(IST) | | కు 15-46(వ)<br>శ 19-30(వ) |
| I 24 | | | య 10-16<br>(వ) |
| కే 27-35 | X 4 | ఇ 8-26<br>గు 27-19 | |

నా దశమ కేంద్రము తులారాశిలో 27°—55'. గోచార ములో గురువు ఆ భాగమును ప్రవేశించినాడు. నా దశమాంగారకుని సంయోగముతో ఆ గురువు నా జన్మరవికి త్రికోణ శుభదృష్టి నిచ్చుచుండుట! ఇది నా వ్యాసంగమునకు ఎంతో వింత యుయి నదే. జ్యోతిశ్శాస్త్రమునకు సంబంధించిన కుంభరాశి 29° లో నా జన్మ రవి ఉండుట !

ఇట్లు తలపోయుచుండగా, ఆనాటి కుజ, శనుల మధ్య బిందువు నా జన్మలగ్నమునకు నికరముగా ఎదురుగా నున్న దని కనుగొంటిని. మనుస్సునకు కొంత అలజడి కలిగెను. కుజ శని సంయోగము క్రూర స్వభావము కలది. ఆనాడా గ్రహ సంయోగపు సమష్టి ఫలము నా జన్మలగ్నమును తమ వైపు నకు ఆకర్షించుచున్నా రేల ? వారి సంకల్పమే మున్నదో ? ఇక, నా చలితలగ్నముమీద ఆనాటి చంద్రు డున్నాడు. ఆ భాగ హత్య లకు సంబంధించినదట ! కాని, ఆ చంద్రునికి నా జన్మగురువు నుండి నిండుగా కోణదృష్టి ! ఏ క్రౌర్యమునకైనా తగిన మన స్తత్త్వము వచ్చుట అసంభవము. మరి ఏ హింసాకాండనైనా చూడవలసి వచ్చునేమో ? ఆనాటి శుక్రుడు రవి సంయోగ దగ్ధుడై నా జన్మచంద్రునికి నికరముగా కేంద్ర వేధ నిచ్చు చుండుట ఏల ? ఇది మనఃక్లేశ సూచకము. ఏ స్త్రీకయినా సంభవించిన క్లేశమో, కష్టమో, చూడవలసి వచ్చునేమో ? నా దైనిక లగ్నము ఆనాటి చంద్రుని కేంద్ర వేధలో నున్నది. ఇది సంయుతము అట్టి సూచన చేయునదే. ఇక, నా దైనిక దశమ మన్ననో, నా చలితవరుణుని పైన నిలిచి, గోచార వరుణు నితో అనుకూల దృష్టితో నున్నది. ఇది నా వ్యాసంగమునకు తగినదే. కాని, దీనిలో ఏదో ఆకస్మికత తొంగిచూచుచున్నది. ఏమి ఈ విచిత్రవ్యూహమునకు అర్థము ?

నా ఆలోచనలు ముందుకు సాగలేదు. ఇంటిలో సిద్ధమగుచుండిన కాఫీ కషాయపు కమ్మని వాసనలు గుప్పున వచ్చి నా ఊహలకు అడ్డు తగిలినవి. లోగడ ఒకానొక రసికాగ్రేసరుడు విలాసవతియగు తరుణితో "కాఫీ" ని పోల్చి చెప్పిన చాటుధార జ్ఞప్తికి వచ్చినది.

"మధురాధర సంసర్గా,
శ్యామా, చారుపయోధరా,
స్నిగ్ధా, సర్వాంగ సురభిః,
"కాఫీ" కస్మై న రోచతే ?" అని.

నవ్వుకొని లేచి ఇంటిలోనికి వెళ్ళి, ఆ కార్యక్రమము ముగించితిని.

బాలభానుడు హరిజముపై అప్పుడే కొంత ఎక్కియుండెను. గడియారము 7 గంటలను చూపినది. ఇంటి ముందు బజారులో చిన్న చిన్న గుంపులుగా జనులు పరుగెత్తుచుండుట చూచితిని. ఇంటిముందు నిలిచి "ఏమి విశేషము ?" అని విచారించగా, "ఖూనీ ! ఖూనీ !" అని ఆ పరుగెత్తువారిలో ఎవరో అరచినారు. "ఎవరు ? ఎక్కడ ?" అని కేక వేసితిని కాని, ప్రతి చెప్పినవారు లేరు. "రామ రామ ! సూర్యోదయమునకే ఎంత ఘోరవార్త వినవలసి వచ్చినది ? తటాలున వారు పరుగెత్తుచుండిన దారియందే ఆత్రముతో నేను సయితము బయలుదేరితిని. ఎందుకో, నాకే తెలియదు. ఆలోచించలేదు కూడ. ఉద్యోగములో నున్న కాలములోనైతే అది వేరుమాట. రమారమి అరమైలు దూరములో నున్న ఒకానొక వీథిలోనికి జనులు పరుగెత్తుచుండిరి. వారి వెంట నేను పోతిని.

ఆ వీథిలో ఒక ఇంటిముందర గొప్ప కోలాహలము. ప్రహరిలోపల ఇంటిముందు వసారాలో చుట్టుప్రక్కల ఇండ్ల పెద్దమనుష్యులు కొందరు, కొందరు పోలీసు అధికారులు నిలిచియుండిరి. పోలీసు భటు డొకడు ఏదో వ్రాయుచుండినాడు. వారి మధ్యమందు నేలపై పడియున్నది ఒక స్త్రీ శవమని తోచినది. అల్లంత దూరమున స్ఫురద్రూపి యగు తరుణు డొకడు మూర్తీభవించిన నిర్లిప్తభావమువలె, కూర్చుండి శూన్యదృష్టులతో ఆకాశమును చూచుచుండెను. అతని మణిబంధమునకు బిగించియుండిన గొలుసును ఒక పోలీసు భటుడు పట్టుకొని యుండినాడు. నిందితు డతడే కాబోలు ? గుమికూడిన జనులను లోపలికి రానీయకుండ ప్రహరి వాకిట భటు డొకడు కావలి యుండెను.

వీథిలోని జనుల గుంపులో నిలుచుకొంటిని. కూడిన జనులు తలకొక్క మాటగా మాటలాడు ధోరణిలో నుండిరి.

"పాపము ! చిన్న వయస్సే !"
"చేసిన ద్రోహమో ?"
"ఏమి గ్రహచారమో ?"
"లేకుంటే, మరేమి ?"
"బంగారువంటి భర్త ఉండగా, ఏమి రోగము మరి?"
"దొంగ లంజకొడు కెవ్వడో తప్పించుకొన్నాడు."
"వాని అదృష్టము మంచిది."
'దీని కర్మ ఇట్లు కాలినది !"

పరిస్థితులు కొంత అర్థమైనట్లే. క్రమక్రమముగా నే నచట గ్రహించగలిగిన కథ ఇది :—

ఆ యింటి యజమాను డొక విద్యావంతుడగు తరుణుడు; యోగ్యమగు వేతన సౌకర్యముగల రాజకీయోద్యోగి. పాతిక వసంతములు దాటియుండు వయస్సు. ఏడెనిమిది నెలల క్రింద ఆ గ్రామమునకు మార్చబడి భార్యతో ఆ ఇంటిలో కాపురము చేరెనట ! ఉద్యోగ కార్యనిర్వహణములో అందెవేసిన చేయి అగుటచే, అధికారులు ఆదరమును, జనులలో పేరు ప్రతిష్ఠలను, సంపాదించినా డతడు; ఎంతో అభివృద్ధికి రాతగిన వ్యక్తి. దూర ప్రాంతములో స్వగ్రామములో నున్నారతని పెద్దలు. భార్యాభర్త లిద్దరే యిచట. దర్శనీయమగు ఆకార సౌష్ఠవము, కళంకములేని శీలము, యోగ్యమయిన ప్రవర్తనము. స్వధర్మశ్రద్ధ, ఆధ్యాత్మికదృష్టి కల వ్యక్తి అతడు.

కాని, సృష్టికర్త పనులు ఒకొకప్పుడు విపరీత పంథాలో నడచుచుండగలవు. అతనిని దండించువారు లేరు. నిరంకుశాధికార మతనిది. ఆ ఉద్యోగి భార్యకు అందములోనే కాక, శీలములో కూడా కొంత లోప మున్నదట ! మును పొక్కమారు, రెండేండ్ల క్రిందట కాబోలు, ఆమె శీలమును సందేహించి, నెమ్మదిగా భర్త ఆమెను పుట్టినింటికి పంపి, దాంపత్యమునకు 'స్వస్తి' అనుకొన్నాడు. కాని, అతని తల్లిదండ్రులు ప్రాపంచిక నీతితో కోడలి పక్షము వహించి, తగిన నిదర్శనము లేక సందేహమాత్రములోనే అగ్నిసాక్షిగా ప్రమాణముచేసి పెండ్లియాడిన భార్య నిట్లు పరిత్యాగము చేయుట ధర్మము కాదని, అతనికి హితము బోధించిరట ! వివేకశాలి యతడు మరల యథాపూర్వముగా సంసారయాత్ర సాగించుచు వచ్చినాడు.

కాని పురిటితో వచ్చిన బుద్ధి పుడకలతో కాని పోదందురు కదా ? ఈ గ్రామమున కాపురము చేరిన తరువాత సయితము ఆమె నడతలో అపుడపుడు లోపములు అగుపడినవట! భార్య తనకు ద్రోహము చేయుచున్నదను అభిప్రాయము ప్రబలముగా భర్తకు హృదయశల్యముగా పరిణమించెను. మాతృదేవత చేసియుండిన హెచ్చరికను అతడు మరచియుండలేదు. అవకాశము కల్పించి ఆమె గుణమును పరీక్షించవలెనని నిర్ధరించినా డతడు. ప్రత్యక్షముగా పట్టవలెనని సంకల్పము.

ఆ వెనుకనాటి సాయంకాలమున కార్యస్థానము నుండి ఇంటికి వచ్చి, ఉద్యోగపు పనులకై గ్రామాంతరమునకు రెండ్లు దినములు వెళ్లవలసి వచ్చినదని భార్యతో చెప్పి, తగు సన్నాహముతో అతడు బయలుదేరినాడు. చీకటిపడుదాక కారు

# కేంద్రములలో శుక్ర వరుణవేధ

స్థానములో కాలక్షేపము చేసి, కొంత వేషమును మార్చుకుని, ఇంటి వెనుక ప్రహరి గోడ మరుగులో కూర్చుండి కన్నులు కాయలు కాచునట్లు కనిపెట్టుకొని యున్న ఆతనిపాలికి ఆ రాత్రి "శివరాత్రి" ఐనది. అరుణోదయవేళలో పురుషు డొకడు ఇంటిలో ప్రవేశించినది కానరాగా, అతనికి దురాగ్రహ పిశాచ మావేశించి ఒడలు తెలియలేదు. తటాలున ప్రహరి గోడ ఎక్కి ఆవరణములోనికి దుమికి, చేతికి దొరికిన లావు పాటి కట్టె నొకటి ఝుళిపించుచు, అపర వీరభద్రావతారము వలె, తలుపు తట్టి గొళ్లెము తీయుమని భార్యను పిలిచినా డతడు. ఇంటిలో ఏదో సంచలనము వినవచ్చినది. కాని, భార్య పలికినది కాదు. బలముకొలది తలుపుల తన్నుచు కేకలు వేయు చుండినా, రెండు, మూడు నిమిషములకు కాని ఆమె తలుపులు తెరచినదికాదు. వెంటనే లోపలికి దూకి వెతుకగా, పురుషు డెవ్వడు కాని, అతనికి కానరాలేదు. పెరటి తలుపులు తెరచి యుండినది మాత్రము అగుపడినది. అర్థము స్పష్టము. అంటుకాడు తప్పించుకొని పారిపోవుటకు అనుకూలములు భార్యయే కల్పించినదని ఊహించి, అపారమయిన క్రోధ ముతో శపించుచు, ముందు వెనుక లాలోచించక, బలము కొలది అతడు భార్యను మోదినాడు. ఏ ఆయువుపట్టునకు తగిలెనో, పాపము, క్రిందపడి మూల్గుచు విలవిల తన్నుకొని ఆమె వెంటనే ప్రాణములను కోలుపోయినదట ! ఘోరము ! కంచంత కాపురము క్షణములో గంగపాలైనది. స్వధర్మమును నిరాదరించి దుర్వ్యామోహము నాశ్రయించిన ఆ యువతి సాధించినదేమి ?

"యో ధ్రువాణి పరిత్యజ్య,
అధ్రువాణి నిషేవతే,
ధ్రువాణి తస్య నశ్యంతి,
అధ్రువం నష్టమేవహి."

అన్నట్లు, ఉభయ భ్రష్టత్వము సిద్ధించినది కదా ?

నాలు గయిదు నిమిషములు కడచుదాక, కథానాయకుని బుద్ధికి కప్పియున్న మబ్బులు విడిపోలేదు. తరువాత "లేచి రమ్మ"ని భార్యను పలుకరించినా డతడు. ఆమె జీవాత్మ అప్పటికే లేచి లోకాంతరమును చేరుకున్నది. కదలించి చూడగా, సత్యము బోధపడెను. తన ఆగ్రహపు ఫలముగా స్త్రీహత్య జరిగినదని అర్థముకాగా, మిన్ను విరిగి మీద పడిన ట్లయినది. తల తిరుగ నారంభించి, భూమి పగిలి ఏ భూతమో తన్ను పాతాళ లోకమునకు కొనిపోవుచున్నట్లు తోచిన దతనికి. తెలివి రాగా, వెలికి వచ్చి కింకర్తవ్యతా మూఢ మనస్కుడై ఆకాశ మును చూచుచు కొంత తడ వుండగా, తన దుష్కృత్యమునకు ఫలమును తా ననుభవించుటే ధర్మమని అతనికి తోచినది. ఉత్తరక్షణమే, సమీపమందున్న పోలీసుఠాణాకు ఎవరితోనో సమాచారమును చెప్పి పంపి, పోలీసువారు రాగా సమగ్రముగా అతడు తన కథనంతయు విశదీకరించి బుద్ధిపూర్వకముగా వారికి స్వాధీనపడినాడు. వారు శవమును బైటవేసి, శవ పంచాయతి మొదలగు కార్యక్రమమును జరుపుచున్నారు.

ఈ ఘోర విషాదాంతగాథ విని నా కన్నులు చెమ్మగిల్లినవి. ఏమి దుర్దైవ ప్రభావమో ఇది ? ఎంతో అభివృద్ధికి రావలసియున్న ఆ తరుణ దంపతుల సంసారముపైడ ఆకస్మికముగా పిడుగు కొట్టినట్లయినది కదా ? దుర్వ్యామోహావేశము ఫలముగా ఆ గృహిణికి అపమృత్యువు, దురాగ్రహావేశపు ఫలముగా కథానాయకునికి ప్రాణాపాయము కల్గు పరిస్థితి ! కొంచెము ప్రశాంతముగా ఆలోచించి యుండెనేని, భార్యను రెండు చెంపపెట్ల బహుమానముతో పుట్టినింటికి పంపి సంసారమున కతడు తిలోదక ప్రదానము చేసియుండును. స్త్రీ హత్యాపాతకము వచ్చియుండదు. కాని ఆ పరిస్థితులలో అంత నెమ్మది కల్గుట ఏ మహానుభావునికో ?

కొన్ని నిమిషములలో శవమును పరీక్షకై పంపి, ఇంటికి బీగముద్రలు వేసి, కథానాయకుని వెంట తీసుకొని పోలీసువారు వెడలిపోయినారు. కోలాహలము శాంతమయినది. ఒకరొకరే కూడిన జనులు జారుకున్నారు. నేను సహా ఇల్లు చేరుకుంటిని, కాని, ఆనాడంతయు నా హృదయములో గొప్ప తుపాను చెలరేగినట్లుండినది.

ఆనాడు రమారమి 5—0 A. M. గంటల కాలమందే కుజ, శనులు సప్తమ భావములో ఉండగల్గుట. ఆ క్షణమందే ఈ హత్య జరిగి యుండగల దనుటకు సందేహములేదు. ఆ దంపతుల జాతకములలోని ప్రబల దుష్ట దశలతో ఆనాటి గ్రహములకు క్రూర సంబంధము ఉండలేరును. ఆ జాతకములు లభించెనేని, ఈ సమన్వయమును చూపుట సాధ్యము. శాస్త్రదృష్టిలో ఇది ఎంతో ప్రయోజనకారి. కాని, ఆ సామగ్రి యిచ్చువా రెవరు ? వారి పెద్ద లెందున్నారో తెలియదు. తెలిసినా, వారికి వ్రాయుట లౌకిక దృష్టిలో రుచికరము కాదు. వ్రాసినా వారీ సామగ్రిని పంపరు కూడ. పోనిత్తము.

నెలదినములకు మండల న్యాయస్థానములో హత్యాపరాధపు అభియోగము తీర్మాన మయినది. న్యాయాధిపతి ఎదుట సహా నిందితుడు, ఎవ-రెంత బోధించినా తన కథను మార్చలేదు. యావజ్జీవ కారాగృహ శిక్ష విధించబడినదని వింటిని. హత్యాకాలములో దశమ కేంద్రమందు వెలుగుచుండిన దయాశాలి బృహస్పతి ఇంత కఠినశిక్ష ఇప్పించినాడే ! అని మనస్సు గ్రుచ్చినది. కాని, అతని జాతకములో గురు వెట్లున్నాడో ? కేవలము ఊహలమీద ఆధారపడుట వ్యర్థ పరిశ్రమ. తరువాత క్రమక్రమముగా ఈ విషయమునే మరచితిని.

ఆరు సంవత్సరములు కడచినది. 1952 వ సంవత్సరమున ఒకానొక అభిజాత్య కుటుంబపు మిత్రుని యింట జరుగుచున్న వివాహ మహోత్సవమునకు వెళ్లియుంటిని. మధ్యాహ్నకాలము కొంత మీరిన ముహూర్త మది. వివాహము ఎంతో శోభాయమానముగా జరిగెను. ఆస్తిక చిత్తవృత్తి,

సనాతన కర్మశ్రద్ధ, గొప్ప సంస్కృతి కల ఉన్నత విద్యావంతుడు యజమానుడు. శ్రద్ధతో అతడు నికరముగా ముహూర్తకాలమును సాధించినాడు. పురోహితుల ధర్మమునకు వదలియుండినచో, వారు "తదేవ లగ్నము" చేతురని అతనికి తెలుసును.

వివాహానంతరము మహా వైభవముగా సమారాధనపు విందులు జరిగినవి.

"సీ. అమృతరసోపమంబైన కమ్మని యాశఁ
బాలపాయసము జంబాలమయ్యె,
మంచు లప్పల మించు మండెంగ మడుపులు
పారలి తెట్టున గట్టు నురుగులయ్యె,
కప్పురంబుల యొప్పు తప్పు పట్టగ జాలు
ఖండశర్కరలు సైకతము లయ్యె,
గరుడపచ్చల చాయగల పచ్చ గందని
కూరలు శైవలాంకురము లయ్యె,
తే. నొలుపు పప్పుల తీరంబు లురలిపడగ,
బూరియటు లడ్డువంబులు పొరలిపార,
విమల శాల్యోదకంబుపై వేర్లిచూపు,
వాజ్య ధారాప్రవాహ సాహస్రములకు."
(శృంగారనైషధము)

కవిసార్వభౌముడు చేసిన ఈ వర్ణనమును జ్ఞప్తికి తెప్పించిన విందు భోజన మది.

తరువాత, తాంబూలచర్వణము చేయుచు బంధుమిత్రులు గుంపులు గుంపులుగ కూర్చుండి, లోకాభిరామముగా నానా విషయములను గూర్చి చర్చలు, ప్రసంగములు, విమర్శనములు సాగించుచుండిరి. ఒకచోట ఆధునిక విద్యావంతులగు యువకులు కొందరు (వారందరు అవివాహితులే) ఏదో విమర్శించుచుండగా, వారికి చేరువగా కూర్చుండి వినుచుంటిని.

"అంతా సరే. కాని, యజమానునికి కొంత చేదస్తము" అని ఒకని విమర్శ.

"ఛీ ! ఛీ ! అతడు గొప్ప విద్యావంతుడు. నీకే చేదస్తము' అని మరియొకడు.

"కాకపోతే ? వధువు ఎదుట నిలచియున్న వరుని చేతికి మంగళసూత్ర మిచ్చి, అతడు కట్టబోవుచుండగా, ఆగుమని వాల్గు నిమిషము లతని నట్లే నిలబెట్టుట చేదస్తము కాక పోతే ? .... నగుబాట్లచేటు !"

అని ప్రథముడు సమర్థించినాడు.

"మంచి కాలమునకు కాచినారు. ఏమి తప్పు ?" అని ద్వితీయుడు.

"కాలమునకు మంచి చెడ్డ లేమిటి ? పిచ్చి కాక !" అని అప్పళించినాడు ప్రథముడు.

"హ, హా ! నెహ్రూ పండితుని శిష్యుడు వీడు !" అని మరియొకడు ఎత్తిపొడిచినాడు.

ఇతరులు కరతాళధ్వనులు చేసిరి.

ఇంతవరకు ఊరక కూర్చుండియున్న వ్యక్తి యొకడు కలుగజేసికొని,

"మనకా శాస్త్రము తెలియదు. అధికారములేని విషయములను విమర్శించరాదు" అనెను.

ఇతడు మంచి వర్చస్వి. ఇంచుమించు ముప్పది సంవత్సరములు దాటియుండును. ముఖము ఎప్పుడో చూచినట్లు తోచినది. ఎచటనో, ఎక్కడనో, స్ఫురించలేదు. భ్రమ కాబోలు.

"ఒక శాస్త్రములో, కలాశాలలో కొంత పాండిత్యము వచ్చినంతనే సర్వజ్ఞుల మనుకొనుట, ఇప్పటి విద్యా విధానములో, అథవా, వ్యాసంగ పద్ధతులలో, మన యువకులు సంపాదించిన ఫలము. ఒక్కొక్క కాలము ఒక్కొక్క కార్యమునకు యోగ్యమని మీ మిత్రునికి తోచలేదు. అర్ధరాత్రివేళలో అతడు కార్యస్థానమునకు పోయి పనులేల చేయరాదు ?" అంటిని.

"సూర్యుడు వెలుగుచుండువేళలోనే కార్యస్థానముల పనులు జరుపవలెనని నిర్ణయించినారు."

ప్రథము డిట్లు అనగా, "అట్లే, శుభగ్రహములు నిర్ణీత స్థానములలో నున్నప్పుడే వివాహములు మొదలగు అభివృద్ధి కార్యములు జరుపుట శుభకరమని ప్రాచీన మహర్షులు నిర్ధరించి యున్నారు" అంటిని.

అంతలో, ఎవరో పిలువగా, అతడు వెడలిపోవుటచే ఆ చర్చ అంతటితో ఆగిపోయినది.

కొన్ని నిముసముల తరువాత, ఆ వర్చస్వి నా సమీపమునకు వచ్చి సవినయముగా తన జాతకము చూడవలెనని కోరెను. కానిమ్మని, నా గదికి అతనిని పిలుచుకొనిపోయి అతడిచ్చిన సామగ్రితో జాతకమును గుణించి, లగ్నశోధనమునకై వివాహము, ఆప్తబంధు నిర్యాణము, ప్రమాదములు మొదలగు ప్రముఖ జీవితానుభవముల దినములు కొన్ని తెలుపుమని అడిగితిని. ఎందుకో క్షణకాల మూరకుండి నిట్టూర్చి,

"నా జీవిత మొక విషాదగాథ ! నక్షత్రానుకూలము బాగున్న కన్యక లభించినదని, చిన్నతనమందే వివాహము జరిపినారు. కొన్నాళ్లు మా సంసారము సవ్యముగా నడచినది. 6—2—1946 వ తేదీనాడు, నా పాపము పండి, భార్య అపమృత్యువు పాలయినది. నేను పాపిని ! దానికి బాధ్యత నాదే."

అని చెప్పునపు డతని కన్నులలో దైన్యము, ముఖములో విషాదరేఖలు, చూపట్టెను. అతని హృదయాంత

# కేంద్రములలో శుక్ర వరుణవేధ

రాశములో అణగియుండిన ఏ దుఃఖాగ్నినో రగులుగొలిపితినే అని మనసు కళుక్కు మనినది. లగ్నశోధనమునకు కావలసిన విషయములు సేకరించుటకై విధిలేక మరల ప్రశ్నించితిని.

"అపుడు మీ నివాస మెచట ?"

ఆ కాలములో నేనుండిన గ్రామమునే అతడు పేర్కొనగా, నాకు అత్యాశ్చర్యమయినది. ఉత్తరక్షణమందే, నా తలలో ఏదో మెరుపు మెరసిన ట్లయ్యెను.

"వెతుకబోయిన తీగె విస్మయం బొదవ,
పదముల తగులుట భాగ్యంబు కాదె !"

"రమారమి, 5 A.M. గంట ప్రాంతములో నేనా... ?"

అనగా, "ఔనండీ !" అని, అత డాశ్చర్యముతో "మీ కెట్లు తెలుసును ?" అని విచ్చుకన్నులతో చూచెను.

విషయము అర్థమైనది. ముఖము జ్ఞప్తికి వచ్చెను. అతడే కథానాయకుడు ! ఆలోచించగా, ఆనాటి నా దైనిక లగ్నము జన్మ వరుణునిమీద నుండెనని తేలినది. ఇక, సందేహ మేమి ? కాని, యావజ్జీవ కారాగారావాస శిక్ష విధించబడి యుండిన వ్యక్తి ఇచటికి రాగలుగుట ఎట్లు ? నెమ్మదిగా ప్రశ్నించితిని. భారతదేశము స్వాతంత్ర్యము సంపాదించినందుకు గుర్తుగా 1948 వ సంవత్సరము నవంబరు నెలలో రాజ్యాంగమువారు తన అపరాధమును క్షమించి వదలినారనియు, తరువాత అవమానముతో సంఘములో సంచరించుటకు మనస్సు రాక దూరప్రాంతములో ఉండగోరి సైనిక శాఖలో ఏదో ఉద్యోగమును సంపాదించుకొని, దానియందే అభివృద్ధి కలిగి ఇప్పుడు "కాప్టన్" గా నున్నాడనియు, ఆనాటి వివాహ సమయమునకు బంధుమిత్రులు చేరియుందురని తలచి చూడ వచ్చినాడనియు, అతడు చెప్పగా నాకు అనిర్వాచ్యమగు ఆనందమైనది. హత్యా సమయములో దశమకేంద్రమం దుండిన బృహస్పతి 'నిర్గంధ కుసుమము' కాలేదు కదా అని, తలవనితలంపుగా కథానాయకుని జాతకము లభించినది కదా, అని, పట్టరాని సంతోషము !

"మరల వివాహ మైనదా ?" అంటిని. అత డించుక వెకిలినవ్వు నవ్వి,

"ఒక స్త్రీహత్య చాలదా ?" అని ప్రతి చెప్పగా నిరుత్తరుడనైతిని. క్షణకాలము ఊరకుండి అత డిట్లనెను.

"సాధారణముగా కోపము నెరుగని నాకు ఆనాడు అంత దురాగ్రహము వచ్చుటకు నా జాతకములో కారణ ముండెనా ? నా ఆయుర్దాయమును చెప్పండి."

అతని పశ్చాత్తాపమునకు, ధర్మదృష్టికి మెచ్చుకొంటిని. అతడి జాతకచక్రమును గుణించి లగ్నశోధనము చేసి, అత డడిగిన రెండు మూడు ప్రశ్నలకు తోచిన సమాధానములు చెప్పితిని. అది యిట్లుండె.

కథానాయకుని స్పష్టజాతకము విద్యార్థులకు, పరిశోధకులకు సహా, ఉపయోగకరమని, నా భావన. ఆ జాతకమునకు 'నిరయన' చక్రము ఇట్లుండును :—

| | | | |
|---|---|---|---|
| | కే 17-35 | | |
| I 13-40 | నిరయన<br>జాతక కుండలి | | బు 16-43<br>ర 29-39-4 |
| | ——<br>అయనాంశలు<br>= 22°-45' | | గు 4-43<br>శు 11-27<br>చ 18-46<br>శ 19-22 |
| | X 19-43 | రా 17-35<br>కు 24-57 | |

వింశోత్తరీదశలో శుక్రదశాశేషము 11 సం, 10 నెలలు, 6 దినములు. చంద్రదశా శుక్రాంతరములో భార్యాహత్య !

ముఖ్యముగా, ప్రశంసా విషయమగు కళత్రభావమును మాత్రము చర్చింతము. ఆ భావములో గొప్ప గ్రహకూటమున్నది. కళత్ర బాహుళ్యమును సూచించు ననవచ్చును. కాని, అతని అభిప్రాయములు అతుకవు. లగ్నాధిపతిశని చంద్రునితో చేరి సప్తమ భావములో నుండుట కళత్ర నష్టమును తెలుపవచ్చును. షష్ఠాధిపతిచంద్రుడు శుక్రునితో చేరి కళత్ర భావములో నుండుట దాంపత్య సుఖలోపములను తెలుపవచ్చునేమో ? కాని, శుభులగు గురు, శుక్రులు—అందులో కుంభ లగ్నమున కుపయోగకారకుడు శుక్రుడు—సప్తమ భావములో నుండగా, భార్యకు శీలహాని వలన అపమృత్యువు, భర్తకు దురాగ్రహము కారణముగా కారాగృహ యోగము అను ఫలములను సాధించుట ప్రయాస.

అభిజ్ఞులు పరిశీలింతురుగాక.

ఇక సాయన జాతకచక్రమును చూతము. నూతన గ్రహస్థానములు, కొన్ని సహమములు సహా, ఈ కుండలిలో చూపబడినవి.

తేదీ : 16—8—1920

అక్షాంశ : 16°—34' ఉత్తరము.

నాక్షత్ర కాలాంతరము—7—10'.

| | | | |
|---|---|---|---|
| కారాగృహ 26-8<br>పుణ్య 25-33<br>భార్యామృతి 6-3<br>I 6-25<br>వ 4-0 | | కే 10-20<br>శత్రు 12-0 | |
| | (సాయనము)<br>—<br>శుద్ధ<br>జన్మ చక్రము<br>— | | యు 8-18 |
| | | | బు 3-43<br>భార్య 5-41<br>ఇ 11-42<br>భార్యాతోటి 17-29<br>ర 22°-23'-39"<br>గు 27-28 |
| X 12-28 | రా 10-20<br>కు 17-42 | VIII 8-26<br>హత్య 9-18 | శు 4-12<br>చ 11-31<br>శ 12-7 |

కళత్రభావములోని గ్రహకూటము ఇచట సంయుతము ప్రత్యక్షమై యున్నది. కాని, ఒకటి రెండు విశేషములను విన్నవింతును.

కళత్ర కారకుడైన కామాధిదేవత శుక్రునికి స్పష్టముగా సమసప్తక క్రూరదృష్టితో నున్న మహాప్రభావశాలి వరుణుడు లగ్నములోనే యుండుట పాఠక మహాశయులు గమనించి యుందురు. ఎండమావులలో గంగాస్రవంతిని చూర్చు చాకచక్యము కల మహామాయావి ఇంద్రుని సఖ్యమును కళత్రాధిపతి బుధుడు కోరుచున్నాడు. భార్యాసహమము సంయుతము ఇంద్ర సాహచర్యమునే అభిలషించుచుండుట! కన్యారాశి మేష నవాంశములో నున్నాడు చంద్రుడు. ప్రబల సురత ప్రియత్వమును సూచించుచు, విషయసుఖ స్థానాధిపతియగు ఈ చంద్రుడు, కళత్రభావములో వ్యయాధిపతియగు శని సంయోగము నపేక్షించుచున్నాడు. శని నవాంశలో నున్న సప్తమ భావము ఆ శుక్ర చంద్రుల నడుమ నున్నది. మనోనిగ్రహము లేక, ఇంద్రియార్థ పారవశ్యమున, యుక్తాయుక్త పరిజ్ఞానము నశించి, ఆనందానుభూతికై వెంపరలాడు స్వభావము కళత్రమం దున్నదనవచ్చును. మెరుపువూసవంటి మరియొక్క యోగమును చిత్తగింపుడు ! వియోగ కారకుడగు వరుణుని సమసప్తక వేధను అనుభవించి విడివడి, విషయసుఖభావాధిపతి యగు చంద్రుని సంయోగమునే శుక్రుడు కోరుచుండుట! శారీరక, వాచిక, స్థాయీలలో జాతకునితో పొత్తు కుదరక అతని కళత్రము మార్గాంతరములలో విషయసుఖమును కాంక్షించుచున్నదని అర్థముకాదా ?

లగ్నమును అంటియున్న భార్యామృతి సహమము భార్య మరణముతో జాతకునికి సన్నిహిత సంబంధము జన్మసిద్ధ మనుచున్నది. లగ్న సప్తమ కేంద్రముల నాశ్రయించియున్న వరుణ—శుక్రవేధ వియోగానుభవమునకు పూటకాపు ! కారాగృహ సహమము పుణ్యసహమమును వెంటనంటి ప్రారబ్ధ పరిపాకమునకు దిక్సూచియగుచున్నది. శత్రుసహమ కేంద్రములో రాహుకేతుల సరి మధ్యమున, భార్యాసహమముతో చేరి షష్ఠభావములో నిలిచి అతి దుష్టుడగు ఇంద్రునినుండి పై రెండు సహమములకును విషమ సార్ధ కేంద్రవేధ ! భార్యావిట సహమము సహా షష్ఠ భావములో నుండగా, దానికి కుజుని కేంద్ర క్రూరదృష్టి! ఆకస్మిక మాత్సర్యావేశముతో ఒడలుమరచి, వివేకమును కోలుపోయి, జాతకుడు దుష్ట ప్రారబ్ధఫలము నాహ్వానించుట కాక వేరేమి ? కళత్రభావములో గురువు ఉండు మాట సత్యమే ! కాని, అతనికి షష్ఠాధిపతి రవి సంయోగము. గురువు గుణవంతుడే కాని, బలహీనుడు. వరుణవేధతో చెడిన నీచ శుక్రుడు భావ మధ్యమందు కులుకుచు అధికారము నిర్వహించుచుండగా, దూరమందున్న లగ్నాధిపతి గురువు ఏమి చేయగలడు ? యోగ్యుడైన జాతకుడు ప్రబల విషమ పరిస్థితులకు చిక్కి క్లేశ మనుభవించగలడనియు అవకాశము లభించినప్పుడు గురువు అతనికి విదితము చేయుననియు, సూచన కావచ్చును.

"లగ్నేశే సప్తమే యస్య,
తస్య భార్యా వినశ్యతి."

అని పరాశర వాక్యము. జాతకుని భార్యకు వైధవ్యము రానీయడు, లగ్నాధిపతియై కళత్రభావములో నున్న ఈ గురువు!

జాతక వాగ్దానము లివి : ఏ యోగములయినా ఫలించుటకు దశల సాహాయ్యము కావలయును కదా ? ప్రశంసా కాలములో దేవమానదశ లెట్లుండెనో గమనింతము. అప్పటికి చలిత జాతక చక్రమిది :—

| | | | |
|---|---|---|---|
| వ 3-8 | భార్యామృతి 7-15<br>I 7-27<br>పుణ్య 26-38<br>కారాగృహ 27-15 | కే 8-57 | శత్రు 8-36 |
| | (సాయనము)<br>—<br>చలిత జాతక కుండలి<br>6-2-1946 నాటికి<br>— | | యు 8-22 |
| X 5-30 | | | ఇ 12-36<br>చ 14-28<br>భార్యా 28-43 |
| కు 3-23 | హత్య 3-7<br>రా 8-57 | శు 5-40 | గు 6-1<br>భార్యావిట 10-56<br>శ 15-17<br>ర 17-3<br>బు 17-58 |

# కేంద్రములలో శుక్ర వరుణవేధ

అప్పుడు వ్యాప్తిలో నున్న దశ లివి :—

(1) చలిత హత్యా సహమము జన్మ కళత్రాధిపతి యగు బుధుని కేంద్ర క్రూర దృష్టికి వచ్చుట.

(2) చలిత కళత్రభావము జన్మ మృత్యు (VIII) భావమును చేరుకొని యముని కేంద్ర వేధ పాలగుట.

(3) చలిత భార్యామృతి సహమము, చలిత లగ్నముతో సహా, మేషరాశియందలి మృత్యుభాగ ($8^\circ$) కు వచ్చుట.

(4) చలిత శుక్రుడు తులారాశిలో $5^\circ$ ను చేరుకొనుట.

(ఇది హత్యకు సంబంధించిన దుష్టభాగ అట !)

(5) చలిత భార్యా సహమము ఇంద్ర శనుల నడుమ నలుగుట.

(6) చలిత భార్యావిట సహమము విషయసుఖాధిపతియై కళత్రస్థానమందున్న చంద్రుని చేరుట.

ఈ దశల సమష్టి ఫలమునకు వ్యాఖ్యానము అనవసరము.

(7) చలితకుజ గురువులు అన్యోన్య కేంద్రగతులగుట. న్యాయస్థానపు తీర్మానము క్లేశకర మగునని దీని సూచన.

(8) చలితవరుణుడు చలిత హత్యా సహమమును మిత్ర దృష్టితో ప్రేరేపించుచు, చలిత గురు కుజులను క్రూరదృష్టి పాలు చేయుట.

ఆ తీర్మానము వరుణ ప్రేరితమగు ఆకస్మిక క్రూర కృత్యపు ఫల మనుట !

(9) చలితరవి జన్మకుజునితో మిత్రదృష్టి నార్జించుట.

ధైర్యసాహసముల నిచ్చు దశ ఇది. అనుభవమును కరబదర సమానముగా చూపుచున్నవి ఈ దశలు !

హత్యాదినమునకు మూడు దినములు వెనుక వచ్చిన పర్వము (అమావాస్య) కుంభరాశిలో $12^\circ—46'$ లో పడినది. ఆనాడు శుక్రునికి రవి చంద్ర సంయోగము ! ఈ గ్రహకూటము జాతకుని ఇంద్రుని చలిత స్థానమునకు నికరముగా సమసప్తకములో నుండి దశా ఫలములకు ఉత్తేజనము నిచ్చినది. తరువాత మూడు దినములకు బుధుడు ఆ పర్వస్థానమును చేరుకొని ఆ ఇంద్రునికి ఎదురైనాడు. జాతకుని బుద్ధికి మబ్బులు కప్పిన దినమది. ఆనాటి ఇంద్రుడు జన్మ యముని కేంద్ర వేధతో అష్టమ భావమును ఆశ్రయించి యుండుట గమనార్హము. ఎంత ఘోర కార్యమునకైనా తగిన గ్రహచారమిది. ఆనాటి శుక్రుడు భార్యావిట సహమమునకు ఎదుట నుండగా వారి నడుమ జాతకుని జన్మ కుజుడు, భీమునివలె, నిలిచినాడు. శత్రువు తప్పించుకొని పోయినాడు. దొరికియుండెనేని, కథ వేరుగా పరిణమించి యుండెడిది. వాని తల్లి కడుపు చల్లనిది !

ఆ దినమునకు జాతకుని దైనికలగ్నము నికరముగా కన్యారాశిలో $4^\circ$ లో నుండెనని విన్నచో, పాఠక మహాశయులు ఉలికిపడక మానరు. దైనిక లగ్నము జన్మ శుక్రునిమీద, దైనిక సప్తమము జన్మ వరుణునిమీద, నిలిచి యుండినవనుట ! వీరేకదా ఈ విషాదాంత నాటికకు ప్రధానకార్యకర్తలు ? సమయమునకు కాచియుండిన వరుణుడు తన పనిని నెరవేర్చినాడు !

సరేకాని, హత్యాకాలములో లగ్నమునకు ఎదురుగా నిలిచి యుండిన కుజ, శనులకు ఏమి సంబంధము ? అందురేమో ! దశలో కుజుడు ఎట్లుండెనో కనుగొన్నాము. వరుణ కేంద్ర వేధ అతనికి. ఆనాటి శనితో ఆ వరుణునికి సార్ధకేంద్ర వేధ; శుక్రునికి అర్ధకేంద్ర క్రూరదృష్టి ! ఈ క్రూరగ్రహముల సంయోగఫలము జాతకుని భార్య అందుకొన్నది. ఆమె జాతకము లభించియుండెనేని, ఆ కుజ శనుల విషమ సంబంధము ఆమె గ్రహములకు తగిలెనని నిరూపించుట సులభము.

ఈ జాతకునికే అప్పటికి వర్షజాతక, దిన జాతకాదులు సాధించితిమేని, అతనికి అది ఎంత క్రూర దశాకాలమో కనుగొనగలము. పరిశోధనదృష్టి గల విద్యార్థులు ఆ పనికి పూనుకొనరు.

ఇంతటితో చాలింతము. ఇంద్రావరుణ గ్రహములను నిరాదరించుట ఎంత ప్రమాదకరమో, మన కీ వాస్తవ జీవిత చరిత్ర బోధించగలదు. ఆ గ్రహములను గమనించక ఈ దంపతులకు నక్షత్రానుకూలము చక్కగా కుదిరినదని నిర్ణయించి యుందురు. శుక్రవరుణ క్రూరవేధ లగ్న సప్తమములకు వ్యాపించుట దాంపత్య విషయమున ప్రబల దోషకారి. ఆకర్షణ మెంత ప్రబలమో, అపకర్షణము అంత క్రూరము. పతింవరలు కానున్న విద్యావతులగు కన్యలు, వయోధర్మానుసారముగా కనువేదురుపాలై, వరుల జాతకములందలి ఇట్టి క్రూరయోగములను నిరాదరించుట క్షేమకారి కాదని మనవి. మరియు పొంతనములు, వివాహ ముహూర్తములు నిర్ధరించి యిచ్చు కార్తాంతికులు, తమ "సంప్రదాయము" కాదని, ఈ నూతన గ్రహములను, భావ సాధనమును, నిరాదరించినచో, అనేక సందర్భములలో అమాయకులగు కన్యావరులకు గొప్ప అపకారము కలుగునని నా భయము.

క్షంతవ్యుడను.

"ఆగ్నేయం, పౌరుషం, వాపి
శాస్త్రం దృక్సిద్ధ, మాశ్రయేత్
యథోత్తమాత్, జపున్యాద్వా
ప్రాప్తం రత్నం హితం భవేత్."

# పావురాలు

## శ్రీ తాడిగిరి పోతరాజు

మూగపావురాలు ఎగిరిపొయ్యాయి. గాలిలో తేలిపోతున్నాయి. గుంపులు, గుంపులుగా, రెపరెప రెక్కలు కొట్టుకొంటూ, ప్రపంచానికి దూరమైపోతున్నాయి. నీలాల నింగిపై పయనిస్తున్నాయి ఆ పిలుపువిని తృళ్ళిపడ్డ పావురాలు.

"అల్లాహో......అక్బర్......అల్లాహో". సుదీర్ఘంగా వినబడుతోంది ఆ కేక. ఆ విశాలమైన మసీదులో ఆ కేక ప్రతిధ్వనిస్తోంది. చెవుల్లో ప్రేళ్ళు పెట్టుకొని, నెత్తినటోపి పెట్టుకొని అరుస్తున్నాడు ముస్లిం మతగురువు ముల్లా.

మళ్ళీ వినబడింది ఆ పిలుపు హెచ్చుస్థాయిలో.

అల్లాహో......లక్బర్......అల్లాహో

అసహ్యభావంతో తొంగిచూసింది, ఏళ్ళు ముదిరి కీళ్ళు సడలిన ముసలి పావురం. ఆ శబ్దం వస్తున్న వైపుచూసి, వెకిలి నవ్వు నవ్వింది.

వెంటనే ఆత్మీయ పరిజనాన్ని అనుసరించింది. తన సోదరులందరినీ దేవుని మందిరానికి రమ్మని సందేశమిచ్చిన 'ముల్లా' తృప్తిగా మెట్లు దిగాడు.

విధిలేక నిలబడిన 'సెంట్రీ పోలీసు'ల్లా నిర్లక్ష్యంగా నిలబడిన గోపురాలు నిట్టూర్పు విడిచాయి. తమ హృదయ కుహరాల్లోనుండి వెళ్ళిపోయిన పావురాలను చూసి, విలపిస్తున్నాయి. తదేకంగా చూస్తున్నాయి అవి వెళ్తున్నవైపు.

దక్కన్ చిత్రలేఖనానికి మచ్చుతునకగా నిర్మించబడింది ఆ మసీదు. అందంగాఉన్న దాని గోపురాలు గగనంలోకి పోను పోను సన్నబడిపొయ్యాయి. గోపురం చివర ఒక చందమామ. నిషాలో ఉన్న నిజాం నవాబులా మత్తెక్కి పడుకొన్నాడు. ప్రక్కనున్న నక్షత్రం జోలపాడుతోంది.

పదిమందిజట్టు ఒకటి మసీదుమెట్లు అధిరోహిస్తోంది. వాళ్ళమధ్యనున్న వ్యక్తి, ఆ స్థూలకాయంపై పిగిలిపొయ్యేటట్టు ఒక ఖరీదైన షేర్వాణి వేసికొన్నాడు. పాకిస్తాన్, భారత దేశాలకున్న వైషమ్యాలనుగూర్చి, అక్కడున్న పరిమిత ప్రజాస్వామ్యపు విలువలనుగూర్చి ఉర్దూలో అనర్గళంగా ఉపన్యసిస్తూ, మెట్లు అతికష్టంగా ఎక్కుతున్నాడు. ప్రక్కనున్న శ్రోతలు, అతని అభిప్రాయాలకు సుముఖతనుగానీ, విముఖతనుగానీ వ్యక్తపరచక, వినయంగా చేతులు కట్టుకొని వెంట నడుస్తున్నారు.

ఇంకా నాలుగు మెట్లు ఎక్కాలి. చటుక్కున ఆగిపొయ్యాడు. ఎర్రగా ఇంతలావున ఉబ్బిపోయిన మెడను రుమాలతో తుడుచుకొన్నాడు.

ఆపై మెట్టుపై ఒక వృద్ధుడు నిర్లక్ష్యంగా అటు తిరిగి కూర్చున్నాడు. అతనివెనుక ఆగిపోయిన మహనీయులను గుర్తించలేదు. సూర్యకాంతిలో ఆ బట్టతల 'నిగనిగ' మెరసిపోతోంది. చిరిగిపోయిన చెప్పులు, విడాకులు పుచ్చుకొన్న 'భార్యాభర్త'ల్లా అటొకటి ఇటొకటీ పడిఉన్నాయి.

అతను నిశ్చల నిర్నిమేష దృక్కులతో పావురాళ్ళను వీక్షిస్తున్నాడు.

పరిసర ప్రభావానికి అతీతంగాఉండి, స్వీయానుభూతుల్లో విహరిస్తున్న అతని అసాధారణ ధోరణి, ఆ ఖరీదైన షేర్వాణిపెద్దమనిషికి - హాస్యాస్పదంగానూ, అసహ్యంగానూ కనిపించింది. అతని రాకను గమనించి, వంగి సలాంకొట్టి 'క్షమించండి హుజూర్' అంటూ ప్రక్కకు తప్పుకోనందుకు అతని ముఖం, గచ్చుమీదబడ్డ కిరసనాయిల్లా ప్రకోపించింది.

కోపంగా చూశాడు.

అతను పావురాళ్ళను చూస్తున్నాడు.

'కౌన్—హై—యే పాగల్? (ఎవరీ పిచ్చివాడు?)

సైకిల్ ట్యూబు 'బరస్ట్' అయినట్టు అతనికంఠం పగిలింది. ఆ ముసలివాడి ఏకాగ్రతకు భంగం కల్గింది. దృష్టి విచలితమైంది.

వెనుతిరిగి చూశాడు.

తెల్లగా జనపనారపీచుతో తయారు చేయగడిన గడ్డం, శుష్కించి లోనికి పీక్కుపోయిన ఆ ముసలి దవడలను కప్పుతోంది. కనుబొమలు కూడా తెల్లగా ఉన్నాయి. ఎర్రగాఉన్న అతనిముక్కు ఆకాశంలో దేనినో చూస్తున్నట్టు కొనతేలిఉంది.

ఆ ముసలివాడు నొసటిపై చెయ్యి అడ్డం పెట్టుకొని వాళ్ళను పరీక్షగా చూశాడు.

అవ్యక్తమైన భావాలతో ఆ చూపులు నిండిఉన్నాయి. లోతుగా పీక్కుపోయి, అగాధమైన లోతులతోఉన్న ఆ కళ్ళలో అతనీ హృదయం మూల్గుతూంది. ఎన్నో భావాలూ, వ్యథలూ, గాథలూ ఆ కళ్ళలో స్థిరనివాస మేర్పరచుకొన్నాయి. 'కాన్సర్' వ్యాధిలా భ్రుకుటి కుంచించుకొన్నాడు. మెట్లపై నిలబడిన వారిపై ధగధగ ఎండ పడుతోంది. ఎండలో ఖరీదైన షేర్వాణి మిలమిల మెరుస్తోంది.

"ఎవడీ పిచ్చివాడు. దారికడ్డంలెమ్మని చెప్పండి." హుకుం జారీ చేశాడు ప్రక్కవారిని ఉద్దేశిస్తూ; ఖరీదైన షేర్వాణి.

# పావురాలు

ముసలివాడి చూపుల్లో అసహ్యం, కోపం వెల్లువలా ముంచుకొచ్చాయి. చివ్వున లేచాడు కాష్ఠంపై నగం కాలిన శవంలా. పెదవులు తీవ్రంగా వణికాయి. నాసికారంధ్రాలు విప్పారాయి.

హృదయంపై చెయ్యి వేసికొని "నేనుకాదు పిచ్చివాణ్ణి.... నువ్వు......మీరంతా......మతంపేరిట మారణ హోమం చేశారు. మతోన్మాదులై అమాయిక ప్రాణాలను ఎన్నిటినో, మీ పొట్టన పెట్టుకొన్నారు....ఈతప్పు......ఈ పాపాన్ని అల్లా ఎన్నటికీ క్షమించడు......" అన్నాడు సుడిగాలికన్న వేగంగా.

ఆ ఘనత వహించిన స్థూలకాయం, కలవరంచెంది చుట్టూ పరికించి చూసుకొన్నాడు భీతితో. ఎర్రటోపీలు కన్పించలేదు. గాలి కొట్టిన 'ఎయిర్‌పిల్లో'లా అతనిగుండె ధైర్యంతో నిండుకొంది.

"బద్మాష్! ఏమిటి?....నీవు మాట్లాడేది!" ఆ శుష్క వదనంపై దెబ్బ చడేలున మ్రోగింది.

అతను ఒక ప్రక్కకు ఒరిగాడు. ప్రేక్షకుల్లో ఇద్దరు ఆతురతతో వచ్చి పట్టుకొన్నారు. నెమ్మదిగా ఆ మెట్టుపై కూర్చోబెట్టారు.

ఒక్కక్షణం నిశ్శబ్దం. ఇద్దరిలో ఒకడు పళ్లు కొరుక్కొన్నాడు. చేతులు నలుపుకొన్నాడు "దాదా పిచ్చివాడు సాబ్..... మనస్సు స్థిరంలేదు......మీ రితన్ని కొట్టటం" అంటూ చూపులు క్రిందకు దింపుకున్నాడు. మాట పూర్తి చెయ్యలేక నీళ్ళు నమిలాడు. అతని కన్నులలో మెరపులా ఎర్రనిగీత మెరసింది.

"పిచ్చివాడయితే........ఎవరితో మాట్లాడుతున్నాడో గుర్తించక్కర్లేదా?" శాసించినట్లుగా గొంతు చించుకొన్నాడు.

పిచ్చివాళ్లకానీ, మంచివాళ్ళుకానీ, "పేదలూ, ధనికులూ సమంగా పన్నులు కట్టినట్టు" ప్రభువులను గౌరవించి తీరాల్సిందే. ఇటువంటి విచక్షణకు తావులేదు.

ఖరీదైన షేర్వాణి ఒక మెట్టు పైకి కదిలింది. రైలు పెట్టెల్లా అందరూ కదిలారు. అతను మళ్ళీ ఆగాడు. జేబులో నుండి రెండు రూపాయలనోటు తీశాడు. తన దయార్ద్ర హృదయాన్ని ప్రకటించుకొంటూ, ప్రచారం చేసికొంటూ ఆ నోటు 'దాదా'పై విసిరాడు.

అందరూ మసీదులోనికి నడిచారు. ఒకవ్యక్తి 'దాదా'కు జేబుగుడ్డతో ముహం తుడిచి, మంచినీళ్ళు త్రాగించాడు. కుడి చెయ్యి 'దాదా'కు ఆసరాగాపెట్టి మసీదులోకి వెళ్తూన్న ఆ ఖరీదైన షేర్వాణి కేసి, కొరకొర చూశాడు.

"దాదా కొడుకు ఈరోజున బ్రతికి ఉన్నట్లయితే నీబోటి వాళ్ళందరూ దాదా కాళ్ళక్రింద బలాదూర్......గులాంగిరీ క్కూడా పనికిరారు"—......అన్నాడు కోపంగా.

మసీదులో ప్రార్థన ప్రారంభించబడింది.

ప్రార్థనలో పాల్గొనేటందుకు వేగిరపడిం దతని హృదయం. 'వద్దులే' అని వారించింది బుద్ధి. "దాదా" కుమారుని తాలూకు స్మృతులు అనివార్యంగా, అతని కళ్ళముందు పైశాచిక నృత్యం చేస్తున్నాయి.

పారిపోవాలని యోచించే 'ఖైదీ'ని పరివేష్టితమైన శృంఖలాలు నిర్బంధించినట్లు, అతనిలోరేగిన స్మృతులను "దాదా" సన్నిధినుండి కదలనియ్యక నిర్బంధించాయి. అతను, 'దాదా' కేసి చూశాడు. నిట్టూర్పు విడిచాడు. అతని ఆలోచనలు కొన్ని సంవత్సరాలు వెనక్కి నడిచాయి.

కళ్ళముందు పైశాచిక ప్రళయతాండవం.

నగరమంతా భీభత్సంగా ఉంది. హిందూ, ముస్లింలమధ్య సంకుల సమరం జరుగుతోంది. చిన్నకార్లు నిర్విరామంగా తిరుగుతున్నాయి. వాటిల్లో అమర్చిన 'లౌడ్‌స్పీకర్ల'నుండి ఆవేశపూరితమైన మాటలు వినబడుతున్నాయి. 'రజ్వీ' జిందాబాద్'— 'హైద్రాబాద్ వర్ధిల్లాలి' అనే నినాదాలు చెవుల్లో గింగురుమంటున్నాయి.

రాత్రివేళ శ్మశానంలో ఎర్రని కన్నులతో గస్తీ తిరిగే తోడేళ్ళ గుంపులా 'రజాకార్' ఉద్యమ నాయకులు ఎర్రని టోపీలు పెట్టుకొని నగర వీధుల్లో గస్తీ తిరుగుతున్నారు. మనుషుల్ని చంపటం ఒక మహోద్యమంగా ప్రచారం చేస్తున్నారు. మునిసిపాలిటీవాళ్ళు కుక్కలను వేటాడినట్లు హిందువులను వేటాడుతున్నారు 'రజాకార్'లు. హైద్రాబాద్ రాష్ట్ర వ్యాపకంగా ఈ ఉద్యమం అమలులోఉంది.

ఎన్నో సంవత్సరాలుగా, ప్రశాంతంగా బ్రతుకులు వెళ్ళదీసిన హిందువులు ఇళ్ళూ, వాకిళ్ళూ వదలి "నాంపల్లి" స్టేషన్ వైపు పురోగమిస్తున్నారు. ఆడవాళ్ళు వణుకుతున్న కాళ్ళతో, చంకలనుండి జారిపోతూన్న చంటిపిల్లలతో స్టేషన్‌వైపు పరుగెత్తుతున్నారు. మగవాళ్ళు చెమట్లు కారుతున్న ముఖాలతో ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకొని ముందు నడుస్తున్నారు. నడికారు పిల్లలు పెద్దలతో నడవలేక పరుగెత్తుతున్నారు.

హిందువుల కళ్ళముందు మృత్యుగహ్వారం కనుపిస్తోంది.

తాను నడుస్తున్నాడు......

'చౌరాస్తా' సమీపించాడు.

ఒక జీప్‌కారు 'చౌరాస్తా'లో ఆగింది. ఆవేశ పూరితమైన ఉపన్యాసం దానిలోనుండి వెలువడింది.

"సోదరులారా......అల్లా మనకోసమై ప్రత్యేకించిన ఈ రాజ్యంలో హింద్వాకాఫర్‌లు కూడా ఉన్నారు. వందలాది సంవత్సరాలుగా మనతో సహజీవితాన్ని కొనసాగనిచ్చిన ఫలితంగా ఇప్పుడు మనకే ద్రోహం చేస్తున్నారు. మనదేశాన్ని 'భారత్' యూనియన్'లో కలిపి వేయటానికి వారు ముఖ్య సాధనాలు. ఈ పరిస్థితుల్లో మనకు రక్షకుడని నమ్మిన రాజుకూడా యూనియన్‌లో కలవటానికి మంతనాలు సాగిస్తున్నాడు......సోదరులారా......భయపడవద్దు......ఈ విపత్కర పరిస్థితుల్లో హైద్రాబాద్ విముక్తికై, కంకణం కట్టుకొన్న అల్లా ప్రియపుత్రుడు

కాశిం రజ్వీ......ఈ విమోచనోద్యమానికి సారథ్యం వహిస్తున్నాడు.....యోధుడు......ప్రజ్ఞాశాలి......వారి అడుగుజాడల్లో నడిచి దేశ స్వాతంత్ర్యం కాపాడండి......యువకులందరూ సైన్యంలోచేరి హిందూ కాఫర్‌లను వెళ్ళగొట్టండి''. ఖరీదైన షేర్వాణీ, ఎర్రకుచ్చుటోపి నెత్తిన పెట్టుకొని, కోరమీసం సొగసుగా నాట్యంచేస్తుండే మూతివద్ద 'మైక్' పెట్టుకొని ఊపిరాడకుండా ఉపన్యాసమిస్తున్నాడు. యువకులను కర్తవ్య పథంలో నడిపిస్తున్నాడు.

మసీదులోనుండి ఏకకంఠంతో ఏవో మాటలు విన వచ్చాయి. ఒక్కక్షణం స్మృతులగాఢపరిష్వంగం వదిలింది. వెనక్కి తిరిగి చూశాడు.

అందరూ చేతులు ముకుళించి, తలలు వంచుకొని మత గురువు పలుకులకు ప్రతి సమాధానం లయ చెడకుండా చెబుతున్నారు.

ఆ ఖరీదైనషేర్వాణీవ్యక్తిని పరిశీలనగా చూశాడు.

నెత్తిమీద, నల్లటి జిన్నాటోపీఉంది. కోరమీసంలేదు. మూతి నున్నగాఉంది.

చూపు త్రిప్పుకొన్నాడు.

జీప్ కదలిపోయింది కళ్ళలో.

మలుపు తిరిగాడు.

అక్కడ ముస్లిం యువకులు సమావేశమై ఉన్నారు. వాళ్ళ ముఖాలలో క్రౌర్యం, అసహనం స్పష్టంగా కనిపిస్తున్నాయి. పిడికిళ్లు గట్టిగా మూసికొని, దేనికోసమో ఎదురుచూస్తున్నారు. తను వాళ్ళను త్వర త్వరగా సమీపించాడు.

ఒక 'రజాకార్' ఆ స్థలానికి పరుగెత్తుకొంటూ వచ్చాడు. అతని మాటలువిని కుర్రవాళ్ళందరూ కత్తులు బయటికితీసి, ప్రమాణంచేసి, లోపల పెట్టుకొన్నారు. అందరూ 'బాగో—బాగో' అనుకుంటూ పరుగెత్తారు.

ఆ మాటలు స్ఫురణ కొచ్చేసరికి, అతని గుండె మరొక సారి ఎత్తుగా ఉబ్బింది. గడ్డం తుడుచుకొని మళ్ళీ ఆలోచించ సాగాడు.

తను పరుగెత్తబొయ్యాడు.

దాదా ఎదురుగా వస్తున్నాడు. 'ఆగ'మన్నట్టు సైగ చేశాడు.

'బాబూ—ఎవర్ని చంపింది?......మనవాళ్ళందరూ ఇప్పు డెక్కడికి వెళ్తున్నారు. విశేషాలేమిటో పూర్తిగా చెబుతావా''. ఆతురత వ్యక్తమౌతోన్నకంఠంతో దాదా ప్రశ్నించాడు.

''మన వాడొక్కణ్ణి ఈరోజు ఉదయం హిందువులు హత్య చేశారు—అంటే ఒక గంటక్రితం—ఆ కారణంచేత ఇప్పుడు చాధర్‌ఘాట్‌వద్ద వాళ్ళకూ, మనకూ భయంకరంగా కొట్లాట సాగుతోంది. మనదేశంలో నివసిస్తూ, మనకు 'గులామ్'ల్లా ఉండక మనపై ఆధిపత్యం చెలాయిస్తారా ఈ హిందూకాఫర్‌లు''. జాతిపట్ల తనకున్న ప్రేమను, దేశాభిమానాన్ని వ్యక్తపరుస్తూ, ఇంకా ఏమో చెప్పబొయ్యాడు తను. కానీ దాదా అసహనంతో,

''అకారణంగా మనవాణ్ణి ఎలా చంపుతారు?......ఇది నమ్మశక్యం గాకుండా ఉంది'' అని అడ్డుప్రశ్న వేశాడు.

'నేను చెప్పేది నిజం—అకారణంగానే చంపారు దాదా..... అబద్ధాలుచెప్పి, నిన్ను నమ్మించవలసిన ఆవశ్యకత నా కేముంది—మన ముస్లిం కుర్రాడొకడు కాలేజీకి వెళ్తూంటే హిందూ గూండాలు అతన్ని హత్య చేశారు నడివీధిలో......ఇది సహించరాని విషయం.....'

అప్రతిభుడైపొయ్యాడు దాదా. ''కాలేజీ విద్యార్థా? నీవు చూశావా అతన్ని.....ఎలా ఉంటాడో తెలుసా'' ప్రశ్నలవర్షం కురిపించాడు దాదా.

''నేనూ ఇప్పుడేకదా విన్నాను—ఎర్రగా పొడుగ్గా ఉన్నాడట...... 'ఖాన్‌భాయ్' అన్నపేరుమాత్రం విన్నాను...... నేను త్వరగా అక్కడకు వెళ్ళాలి......నేను తిరిగ్గా నీకా విషయాలు చెప్పటాని కిది సమయంకాదు.....మన్నించు'' అంటూ తను పరుగెత్తబొయ్యాడు.

'ఖాన్'—దాదా గొంతులోనే ఉండిపొయ్యాయి ఆ మాటలు.

''బాబూ నన్ను ముందు ఆ 'చంపిన స్థలానికి' తీసికెళ్ళు.... తరువాత 'చాధర్‌ఘాట్'వద్దకు వెళ్దువుగాని.....బాబ్బాబు.....నీ కడుపున పుడతాను.......ఈ ముసలివాడికీ సహాయం చెయ్యి...... అల్లా నిన్ను దీవించుతాడు......బాబూ'' జాలిగొలిపే కంఠంతో దాదా బతిమాలాడు.

దాదా రోడ్డుపై కూలబడ్డాడు.

'తప్పక తీసికెళ్తాను దాదా'. తా నన్నాడు.

రిక్షాను పిలిచాడు. రిక్షా వీధులన్నీదాటి, మెయిన్ రోడ్డుతో కలుపుతూన్న ఆ మలుపులో పయనించ సాగింది. ఆ ప్రదేశంలో 'ఎక్కువ'గా హిందువులు నివసిస్తూంటారు. రోడ్డుపై గుంపులు గుంపులుగా ముస్లిం విద్యార్థులు సమావేశమై ఉన్నారు మరణించిన వ్యక్తిపట్ల సానుభూతిని వ్యక్తపరుస్తూ. హత్యకు సంబంధించిన కారణాలనుగూర్చి, రక రకాలుగా మాటలు వినవస్తున్నాయి. పంజాబీ దుస్తుల్లోఉన్న ముస్లిం యువతులు కూడా ఉన్నారు.

''ఖాన్‌భాయ్ ఒట్టి అమాయకపు మనిషి.....ఒంటరిగా తిరగకూడదు—పరిస్థితులు అధ్వాన్నంగా ఉన్నాయంటే వినిపించుకోక, వన్నెవరు కొడ్తారని ధీమాతో తిరిగి ఇంత చేసికొన్నాడు'' డగ్గుత్తికతో పెదవి కరచి పట్టుకొని అంటోంది ఒక విద్యార్థిని.

''ఖాన్‌భాయ్ హిందువులనునమ్మి, స్నేహం చేసిన ఫలిత మిది—అతని హృదయాన్ని అర్థం చేసికొనే శక్తి ఎవరికుంది?.... బద్మాష్‌లు...'' ఓ రెండు జడల అమ్మాయి గొంతు కోపంతో మిళితమైన బాధతో అంది.

# పావురాలు

'చదువుకొన్న మూర్ఖులు—రోగ్స్' ఒక యువకంఠం అంది.

ఆరిపొయ్యేదీపం రెపరెపలాడుతూ క్రొత్త వెలుగు వెదజిమ్మినట్లు, ముసలి దాదా ఎవరి ఆసరా లేకుండా రిక్షా దూకాడు. అందర్నీ తోసికొంటూవెళ్ళి, ఆ మరణించిన వ్యక్తిని చూడసాగాడు.

తల గడ్డకట్టిన నెత్తురు మడుగులో అంటుకుపోయింది. అతని ఉంగరాలజుత్తు ఆ రక్తంలో జీరాడుతోంది. తెల్లటి మెదడులాటి పదార్థం ప్రక్కనేఉంది. దానిపై ఈగలు ముసురుతున్నాయి. కనురెప్పలు మూసికోకపోవటంవలన, నిశ్చలంగాఉన్న ఆ గాజు కళ్ళు అందరికేసీ కన్నార్పక చూస్తున్నాయి. అతను ధరించిన తెల్లని పైజమా, చొక్కా పవిత్రంగా ఆచ్ఛాదిస్తున్నాయి—పుస్తకాలు అల్లంతదూరాన పడ్డాయి.

భీరువు గుండెల్లో భయాన్ని పిండుతూ, మతోన్మాది హృదయంలో ఆనందాన్ని రేకెత్తిస్తూ, మానవత్వమున్న మానవుని హృదయాన్ని బద్దలు చేస్తూన్న ఆ దృశ్యాన్ని దాదా రెప్ప కొట్టక రెండు క్షణాలు చూశాడు.

'అల్లా......' అంటూ ఆ రక్తపుమడుగులో కూలబడి, శవంపై వాలిపొయ్యాడు దాదా. అతని కళ్ళు చెమ్మగిల్లాయి. గట్టిగా గాలి పీల్చుకొని వదిలేశాడు. శూన్యంలోకి చూస్తూన్న తన చూపులు త్రిప్పుకొని దాదాకేసి చూశాడు.

దాదా ఏడుస్తున్నాడు చిన్న పిల్లవాడిలా.

మసీదునుండి మళ్ళీ ఒక్కసారి ఏకకంఠంతో మాటలు వినిపించాయి.

'దాదా?' పిలిచాడు.

ప్రశ్నార్థకంగా దాదా ఇటుతిరిగి చూశాడు.

"దాదా......ఖాన్‌భాయ్ హత్యకు మేమా కారణం? హిందువులు చంపారు. హైద్రాబాద్ విముక్తికోసమై ప్రాణాలు బలి చేసిన అనేకమంది ముస్లిం వీరుల్లో నీ పుత్రు డొకడు. ఖాన్‌భాయ్ ఆత్మశాంతికోసం మేము ప్రతిరోజూ ప్రార్థనలో అల్లాను వేడుకొంటున్నాం."

"ఖాన్‌కాదు.....చిట్టితల్లి......నా చిట్టితల్లిని పొట్టన బెట్టుకొంది వీళ్ళుకాదూ?...." వ్రేలుపెట్టి మసీదులోకి చూపెట్టాడు. గొంతు పూడిపోయింది.

మసీదులో అందరూ శిరస్సులు నేలపైకొంచారు.

మతగురువు ఏదో ఉర్దూలో పలికాడు.

అందరూ విధేయతతో ఆ మాటలకు మారు పలికారు. దాదా చెయ్యి దించుకొన్నాడు. చూపు మరల్చుకొన్నాడు. కన్నులలో నీరు ఉబికింది. ముఖం రెండు చేతుల్లో దాచుకొని, "నా చేతులారా నిన్ను గొంతుపిసికి చంపానుబిడ్డా......నన్ను అల్లా క్షమించడు"—అంటూ శిరస్సు నేలపైకొంచి మోకరిల్లాడు.

అతని కేమీ అర్థం కాలేదు. ఆశ్చర్యంతో దాదాకేసి చూసి "నీ కూతు రెవరు దాదా" అని అడిగాడు.

దాదా ప్రత్యుత్తర మియ్యలేదు. నేలకొంగిన శిరస్సు మెట్టపై అలానే ఉండిపోయింది. అతని మురికి వ్రేళ్ళనుండి ఏటి చారికలు కన్పిస్తున్నాయి. దాదా మూసిన కనురెప్పలవెనక భయంకర దృశ్యాలు. కళ్ళుమూసికొన్నా కనిపిస్తున్నాయి.

## 2

వారంరోజులు గిర్రున తిరిగిపొయ్యాయి. హైద్రాబాద్ చరిత్రలో 'ఖాన్‌భాయ్' హత్య పాతబడిపోయింది. ఈ హత్యను పురస్కరించుకొని, మతవైషమ్యాలు పరాకాష్ఠనందుకొన్నాయి. హైద్రాబాద్‌లో స్థానికంగా జరుగుతున్న అఘాయిత్యాలకన్నా గ్రామాలలో జరిగే హత్యలు, దుర్మార్గాలూ భయంకరంగా ఉన్నాయి. కొట్లాటలకు పోవటం, కత్తులు ప్రక్కలో పెట్టుకొని పడుకోవటం అందరికీ సామాన్యంగా ఆచరించే దైనందిన చర్యలైపొయ్యాయి. మునిసిపాలిటీ కారులనుచూసి, కుక్కలు భయపడి పారిపోయినట్లు, రజాకార్ జీపులనుచూసి, హిందువులు "నాంపల్లి" స్టేషనుకు పరుగెత్తుతున్నారు.

దాదా పడుకొన్నాడు.

నూనె మరకలతో నల్లగా మురికిబట్టిన ఓ పరుపుపై మేను వాల్చాడు. శిథిలమై, జీర్ణావస్థలోఉన్న అతని ఇంటిగోడలు ఉప్పిరికి పడుతున్నాయి. పైన బూజు నిశ్చింతగా వూగిస లాడుతోంది. పరుపంతా ఉప్పుమట్టి పేరుకుపోయింది. ప్రక్కన తనచేతికర్ర, నీళ్ళుత్రాగే చవుకబారు 'మగ్గు' ఉన్నాయి.

'దాదా' కళ్ళు తను పుత్రుడు చదివిన పుస్తకాల దొంతరలను పరిశీలిస్తున్నాయి. ఆ దొంతరల మధ్యనున్న తన పుత్రుని ఫోటోపై సాలీడు గూడుకట్టింది అసహ్యంగా. "బేటా....." అంటూ, అటు పొర్లాడు. కళ్ళలో నీరు ఇగిరిపోయింది.

దాదాకు పెద్ద అన్యాయం జరిగింది. తన జీవితపు నడక భ్రష్టమైపోయింది. తను విశ్వమానవ శ్రేయోభిలాషి. హిందూ ముస్లిం అనే తారతమ్యం లేకుండా అందర్నీ ప్రేమించాడు. అందరికీ తను ఉపయోగపడ్డాడు.

తను మరొకరిపట్ల అన్యాయంగా, దుర్మార్గంగా ప్రవర్తించితే, ఆ పాపానికి 'రేపు' తన కొడుకు శిక్షితుడౌతాడనే విశ్వాసంతో బ్రతుకు వెళ్ళదీశాడు. ఏం పాపంచేస్తే దేవుడు తనకీ శిక్ష విధించాడో తెలియక తికమకపడ్డాడు దాదా.

ముచ్చటగా విరియబూసిన పరిమళాన్ని వెదజల్లుతుందని ఎదురుచూసిన 'మొగ్గ'ను త్రుంచివేశారు.

ఎద్దంత కొడుకు. చేతికి అక్కరకొచ్చిన కొడుకు. హిందువులు అకారణంగా చంపివేశారు. హిందువులతో స్నేహం చేస్తూ, వాళ్ళ రహస్యాలను ముస్లింలకు చేరవేస్తున్నాడన్న అనుమానంతో హత్య చేశారు.

తన పుత్రు డా కాలేజీలో విద్యార్థి సంఘానికి అధ్యక్షుడుగాఉండి, హిందూ, ముస్లింలను ఒకే జాతిగా సమైక్యపరచా

లనీ, సంఘటితపరచాలనీ శక్తివంచన లేకుండా కృషి చేశాడు. ఆ ప్రేమకు, సేవకూ ఫలితంగా తన నా విధంగా హత్య చేశారు.

ఇప్పుడా దుర్మార్గులను శిక్షించాలి.

అదే తన జీవిత పరమావధి. ఇదే తనకు మిగిలిన కర్తవ్యం.

న్యాయాన్యాయాలను పరిశీలించి, దుర్మార్గులను శిక్షించే అలౌకిక శక్తి ఒకటున్నదన్న అంధ విశ్వాసం, ఈ సంఘటనతో మట్టికొట్టుకుపోయింది.

పుత్రుని దుర్మరణం హిందూజాతిపై కక్షను, ద్వేషాన్ని పురికొల్పసాగింది.

బ్రతుకులో ఆశలన్నీ రాలిపోయి, నిరాశ నర నరాల్లో జీర్ణించుకుపోయినప్పుడు, ఆ వ్యక్తికి ప్రపంచంపట్ల, బ్రతుకు పట్ల విరక్తభావం కలుగుతుంది. ఆ భావం కొందరిని ఆత్మ హత్యకు పురికొల్పుతుంది. కొందరిలో ఆ పరిణామం తనకా బ్రతుకు కల్పించిన వారిపై పగ సాధించటానికి కావలసిన మూర్ఖత్వాన్ని, అమానుషత్వాన్ని ప్రసాదిస్తుంది.

బుసలుకొట్టే ఆ పాశవిక ప్రవృత్తులనుండి మానవునికి విముక్తి కలిగించాలంటే, అతని హృదయంలో అణగారిపోయిన ప్రేమ, ఆత్మీయత మొదలయిన సునిశిత ప్రవృత్తులను జాగృతంచేసే బలీయమైన ప్రభావం ఉండాలి.

'హిందు' అన్నమాట తలపుకొస్తే 'దాదా' ఒళ్ళు కంపర మెత్తుతూంది. ముసలివాడయినా, అతని రక్తం వేడెక్కింది. దాదా పిడికిలి బిగించాడు. నరాలుఉబ్బి, ఎర్రటి శరీరంలో నల్లటి చారలుగా కన్పించాయి. ఏదో సమస్య పరిష్కారమై నట్టు 'దాదా' లేచాడు.

కూజాలో నీళ్ళు ఆ మురికి 'మగ్గు'లో పోసికొని, కళ్ళు పైకెత్తుకొని, గోడకేసి చూస్తూ 'గుటగుట' త్రాగాడు మొరటుగా.

పుత్రునిఫోటోపై సాలీడు ప్రాకుతోంది. నీళ్ళు చింది, గడ్డంపైనుండి జారి మురికి షేర్వాణి తడిసిపోయింది.

ఎర్రబారిన అతని కళ్ళు తీక్షణమైన చూపులు ప్రసరింప చేశాయి. ''కాఫర్'' అంటూ సాలీడును క్రింద పడవేసి, కాళ్ళ కింద నలిపివేశాడు. ఫోటోపైనున్న సాలెగూడు, షేర్వాణితో తుడిచాడు.

గడియవేసిఉన్న తలుపు సందునుండి, ఉత్తరం ఒకటి లోపల పడింది.

దాదా గడియ తీశాడు.

'పోస్ట్‌మాన్' సైకిల్‌పై పోతున్నాడు.

వారం రోజులనుండి వెలుగుచూడ నోచుకోని ఆ ఇంటి గోడలు ప్రశాంతంగా వెలిగాయి. ఆ వెలుగులో దాదా సులోచ నాల కోసమై వెదకాడు. సులోచనాలు గోడమీద ఉన్నాయి. దానికి ఒకవైపు తీగె ఉంది. మరొకవైపు దారం వ్రేలాడు తోంది. కళ్ళద్దాలు ముక్కుపై పెట్టుకొని ఆ దారం చెవికి చుట్టుకొన్నాడు.

ఉర్దూలో వ్రాసిఉంది.

ఉత్తరం చేతివ్రేళ్ళమధ్య గజగజ వణికింది. అతను గోడకు చేరగిలా పడ్డాడు ఒక్కక్షణం. మళ్ళీ లేచాడు. బయటికి వెళ్ళాడు. రెండు మూడుసార్లు అటూ, ఇటూ తిరిగాడు. మెదడుపులో చీకట్లు క్రమ్మితే, మనస్సు ఆలోచించటానికి నిరాకరిస్తే, మానవ హృదయం అలా కొట్టుకొంటూంది, తెగిపోయిన బల్లితోకలా.

కళ్ళద్దాలముందు మళ్ళీ ఉత్తరం పెట్టాడు.

అక్షరాలు—కన్నీటిబొట్లుపడి చెరిగిపోయిన అక్షరాలు—రక్తాక్షరాలు.

అతని పెదవులు కదిలాయి.

'అల్లా' అంటూ తలగోడకేసి కొట్టుకున్నాడు.

తలుపు గడియపెట్టకుండా బజార్లో పడ్డాడు. శివం పూనినవాడిలా పెద్ద పెద్దఅంగలువేసికొంటూ రోడ్డుపైన నడవసాగాడు. ముసలి 'దాదా' వీరులా ముందుకుపోతోంటే, అతని శ్రేయోభిలాషులు, పరిచితులు ఆశ్చర్యంతో నోరు తెరచు కొని చూడసాగారు.

వేగంగా నడవటంమూలంగా, అతనికాలు మడతబడింది. తగిలిన కాలుకే మళ్ళీ ఎదురుదెబ్బ తగిలింది.

దక్కన్ శిల్పకళా నైపుణ్యంతో ప్రాచీనంగా కన్పిస్తూన్న భవనమ్ముందాగిపొయ్యాడు. దాదా ప్రహరీగేటు నెట్టాడు. తాళం వేసిఉంది.

ఇల్లంతా నిర్మానుష్యంగా బోసికొడ్తోంది. పాడుబడిన దయ్యాలకొంపలా చండభానుని కాంతిలో కాగిపోతోంది.

దాదా చువ్వలమధ్య ఇరికించిన ముఖాన్ని వెనక్కి తీసి కొన్నాడు.

'మోతీ' అని పిలిచాడు.

సీమ కుక్కపిల్ల ఆ ఇంటినుండి పరుగెత్తింది. సందులో నుండి దూరి ఈవలకొచ్చి 'దాదా'ను స్పృశించింది. మోర ఎత్తి పెద్దగా ఏడవసాగింది. దాన్ని ఒళ్ళోకి తీసికొని ప్రేమతో దాని తలని నిమిరాడు.

కుక్కపిల్లవచ్చిన రెండు నిముషాలకు ఆ బంగళా వరం డాలో ఒక యువతి ప్రత్యక్షమైంది. దొంగలా తొంగిచూసి కొంటూ, మునిగాళ్ళమీద నడుచుకొంటూవచ్చి స్థంభంచాటున దాక్కుని రోడ్డుపైనున్న వ్యక్తిని పరిశీలనగా చూసింది.

సన్నగా ఎర్రగాఉంది. వేసవి గాలులకు వాడి వాలిపోయిన లేత రెమ్మలా నీరసంగాఉంది. ఆ పిల్లకనులు భీతిని వ్యక్త పరుస్తూ, కాంతిగోళాల్లా ఉన్నాయి. కనురెప్పలు వాచిపొయ్యాయి. చిందర వందరగాఉన్న జుత్తు చిరుగాలి తాకిడి కక్కడ భయపడి అల్లల్లాడుతోంది.

గేటువద్దఉన్న 'దాదా'ను భయంతో, సందేహంతో ఒక త్రుటికాలం పరిశీలించింది. చెక్కిళ్ళవెంట అశ్రువులు రాలి పొయ్యాయి. దాదా అంటూ బావురుమని ఏడ్చింది. వణుకుతున్న కాళ్ళతోవచ్చి గేటు తీసింది.

ప్రేమతో ఆపిల్లతల నిమురుతూ, ఓదార్చాడు దాదా. 'భయపడకు తల్లీ....నే నొచ్చానుకదా!.....లోనికి వెళ్దాం—పద'' అని బయట నిలబడితే సంభవించే ప్రమాదాన్ని సూచించాడు.

కుక్కపిల్ల, ఆ అమ్మాయి లోనికి నడిచారు.

రోడ్డు చివరలు రెండూ నిశితంగా పరిశీలించి గేటు మూశాడు.

మధ్యహాలులోఉన్న అద్దాల బీరువాలు, విలువైన వస్తువులూ అన్నీ సహస్రధా ముక్కలై, చెల్లాచెదరై క్రిందపడి పొయ్యాయి. నడవాలంటే గాజు పెంకులన్నీ జాగ్రత్తగా పరిశీలించి అడుగువెయ్యాలి. కర్ర సామానంతా అటు, ఇటు విసిరి వెయ్యబడి, అంతా చిందర వందరగా ఉంది.

''ఎలా పారిపోదాం మనం?'

ఆ అమ్మాయి ప్రశ్నించింది.

'ఇప్పుడే పోదాం......తల్లీ.....మరి అమ్మ విషయం?

'అమ్మను—అమ్మను—వాళ్ళు రాత్రి లాక్కెళ్ళారు—దాదా'—గుడ్డ నోట్లో పెట్టుకొని, చిన్నస్వరంతో చెప్పింది ఏడుస్తూ.

''ఎప్పుడు?''

''నీ వుంటే ఈ ఘోరం జరిగేది కాదు దాదా. ఎలానో తప్పించుకొనేవాళ్ళం''....ఆ రోజున నీవు వెళ్ళినరాత్రి మన ఇంటిని రజాకార్లు ముట్టడించారు. మన ప్రహరీచుట్టూ తుపాకులూ, కత్తులూ పట్టుకొని కొందరు 'పహరా' తిరుగుతూంటే, కొందరు మన ఇంట్లో ప్రవేశించారు. అమ్మ నన్ను 'మైలగుడ్డల' పెట్టెలో దాచింది. వాళ్ళ ఇంట్లో ప్రవేశించి నగలూ, డబ్బూ అన్నీ దోచుకొని ఈవిధంగా భీభత్సం చేశారు......నాన్నను ఎక్కడ దాచావో చెప్పమని హింసించారు దాదా అమ్మను......ఒకడు 'రోగ్' అమ్మను గుండెల్లో తన్నాడు......నేను చూడలేక కళ్ళు మూసుకున్నాను దాదా.''

పెల్లుబికి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక పెద్దగా ఏడ్చి దాదాను కౌగలించుకొంది.

దాదా పెదవులు కరచి పట్టుకొన్నాడు. ముక్కు కంది నట్లు ఎర్రబారింది. ఆయాసమొచ్చి దాదా నేలపై చతికిల బడ్డాడు.

'దుర్మార్గులు......ముక్కలు ముక్కలుగా నరికేవాణ్ణి..... ఇంకేం చేశారు?''

''ఇంకేముంది దాదా-అమ్మే క్రిందపడిపోయి, రెండు చేతులెత్తి దణ్ణంపెట్టినా, ప్రాణమిమ్మన్నా, వదలిపెట్టలేదు. ఇక ఆ బాధ భరించలేక రెండు రోజుల్లో వస్తారు...... పట్టిస్తానని ప్రమాణం చేసింది......రాత్రివరకూ మన ఇంటిపై నిగా వేశారు. రాత్రి పన్నెండు గంటలకు అమ్మను......అమ్మను..... ఈడ్చుకెళ్ళారు దాదా......

''పెద్దగా ఏడవకు తల్లీ—ఆ దుర్మార్గులు మనల్ని పసి కట్టారు.''

రెండుక్షణాలు భయంకరమైన ప్రశాంతత ఆవహించింది. ఆ అమ్మాయి 'ఎక్కిళ్ళు' మినహా మరే సవ్వడీలేదు. ఎర్రగా వాచిన కనురెప్పలు తుడుచుకొని దాదాను పిలిచింది.

''దాదా!......అమ్మ నాకికలేదా?''

''క్రూరమృగాల నోటిలోబడినవాళ్ళు తిరిగివస్తారా అమ్మా...ఈ ముసలి దాదాయే నీకు అమ్మా......నాన్నా.''

'దాదా!'

'అమ్మా!'

దాదా ముసలి చేతులు ఆ పిల్లతలను నిమిరాయి. తన మురికి షేర్వాణీతో ఆ అమ్మాయి కళ్ళు తుడిచాడు. ఆ అమ్మాయి శిలాప్రతిమలా కూర్చొని సుదీర్ఘంగా ఒక్క నిముషం ఆలోచించింది.

''దాదా......ఎన్నో సంవత్సరాలుగా ఈ గడ్డపై బ్రతికాం.. ఇప్పుడు మీరు వెళ్ళిపొమ్మంటే ఎక్కడికి పోవాలి. ఇళ్ళూ, వాకిళ్ళు వదులుకొని......ఈ హైద్రాబాద్ మా దనటానికి మీకు హక్కేముంది. మీరు అరబ్బు దేశంనుండి, పర్షియానుండి వలస వచ్చినవాళ్ళేకానీ, మీకు మాత్రం ''జన్మ హక్కెక్కడిది''—పశువులు'' అంది.

దాదా కన్నుల్లో జ్వాలలు రేగాయి. ఒక నిశితమైన చూపు విసిరాడు.

''ఆ అమ్మాయిలో హిందూ రక్తం ప్రవహిస్తోంది. ప్రతి అణువూ హిందూజాతికి చెందింది.''

మానినపుండు పథ్యంలో వ్యత్యాసం రాగానే సన్నిరేగి నట్లు, మళ్ళీ హిందూజాతిపైన అసహ్యం, ద్వేషం పుట్టుకొచ్చాయి. ఆ ద్వేషమ్ముందు, ఆత్మీయత, ప్రేమ, ప్రవృత్తులు గ్రహణం పట్టినట్లు మరుగున పడిపొయ్యాయి. తెల్లనిబట్టపై నెత్తురుమరకలా కక్ష మదిలో మెరసింది. కోపం వెల్లువలా ముంచెత్తింది. కోపంతో ఆ అమ్మాయిని ప్రక్కకు నెట్టాడు. తల నేల కొట్టుకుంది.

''మేముకాదు పశువులం—మీరు, మీ హిందూజాతి—మిమ్మల్ని ఏంజేసినా పాపంలేదు......అన్యాయంగా నా కొడుకుని చంపారు......మీరు పశువులు.''

అప్రతిభురాలైపోయింది.

''దాదా? ఖాన్‌ఖాయ్‌ని హత్యచేశారా?'' వ్యాకులత ఆ కంఠంలో స్పష్టంగా గోచరించింది. లేచి నివ్వెరపాటుతో దాదాను చూడసాగింది.

''మీరే చేశారు?'' ముహంపై స్వేదజలం కారుతూంటే వేలు తనకేసి చూపెడుతూ గర్జించాడు.

ఈ అసత్య అభియోగానికి ఆ అమ్మాయి చెవులు మూసికొంది. శివం పూనినట్లు మీదకొస్తూన్న అతన్నిచూసి ఒక్కడుగు వెనక్కివేసింది.

''దాదా......నాకు తెలియదు—నిజం దాదా''

"నీకు తెలియదూ......మీ హిందువులు చంపారు...... పశువులు......పృధ్వికి చీడపురుగులు....అధములని, అస్పృశ్యు లని, భూసురులని, భూపతులని, మానవులను విడదీసి అది "పూర్వ జన్మ ఫల"మని సమర్థించే మీ మతాన్ని, జాతినీ సమూలంగా నాశనం చెయ్యాలి—వ్యక్తికీ, వక్తికీ మధ్య కులాలపేరుతో అందు కోరాని అంతస్థులు సృజించిన దుర్మార్గులు మీరు—సోదర భావం, సమానత్వంఅంటే తెలియని మూర్ఖులు—మిమ్ములను నాశనం చెయ్యాలి. అప్పుడే నాకు శాంతి.....నిన్ను చంపేస్తా...." సంధి(క్రమ్మిన రోగిలా పేలిపొయ్యాడు.

"నన్నెందుకు చంపుతావ్" నిశ్చలంగా అడిగింది తడబాటు లేకుండా.

ఆ అమ్మాయిలో (ప్రస్ఫుటితమయ్యే గంభీరతచూసి, దాదా అడుగు ముందుకు వెయ్యలేదు.

'నీవు శత్రువ్వు కనుక'

'నేనా?'

'అవును నీవే'

'మనకున్న శత్రుత్వ మేమిటి దాదా?'

'నీవు హిందూవి—నేను ముస్లింని......యుగ యుగా లుగా వస్తోంది ఈ శతృత్వం"

"హిందూజాతిలో జన్మించటం నా స్వయంకృతాప రాధమా? అయితే ముస్లిం జాతిలో నీవుకోరి జన్మెత్తావా?"

దాదా రెండు చేతులూ పైకెత్తి ఒక కాలుముందుకేసి చిత్తరువులా ఉండిపొయ్యాడు. లోనికి పీక్కుపోయిన కళ్ళు నిర్జీవంగా, భావరహితంగా ఉండిపొయ్యాయి. చూపులు క్రిందకు దించుకొన్నాడు. అటు తిరిగి ఏదో సమాధానం చెప్పబొయ్యాడు. మాటలు పెదవులుదాటి రాలేదు. చదువూ, సంస్కారం ఆ అమ్మాయి కళ్ళలో ప్రతిఫలిస్తున్నాయి.

"దాదా?" కటువుగా పిలిచింది.

వెనక్కి తిరిగాడు. "మానవులు విధాత సృష్టిలో అందరూ సమానులే. ఈ జగత్తుపై వేళ్ళుపాతుకుపోయి, వైరితలలు వేసిన ఈ జాతులు, మతాలు, మానవుల్ని వేరు చేస్తున్నాయి. అనాగరికయుగాలలో స్వప్రయోజనాలకోసమై స్వార్థపరులు సృజించిన ఈ బంధనాలు ఛేదించుకొని, మానవ సౌభ్రాతృత్వం సాధించే భావ వికాసం మనలోలేదు. బ్రహ్మజెముడులా విస్తరించిన ఈ నాగరికతారణ్యంలో వికృతంగా విరిసిన ఈ శాస్త్ర విజ్ఞానం ప్రసాదించిన తుపాకులూ, ఫిరంగులూ తీసికొని తిరుగుతున్నారు పశువులు...........మీరు హిందువులను వేటాడుతారు....... హిందూవులు ముస్లింలను హత్య చేస్తారు. ఈ రక్తవాహినితో వీళ్ళు సాధించబొయ్యే మహత్కార్య మేమిటి?"

అన్నిటికీ తెగించిన ఖైదీలా అనర్గళంగా మాటా డింది స్వచ్ఛమైన ఉర్దూలో.

ఆ మాటలు దాదాపై కొంత ప్రభావం చూపెట్టాయి. ఆ అమ్మాయిపట్ల కల్గిన అసహ్యం, ద్వేషం మంచులా నీరు కారి పోసాగింది. కానీ పుత్రుని దుర్మరణం జ్ఞప్తికొచ్చింది.

హిందువులు హత్య చేశారు తన కొడుకుని—ఆ కోవకు చెందిందే తను—

"మాటలతో నన్ను మోసం చేద్దామనుకొంటున్నావా? అదేం కుదరదు......నిన్ను గొంతుపిసికి"......అంటూ ముందుకు కదిలాడు.

ఆ పిల్ల భయపడి పరుగెత్తలేదు. ఆ ముసలివాడి చర్యను ప్రతిఘటించలేదు. అతని దురాగతాన్ని అనుకూలిస్తూ, మెడను వెనుకకు వాల్చింది.

దాదా ఆగిపొయ్యాడు అదే భంగిమలో.

"ఆగిపొయ్యావేం దాదా! చంపు......నాలాటి వాళ్ళను పదిమందిని హత్య చెయ్యి. ఈ పుణ్యానికీ హిందువులపట్ల నీవు చూపిన ప్రతీకారానికీ 'అల్లా' మెచ్చుకొని నీకు ఖాన్ భాయ్‌ని తిరిగి ప్రసాదిస్తాడు."

"ఖాన్‌భాయ్......భాయ్......"అంటూ గొణుక్కున్నాడు. తీవ్రమైన భావసంచలనం కల్గింది. గ్రహణంపట్టి వదలినట్లు. కక్ష, ప్రతీకారభావం అతన్ని వీడిపొయ్యాయి. పవిత్రమైన ప్రేమతో అతని హృదయం ప్రకాశించింది. తన కాఠిన్యతకు మనస్సు క్షోభ చెందింది.

"బేటీ'......ఆ పిల్లను తన చేతుల్లోకి తీసికోటానికై చేతులు చాచాడు, కళ్ళవెంట నీళ్ళు జలజలరాలుతూంటే.....

హఠాత్తుగా 'సంభవించిన ఈ హృదయ పరివర్తనను ఆ అమ్మాయి గుర్తించలేదు. ఏవగింపుతో 'దాదా' చేతులను తోసి వేసింది.

'దాదా! నిన్ను ఒక్క టడగాలనుకొంటున్నాను......నిజం చెబుతావా?"

న్యాయవాదిముందు నేరస్థునిలా భయపడుతూ నిల బడ్డాడు. విశేయతతో, కనురెప్పలు పైకెత్తాడు.

'నాల్గురోజులనుండి మా ఇంట్లో జరిగిన ఈ అత్యా చారాలను నీవు పరోక్షంగా ప్రోత్సహించావ్‌కదూ?....ద్రోహీ..... నీ యావజ్జీవితం మా సేవలో గడిపావ్—నీ చేతులతో నన్ను పెంచావ్. నీ చేతులతోనే మమ్ములను నాశనం చేస్తున్నావ్ కదూ?.......నన్ను చంపటానికి నీకు చేతులెలా వస్తున్నాయి?

దాదాకు వీపు జలదరించింది. ఎవరో వీపు చరిచినట్లు, జుట్టుబట్టి లాగినట్లు, నవ్వినట్లు వింత వింత ధ్వనులు విన వస్తున్నాయి. చుట్టూ తిరిగిచూసికొన్నాడు. పగిలిపోయిన అద్దాలు పళ్ళికిలించాయి.

"బేటీ......నేనా!......నేనా?" అన్నాడు గొంతు పిసికి నపుడు వెలువడుతున్నట్లు మాటల్లా......

వీధిలో అల్లరి వినిపించింది.

కిటికీవద్ద పరదాతీసి తొంగిచూశాడు.

జీప్ ఒకటి రోడ్డుపై ఆగింది. తుపాకులూ, కత్తులూ పట్టుకొన్న 'రజాకార్'లు పట్టపగలే హత్య చెయ్యటానికి సన్న ద్ధులై కారు దిగారు.

# పావురాలు

ఆ పిల్ల శరీరం మంచులా బిగుసుకుపోయింది. సర్వాంగాలు మొద్దుబారిపోయ్యాయి. నిర్జీవంగా నిలబడి 'దాదా' కేసి చూసింది. అస్తమయానికిముందు వెలిగే సూర్యకాంతిలా ఆ పిల్ల పెదవులపై చిరునవ్వు గోచరించింది.

"ఈ దిక్కులేనిదాన్ని చంపటానికి ఇంతమంది ధీరులు తుపాకులతో, కత్తులతో రావాలా!......దాదా......నన్ను హింసించి పరాభవించి నరికిపారేస్తే మీకు కలిగే ప్రయోజనమేముంది..... చంపటం మీా లక్ష్యం.....అదిగో ఆ కర్ర తీసికొని నా తలమీద కొట్టు......ఒక హిందూని చంపానన్న ఆత్మసంతృప్తి నీకు చిరకాలమువుండిపోతుంది.....త్వరగా దాదా"......తూలి క్రింద పడిపోయింది.

దాదా శరీరం కంపరమెత్తింది. కిటికీనుండి చూశాడు. గేటుతాళంలాగిచూసి ఒకడు గేటు దూకాడు.

దాదా కళ్ళు తుడుచుకొని, షేర్వాణి సవరించుకొని బయటికి వెళ్ళాడు.

'ఆదా భరజే' అంటూ అందరికీ వంగి సలాముకొట్టాడు.

"ఏమిటి? వాడి ఆచూకీ ఏమైనా తెలిసిందా?" ఆ ఖరీదైన షేర్వాణి, ఎర్రని కుచ్చుటోపీ పెట్టుకొని ప్రశ్నించాడు.

"తెలిస్తే వాణ్ణి ప్రాణాలతో వదలిపెట్తానా?...... నేను మాత్రం ముస్లింని కానూ?"

"ఈ ముసలివాణ్ణిచూసి మన యువకులు ఎన్నో విషయాలు తెలిసికోవాలి". చిరునవ్వు నవ్వటానికై ఆ ఖరీదైన షేర్వాణి, పెదవిని ఒక ప్రక్కకు లాగాడు పక్షవాతం వచ్చిన వాడిలా. కారు స్టార్ట్ చేశారు.

"ఈ ఇంట్లో ఇప్పు డెవరున్నారు?". ఒకడు ప్రశ్నించాడ.

కారు కదిలింది, వెనక్కి తిరుగుతూ.

"ఎవరూలేరు......నేనొక్కడ్నే......"

"రెండోగొంతు వినిపించిందే?"

"అవును......ఆమె నా కూతురు......"

కారు వేగంగా దూసుకుపోయింది.

దాదా అందరికీవంగి సలాములు కొట్టాడు. కారు దృష్టిపథంనుండి దూరమయ్యేవరకూ కోరచూపు చూశాడు. గేటు తాళంవేసి ఇంట్లోకి పరుగెత్తాడు.

దాదా గుండెల్లో సన్నగా బాధ దూసుకుపోయింది. నిలబడలేకపొయ్యాడు. కనుకొలకులనుండి నీరు గిర్రున తిరిగి 'షేర్వాణి'పై పడింది.

ఆ అమ్మాయి మొహాన్ని రెండు చేతులతోనూ పొదవి పట్టుకొని, "నీవు కూడ నన్ను—దిక్కులేనివాణ్ణి చేశావామ్మా.... అమ్మా" అంటూ బావురుమన్నాడు.

అట ఇటూ పడిఉన్న చేతులు సరిచెయ్యటానికి దాదా చేతులు స్పృశించాడు. నాడి నీరసంగా కొట్టుకొంటోంది. పెదవులు చప్పరించసాగింది.

మూడు రోజులనుండి నికృష్టపుబ్రతుకు వెళ్ళదీసిన ఆ అమ్మాయి దుస్థితి అవగాహన చేసికొన్నాడు. నీళ్ళు తెచ్చి మొహంపై చల్లి, తడిగుడ్డతో ముఖాన్ని తుడిచాడు.

ఆ అమ్మాయికి స్పృహ కల్గింది. కళ్ళు తెరచిచూసింది భయంగా పిచ్చి పిచ్చిగా.

"ఆ దుర్మార్గులు వెళ్ళిపొయ్యారమ్మా......లే, మనం త్వరగా వెళ్ళకపోతే మన జీవితాలకు ఇదే చివరిరోజు" బ్రతిమాలుతున్నట్టు జాలిగా అడిగాడు.

లేచి కూర్చొని 'దాదా'ను పరీక్షగా చూసింది. అతని వింత ధోరణి ఏమీ అర్థంకాలేదు. ఏదో మాట్లాడబోయింది. కానీ,

"త్వరగా పారిపోవాలి లేమ్మా". దాదా కంఠంలో భయం.

మురికిగాఉన్న తెల్ల దుప్పటితెచ్చి, ముస్లింస్త్రీ బురఖా తగిలించుకొన్నట్లు కళ్ళు కన్పడేలా అపాదమస్తకం కప్పాడు. ఒక్కసారి రోడ్డుపైకి వెళ్ళి అంతా నిశితంగా పరిశీలించి వరండాలోకి వచ్చాడు. భయ సందేహాలలో మరొకసారి వెనుతిరిగి చూశాడు. తలుపుతీసి "బయటికి రా మ్మా...... రిక్షాలేమీ కన్పించలే"దన్నాడు.

మూగగా అనుసరించింది 'దాదా'ను.

కుక్కపిల్ల తనను అనుసరించింది.

దాదా యాంత్రికంగా పెద్ద పెద్ద అంగలు వేసికొంటూ, ఏమో మాట్లాడుతూ నడుస్తున్నాడు.

ఇల్లుదాటి పదిగజాలు దాటారు.

ఆ అమ్మాయి కాళ్ళు నీరసించిపోసాగాయి. దాహం వేయసాగింది.

"దాదా!"

"అమ్మా!"

"నాకు కళ్ళు తిరుగుతున్నాయి"—తల పట్టుకొని పాదచారులు నడిచే బాటపై కూర్చుంది.

దాదాలో భయం ఉధృతమైంది. ఐదు నిముషాలు గడిచాయి. ఒక రిక్షా దొరికింది. ఆ అమ్మాయిని రిక్షాలో కూర్చోబెట్టి, 'దాదా' కుక్కపిల్లను చేతబట్టుకొని, రిక్షా ఎక్కాడు.

'రిక్షా' ముందుకుసాగింది.

జీప్ ఒకటి ఎదురై దూసుకుపోయింది. తుపాకులు పట్టిన రజాకార్‌లు.

దాదా వెనుతిరిగి చూశాడు.

"జీప్' బంగళాముందాగింది. ఆ ఖరీదైన షేర్వాణి ఆజ్ఞతో అందరూ గోడదూకి లోపలికి పరుగెత్తారు.

"అమ్మో" అన్నాయి, దాదా పెదవులు.

దాదా భుజంపై నిర్జీవంగా వ్రాలిన ఆ అమ్మాయి తృళ్ళిపడింది.

## 3

రిక్షాదిగి దాదా మురికికూపంలో ప్రవేశించారు ఇద్దరూ. వెంటనే గడియపెట్టాడు. ఆ పిల్ల దాదా మురికి పరుపుపై కాళ్ళు ముడుచుకొని పడుకొంది. దాదా 'వేడ్నీళ్ళు' పొంగించి 'చా' చేశాడు. 'నికిల్' కోటింగు రాలిపోతున్న పాత 'మగ్గు'లో పోసి ఆ అమ్మాయికి త్రాగించాడు.

కొన్ని 'కుక్కపిల్ల'కు పోశాడు.

తోక ఊపుకొంటూ సంతోషం వెలిబుస్తూ, గతి కింది కుక్కపిల్ల. ఆ అమ్మాయి 'చా' త్రాగుతోంటే గడియ తీసికొని బయటికివెళ్ళాడు. వెడుతూ, వెడుతూ బయట తాళం వేసికొని వెళ్ళాడు దాదా.

ఆ అమ్మాయి గుండె లాగిపోయినంత పనయింది. కేక పెట్టి పిలుద్దామంటే దయ్యంపట్టినట్లు పెదవులవెంట మాట బయటికి రాలేదు. ప్రాణా అరచేత బట్టుకొని ద్వారం కేసి చూస్తూ కూర్చుంది.

పదిహేను నిముషాలు గడిచి పొయ్యాయి.

తలుపు తీశాడు దాదా. దాదా చేతుల్లో పునుగులు, ఇంకా శనగపిండితో తయారు చెయ్యబడ్డ పదార్థాలు ఏవో ఉన్నాయి. అవన్నీ పళ్లెంలో కుమ్మరించి తినమన్నాడు దాదా.

"వద్దు—దాదా—నాకు ఆకలివెయ్యటంలేదు. ఎందుకింత శ్రమ" అంది.

"వాడు కూడా ఇంతే......రాక రాక ఎప్పుడన్నా ఇస్కోలు నుండి ఇంటికొస్తే ఏమీ తినడు......" దాదా చిరాకుపడ్డాడు.

కిమ్మనక సగం పళ్లెం ఖాళీచేసి, "ఇక చాలుదాదా" అంది నీళ్ళు త్రాగుతూ. మిగతావి దాదా, కుక్కపిల్ల పంచుకొన్నారు. దాదా 'టీ' వేడిచేసికొని త్రాగసాగాడు. ఆ అమ్మాయి దాదా ఇంటిని పరిశీలనగా చూడనారంభించింది.

మురికి షేర్వాణీలు, బూజుపట్టిన పుస్తకాలు, ఉప్పి రికిపడుతున్న గోడలు—మట్టికంపు కొడుతున్నాయి. చందమామ, నక్షత్రం ఉన్న మసీదుఫోటోకు ఆరిపోయిన అగరువత్తులు వ్రేలాడుతున్నాయి. ఆ గదిలో చిల్లులువడ్డ గోనె పట్టా వ్రేలాడ కట్టిఉంది. దానికి ఆవలిది వంట గది—ఘోషాగది.

దూరాన రైలు కూసింది.

చూపులు క్రిందకు దించుకుంది.

దాదా మగ్గులో ఉన్న టీ మొత్తం ఖాళీచేసి, ఆమెకేసి చూశాడు.

మూర్తీభవించిన నిరాశ, నిస్పృహలా అచేతనంగా కూర్చొని, కళ్ళుప్పగించి చూస్తోంది. ఆమెలో వీస్తున్న తుఫాను ఆ కళ్ళలో స్పష్టంగా ప్రతిబింబిస్తోంది.

"ఏమిటమ్మా ఆలోచిస్తున్నావ్."

రైలు కూత మళ్ళీ వినిపించింది.

"నేను విజయవాడ వెళ్తాను దాదా......చుట్టూరా ముస్లింలున్న ఈ వాతావరణంలో ఉండటం మరీ ప్రమాద కరం......త్వరగా బయల్దేరు......ఈ గాజు లమ్మి వస్తా"

దాదా హృదయం గతుక్కుమంది. కడుపులో చెయ్యి పెట్టి కెలికినట్టుంది. అప్తులు, ఆత్మీయులు తన జీవితపథం నుండి ఒక్కొక్కరే తప్పుకొంటున్నారు. ఆ ముసలిహృదయంలో మెలి తిరుగుతూన్న వ్యథలు ఏడు దశాబ్దాల అనుభవాలను ధృవపరిచే తన నుదిటిపైనున్న ముడుతలు స్పష్టంగా కన్పించు తున్నాయి.

గాజులుతీసి దాదా చేతిల్లో పెట్టింది.

దాదా వాటిని ఆ చాపపై బెట్టాడు. లోనికివెళ్లి తన అల్యూమినియం పాత్ర ఒకటి బయటికి తెచ్చాడు. దాదా చెయ్యి దానిలో దూర్చగానే రెండు చిమటలు, ఒక సాలీడు దాదా శరీరంపైకి ప్రాకాయి. ఒక ఎర్రగుడ్డపేలికతోకట్టిన మూట నొకదాన్ని బయటికితీశాడు. దానిలో ముస్లింస్త్రీలు చెవులకు కుట్టించుకునే జూకాలున్నాయి. ఇంకా రెండుమూడు మెట్టె లున్నాయి.

ఆ అమ్మాయి నిస్తుబోతూ చూస్తూ కూర్చుంది, అతని విపరీతపు చేష్టలన్నిటిని.

వాటన్నిటినీ, ఆ గాజులతో కలిపి ఓ మూట కట్టాడు. పై భాగంవిరిగిన మరొకపాత్ర తెచ్చి బోర్లించాడు. రూపాయి నోట్ల పొత్తాం, నాల్గు వెండి రూపాయిల బిళ్ళలు ఇంకా కొంత చిల్లర పడింది. నోట్లు నల్లగా మాసిపోయి అసహ్యంగా ఉన్నాయి.

"అమ్మా! వీటిని నీ చీర చెరుగుకు కట్టుకో" అన్నాడు.

పుచ్చుబట్టిన ఓ జాజిచెక్కలపెట్టి తెరచి, చివికి పోయిన రెండు పాత చీరెలు, ముస్లిం స్త్రీలు కప్పుకొనే ఘోషా బురఖాలు తీశాడు. అవి నల్లటి సిల్కు బురఖాలు.

"ఇవి కట్టుకోమ్మా. వీటిని విజయవాడ వెళ్లేవరకూ తియ్యకూడదమ్మా......తెలిసిందా."

ఆ నగలు, మరొక పాత చీరెలో బంధించి, దాన్ని మరో చీరెలో బంధించి, మూట కట్టాడు. బయటికెళ్ళి రిక్షా నొక దాన్ని పిలిచాడు. ఆ అమ్మాయి రిక్షాలో కూర్చుంది. పరదావేసి దాదా లోనికి వెళ్ళాడు.

రెండు మూడు నిముషాలు గడిచిపొయ్యాయి.

దాదా బయటికి రాలేదు.

"ఏం చేస్తున్నావ్ దాదా" అంటూ రిక్షాదిగి లోపలికి వెళ్ళింది.

దాదా ఖర్జూరపుముద్ద నొకదానిని నీళ్ళతో తడపుతూ, ఒక తువ్వాలులో మూట గడుతున్నాడు.

"ఏమిటి దాదా?"

"త్రోవలో ఆకలి వేస్తే ఎలామ్మా" అంటూ తల పైకెత్తి చూశాడు.

దాదా చెంపలనుండి కన్నీరు జారుతోంది.

దాదాను ఆపాదమస్తకం పరిశీలనగా చూసింది. శిలా ప్రతిమలా ఒకే భంగిమలో ఉండిపోయింది.

"దాదా! నేను వెళ్ళను...." మూట విసిరింది చాపపైకి. రిక్షావాడు బయట కేకబెట్టాడు.

రైలుకూత మళ్ళీ వినిపించింది.

దాదా నోరు తెరచుకొని విస్తుబోతూ చూడసాగాడు, ఒక చేత్తో మూట పట్టుకొని.

హైదరాబాద్ నగరాన్ని విడిచిపోవాలనుకొన్న రైలు తొందరపడుతూ మళ్ళీ కూసింది.

ఆ అమ్మాయి రిక్షాలో కూర్చుంది.

దాదా బయటికొచ్చి, పరికించి చూశాడు. సూర్యుడు అస్తమించబోతున్నాడు. నెత్తురు ముద్దలా, గీకినపుండులా, కమిలి, కుళ్ళిపోయినపండులా అసహ్యంగా ఉన్నాడు. చిత్రకారుని గీతల్లా, భవనాలన్నీ నల్లగా మేఘాచ్ఛాదితమైపొయ్యాయి.

పరదా వెనుక ఆ అమ్మాయి బురఖా తగిలించుకొని కూర్చుంది. క్రిందిభాగంపై దాదా కూర్చున్నాడు. చీకటిలా ఆలోచనలు చుట్టుకోసాగాయి వాళ్ళను.

కుక్కపిల్ల దొంగ కార్చుకొంటూ, నాలుక చాచుకొని రిక్షావెంట పరుగెత్తసాగింది. ఆ విషయం ఎవరూ గ్రహించ లేదు.

రిక్షా దిగమని 'హుకుం' జారీ చేశాడు రిక్షావాడు.

దాదా ఈ లోకంలో పడ్డాడు. "అరే! స్టేషన్ వచ్చేసింది......దిగమ్మా" అన్నాడు.

దాదా వెళ్ళి ఒక టిక్కెట్టు విజయవాడకు కొని తెచ్చాడు. రైలుబండి ప్లాట్‌ఫారం వదిలిపెట్టటానికి తయారుగాఉంది. చేపలన్నిటినీపట్టి ఒక మురుగుగుంటలోవేసి, జీవన్మరణ సంధ్యలో ఉంచినట్లు అందరూ క్రిక్కిరిసిపొయ్యారు. నిశ్శబ్దం—మరణం లాటి నిశబ్దం ఆవహించుకొంది. డబ్బాలలో అమర్చిన పంకాలు నిర్విరామంగా తిరుగుతున్న అలికిడి, కూలీల కేకలు, మినహా వేరే శబ్దంలేదు. అందరి గుండెలూ భయాన్ని పిండేస్తున్నాయి. అందరూ గార్డు 'విజిల్' కోసం, పచ్చని దీపపుకాంతులకోసం నిరీక్షిస్తున్నారు.

ఎలానో ఖాళీ చేసికొని కిటికీచెంత నిలబడింది.

దాదా మూట అందించాడు. బిస్తరు (మూట) చంకలో పెట్టుకొని బురఖా తొలగించుకొంది, ఉక్కబోస్తోంటే.

"అమ్మా!"

"దాదా!"

తల బయటికి పెట్టింది. దాదా కళ్ళు జలజలలాడు తున్నాయి.

"నిన్ను చూడ్డం ఈ జన్మ కిదే ఆఖరిసారనుకుంటాను దాదా". ఆ అమ్మాయి కంఠం ఒణుకుతోంది.

విజిల్ ఊదాడు 'గార్డు'.

పచ్చదీపపు కాంతులుచూసి భయపడి ఒళ్ళు జలదరించేలా కేక పెట్టింది రైలు. నిప్పురవ్వలు విరజిమ్మింది. ఉరి త్రాడులా మెత్తగా పట్టాలపై జారింది రైలు.

దాదా గుండె 'కలుక్కు'మంది.

రైలు కదిలింది.

ఆ పిల్లను స్పృశిస్తూన్న ఆ వృద్ధుని చేతులు కిటికీ ఈవలకు నెట్టివేయబడ్డాయి. నల్లటి రైలుపై విశ్రాంతి తీసికొన్న తెల్లటి వెలుగుమరకలు ఒక్కొక్కటే తప్పుకొంటు న్నాయి. వెలుగులో స్పష్టంగా కనిపించిన ఆ అమ్మాయి ముఖం కొద్ది గజాలుపొయ్యేసరికి నల్లగా వికృతంగా అదృశ్యమై పోసాగింది.

దాన్ని అనుసరిస్తూ క్రింద "దాదా" పరుగెత్తుతున్నాడు. అతని పెదవులు ఏదో పలుకుతున్నాయి. పలవరిస్తున్నాయి.

అతనినీడ ఇంత పెద్దగా దయ్యంలాపడి గదులపైబడి పరుగెత్తుతోంది.

"ముసలివాడా! చస్తావ్......ప్రక్కకు తప్పుకో!" అని అరుస్తూన్న తెల్లకోటు మనిషి దాదాను పట్టుకొన్నాడు.

రైలు వెనక్కి వెనక్కి తిరిగి చూసుకొంటూ, మలుపు తిరుగుతూ వెళ్ళిపోయింది—చీకటిలో లీనమైపోయింది.

## 4

దాదాను తీసికెళ్ళి 'లాకప్'లో పడేశారు. 'దాదా' వెంట వస్తూన్న కుక్కను 'కస్టడీ' లోకి తీసికోలేదు. అందువలన అది బయట పచార్లు కొడుతోంది. దీపపుకాంతిలో పచ్చగా మెరుస్తూన్న కళ్ళతో, దొంగ కార్చుకొంటూ, వాకిలివద్ద నిలబడి, ఇనస్పెక్టరును, పోలీసులను పరీక్షగా చూస్తోంది.

అది లోనికి రావటానికి ప్రయత్నిస్తే పోలీసు దాన్ని వెంటబడి తరుముతున్నాడు. అది ఎన్నిసార్లు తరిమినా, మళ్ళీ మళ్ళీ తోక ఊపుకొంటూ వస్తోందే కానీ, ఆ స్థలాన్ని విడిచి పెట్టటంలేదు.

ఈ తతంగమంతా ఇనస్పెక్టరు ఓరకంటితో చూస్తూనే ఉన్నాడు.

దాదాకేసి చూశాడు.

తప్పించుకుపోవాలనే ఉత్సుకతగానీ, ప్రయత్నంగానీ చెయ్యక, కునుకుపాట్లు పడుతున్నాడు 'మునగడ' తీసికొన్న దాదా.

ఇనస్పెక్టర్ పోలీసుకు సైగ చేశాడు.

"ఒరేయ్—ముసలోడా......నీకు తోడు ఒక కుక్క...... గరీబ్ గాడిద కొడకా"......తుపాకి మడిమతో పొడిచి నిద్రలేపి బయిటికి తోశాడు.

కుక్కపిల్ల పరుగు పరుగున వచ్చి కాళ్ళు నాకింది.

దాదా ప్లాట్‌ఫారంపై కొంతదూరం నడిచాడు, ఖాళీ జాగా దొరుకుతుందేమోనని పడుకొందామని.

వందలాది ప్రయాణీకులు కాళ్ళూ, చేతులూ 'మావి కాదన్నట్టు' పడవేసి నిద్రబోతున్నారు. అత నెవరో మూట క్రిందబెట్టుకొని వెల్లకిలా పడుకొని నిద్రబోతున్నాడు నోరు తెరచుకొని. పైన 'పంకా' నుండి రాలి పడుతున్న పురుగులు అతని నోట్లో సునాయాసంగా పడుతున్నాయి. అతనెవరో నిద్రబోతూనే కాళ్ళు చరుచుకొంటున్నాడు దోమలు కుడ్తోంటే. ఆ దిక్కు

మాసిన కుర్రాడెవడో మూటలా ఉండ చుట్టుకొని అక్కడ పడిఉన్నాడు. బిచ్చగత్తె ఒకర్తె ఆ స్తంభం ప్రక్కగా పడుకొంది. రొమ్ములపై రవికలేదు. శుష్కస్తనాన్ని నోట్లో పెట్టుకొని చీకుతూ, పాలురాక ఏడుస్తోంది ఒక పాప. తల్లిలేచి విసుక్కొంటూ గౌనులేని ఆపిల్ల ఒంటిపై ఒకటి చరిచి 'పడుకో.... పాడుముండా'' అంటూ ప్రక్కకుమళ్ళి పడుకొంది.

గుట్టలు గుట్టలుగా పడిఉన్న ఆ మూడోతరగతి ప్రయాకుల విశ్రాంతి స్థలంలో దాదాకు స్థలం దొరకలేదు.

కొంతదూరం నడిచి మూసివేసిన 'టీస్టాల్' ప్రక్కన మేను వాల్చాడు. నిద్ర దూరమైంది. తెల్లవారంగనే ప్రోగయ్యే ఈగల్లా మళ్ళీ ఆలోచనలు ముసురుకోసాగాయి. అతనిచెంత కుక్క ముడుచుకొని పడుకొంది.

దాని శరీరాన్ని ప్రేమతో నిమిరాడు దాదా.

కుక్కలేచింది తోక ఊపుకొంటూ. మెడ సాగబెట్టి కుయ్ కుయ్ మంటూ, దాదా పెదవులు స్పృశించింది.

''బేటా''......అంటూ కుక్కను ఒళ్లోకి తీసికొన్నాడు.

కుక్క చెవులపై కన్నీటిబొట్లు రాలాయి. అది చెవులు టపటప విదిలించుకొంది. గాడిదలా ఓండ్రపెడుతూ, స్టేషన్‌లోకి ఒక గూడ్సుబండి వచ్చింది. తెల్లకోటు వేసికొన్న వ్యక్తి, కాకీయూనిఫారమ్ వేసికొన్న మరొక వ్యక్తి దిగారు. అడుగుల్లో అడుగు వేసికొంటూ భారంగా నడుస్తున్నారు దీపాలు చేత బుచ్చుకొని.

''భయంకరమైన దృశ్యం......ఒళ్ళు గగుర్పొడుస్తోంది'' తెల్లకోటు అంటున్నాడు.

''రెండు మూడు రోజులు అన్నం నీళ్ళూ సహించవ్..... ప్రొద్దున్నే ఎవరిముఖం చూశామోకానీ.......చూశావా విధి...... హైదరాబాద్ వదలటంతోనే బ్రతికిపొయ్యామని సంతోషించి ఉంటారు కానీ, వాళ్ళ ప్రాణాలకై ఆ కిరాతకులు పొంచి ఉన్నారని వాళ్ళకేం తెలుసు పాపం.''

కాకీ యూనిఫారమ్ గొంతునుండి మాటలు పెగిలి రావటంలేదు.

దాదాకు ఆతృత హెచ్చింది. గుండె దడదడ కొట్టుకొంది. విషయాలు పూర్తిగా చెప్పమని వాళ్ళను దీనంగా అర్థిస్తున్నాయి అతని దృక్కులు.

వాళ్ళు దాదాకేసి చూడలేదు. మాట్లాడుకొంటూ 'జల్లెడ'లా ఉన్న ఒక తలుపు త్రోసికొని వెళ్ళారు. వాళ్ళ వెనుక తలుపు మూసికొంది.

మరో గూడ్సు కూత విన్పించింది. విజయవాడ వెళ్లే దిశగా 'ఇంజన్' ఉంది. దూరాన ఎర్రగా కనిపిస్తున్న దీపం పచ్చగా మారిపోయింది.

''ఈ మాల్‌గాడీ (గూడ్సుబండి) ఎంతవరకు?''

చకచకా నడిచి, 'దాదా' ఆ ఇంజన్ డ్రైవర్‌కొక సలాం కొట్టి అడిగాడు.

''భద్రాచలం!''—భుగభుగ మంటలుమండే పొయ్యిలో బొగ్గు వేసికొంటూ సమాధానం చెప్పాడు.

గిర్రున వెనుతిరిగాడు. కొత్త సత్తువ ఆవహించినట్లు, దయ్యం పట్టినవాడిలా దాదా ఒక వాగన్ పైకెక్కి దూది బేళ్ళ మధ్య పడుకొన్నాడు. ఒక అర్ధగంటసేపటికి గూడ్సు కదలింది.

గూడ్సుతోపాటు ఒక మైలుదూరం పరుగెత్తి కుక్కపిల్ల వేసారి ఆగిపోయింది.

తెల్లవార్లూ గూడ్సుబండి ఆగుతూ, నిద్రపోతూ తాబేటి నడక నడిచింది. ఏదో స్టేషన్ రాబోతోంది. స్పీడు తగ్గింది.

రాత్రంతా జడలు విరబోసికొని నిద్రించిన నిశాకాంత ఎర్రగా కళ్ళు నలుపుకొంది. కళ్ళు తెరచిచూసేలోగా సూర్యుడుదయించాడని తెలిసి, తెల్లబోయింది. దూదిబేళ్లపై కూర్చున్న 'దాదా' సూర్యోదయాన్ని చూశాడు. తుపాకిగుండు గుండెల్లోనుంచి దూసుకుపోయిన యుద్ధవీరునిలా, రక్తవర్ణంతో కొద్ది కొద్దిగా 'జనగాం'పై పొడుస్తున్న ఉదయభానుని చూసి శరీరం జలదరించింది.

'స్టేషన్' కొద్ది గజాల దూరంలో ఉంది.

దాదా ప్రక్కకు చూశాడు.

రైలు పట్టాలవెంట కొన్ని పీనుగలు పడి ఉన్నాయి. గుర్తించటానికి వీలు లేకుండా వికృతంగా భయానకంగా ఉన్నాయి. చేతులూ, కాళ్ళూలేని మొండాలు. రైలుకట్టక్రిందకు దొర్లిపోయిం దొక శిరస్సు. ఆ శిరస్సు ఏ మొండానిదో? అది పోయిన త్రోవంతా రక్తపు మరకలు.

'జనగాం'

గూడ్సాగిపోయింది.

దాదా అరచేతులూ, అరికాళ్ళూ నీరు కారి పోసాగాయి. శరీరం తేలిపోసాగింది. వెంటనే 'వాగన్' దిగలేకపొయ్యాడు. రెండు నిముషాలాగి 'హుక్కు' పట్టుకొని వ్రేలాడి దూకాడు.

కొన్ని గజాలు వెనక్కి నడిచాడు.

''ఒక పసిపాప రైలు పట్టాలమధ్య పడిఉంది. నెలల పిల్ల. చెవుల్లోనుండి, ముక్కుల్లోనుండి సన్నగా రక్తపు ధారలు ఎండిపోయి కన్పించుతున్నాయి. చేతులు సన్నగా రోజా రంగులో ముద్దగా ఉన్నాయి. ముక్కు పచ్చలారని ఆ పసికందు నిద్రిస్తున్నట్లుంది. తల్లి రొమ్మునుండి లాగి రైలు పట్టాలపై విసిరాడొక ధీరుడు, ఆ పొత్తిగుడ్డల పాపను.

'దాదా'తోపాటు కొందరు చూస్తున్నారా పాపను ప్రదర్శనశాలలో వస్తువును చూసినట్లు. ఎవరి మానాన వాళ్ళు వెళ్ళిపోతున్నారు. కడుపులో చెయ్యి పెట్టుకొని ముందు కొంగి, 'దాదా' ఆ పాపపై నిండుగా గుడ్డ కప్పాడు.

ముక్కు చీదుకొంటూ ప్రక్కకు తిరిగాడు.

ఎదురుగాఉన్న టెలిగ్రాఫ్ స్తంభానికి కట్టివేయబడిం దొక మానవ శరీరం. ఆ శరీరంయొక్క తల ముందుకుబడి నిర్జీవంగా వ్రేలాడుతోంది. చేతులు వెనక్కి విరిచి కట్టివేయబడ్డాయి. ఆ విశాలమైన ఛాతీనుండి రెండు మెలికలు తిరిగిన కత్తుల

దూసుకుపొయ్యాయి. ఆ పీనుగు దిష్టిబొమ్మలా ఆ స్థంభానికి వ్రేలాడుతోంది.

ఆ శరీరానికిముందు మరొక పీనుగ. అర్ధ నగ్నంగాఉంది. మొలపై వక్షస్థలంపై పూర్తిగా బట్ట తొలిగిఉంది. మెడ క్రింద మాంగల్యం ఉదయభానుని అరుణకాంతిలో 'మిల మిల' మెరుస్తోంది. ఆ పురుషుని కళ్ళముందు ఆ స్త్రీమానహరణ జరిగిన చిహ్నే లున్నాయి.

దాదా ముఖానికి గుడ్డ అడ్డంవేసికొన్నాడు ఒక్కక్షణం.

ఆ పీనుగపై గుడ్డ 'సరిజేసి' బోరగిలా తిప్పాడు దాదా.

నాల్గు గజాలు ముందుకు నడిచాడు.

ఇంతవారుగాఉన్న శిరోజాలు, పేర్చిన రాక్షసిబొగ్గు గుట్టలమధ్య నల్లగా కదలాడుతున్నాయి.

'దాదా' శరీరాన్ని ముందు కీడ్చుకువెళ్లాడు.

మూసికొన్న ఆ విశాలమైన కనురెప్పలు మినహా ముఖం స్పష్టంగా కనిపించటంలేదు. నున్నని ఆ బుగ్గలపై కొరికినట్లు గాట్లు. వక్షస్థలం కోసివేయబడి ఎర్రగా నెత్తురు పేరుకు పోయింది.

శరీరమంతా నగ్నంగా ఉంది కత్తిగాట్లతో. ఒక చెయ్యిలేదు.

దాదా కాళ్ళక్రింద భూమి కృంగిపోసాగింది.

కళ్ళముందు చీకట్లు క్రమ్మాయి.

సూర్యుడు ఆకసంనుండి రాలిపోయినట్టు అంతా చీకటి.

కాళ్ళు నిలబడలేకపొయ్యాయి.

చూపు ప్రక్కకు మరల్చుకొన్నాడు.

అల్లంతదూరాన రక్తపు మడుగు.

ఎర్రటి నెత్తురు.

నల్లగా గడ్డ కట్టుకుపోయింది.

ఆ నెత్తురులో ఒక చెయ్యి మోచేతివరకూ నరకబడిఉంది. పగిలిపోయిన గాజుముక్కలు దానిలో పేరుకుపొయ్యాయి.

అతి సుకుమారంగా, మృదువుగా ఉన్న ఆ వ్రేళ్ళు ముడుచుకుపొయ్యాయి.

ఆ చేతి ప్రక్కన చెల్లాచెదరయిన ఖర్జూరపు పండ్లు, చీరెలు.

భయ విహ్వలమై పరుగెత్తుతున్న యువతిని వెంటబడి చెరచటానికి ప్రయత్నించి......మానభంగంచేసి, హత్య చేసిన దృశ్యం.

దాదా గొంతు పూడిపోయింది.

పాత దయ్యాలబావిలోపడ్డ వ్యక్తి ఒడ్డు పట్టుకోలేక, వెనుకకు జారిపోతూ, ఊబిలో దిగబడుతున్నట్లు, దాదా కాళ్ళు జారిపోసాగాయి.

కాళ్ళీడ్చుకొంటూ రెండడుగులువేసి ఆ చెయ్యి తీశాడు.

'బేటీ'......అంటూ గుండెలకు ఒత్తుకున్నాడు.

## 5

''నిన్ను నా చేతులారా చంపాను.......మూర్ఖుణ్ణి.....' నా పాపానికి నిష్కృతిలేదు......అల్లా నన్ను క్షమించడు......ఈ చేతులతో నిన్ను పెంచాను......ఈ చేతులతోనే నిన్నువల్లకాటికి సాగనంపాను......బేటీ''......ముసలాడు నుదురు నున్నటి ఆ చలువరాతి మెట్టుపై బలంగా గుద్దుకొన్నాడు.

''దాదా?......ఏమిటూ పిచ్చిపని?......పెద్దవాడివి, నాచే చెప్పించుకోవాలా? పోయినవాళ్ళకోసమై బెంగపడితే ప్రయోజనమేముంది......లే'' అంటూ ప్రక్కనున్నవ్యక్తి లేవనెత్తాడు.

మసీదులో ప్రార్థన ముగిసింది.

ఆ ఖరీదైన షేర్వాణి అతి కష్టంతో మెట్లు దిగుతున్నాడు గర్భిణిస్త్రీలా. దాదా కోపంగా చూశాడు అటుకేసి. సోదర ముస్లింలు కొందరు దాదా ప్రక్క చేరారు. దాదా యోగక్షేమాలు పరామర్శించి, ఓదార్చి అతని స్మృతిపథంనుండి నైరాశ్యపు భావనలను దూరం చేశారు.

''ఇంటికి వెళ్దామా దాదా''. ఒకడన్నాడు.

''ఎందుకు....నే నొక్కడ్నే వెళ్తాను....నువ్వెళ్ళు'' అన్నాడు దాదా.

దాదా లేచాడు పీరులా.

మెట్లక్రింద కూచొని 'పైసా......పైసా........సాబ్'' అంటూన్న ఒక రోగిష్టి బిచ్చగానికి రెండురూపాయల నోటు వేశాడు.

## 6

'హుస్సేన్‌సాగర్'లోకి సూర్యుడు దిగజారబోతున్నాడు. వీధుల్లో కార్లు రిక్షాల సందడి ఎక్కువైంది.

దాదా రోడ్డువెంట నడుస్తూంటే, ఒక హిందూ దేవాలయంనుండి భజన కోలాహలం వినబడింది. అనాలోచితంగా అతనికాళ్ళు ఆ దేవాలయ ప్రాంగణంలోకి నడిచాయి.

లోపల పూజ జరుగుతోంది.

'గదంతా సుగంధంతో నిండిపోయింది. ఒక భక్తుడు గణగణ గంట కొడ్తున్నాడు నిర్విరామంగా. దానికి లయ కలుపుతూ మరొక నిలయ విద్వాంసుడు మద్దెల వాయించుతున్నాడు. చెవులు బద్దలయి పోతున్నాయి.

దేవాలయపు బురుజుల్లోఉన్న పావురాలు రివ్వున ఎగిరి పొయ్యాయి.

ఒక స్త్రీ తడిబట్టలు కట్టుకొని, జడలు విరబోసికొని గుడిచుట్టూ ప్రదక్షిణాలు చేస్తోంది.

భక్తకోటి కనీస సంఖ్యకు హాజరయ్యారని ధృవపరచుకొని ఆచార్యుడు గొంతు పెగల్చుకొన్నాడు. 'పాండురంగ విఠ్ఠల్' అంటూ ఒక చరణం రాగాలాపన చేయసాగాడు. భక్తకోటి తాళాలు కొట్టుకొంటూ, బండగొంతులతో అనుకరిస్తున్నారు.

ఒక ఐదు నిముషాలు గానమాధుర్యంలో ఓలలాడించి, ఓలలాడిపోయిన ఆచార్యులు 'పాండురంగవిఠ్ఠల్' అన్న ఒక్క

మాటే లంకించికొని, ఆనందపారవశ్యంలో తన్మయుడై ఊగిపో సాగాడు. మిగతా సుజన బృందం తారస్థాయిలో తాళాలు కొట్టు కొంటూ, ఉన్మాదావస్థలో మారు పలుకుతున్నారు.

ద్వారంచెంత నిలబడి చోద్యం చూస్తున్నాడు దాదా.

ఒక భక్తుడు ఆలస్యమైపోయిందని స్వామి ఆగ్రహానికి గురైపోతానేమోనన్న భయంతో చెమట్లు కక్కుకొంటూ, పీచు తీసిన కొబ్బరికాయ చేత బట్టుకొని విసురుగ్గా లోపల ప్రవేశించబొయ్యాడు. 'దాదా' మురికి షేర్వాణి అంటే అంట నట్లు అతనికి తగిలింది. టక్కున బ్రేకువేసినట్లాగిపొయ్యాడు.

"అడ్డంలే......తురక ముండాకొడుకా!......మైలబడి పొయ్యాను......ఇంకేముంది" అని గొణుక్కుంటూ వెళ్ళి ఒక బొక్కెన నీళ్ళు నెత్తిపై పోసికొని మళ్ళీవచ్చాడు.

దాదా కొద్దిదూరం జరిగి అతన్ని 'జూ'లో జంతువులా పరిశీలించసాగాడు. అతను దూరంగా నిలబడి "దూరం—దూరం" అన్నట్టు చేతితో సైగచేసి, మంత్రోచ్చారణ చేసికొంటూ లోనికి వెళ్ళాడు.

దాదాకు విభ్రాంతి కల్గింది.

తన నెందుకలా అసహ్యించుకొన్నాడు—ముస్లిం మతస్థు డనని తన కెలా తెలుసునాని విస్తుబొయ్యాడు—ఎందుకు తెలి యదు? క్షుణ్ణంగా తెలిసిపోతుంది.

దాదా గడ్డంచూసికొన్నాడు.

గడ్డం పొడుగ్గా క్రిందకు పెరిగింది. గిజిగానిగూడులా నున్నటి తన తలపై ఎర్రటి కుచ్చుటోపీ వ్రేలాడుతోంది—'వేసికొన్న షేర్వాణీ, పైజమా, చెప్పులు అన్నీ వాళ్ళకు విరుద్ధం గానే ఉన్నాయి. ఏ ఒక్క విషయంలోకూడ సామరస్యంలేదు.

లోనికి వెళ్ళిన వ్యక్తిని పరిశీలనగా చూశాడు.

అతని నున్నటి పొట్టమీద సన్ననిత్రాడు వ్రేలాడుతోంది. గడ్డంలేదు. మీసాలు లేవు—నున్నగా క్షవరం చేయించుకొన్నాడు. తలంతా నున్నగా గొరికించుకొని మధ్యలో గోష్పాదమంత పిలక చూడ ముచ్చట ఉంది.

వాళ్ళిద్దరిమధ్యను వున్న తారతమ్యం గ్రహించాడు.

అతను గడ్డం 'సాఫ్' చేసికొని తలలో పిలక పెట్టుకొంటే, తనుతలంతా 'సాఫ్' చేయించుకొని గడ్డం పెంచుకొన్నాడు.

మత విశ్వాసాల్లో ఉన్న భేదం, వేషధారణలో కూడా స్పష్టంగా కనుపిస్తోంది.

మత విశ్వాసాలను ఆధారంగా చేసికొని, ఆచార సంప్ర దాయాల్లో, వేషభాషల్లో, కల్గిన వ్యత్యాసాలు ఆలోచించాడు. వీటన్నిటికీ అంతర్గతమైన విలువ ఉందా?—లేదా? అన్న మీ మాంసలో పడిపొయ్యాడు.

దాదా దృష్టిపథంలో వివిధ మతాలూ, వాటి తాలూకూ ప్రతినిధులు హాజరయ్యారు.

నున్నగా తల గడ్డం మీసాలు గొరిగించుకొని, భిక్షాపాత్ర చేత బట్టుకొని తెల్లని బట్ట మొలకు చుట్టుకొన్నా డొకడు...... అతను బౌద్ధ మతస్థుడు.

గడ్డం, మీసాలు మెలి తిరిగి చెట్టు వ్రేళ్ళులా సాగిపో తూంటే, తల వెంట్రుకలన్నీ ఒక్కచోచేర్చి 'పాగా' చుట్టు కొన్నాడు. వెంట్రుకలపై కత్తి వెయ్యకూడదని అతని నియమం. అతను సిక్కు.

పై రెండు మతాలకు కేశఖండనలో ప్రతికూలభావాలు.

"మెడలో లింగకాయ వ్రేలాడవేసికొని, నొసటిపై అడ్డగీతలు గీచుకొన్నా డొకడు—శైవ మతస్థుడు.

"మెడలో నల్లటి దారంతో 'క్రాస్' గుర్తులాటి రేకు బిళ్ళ వ్రేలాడవేసికొన్నా డొక భక్తుడు. అడ్డంగాఉన్న రేకుకన్న నిలువుగా ఉన్నరేకు పొడవుగా ఉంది—అతను క్రైస్తవ మత స్థుడు.

ఒక్కొక్క మతాని కొక చిహ్నం.

సమాజంలో శాంతి భద్రతలు నెలకొల్పటానికి, మానవుని నైతిక శక్తులు పెంపొందింపచెయ్యటానికీ మతం, మూలాధారం కావచ్చుకానీ, మతాన్ని వ్యక్తపరుస్తూన్న ఈ బాహ్య చిహ్నాలు సామాజిక జీవితంలో ఎన్నో అనర్థకాలు తెచ్చిపెడుతున్నాయి. యుగ యుగాలుగా, తర తరాలుగా సాగిపోతూన్న ఈ చిహ్నాలు మానవులను విడదీసి ఒకరిపట్ల మరొకరికి అసహ్యాన్ని పురి కొల్పుతున్నాయి.

దాదాలో అసహ్యం, ఉక్రోషం ముంచుకొచ్చాయి. నెత్తి మీద టోపీతీసి విసిరి పారేశాడు— "బేవకూఫ్‌లోగ్" అని తిట్టు కొంటూ.

గుడిలో పూజ ముగిసింది. దైవనామసంకీర్తనలో శోషిం చిన భక్తకోటి శ్రమకు ఫలితంగా ప్రసాదం పుచ్చుకొంటున్నారు. చక్కెర పొంగలి, దధ్యోజనం ఇత్యాదులు. దైవ సన్నిధిలో కళ్ళు కద్దుకొని మరీ తింటున్నారు భక్తులు.

దానికోసం బయటవేచి ఉన్నారు వికలాంగులు, దైవ స్వరూపులు—ప్రతినిధులు—మనిషి చనిపోతే ఆసుపత్రి గేటు వద్ద ఎదురు చూస్తున్న బంధువుల్లా. వాళ్ళందరూ ఒక్కసారే 'బాబ్బాబు' అంటూ గందరగోళం చేయసాగారు.

"అరవకండ్రా......దిక్కుమాలిన వెధవల్లారా?" అంటూ బయటి కొచ్చాడు, పులిహోర వడ్డిస్తూన్న అర్చకుడు పళ్లెం పట్టుకొని.

తుప్పు పట్టిన రేకుడబ్బా ముందుకు చాచాడు...... ఒక గూనివాడు.

—వంగిపోయిన నల్లటి రాతివెండిపెళ్లెం ఎత్తి పట్టు కొంది—ఒక గుడ్డిది.

"దొరా—నా కిందులో పడెయ్యి—నీ కాళ్ళకు మొక్కుతా దొరా! నీ బానిసోణ్ణి" ఒక చెయ్యి గూడవరకూ విరిగిపోతే, దానికి జోలి తగిలించుకొని, మరో చేత్తో 'జోలి' తెరుస్తూ అంటు న్నాడు దీనంగా ఓ అవిటివాడు.

ఈవిధంగా అడుక్కుతినే బొచ్చెలన్నీ ఎత్తిపట్టారు. అర్థగంట సేపటికి కోలాహలం ముగిసింది.

"ఎవరయినా అందుకోవాల్సినవాళ్ళున్నారా" అంటూ నడుం పైకెత్తాడు వడ్డిస్తూన్న భూసురుడు.

"ఇంద" అంటూ చేతిలో పులిహోర పట్టుకొని, దాదా కేసి చూశాడు. దానికోసం దాదా చెయ్యి చాచలేదు. నిర్లక్ష్యంగా అసహ్యంగా అతనికేసి చూశాడు. ఇంకా ఇద్దరు పూజారు లా సన్నివేశాన్ని తిలకించారు.

"తురక గాడిద......వాడు తినడులే......అడుక్కు తినే వాడికి కూడా పెద్ద నిక్కు......లోపలికి రా" అన్నాడు ఓ పూజారి.

భిక్షువులందరూ, ప్రసాదం గొంతులో పడవేసికొని, దేవునితో అవసరాన్ని రేపటికి వాయిదా వేసికొని వీధులవెంట పడ్డారు.

# 7

సంధ్య వెలుగుండగానే, నగర పాలక సంఘ విద్యుద్దీపాలు, కళ్ళు రెపరెప లాడించుకొంటూ నిద్రలేచాయి. విద్యుక్తధర్మాన్ని పాటిస్తూ, సన్నగా గాలి వీచింది. ఒక పాట గాలిలో ఊగుతూ నీరసంగా పయనిస్తున్నది. ఆ గీతం అతని హృదయాంతరాళంలో జాలిగా, విషాదస్వరంతో అస్పష్టమైన లయతో వినవస్తున్నది.

"ఈ జాతి, కుల, మత భేదాలు విస్మరించి, మానవ జాతిసమైక్యతకోసం పాటుపడిన వాళ్లందరూ చరిత్రహీనులై పొయ్యారు. 'దాదా........మరి నీవు' అంటూ ఏదో అనబోయి నవ్విందా కంఠం. వెక్కిరించింది.

దాదాకు ఒళ్ళు మండింది. మెట్లపై నిలబడి కొరకొర చూశాడు దాదా. ఇంతకుక్రితం, ఆలస్యంగా వచ్చి, మైలబడిన భక్తుడు మెట్లు దిగుతున్నాడు.

"ఏంరా—నీవు కళ్ళురిమిచూస్తే నాకేం భయమను కొన్నావా? ఏదో కూటికిలేని వెధవ్వని వదిలిపెడితే......అయినా నీ కిక్కడేం పని?"

దాదా చెంపపై 'ఛడేల్ ఛడేల్'న దెబ్బలు పడ్డాయి.

"ఈలాటి వాళ్ళను నమ్మకూడదు......చూపులకు అమాయకంగా కనబడ్డా, ఉన్నట్టుండి ఏదో ఒకటి అందుకుపోతారు. దొంగముచ్చు......కొట్టండి". ఒక కంఠం నిర్ణయించింది.

ఇంకా నాలుగు చేతులు కలిశాయి హుషారుగా ఆ మహా త్కృష్ట కార్యనిర్వాహణకై. అసహాయులైన పేదవాళ్ళపై దిక్కులేనివాళ్ళపై చెయ్యిచేసికొని, వారి ధైర్య సాహసాలూ, పౌరుషం నిరూపించుకొంటూరు కొందరు.

మెడబట్టి దేవాలయ ప్రాంగణంనుండి బయటికి గెంటూరా మానవులు.

నిర్విరామమైన ఘంటారావం.....హిందూ దేవాలయంలో గణగణలు. రెండవసారి ప్రార్థనకు సన్నాహాలు జరుగుతున్నాయి.

దేవాలయపు బురుజుల్లోఉన్న పావురాలు 'బిలబిల'మంటూ బయటికివెళ్ళిపొయ్యాయి.

అల్లాహో అక్బర్......అల్లాహో

మసీదులో పావురాళ్ళు లేచాయి.

దాదా 'మూసీ'నదివైపు నడుస్తున్నాడు.

పావురాలన్నీకలిసి మైత్రీభావంతో గుంపులు గుంపులుగా ఎగిరిపోతున్నాయి. గాలిలో తేలిపోతున్నాయి.

అల్లాహో......అక్బర్.

గణగణలు.

ఆ రెండు పిలుపులకు అతీతుడైన దాదా చిరునవ్వుతో నీలాలనింగికేసి చూస్తున్నాడు.

మూగ పావురాలు ఎగిరిపోతున్నాయి.

# నన్నయ భారతంలోని కొన్ని పాఠభేదాలు

## శ్రీ బులుసు వేంకటరమణయ్య

**1962** మేనెల భారతి సంచికలో శ్రీ మంగిపూడి కృష్ణమూర్తిగారు 'నన్నయ రచనలో కొన్ని సవరణలు' అనే పేరుతో నన్నయ భారత భాగంలోని కొన్ని అపపాఠాలనూ, వాటికి తగిన సవరణలనూ వివరించారు.

మన ప్రాచీన గ్రంథాలలో లేఖకుల ప్రమాదం వల్లనూ, లేఖకులు వ్యుత్పన్నులైన యెడల వారి సమన్వయ పద్ధతులవల్లనూ వేర్వేరు రీతులుగా పాఠాంతరాలు కానరావడం సహజం. ఇది సర్వ వాఙ్మయాలకూ సాధారణం! సముచిత పాఠ నిర్ణయంలో భాషా స్వభావం గమనించడం, కవి హృదయం కనిపెట్టడం, మూలాన్ని పరిశీలించడం ఎంతో అవసరం! అన్నీ సక్రమంగా జరిగినప్పుడే తగిన పాఠాన్ని నిర్ణయించ వీలుంటుంది.

బహుళ ప్రచారంలో ఉండే గ్రంథాలలో ఎక్కువ పాఠాంతరాలు దొర్లడం పరిపాటి. వివిధ ప్రాంతాలలోని లేఖకులు ప్రతులు వ్రాసుకునేటప్పుడు వేర్వేరు పాఠాలు పుస్తకాల్లోకి ఎక్కుతూ ఉంటాయి. పరమ పవిత్రమైన పంచమ వేదమై, కవిత్రయ ప్రణీతమైన మహాభారతంలో గ్రంథం పైనీ, రచయితలపైనీ ఉండే భక్తి గౌరవాలను బట్టి చేర లేదేమో కాని, భాస్కరరామాయణం, రంగనాథ రామాయణం వంటి గ్రంథాలలో గ్రంథ భాగాలకు భాగాలే అధికంగా చేరడం కానవస్తున్నది. ఇట్టి భాగాలలో ఏవి కవి వ్రాసినవో, ఏవి మధ్యను వచ్చినవో నిర్ణయించటం శ్రమ సాధ్యంగానే ఉన్నది.

భారతాన్ని చాలాకాలం క్రిందటనే వివిధ సంస్థలవారు ప్రకటించడం ప్రారంభించారు. ఒకరి ముద్రణలో సరియైన పాఠాలుగా ఉన్నవి వేరొకరి ముద్రణలో పాఠాంతరాలుగా చూపబడేవి. భారత ముద్రణ ప్రతులలో శ్రీ వావిళ్లవారి ప్రచురణమూ, శ్రీ ఆనంద ముద్రణాలయంవారి ప్రచురణమూ ప్రామాణికములుగా తలచబడేవి. కాని వాటిలో కూడా చాలాచోట్ల అపపాఠాలు పడివుండడంవల్ల పాఠకులకు తరచుగా సందేహాలు కలగడమూ సంభవమే. భారతాన్ని పరిశీలన దృష్టితో పఠించి శ్రీ కృష్ణమూర్తిగారు తమ వ్యాసంలో కొన్ని పాఠభేదాల విషయంలో ఉచితమైన నిర్ణయాలు చేశారు. వారి వ్యాసం చదివాక కలిగిన ఉత్సాహమే దీన్ని వ్రాయడానికి నన్ను పురికొల్పినది.

ప్రాచీన గ్రంథపాఠములను పరిశీలించేటప్పుడు తొందరపాటు లేక నిదానంగా పర్యాలోచించాలి. అందులోనూ కవిత్రయంవారి రచనల విషయమై ఎంతో జాగ్రత్త చూపాలి. ఈ పనిలో తాళపత్ర ప్రతులతోపాటు అతి ప్రాచీనాలైన ముద్రిత ప్రతులు లభిస్తే వాటిని ముఖ్యంగా సంప్రతించాలి. ఏమంటే పూర్వకాలపు తరహా పరిష్కర్తలూ, ప్రకాశకులూ ఎన్నో ప్రతులను పరిశీలించి, తగిన పాఠమని తమకు తోచిన దానినే గ్రహించి గ్రంథములను ముద్రించేవారు.

ఆంధ్రగ్రంథ ముద్రణోద్యమం ప్రారంభమైన తొలి రోజుల్లోనే 1853 వ సంవత్సరంలో ఆంధ్రమహా భారతం ముద్రితమైనది. దీని ప్రతి నావద్ద ఉన్నది.* దీని ప్రకాశకులు విళుందుడ—సోమసుందర పిళ్లగారు. 19 వ శతాబ్దంలో సుప్రసిద్ధ విద్వాంసులు శ్రీ కరాలపాటి రంగయ్యగారు దీన్ని పరిష్కరించినారు. పా. కుమారయ్యగారు తమ కళానిధి ముద్రాక్షరశాలలో దీన్ని ముద్రించారు. ఇందులో ప్రకాశకులు పీఠికలో యిచ్చిన క్రింది విషయాన్ని బట్టి అప్పట్లో తెలుగు భారతం స్థితి ఎలా ఉండినదీ తెలియగలదు.

". . . . . . . . . కవిత్రయకృత శ్రీమదాంధ్ర భారత మహాకావ్య రత్నంబు సాంతంబుగాఁ బదునెనిమిది పర్వంబులును జదువ నపేక్షించువారల కొక్కొక్కయెడ నొక్కొక్క పర్వంబ చిక్కుటయ కాక సమగ్రంబుగా దొరకుట మిక్కిలి దుర్లభంబగుటయు, నెట్టకేనిం జిక్కినయవి యవిచక్షణులగు నక్షరచణులచే లిఖితంబు లగుటచేసి వర్ణ వ్యత్యయ లోపాదులు మెండుగా నిండుకొని యుండుటయును విమర్శించి యిట్టి లోపంబులనెల్ల వారించి యమ్మహా గ్రంథంబు పండిత సాహాయ్యంబునఁ బరిష్కరించి యచ్చు

---

* రమారమి 20ఏళ్ల క్రిందట అదృష్టవశాత్తూ పాత పుస్తకాల అంగడిలో ఇది కానరాగా, విక్రేత అడిగినంత సొమ్ము ఇచ్చి దీనిని కొన్నాను. దీన్ని సుప్రసిద్ధ విద్వాంసులు శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారు, శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు, కూడా చూచి, తృప్తిపడ్డారు. భారతం తిరిగీ ముద్రిస్తే దీన్ని ఆధారంగా చేసుకొని పని సాగించడం మేలని అభిప్రాయం వెలిబుచ్చారు. నాకు సందేహాలు కలిగినప్పుడు ఈ పుస్తకాన్నిబట్టే సందేహ నివృత్తి అవుతూఉండును. దీన్ని అనుసరించే ప్రాచీన గ్రంథాలలోని పాఠములను గురించి కొన్ని వ్యాసాలను అప్పుడప్పుడు వివిధ సంచికలలోనూ, పత్రికలలోనూ ప్రకటించడం జరిగింది. ఈ వ్యాసానికి ఆధారం కూడా ఈ ప్రాచీన ముద్రిత గ్రంథమే!

# నన్నయభారతంలోని కొన్ని పాఠభేదాలు

కూర్పించి సులభక్రమంబున నెల్లవారలకు నుపయోగింపఁ జేయుట యత్యావశ్యకంబని యెంచి తత్కాలంబున మే మచ్చు గూర్పించుచున్న భాస్కరరామాయ ణోత్తర రామాయణం బులు పరిసమాప్తంబులైనం దోడనె యీ యాంధ్ర భారతం బును ముద్రింప నిశ్చయించితి; మట్టి సమయంబున మా యుద్యమం బెఱింగి మాకన్న మున్న కొంద ఱీ గ్రంథం బచ్చు గూర్పించి విక్రయించుచుండ నా సంచికలు మా చందాదారు లలోఁ గొందరు దెప్పించుకొని సావధానులై విమర్శించి యందుఁ గల గ్రంథపాతాది భ్రంశ బాహుళ్యంబు మా కెఱింగించి 'యీ గ్రంథంబు మరలఁ బరిష్కరింపించి నిర్దోషంబుగా నచ్చు వేయింపవలయు' నని కోరిరి. గావున మేము వారి కోరిక ప్రకారము ద్రవ్యోపపత్తి మొదలగు సాహాయ్యంబులం బొంది బహు దేశంబులనుండి ప్రాచీన గ్రంథంబు లనేకంబులు రావించి జాగరూకులమై భగవదనుగ్రహాతిశయంబువలన నే విఘ్నంబును లేక పదునెనిమిది పర్వంబులును సమగ్రములుగా నచ్చు గూర్పించి ప్రకటించితిమని యెఱింగించుటకు మిగుల నానందించుచున్నారము."

పైని వివరించిన విషయాన్నిబట్టి ఆ కాలంలో కూడా గ్రంథ ముద్రణంలో ఎంతో పోటీ ఉండినదనీ, విచక్షణులగు పాఠకులు సుప్రసిద్ధ విద్వాంసుఁ పరిశీలించి ప్రకటించిన గ్రంథాలనే ఆదరించేవారనీ, అట్టి వానిలో శ్రీ కరాలపాటి రంగయ్య పండితులు పరిష్కరించిన భారతం ఒకటనీ తెలుస్తున్నది. ఆయన, తమకు లభించిన భారత ప్రతులను సంప్రతించి ఆ గ్రంథాన్ని పరిష్కరించారు. ఎక్కడో దొర్లిన అచ్చు తప్పులు తప్ప, ఇందు వేరే దోషములు కానరావు. సుప్రసిద్ధ విద్వాంసులైన శ్రీ రంగయ్యగారు సంస్కరించిన ప్రతిలోని పాఠాలను మనం గ్రహిస్తే చాలావరకూ సందేహాలు తీరిపోతాయి.

## 1. చెప్పనినాఁడు - చెప్పనివాఁడు

'తన యెఱిఁగిన యర్థం బొరుఁ
డనఘా ! యిది యెట్లు సెప్పుమని యడిగినఁ జె
ప్పని నాఁడును సత్యము సె
ప్పనినాఁడును ఘోర నరక పంకమునఁ బడున్.

(ఆది—1—137)

అనేచోట 'చెప్పనినాఁడు' అనే పాఠం సరికాదనిన్నీ, 'చెప్పనివాఁడు' అనేదే సరియైన పాఠమన్నిన్నీ శ్రీ కృష్ణమూర్తిగారు వ్రాయడం ఎంతో సముచితం ! అదే సరి అయిన పాఠమని కొంచెం ఆలోచిస్తే తెలిసిపోతుంది. శ్రీ రంగయ్య పండితులు పరిశీలించిన ప్రతిలో (పుట. 11 పంక్తులు 28, 29) 'చెప్పనివాఁడు' అనియే ఉన్నది. దరిమిలా అచ్చుపడిన ప్రతుల్లో 'చెప్పనినాఁడు' అని యెక్కడం విచిత్రంగానే ఉంది.

## 2. అంగములు వదలె

తల వడఁకఁ దొడుగె నింద్రియ
ముల గర్వ మడంగె నంగములు వదలె పలి
తంబు లయ్యె వగరును
దలయేరును నుక్కివయును దలకొనుదెంచెన్.

(అది. 3—19)

అనే పద్యంలో 'అంగములు వదలె' అనడం సరికాదనీ, 'వడలె, సడలె, వదిలె' అనే వాటిలో దేనినైనా సరియైన పాఠంగా గ్రహించడం ఉచితమనీ వ్యాసకర్త వివరించారు. చాలా ప్రతుల్లో 'వదలె' అనే ఉంది. దాన్ని 'వడలె' అని గాని 'సడలె' అని గాని మార్చడంకంటె 'వదిలె' అని అనుకోవడమే ఉచితంగా ఉంటుంది. 'అంగములు వదులుగా అయిపోయా' యని చెప్పడం సరిగానే ఉంటుంది.

## 3. తంసుధీరుఁడు

అతనికి సరస్వతీ నది
మతి ననురక్తయయి వాని మానుగఁ దనకుం
బతిఁ జేసికొనియె ధర్మ
స్థితి న య్యిరువురకుఁ ద్రసుఁడు ధీరుఁడు పుట్టెన్.

(ఆది. 4—4)

ఇందులో ఉన్న 'త్రసుఁడు' సరికాదనీ, 'తంసు' డనే పదమే మూలమైన సంస్కృతంలో కానవస్తున్నదీ అని చెప్పి 'తంసు ధీరుఁడు పుట్టెన్' అనే పాఠాన్ని శ్రీ కృష్ణమూర్తిగారు నిర్ణయించారు. సంజ్ఞానామవాచకంతో విశేషణపదం చేరి సమాసాన్ని పొందవచ్చునని కొన్ని ప్రయోగాలను చూపుతూ విపులంగా వివరించారు. 'స్థితస్య గతి శ్చింతనీయా' అని ఎక్కడైనా కవులు ప్రయోగించినవాటిని సమర్థించడానికి వారి వివరణ ఉపయోగించవచ్చును. సంజ్ఞావాచకపదం అర్థవంతమైతే —ఇదా, అదా అనే సందేహానికీ, తన్నిర్ణయానికీ ఎక్కువ అవకాశం ఉంటుంది. ప్రస్తుతంలో త్రసుడన్నా, తంసుడన్నా ఒక్కటే ! దేనికీ వ్యుత్పత్త్యర్థాన్ని చెప్పలేము. కరాలపాటివారి ప్రతిలోనూ 'త్రసుఁడు' (పుట. 41. పం. 10) అనే ఉన్నది. 'తంసుఁడు' అని మార్పుచేస్తే 'తంసుధీరుఁడు' అనే చెప్పాలి. అలా చెప్పితే ఇలాటి సమాసాలు చెయ్యవచ్చునా ? కూడదా ? అనే చర్చకు కూడా దిగవలసి వస్తుంది. ఇంతకూ సంస్కృత ప్రతులూ అనేక రకాలుగా ఉన్నవి. ఉత్తరదేశ ప్రతులకూ, దక్షిణదేశ ప్రతులకూ ఎంతో తేడా కనపడుతుంది. అనేకములైన ప్రతులను సంప్రతించి ప్రకటించిన భండార్కరు సంస్థ వారి ప్రతిలో ఏ పాఠం ఉన్నదో—ఆ ప్రతి నాకు అందుబాటులో లేదు. నన్నయకు లభించిన దానిలో 'త్రసుఁడు' అనే ఉన్నదేమో ! శ్రీ కృష్ణమూర్తిగారు వ్రాసినది సబబుగా లేదని చెప్పలేము. కాని, పదద్వయంలోనూ ఏదైనా సరిపోయే పక్షంలో లేనిపోని విమర్శలకు దారితీసే 'తంసుఁడు' కంటె 'త్రసుఁడు' అనేదాన్నే అంగీకరిస్తే మేలేమో !

## 4. కానీన

ఏను నీ చెప్పినవారిలోపల నెవ్వఁడుఁగాను
కానీన సర్వ శస్త్రాస్త్ర విద్యలఁ గడుఁ బ్రసిద్ధుండ

భూనుత (బహ్మ తేజోధికుండ నిన్ను బోరిలో పోర్వ
గా నున్న వీరుండ . . . . . (ఆది. 7—202)

అర్జునుడు కర్ణుడితో పలుకుతున్న యీ మాటలలో 'కానీన' అనే సంబోధన మిక్కిలీ అనుచితంగా ఉన్నదనీ, దానికి బదులు సంస్కృత మూలాన్ని అనుసరించి 'కర్ణ' అనే పిలుపే తగివుండనీ, అర్జునుడికి అప్పటికి కర్ణుడు కానీనుడని తెలియదనీ, పరిష్కర్తలు 'కర్ణ' పదానికి బదులుగా 'కానీన' పదాన్ని కూర్చారనీ వ్యాసకర్త వివరించారు. కరాలపాటివారి (పతిలో (పు. 99. పం. 4) కూడా 'కానీన' అనే ఉన్నది. అప్పటికి అర్జునుడికి కర్ణుని జన్మవృత్తాంతం సంగతి తెలియకపోయినా నలుగురూ అతడు తక్కువ కులంలో పుట్టినట్లు చెప్పుకోవడమూ, ఆనోటా ఆనోటా కర్ణుడు కానీనుడనే మాటను వినడమూ అసంభవాలు కావు. కర్ణుణ్ణి నిరసనభావంతో అర్జునుడు చూడడం సందర్భానుకూలంగా ఉన్నది కూడా. సమన్వయానికి విరుద్ధంకాని యీ పదాన్ని తీసివేసిన యెడల పద్యంలో ముఖ్యమైన కర్ణుని గూర్చిన సంబోధనయే లేకపోతుందే! అంతే కాకుండా 'కానీన' అనేదాన్ని 'కాని' అని మార్చిన యెడల 'శస్త్రాస్త్ర విద్యల' అనేదాన్ని 'శస్త్రాస్త్ర విద్యలయందు' అని మార్చవలసీ వస్తుంది. ఈ కారణాలనుబట్టి 'కానీన' పదాన్ని మార్చివెయ్యడం అంతగా ఉచితమని తోచదు.

## 5. మాధవి

ధర్మ తత్త్వజ్ఞుం డీ ధర్మ తనూజుండు
ధర్మమార్గం బేల తప్పం బలుకు ?
దేవతామూర్తి యీ దేవి మాధవి యేల
తా నెఱుంగక యనృతంబు పలుకు ?
(ఆది—7—256)

పయి పద్యంలో ఉండే 'మాధవి' కుంతీదేవిని తెలుపజాలదనీ, దానికి బదులుగా 'యాదవి' అని ఉండవలెననీ వ్యాసకర్త చెప్పడం ఎంతో ఉచితంగా ఉన్నది. (వాతలో 'యా' కు బదులు 'మా' పడడం, ఒత్తులేని అక్షరాలను ఒత్తులతో (వాయడం పరిపాటి. అందువల్ల 'యాదవి' కి 'మాధవి' పడిఉండాలి. కరాలపాటివారి (పతిలోకూడా 'మాధవి' అనే ఉన్నది. (పుట. 102. పం. 5.) 'యాదవి' అనడమే సమంజసం.

## 6. బహిర్గిరోపగిరులు

అతుల చతురంగ సేనా
యుతుఁ డంతర్గిరి బహిర్గిరోపగిరుల భూ
పతుల నని నోర్చి శౌర్యో
న్నతిఁ గొనియెను వారిచేత నానా ధనముల్.
(సభా. 1—235)

పయి పద్యంలో 'బహిర్గిరి' అనే పదానికి బదులుగా 'బహిర్గిర' అని అకారాంత పదం ఉన్నదనీ, మూలంలో 'బహిర్గిరిం' అనే ఉన్నదనీ, 'బహిర్గిర' అనేదాన్ని ఇకారాంతంగా మార్చినయెడల 'బహిర్గిర్యుపగిరులు' అని యణాదేశసంధి వచ్చి ఛందోభంగం కలుగుతుందనీ వ్యాసకర్తలు (వాశారు. 'బహిర్గిరోపగిరులు' అనడంవల్ల కుసంధి దోషం వచ్చిందన్నారు. నన్నయభట్టు 'బహిర్గిర' పదాన్ని (పయోగించాడని అనుకుంటే ఆ దోషం ఉండదు. "గిరేశ్చ సేనకస్య" (5—4—112) అనే పాణిని సూత్రాన్నిబట్టి 'టచ్' వస్తే 'బహిర్గిరి' 'బహిర్గిర' అనే అకారాంతంగా కూడా ఉండడానికి అవకాశం ఉంది. కరాలపాటివారి (పతిలోనూ 'బహిర్గిరోపగిరులు' అనే ఉంది. ఇక్కడ వేరే రీతిగా ఉండడానికి వీలు కానరాదు.

## 7. భస్మతతులు

అతుల శౌర్యుం డనిలతనయుం డమిత వాహినీ పదా
హతి ధరిత్రి దలర నిట్లు లరిగి పూర్వ దిశ్మహీ
పతులచేత రత్నరజిత భస్మతతులఁ గొనియె భూ
నుతయశుండు వేలువేల నూరుకోట్ల సంఖ్యలన్.
(సభా—1—245.

పయి పద్యంలో (శీ కృష్ణమూర్తిగారు సూచించినట్లు 'భస్మ'కు బదులు 'భర్మ' అనుటయే ఉచితము. 'భస్మ' అచ్చు తప్పనియే చెప్పాలి. కరాలపాటివారి (పతిలో (పుట 135. పం. 21) 'భర్మతతులు' అనియే ఉన్నది. 'భస్మతతులు' సరియైన పాఠమని అనుకోవడం అవివేకమూలం!

## 8. భూరిబలుని పుత్రు

జలజనాభు పగతు జంభకుం డను వాని
భూరిబలుని పుత్త్రుఁ బోరిలోన
నోడివి వానిచేత నుత్తమ గజహయ
రత్నతతులు గొని పరా(కమమున. (సభా.1—247)

ఇక్కడి "భూరిబలుని పుత్త్రు' అనేదానికి 'భూరిబలు సుమిత్రు' అనీ, 'భూరిబల సమేతు' అన్నీ ఉన్న పాఠాంతరాలు సరికావనీ, 'భూరిబలుని పుత్త్రు' అన్నదే సరియైన పాఠమనీ (శీ కృష్ణమూర్తిగారు (వాశారు. దానికి ఆధారంగా,

"తత శ్చర్మణ్వతీ కూలే
జంభక స్యాత్మజం నృపం,
దదర్శ వాసుదేవేన
శేషితం పూర్వ వైరిణా."

అనే సంస్కృత మూలాన్ని చూపుతూ "జంభకుడను వాని కుమారుని సహదేవుడు ఓడించెను. కనుక 'భూరిబలుని పుత్త్రు' అనునదియే సరియగు పాఠము" అన్నారు. ఆ పుత్రుని పేరేదో మూలంలో లేదు. ఓడించబడినవాని పేరు చెప్పకుండా తండ్రిపేరు మాత్రం చెప్పి ఊరుకోవడం సరిగా ఉన్నట్లు కానరాదు. లేదా—అతడు 'అగస్త్య (భాత' వంటి వాడైనా అయివుండాలి. భండార్కరు సంస్థవారి (పతినీ,

వారిచ్చిన పాఠాంతరాలనూ చూస్తేనేగాని మూల పాఠమును నిశ్చయించలేము.

ఇక మూలంలో 'ఓడించబడినవాడు జంభకుని పుత్రు' డని వుంటే అనువాదంలో 'భూరిబలుడనే వాని కుమారుణ్ణి— జంభకు డనేవాణ్ణి ఓడించినట్లు' స్పష్టంగా కానవస్తున్నది. 'భూరిబల సమేతు' అనే పాఠంలో కూడా జంభకుణ్ణి ఓడించి నట్లు అర్థమవుతుంది. కరాలపాటివారి ప్రతిలో 'భూరిబల సమగ్రు' (పుట. 135. పం. 24) అని ఉన్నది. దాన్నిబట్టి కూడా ఇదే అర్థం వస్తుంది. శ్రీ కృష్ణమూర్తిగారు అంగీకరించిన పాఠంలో ఈ అర్థమే వస్తూఉన్నందున అదీ మూలాను గుణంగా లేదని చెప్పవలసి ఉన్నది. ఈ విషయంలో సంస్కృత మూల పాఠాలను ఇంకా పరిశీలించవలసి ఉన్నది.

## 9. మెలఁతగా దీనియందు నిర్మించె నొక్కొ

అఖిల లావణ్య పుంజంబు నబ్జభవుఁడు
మెలఁతగా దీనియందు నిర్మించెనొక్కొ ?
కానినాఁ డిట్టి కాంతి యే కాంతలందు
నేల లేదని సామర్షహృదయు లైరి.
(సభా. 2—160)

ఇక్కడ 'మెలఁతగా దీనియందు నిర్మించెనొక్కొ' అనడం సరి కాదు. శ్రీ కృష్ణమూర్తిగారు తలచినట్లు 'మెలఁతగా దీని ధాత్రి నిర్మించె నొక్కొ?' అనే పాఠమే అంగీకార్యమైనది. కరాలపాటి వారి ప్రతిలో 'మెలుతగా దీని ధాత్రి నిర్మించె నొక్కొ?' అనే పాఠమే (పుట. 147. పం. 4) ఉంది.

## 10. నలేశు

భామ విదర్భ కేగి తన
బంధుజనంబుల వద్ద నుండియుం
గోమలి దేహసౌఖ్యముల
కున్ వెలియై మలినార్ధ వస్త్రముల్
భూమి రజంబు నంగమునఁ
బొల్పగుచుండఁగ నుండె జీవిత
స్వామి నిజేశుఁ జూచు
దివసంబులఁ గోరుచు సువ్రతంబుతోన్.
(అర—2—153)

పయి పద్యంలో నాలుగవ పాదంలోని 'నిజేశు' అనే దానికి బదులుగా 'నలేశు' అనే పాఠం ఉన్నదనీ, ఆ 'నలేశు' పాఠమే సరియైనదనీ, 'నిజేశు' అనే పాఠాన్ని అంగీకరిస్తే తత్సమానార్థకమైన 'జీవితస్వామి' అనే మరొక పదం ఉండడంవల్ల పునరుక్తి దోషం సంభవిస్తుందనీ శ్రీ కృష్ణమూర్తిగారు వ్రాశారు. 'నలుఁడు' సంజ్ఞా విశేష్యం గాని 'నలేశుఁడు' కాదు. అందువల్ల 'నిజేశు' అనే దానికి బదులుగా 'నలేశు' అని మార్చడం కూడా సరసంగా లేదు. కరాలపాటివారి ప్రతిలో (భా. 2. పుట. 32. పం. 7) 'నిజేశు' అనే ఉన్నది. నిజేశపదానికి 'తన భర్త అయిన నలుఁడు' అనీ, జీవితస్వామి పదానికి 'ప్రాణాధికుడు' గాని, అటువంటి మరొకటి అర్థం చెప్పుకుంటే పునరుక్తి దోషం ఉండదు. ఇలాటి పద్ధతి చాలాచోట్ల ఉన్నది. ఈ పద్యంలోనే దమయంతిని తెలియజేసే 'భామ, కోమలి' అనే రెండు పదాలు ఉన్నవి. నలుని విషయంలో ఉండే పునరుక్తి దోషం ఆమె యెడల కూడా ఉన్నదని చెప్పవలసి వస్తుంది. ఆ పదాలకు కూడా వేర్వేరు అర్థాలను చెప్పినగాని ఎలాగూ కుదురదు. ఆవిధంగానే 'నిజేశు' అనే పాఠం విషయమై కూడా అర్థ విశేషాలను స్వీకరించాలి. పాఠాంతరమైనా సరసంగా లేదు. కావున 'నిజేశు' అనేదాన్ని 'నలేశు' గా మార్చడం అనవసరమని నాకు తోస్తున్నది.

ఈ పద్యంలో మరొక విశేషం కూడా ఉన్నది. 'కోమలి... మలినార్థ వస్త్రముల్, భూమి రజంబు నంగమును బొల్పగుచుండగ' అనేచోట 'మలినార్థ వస్త్రముల్' అనే బహువచనానికి బదులు 'మలినార్థ వస్త్రమున్' అనే ఏకవచనాన్నే గ్రహించాలి. పూర్తి వస్త్రం కాకుండా సగం వస్త్రాన్నే దమయంతి ధరించి ఉన్నది. ఈ స్థితిలో బహువచనం సరికాదు. కరాలపాటివారి ప్రతిలో (భా. 2. పుట. 32. పం. 6) 'మలినార్థ వస్త్రమున్' అని ఏకవచనమే ఉన్నది.

## 11. నల్లనైతోతెంచు నల్లగృహము

నీలజీమూతంబు లీల నాకర్షించి
నల్లనైతోతెంచు నల్ల గృహము
గల హిడింబుండను బలితంపు రక్కసు
చెలియలు ....... (ఆది.6—214)

పయిచోట 'అల్ల గృహము' నకు గల 'అట్టి తనువు' అనే పాఠాంతరం విషయంలో జరిగిన వాదోపవాదాలను గూర్చి గాని, తత్సంబంధంగా జరిగిన అఖండయతి చర్చను గురించి గాని వ్రాయ దలచుకోలేదు. శ్రీ కృష మూర్తిగారు చెప్పిన 'అల్ల గృహము' అన్నదే కరాలపాటివారి ప్రతిలో (పుట. 81. పం. 30) ఉన్నదని మాత్రం మనవిచేస్తున్నాను.

శ్రీ కృష మూర్తిగారి వ్యాసాన్ని చదివిన తర్వాత నావద్ద ఉన్న భారత ప్రతిని గమనించి, అప్పైని నాకు తోచిన విషయాన్ని 'భారతి' పాఠకులకు తెలియజేయ దలచియే ఈ వ్యాసం వ్రాయబడినది. శ్రీ కృష్ణమూర్తిగారి కృషిని కూడా దీని మూలంగా అభినందిస్తున్నాను.

భారతం వలెనే మన వాఙ్మయంలో గల ప్రాచీన గ్రంథాలలో పాఠాంతరాలు ఎన్నో ఉన్నవి. వాటి విషయమై వాదోపవాదాలూ, తర్జన భర్జనలూ జరగడం పరిపాటి ఐపోయింది. వాఙ్మయాభిమానులు ప్రయత్నించి తగిన విద్వాంసులను ఒక సంఘంగా కూర్చి వారి మూలంగా పరిశుద్ధంగా గ్రంథాలను పరిష్కరింపజేసి వెలువరించడం ఎంతో అవసరం. భండార్కర్ ఇన్స్టిట్యూటువారు సంస్కృత భారతాన్ని ప్రకటిస్తున్నట్లు ముఖ్యంగా తెలుగు భారతాన్నయినా మొదట ప్రకటించడం అవసరం. అట్టి కృషిలో కరాలపాటి రంగయ్యగారు మున్నగువారు పరిష్కరించిన ప్రాచీన ముద్రణములు కూడా లిఖిత గ్రంథాలతోపాటు ఎంతో ఉపకరించగలవు.

# ఆకాశంలో డేగ

శ్రీ కేశవరావు

గాలిమీద తేలిపోతూ
ఆకాశంలో నిర్లక్ష్యంగా సున్నాలు చుడుతోంది ఒక
డేగ—

వలయాలు వలయాలు వలయాలుగా
క్రింద సముద్రం వొడ్డున నగరం పెడుతున్న ఘోష
వినకుండా—
లోయలు పచ్చిక కంబళ్ళ కింద దాచుకున్న లోతుల్ని
చూడకుండా—
కొండ శిఖరాలకంటే మరింత ఎత్తు ఎగిరి, ఎగిరెగిరి
ఆకాశంలో సున్నాలు చుడుతోంది గాలిమీద తేలిపోతున్న
డేగ—

తాను నిర్మించుకున్న వలయంలోనే తాను
ఎంతసేపూ తిరుగుతున్నానని తెలీదా డేగకి—
తను చుట్టుకున్న ఆ వలయంనుంచి
బయటపడకపోతే ఆ వలయానికే తాను చివరికి
బలి అయిపోవలసి వస్తుందని తెలీదా డేగకి—

గాలిమీద రెక్కల్ని వదిలేసి
వయ్యారంగా కళ్లు సగం మూసేసి
సన్నగా ఈలపాటతో పల్లీలు కొడుతూ
శూన్యంలో వలయాలు చుట్టుకుంటోంది
డేగ—

ఎప్పటికప్పుడు కొత్త వలయాలు గాలికంటే వేగంగా
నిర్మిస్తున్నాననే గర్వంతో
కొంతదూరం టపటపా రెక్కల్ని విలాసంగా కొట్టుకుని
తిరిగి గాలిమీద రెక్కల్ని వదిలేసి

# ఆకాశంలో డేగ

సగం కళ్లుమూసి
ఈల మీద తేలిపోతూ
చుట్టుకున్న వలయంలో
బందీ అయిపోతోంది ఆకాశంలో గిరగిరా తిరుగుతున్న
డేగ—

వలయాలలోంచి వలయాలు చుట్టుకోడం తప్ప
తన మీద ఆకాశం వొంపుతున్న నీలపు
ఆనందాన్ని—
అస్తమిస్తున్న సూర్యుడు తన రెక్కలమీద వదిలేసి
పోయిన బంగారు కిరణాలు చేస్తున్న జీవన
నృత్యాన్ని—

గాలి అలలు అలలుగా కదిలివొచ్చి వెంటతెచ్చిన
అడవుల పరిమళంలా
తనని ముంచెత్తుతోందనే విషయమే
తెలీక—
ఆలోచించక—
గాలిమీద రెక్కల్ని వదిలేసి
వయ్యారంగా కళ్లు సగం మూసేసి
చుట్టుకున్న వలయంలో
ఆకాశపు నీలి రిబ్బను కొసని ముక్కున కరుచుకుని
వలయాలు వలయాలు వలయాలుగా
వలయాలు చుట్టుకుంటోంది ఆకాశంలో ఒక
డేగ—

# రామకథా భాష్యకారులు; భవభూతి మురారిభట్టులు

శ్రీ వెల్దండ ప్రభాకరామాత్య

"భాషాసు రమ్యా గైర్వాణీ, తస్యాంకావ్యం మనోహరమ్
తత్రాపి రూపకం రమ్యం"........

భాషలలో సంస్కృతము రమ్యమనీ, అందును కావ్యము మనోహరమని, రూపకము రమ్యతరమని భావము. గీర్వాణ సాహిత్యమున వాల్మీకి భవభూతులు సర్వకాల సర్వావస్థలలో వెలుగొందు కాంతిపుంజములు. భవభూతి మహావీరచరితము, ఉత్తరరామచరితములు వాల్మీకి కథామూలములు. ప్రాచేతసుని రామాయణమహాకావ్యమును మననముచేసిన భవభూతి, తత్కవి వీరరసమును కరుణరసమును సమానముగా పోషించినాడని తదనుగుణముగా తానీ రెండు నాటకములను వీరరస కరుణరస ప్రధానములుగా రచించి వాల్మీకికే భాష్యము అనదగినవిగా రూపొందించినాడు.

మహావీర చరితము భవభూతి ప్రప్రథమరచన. అందువలన మహావీరచరితము పాండిత్య ప్రకర్ష ప్రదర్శనకు పరాకాష్ఠయైనది. ఇందుగల శ్లోకములసంఖ్య మూడువందల తొంబది. దీనినిజూచియే భట్టమురారి తన 'అనర్ఘరాఘవము' నేవంవిధముగ కూర్చెనను యపప్రథ కూడకలదు. తద్విషయము మున్ముందు వివరింతును. కాని మురారి గ్రంథమునకు భవభూతి మహావీరచరితము సరితూగదు. మహావీరచరితము ప్రాచేతసరామాయణ పూర్వకథామూలమని ముందే వాకొనియుంటిని. రామాయణేతివృత్తముగల నాటకములు సంస్కృత సాహిత్యమున మిక్కుటము. దీనివలన వాల్మీకి ప్రభావ మెంతగలదో తెలియగలదు. నేటికిని రామాయణ కథామూలములగు నాటకములు రచింపబడుచునే యున్నవి. రామకథ నిత్యనూతనముగదా. రామకథ రచించుటవలన వాల్మీకి యశఃకాయుడయ్యెనో, కాక వాల్మీకి లేఖినివలన రామకథకు ప్రచారముకలిగి మనజీవితభాగమైనదో ఇదమిత్థమని తేల్చరాని విషయము. ఏలనన ప్రాచేతసునికి రామునికి యవినాభావ సంబంధముకలదు. ఇందుకు వాల్మీకి శ్రీరాముని సమకాలికుడగుటవలననే. అంతేకాక ఆ స్వామికథను రచించి ఆదికవియై అతని కుమారులచే అతనికి విన్పింపజేసినాడు. ఇప్పుడు భవభూతి మూలకథకుచేసిన మార్పులను కథాగతిని పరికింతము.

## కథాసారము

విశ్వామిత్రుని ఆశ్రమమున యజ్ఞము జరుగనున్నది. అత డయోధ్యకు వెళ్ళి రామలక్ష్మణులను తోడ్కొనివచ్చెను. అచ్చటికే కుశధ్వజుడు సీతా ఊర్మిళలతో వచ్చెను. కుశధ్వజుడు కుశలప్రశ్నల పిదప రామలక్ష్మణులతో పరిచయమును కల్గించుకొని తనప్రసన్నతను వ్యక్తముచేసికొనెను. ఇచ్చటనే రాము డహల్యకు శాపవిమోచనము గావించెను. ధనుర్భంగము చేయవలెనను నియమమే లేకుండిన రామునితో సీతావివాహము జరిగియుండెడిదని కుశధ్వజుడు తలంచెను. ఈ తరుణముననే సీతను తనకిచ్చి వివాహము జరిపింపుమని రావణుడు రాక్షసదూత నొకనిని పంపించెను. కుశధ్వజు డాతని కిదమిత్థమ్మని ప్రత్యుత్తరము చెప్పక మిన్నకుండెను. ఇంతలో రాముడు విశ్వామిత్రుని యజ్ఞవాటిక నపవిత్రముచేయవచ్చిన తాటకను తన నిశిత ఖడ్గధారకు బలిగొనెను. రాక్షసదూతకు తాటకా సంహార వృత్తాంతము బాధకలిగించెను. అతడు తానువచ్చిన రాచకార్యము విషయమై ప్రస్తావించగా కుశధ్వజుడు మొదటివలెనే మిన్నకుండెను. విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు దివ్యాస్త్రములనొసగెను. విశ్వామిత్రుడు రామునివిషయములో కుశధ్వజుడు కనపరచుచున్న ఉత్కంఠమును గమనించి శివధనువును తెప్పించి రామునిచే ధనుర్భంగము గావింపజేసెను. రామలక్ష్మణులకు క్రమక్రమముగా సీతాయూర్మిళలతో వివాహము స్థిరపడుటేకాక మిగిలిన దాశరథు లిర్వురికి మాండవీ శ్రుతకీర్తులతో సంబంధము నిశ్చయమయ్యెను. రాముడు మారీచ సుబాహువులనుకూడ జంపెను. మిథిలనుండి తిరిగివచ్చిన రాక్షసదూత శివధనుర్భంగ వృత్తాంతమును, తాటకా మారీచ సుబాహువులవధ మొదలగు విశేషములను రావణునకు నివేదించెను. ఈ విషయములు రావణునకు చాలచింత కల్గించెను. దానిపై రావణుడు శూర్పణఖతో మంతనముచేసెను. ఇంతలో దండకారణ్యమున మునులను పీడించుచున్న రాక్షసులచర్య నరికట్టమని చెప్పుచు రావణునకు పరశురాముని లేఖకూడ వచ్చెను. ఈ సందర్భమును పురస్కరించుకొని హరచాపఖండనముచేసిన రాముని మదమణగించుటకు పరశురాముని పురికొల్పవలెనని లంకేశ్వరునకు యోచనయును కలిగెను. రాముడు మిథిలలో కన్యాంతఃపురముననుండెను. దశరథాదులుకూడ అచటనే యుండిరి. ఈ సమయముననే రావణుని బోధను

వినిన పరశురాముడు శివధనుర్భంగము గావించిన వీరుని దర్శనార్థమై మిథిలకు వచ్చెను. రాముని దర్శనముతో పరశురాముడు పరమప్రీతుడయ్యెను. కాని యాతడు క్షత్రియకుల నాశనమునకై ప్రతిజ్ఞ పూనినందున రామునిగూడ క్షత్రియ మాత్రునిగా దలంచి తత్కారణమున యాతడుకూడ వధార్హుడని భావించెను. ఈ యమంగళ సంఘటనవలన దశరథ జనకాదుల మనములు వికలములయ్యెను. విశ్వామిత్ర వసిష్ఠాదులు పరశురాముని కోపోపశయనము గావించి స్తోత్రములు చేసినను పరశురాముడు యథాపూర్వముగ నుండుటేగాక వారిని మీరు మాన్యులు, కాని నేను ప్రతిజ్ఞాపాలనమును గావింపవలెనని మారుపల్కెను. జనకు డస్త్రగ్రహణము చేసినను, శతానందుడు శాపమిచ్చినను పరశురాముడు దృఢతరముగ నుండెను. పరశురాముని క్రోధాగ్నిని చూచిన దశరథుడు వెఱగంది తా నస్త్రమును ధరింప నుద్యుక్తుడయ్యెను. ఇంతలో రాముడంతఃపురము నుండివచ్చి పరశురాముని తగువిధమున శాంతపరచి యాతనిని నిర్వీర్యుని చేసెను. పరశురాముడు తనశక్తిని రామునికి సమర్పించి శాంతచిత్తుడై జ్ఞానియై తనసర్వస్వమైన పరశువును కోదండమును రాముని కైవసముచేసి తపమాచరించుటకు మహేంద్రగిరి కరిగెను. పరశురాముని పరాజయ వృత్తాంతము లంకేశ్వరునకు తీరని బాధ కలిగించెను. రాముని దమనమునకు లంకేశ్వరుడు తనమంత్రులతో మంతనము చేయుచుండెను. రాముని అభ్యుదయము వారికి భయముప్పతిల జేయుచుండెను. ఆలోచనానంతరము శూర్పణఖను మంథరా రూపమున నయోధ్యకు పంపనిశ్చయింపబడెను. కైకేయి నిజమైనదాసి మంథర మిథిలలో నుండెను. ఈ కుహనామంథర అయోధ్యకేగి కైకేయిని దశరథుడు తనకు మున్నిచ్చిన రెండువరములను కోరునట్లు చేసెను. తత్ఫలితముగ సీతారామలక్ష్మణు లడవికి వెళ్ళిరి. భరతు డీవృత్తాంతమును విని దండకాటవికేగి శ్రీరంగ పుర విహారుడగు కోదండరామావతారు నెంత ప్రార్థించియుపడినను యాతని వేడికోలును మన్నింపక తనస్వర్ణపాదుకలనిచ్చి పంపివేసెను. రాముడు దండకారణ్యమున ఖరదూషణాది రక్కసుల నుక్కడగించెను. రావణు డమర్షమున సీతను హరించెను. రామలక్ష్మణులు సీతాన్వేషణమున యరణ్యావాటిని సంచరించుచు జటాయువును దర్శించి యాతనివలన సీతావృత్తాంతమును విని కిష్కింధ ననుసరించి వెళ్ళుచు విరాధ వధ గావించిరి. కిష్కింధకు వెళ్ళి సుగ్రీవునితో మైత్రిసాధించిరి. రావణప్రేరితుడై వచ్చిన వాలిని సంహరించిరి. వాలి తన యవసాన తరుణమున రామసుగ్రీవుల సఖ్యమును దృఢతరముజేయుటయే కాక కిష్కింధకే వచ్చిన విభీషణునితో శ్రీరామునికి సఖ్యము నెరపెను. వాలివధతో మాల్యవంతుని (రావణునిమంత్రి) చింత మిక్కుటమయ్యెను. అతడు రాముని లంకకు రానీయకుండ చేయవలెనని ఏదియే నుపాయము నాలోచించుచుండెను. రాముడజేయు డనుభావము సూటిగ నాతని మనమున నాటుకొనియెను. రాముడు సముద్రముపై సేతుబంధనముచేసి లంకను ప్రవేశించెను. రామరావణ సైన్యములమధ్య యుద్ధ మారంభమయ్యెను. రాక్షసవీరు లొక రొక్కరు మరణించిరి. ఘోర సంగ్రామము జరిగినమీదట మేఘనాథుడు ప్రయోగించిన శక్తి శరీరములో జొచ్చినందున లక్ష్మణుడు మూర్ఛిల్లెను. జాంబవ దాదుల మంతనము ననుసరించి హనుమంతుడు సంజీవిని తెచ్చుటకు పంపగా యాతడు శరవేగమున వెళ్ళి యట సంజీవికరణిని గానక తత్పర్వతమునే పెకలించుకొని లంకకు దెచ్చెను. ఆ పర్వతమందలి యోషధుల గాలి సోకగానే సౌమిత్రి సేదదీరి స్వస్థుడై మేఘనాథుని బలిగొనియెను. శ్రీరాముడు రావణుని సంహరించి సీతను రక్షించెను. రావణవధానంతరము శ్రీరాముడు తాను మొదటచేసిన ప్రతిజ్ఞమేరకు విభీషణునకు పట్టాభిషేకము గావించెను. విభీషణుడు పట్టాభిషిక్తుడై బందీలైయున్న దేవతలను మునులను చెరసాలనుండి విడిపించెను. లంకాకాండ పూర్తికాగానే అగ్నిచే పరిశుద్ధ చరిత్రగా నిర్ణయింపబడిన సీతాసమేతుడై రాము డయోధ్యకు వెళ్ళి పట్టాభిషిక్తుడయ్యెను.

## మాతృకకు మార్పులు

వాల్మీకి మూలమునకు భవభూతి చేసినమార్పులు సమంజసమా? యని తోచును. అతడు వ్రాయుచున్నది మహావీరచరితము. శ్రీరాముని కోదండరామునిగను వీరునిగను చిత్రింపవలెను. అందులకే (భవభూతికి) యీ తాపత్రయము. కావుననే పరశురాముని వృత్తాంతము రెండు మూడంకములలో కన్పించును. వాల్మీకి చిటికెలో ముగించిన ఈ వృత్తాంతము నీతడు పొడిగించుటలోగల ఆంతర్య మేమైయుండును. ఒకప్పుడు శ్రీమహావిష్ణువు ధరించు సుదర్శనమునకు తాను లేకున్న యీసర్వ సాక్షి యశక్తుడను తలంపు గల్గినది. దానిని యా దేవదేవుడు గ్రహించి సుదర్శనము నుద్దేశించి 'నీవు మహాబలసంపన్నుడవైన క్షత్రియునిగ జన్మింపుము. నేను నాయందున్న ఒక అంశతో మాత్రమే జన్మింతును. అప్పుడు నాశక్తిని పరికింతువుగాక' యని చెప్పెను. సుదర్శనము కార్తవీర్యార్జును డయ్యెను. భగవంతుని అంశ పరశురాముడై జన్మించెను. పరశురాముడు తనయవక్రపరాక్రమముతో కార్తవీర్యార్జునుని సంహరించెను. రావణ సంహారమునకు సర్వలక్షణ సంపన్నుడైన నరుడు కావలెను. శ్రీరాముడు పరశురామునియందున్న యంశను గ్రహించి పరిపూర్ణుడయ్యెను. పరశురామునికి తా నవతార మను స్మృతి లేదు. అయినను అంతరాత్మలో అతనికి శ్రీరాముని చూచిన వెన్వెంటనే ఆతడు పరమాత్మ యను భావము స్ఫురించినది. మూలమున విభీషణుడు కిష్కింధకు రాలేదు. వాలి రావణప్రేరితుడై శ్రీరామునితో యుద్ధముచేయ సమకట్టలేదు. మాల్యవంతుడు యజ్ఞవాటికకు రాలేదు. సీతను రావణున కిచ్చి వివాహముచేయుమని అడుగలేదు. శూర్పణఖ కుహనామంథర

రూపమున వచ్చి కైకేయిని వరము అడుగమని ప్రోద్బలము చేయలేదు. వాలి విభీషణ శ్రీరాములకు స్నేహము కలుగునట్లు చేయలేదు. ఇన్నిమార్పులను చేసినను ఔచిత్యభంగమయి నట్లు కన్పింపదు.

## అనర్ఘరాఘవమునకు పోలికలు

భవభూతి, మురారిభట్టుల నాటకములకు వాల్మీకి రామాయణమందలి పూర్వకథయే యితివృత్తము. రెండును ఏడంకముల నాటకములే. సర్ ఆర్థర్ బెరిడల్ కీతు భవభూతి మహావీరచరితము వ్రాయగా భట్టమురారి అదే ఇతివృత్తముతో ఇంతపెద్ద నాటకము వ్రాయుట చర్వితచర్వణమని మురారిని తూలనాడెను. కాని ఒక్కవిషయమునుమాత్ర మత డంగీకరించెను. ఇది పాండిత్య ప్రకర్షకు నికషోపలమని; ఆంగ్లభాషలోని కనువదించుట దుస్తరమని; మురారి ముందు భవభూతి నిలువకల్గునా? అనర్ఘమునకూడ మాల్యవంతుడు కన్పించును. అనర్ఘమున కూడ వాలి దశకంఠరునితో చెలిమిచేసినట్లు కలదు. మహావీర చరితమున వాలి రావణప్రేరితుడై రామునితో యుద్ధము చేయుటకు వచ్చినట్లును కలదు. మహావీరచరితమున శూర్పణఖ కుహనామంథరగ తన విధి నిర్వహించినది. ఇందు జాంబవంతుని ప్రేరణచే శ్రమణ యను కిరాతస్త్రీ మూర్ఛిల్లిన మంథరా దేహమును జొచ్చి కైకేయిని వరము అడుగజేసినది. భవభూతి మురారు లిర్వురును కైకేయిపాత్రపోషణమునకు తాపత్రయ పడిరి. చతుర్థాంకమున మురారికూడ పరశురాముని వృత్తాంత మును జొప్పించెను కాని మహావీరచరితమున నున్నంత దీర్ఘముగ లేదు. కాని యీ కవులిరువురు జామదగ్న్యుని వృత్తాంతమునకు ప్రాముఖ్యమిచ్చిరనుటలో సందియములేదు. మురారి తననాటకములో 549 శ్లోకముల జొప్పింపగా భవభూతితననాటకమున 390 శ్లోకముల వ్రాసినాడు. కైకేయి శాంతస్వభావు రాలని కేవలము మంథరావేషముననున్న శూర్పణఖ ప్రభావమున యామెమనస్సు రాక్షసత్వము జెందినదని నిరూపించుటకు భవభూతి ఈమార్పు జేసెను. ఇట్టిదే మురారికూడ మంథరా శరీరములో శ్రమణను జొప్పించి నాటకమును రంజింపజేసెను. ఇట్టిది మరి వాల్మీకి చేయలేకపోయెను. ఇంకొకమార్పు విభీషణుని కిష్కింధకు రప్పించుట. మురారిలో వాలిసహాయార్థము ఖర దూషణాదులను రావణుడు నియోగించెననునది పెద్దమార్పే. రామాయణము శరణాగతవేదము. ఈ నాటకమున సీతా శరణాగతి, అహల్యాశరణాగతి, పరశురామ శరణాగతి, వాలి శరణాగతి, విభీషణ శరణాగతి, కడపట రావణశరణాగతి చక్కగా నిరూపితములైనవి.

పూర్వము నాటకములను ప్రదర్శించుట కనువైన రంగస్థలము లుండెడివి కావని తెలియుచున్నది. భవభూతి మూడు నాటకములును మహాకాళనాథుని (ఉజ్జయిని)సన్నిధానమున యాత్రార్థులై వచ్చిన సభాసదుల సమావేశముననే ప్రదర్శింప బడినవి. భవభూతి తన మూడు నాటకములలో తా నితఃపూర్వము వాడిన పెక్కుశ్లోకములను, శ్లోకపాదములను చేర్చినాడు. వీటిపై అతనికి మమకారము మెండు అని ఇందువలన తెలియును. మహావీరచరితము భవభూతి ప్రప్రథమ రచన యగుటవలన శైలిలో ఔద్ధత్యము కన్పించును. మహావీర చరితము నాటకముగా రాణించలేదని పెక్కండ్రభిప్రాయ పడినారు. ప్రేక్షకులకు శాకుంతలము, మచ్ఛకటికము వలసినంత వినోదము నిచ్చినవిగాని వీరరసప్రధానమగు మహావీరచరితము నచ్చలేదు. మొదటినాటకములో మిగిలిన యితని నాటక ద్వయముకన్న శ్లోకములసంఖ్య ఎక్కువ. మూడంకములవరకు పరశురాముని దర్శనము. శ్రీరాముని చరితము భారతదేశమున ప్రజలజీవితములో చక్కగా జీర్ణించుకొనిపోయినది. మనవారు నాడును నేడును వీరపూజ చేయుచునేయున్నారు. అప్పుడే వేదశాస్త్రాధ్యయనము కావించి పాండిత్య ప్రకర్షతో విరాజిల్లుచున్న భవభూతికి మహావీర చరితము తగిన క్రీడారంగమైనది. మహావీర చరితమున తాను 'వశ్యవాచః' అని చెప్పుకున్నాడు. అందులకు ప్రబలనిదర్శనము 77 శార్దూలవిక్రీడితములు, 29 స్రగ్ధరావృత్తములు. నిరర్గళమైన ధార. ఈ నాటకాంతమున వ్రాసిన 'క్ష్మాపాలః' అను భరతవాక్యమున, రాజులు విలంబముచేయక భూభార సంరక్షణ చేయవలెనని, మేఘుడు సకాలమున వర్షింపవలెనని రాష్ట్రములు సస్యసంపన్నతతో కళకళలాడవలెనని, కవులు ప్రసాదగుణ సమన్వితమగు రచనలను చేయవలెనని, విద్వజ్జనులు ఇతరుల కృతులను జీర్ణించుకొని ప్రమోదమందవలెనని వాకొనినాడు. కాని ప్రసాదగుణము మహావీర చరితములో నున్నదనియా? లేక పాండిత్య ప్రకర్షతో ఆమూలాగ్రము మహావీరచరితమును రచించిన పిదప భవభూతికి కల్గిన గుణపాఠమా యని సంశయము కలుగుచున్నది. మాలతీమాధవము, ఉత్తరరామచరితములు సరళములే యని చెప్పనొప్పు. కాని 'ప్రౌఢత్వ ముదారతా చ వచసాం' మాత్రమెక్కడ చూచి నను కన్పట్టుచున్నది. ఈ ప్రౌఢత్వ ముద్ర యుండుటవలననే కాబోలు విశ్వవిద్యాలయములు, పండితపరిషత్తు లీనాటకమును నిరాదరణచేసినవి. ఈ నాటకమునకు పెక్కువాఖ్యానము లున్నట్లు కన్పట్టవు. వీరరాఘవుని వ్యాఖ్య యొకటి, జీవానందవిద్యాసాగరకృత టీక యొకటియును కలవు. ప్రకృతము ఆచార్య రామచంద్రమిశ్రులు (వ్యాకరణవేదాంత సాహిత్యాచార్యులు) వ్రాసిన ప్రకాశ సంస్కృత హిందీటీక సుబోధకముగా ఉన్నది. దీనిని వారణాసి ప్రచురణ సంస్థ చౌఖంబా విద్యా భవనమువారు నాగరలిపిలో ప్రకటించి నారు. ఈనాటకమున గల శ్లోకములసంఖ్య 390. ఇతని మూడు నాటకములోని శ్లోకసంఖ్యను వృత్తరీతుల వివరములు గల పట్టికను పాఠకుల రేఫదెవ్వుకొర కింద బొందుపరచు చున్నాను.

| క్రమ సంఖ్య | వృత్తముల పేర్లు | మహా వీర | మాలతి | ఉత్తర చరిత |
|---|---|---|---|---|
| 1 | అనుష్టుప్ | 131 | 15 | 89 |
| 2 | అపరవక్త్ర | — | 1 | — |
| 3 | ఆర్యా | 2 | 11 | 2 |
| 4 | ఇంద్రవజ్ర | 9 | 7 | 6 |
| 5 | ఉపజాతి | 12 | 3 | 7 |
| 6 | ఉపేంద్రవజ్ర | — | 3 | — |
| 7 | ఔపచ్ఛందసిక | — | 1 | 1 |
| 8 | దండక | — | 1 | — |
| 9 | ద్రుతవిలంబిత | — | 4 | — |
| 10 | నర్దటక | — | 2 | — |
| 11 | పుష్పితాగ్ర | 4 | 5 | 5 |
| 12 | పృథ్వీ | 4 | 4 | 3 |
| 13 | ప్రహర్షిణి | 9 | 7 | 7 |
| 14 | మంజుభాషిణి | — | 7 | 5 |
| 15 | మందాక్రాంత | 16 | 15 | 13 |
| 16 | మాలిని | 13 | 21 | 16 |
| 17 | రథోద్ధత | 1 | 3 | 3 |
| 18 | వసంత తిలకము | 36 | 49 | 26 |
| 19 | వంశస్థ | 2 | — | 1 |
| 20 | వియోగిని | — | 1 | — |
| 21 | శార్దూలవిక్రీడితము | 77 | 32 | 25 |
| 22 | శాలిని | 3 | 2 | 5 |
| 23 | శిఖరిణి | 30 | 22 | 30 |
| 24 | స్రగ్ధరా | 29 | 6 | — |
| 25 | హరిణి | 5 | 12 | 9 |
| వృత్తరీతులు 25; శ్లోకములసంఖ్య | | 390 | 234 | 255; |

మూడు నాటకములలో మొత్తము శ్లోకముల సంఖ్య=879.

భవభూతి మహావీర చరితమున పరశురాముని పాత్ర నత్యద్భుతముగా పోషించినాడు. అతడు రాముని గర్వాపహరణముచేయ వచ్చినను ఎందులకో రాముడు భగవంతుడనెడి భావము స్ఫురించినది.

రామరామ నయనాభిరామ
తామాశయస్య సదృశీం సముద్వహన్
అప్రతర్క్యగుణరామణీయకః
సర్వథైవ హృదయంగ మోఽసియే. II—37

అభినవవాగనుశాసన మల్లాది సూర్యనారాయణశాస్త్రి చరణులు భవభూతి విషయమున ప్రమాణము. వారు భవభూతి నాటకముల మూడింటిని అనువదించుటేకాక విమర్శనలనుకూడ వెలయించిరి. పై శ్లోకమునకు వారి యనువాద మిందుదహరింతును.

గీ. రామ రఘురామ! నయనాభిరామ మగుచు
దలఁపునకు మించు నందచందంబు లెలయు
వర్ణనకు మించు సద్గుణవర్గ మొప్ప
నెల్లవిధముల నామది కెక్కితీవు.

రామా! నయనాభిరాముడవైన నీవు నీగుణములచే, నీసుందరతరాకృతిచేత నన్నాకర్షించి నాహృదయములో నిమిడిపోయినావు. రాముని గెలుచుటకు వచ్చి ప్రకాశముగ నతనితో పరశురాము డిట్లనగల్గునా? ఇదే భవభూతిలోని చమత్కృతి. ఎదుటివారెవరైనను వారికి తమకు గల బంధుభావము తెలియకపోయినను హృదయాంతరాళమున నున్న భావమును ప్రకటింపజేయును. ఇట్టిభావమేకదా ఉత్తరామచరితమున పరిపక్వమై పరాకాష్ఠకు వెళ్ళినది. లవకుశులు శ్రీరాముని దర్శించినపుడు 'తాతపాద' అని పిలిచిరి. తండ్రీ అని పిలిచిరి కావున శ్రీరాముడు పుత్రవాత్సల్య భావమున వారిని కవుంగిలించి నాదరించెను. ఇట్లు తాతపాద యని పిలుచుటకు చంద్రకేతువు కారణము. అతడు వీరిరువురి ప్రియవయస్యుడు. అతనికి తండ్రియైనప్పుడు తమకును తండ్రియేనట. కుశలవులకు వాల్మీకి రామాయణ కథానాయకుని దర్శనము లభించెనను సంప్రీతి, కోసల సార్వభౌమునకు సీతరూపును దలపింపజేయుచున్నందువలన వీ రాత్మజులై యుండురేమోనను భావము కలిగినవి. ఇదియంతర భావము. ఇతమిత్థమ్మని వారికి పరస్పరము తెలియదు. రాముని పరశురాముడు జగత్పుణ్యరాశి యని సంబోధించినాడు. భట్టమురారికూడ పరశురాముని చక్కగ చిత్రించినాడు. రాముని చూడగనే అతనికి కల్గినభావము:—

సవిధముపసరన్ సమూలకాషం
కషితనృపాన్వయమద్య మాం ధినోషి
హరిమివ కరికుంభకూటకోటి
ప్రకట కఠోర నఖాంకురం కురంగః

దీనికి సత్యవోలు కామేశ్వర కవికృత అనువాదపద్యము.

భూపకులముల నామూలముగ వధించి
మించు నను జేరి వేడ్క గావించెదౌర
కుంభికుంభాళి జీల్చిన గోళ్లసంగు
సింగమును జేరవచ్చు కురంగమట్లు.

భట్టమురారి చిత్రించిన పరశురామునిలో కొంత ఉదాత్తత కలదు. అంతేగాక భవభూతి రాముని జూచి జాలిపడినట్లు కనిపించును. పరశురాముడు రాముని జూచి కంటనీరుపెట్టు

కున్నాడు. ఎందుకు, కంటతడిపెట్టుచున్నావన పరశురాము డిట్లనెను:—

సంభూయ్యైవ సుఖాని చేతసి పరం భూమాన మాతన్వతే
యత్రాలోక పథావతారిణి రతిం ప్రస్తౌతి నేత్రోత్సవః
సత్వం నూతన ఏవ కంకణధరః శ్రీమాన్ప్రియశ్చేతసో
హంతవ్యః పరిభూతవాన్గురు మితి ప్రాగేవ దూయామహే. II 45.

దీనికి మల్లాదివారి అనువాద ముదహరింతును:—

మ. కనువిందయ్యెను నీదు మేను,
మది లగ్నంబయ్యె నీరూపు,
మొన్ననె పెండ్లైనది
చేతికంకణమునైనన్ విప్పలేదంచు
జాలిని గొన్నాడను,
గాని మాగురుని విలేఖిదించు దోషంబు
నీ తను విచ్ఛిత్తికి నర్హమైన దను చింతం
గంట నీర్వెట్టితిన్.

కైకేయి పాత్రనుకూడ చక్కగ పోషించినాడు. రాముడు రావణవధానంతరము సాకేతమునకు తిరిగివచ్చినప్పుడు కైకేయి ఖిన్నవదనయ్యేయుండును. ఆమెను అరుంధతి పల్కరించుచున్నది.

అరుం : (కైకేయిని జూచి) కోడలా! అట్లున్నావేమి?

కైకేయి : అమ్మా మంథరచే వరము లడిగించి కుమారుల నడవికి బంపించినానని లోకాపవాదముపాలై క్రుంగుచున్నాను. ఆ పిల్లలమొగ మెట్లు చూతును.

అరుం : అమ్మాయీ! నీవు తప్పుచేసినట్లు వచ్చిన నింద సరిగాదు. ఆ విషయము మాగురువుగారవుడే యోగ దృష్టిని దెలిసికొనియున్నారు.

అందఱు : ఎట్లు, ఎట్లు?

అరుం : మాల్యవంతుని దురాలోచనమునుబట్టి శూర్పణఖ మంథరారూపము దాల్చి యట్లుచేసెనని—

కైకేయి నిజముగా మంథరమాట విని శ్రీరాముని అరణ్యములకు పంపించెననుట జగమెఱిగినసత్యము. కాని భవభూతి మురారులు కైకేయి నిజముగ అట్లు చేయలేదు; నిమిత్తమాత్రురాలు అని వాకొనినారు. సామాన్యముగ భవభూతికి కాళిదాసునకు తారతమ్యము నెరపుదురు. కాళిదాసు కవిత ఒడుదుడుకులు లేనిది. భవభూతి సందర్భోచితముగ సత్యున్నత స్థితికి వెళ్ళగల సమర్థుడు, ప్రతిభావంతుడు. ఈ విషయ మీతని నాటకములలో గోచరించును. భవభూతి ప్రవేశ పెట్టిన నాయకు లత్యుత్తమ నైతిక ధర్మాచరణ పరాయణులు. భవభూతి విదూషకుని పాత్ర లేకుండ తననాటకములను వ్రాసి మెప్పువడసినాడు. భవభూతికి మానవస్వభావ విరూపణము సహజముగా ప్రాప్తించిన ప్రతిభ. ఈ విషయమున కాళిదాసున కగ్రతాంబూలము రాదు. ప్రకృతివర్ణనలో, మానవస్వభావ వర్ణనలో నగ్రగణ్యుడు. నా మతమున కాళిదాసు ప్రతిభయంతయు మేఘసందేశమున నిక్షిప్తమైయున్నది. అందుకే కాళిదాసుని ప్రశంసించు వారు భవభూతిని మేల్మెలన లేరు. దానికి కారణమును భవభూతి తన మాలతీమాధవమున నిర్భీతిగ బేర్కొనినాడు. మహావీరచరితము చక్కని నాటకము. సాహిత్యపిపాసువు లీ నాటకమును జదివి యానందింతురుగాక.

సమానధర్మేణ సమర్పితమ్.

# మాలపల్లి

## (రెండవ భాగం)

### శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ

### నాటకీకరణం : శ్రీ గోపీచంద్

[సమయము : ఉదయము ఎనిమిది గంటలకు.]

అప్పు : త్వరగా బువ్వకట్టు అత్తా.

మాలక్ష్మి : ఎందుకయ్యా అంత తొందర.

అప్పు : పొలానికి గొడ్లను తోలి వచ్చా. మళ్లవెయ్యకపోతే ఆసాముల చేలల్లో పడతయి.

మాలక్ష్మి : ఇదిగో అయిపోయింది.

* * * *

(బజార్లో రామదాసు, సంగదాసుని కలుస్తాడు.)

రామ : ఎక్కడికి సంగదాసూ. బుచ్చయ్యగా రూళ్లో ఉన్నారా ?

సంగ : నిన్న నీకోసం వచ్చారు. నీ వింట్లో లేవు. ఈవేళ మళ్లీ పోదామంటే నీవింట్లో ఉన్నావేమో చూతామని వస్తున్నా.

రామ : నేనూ వారి దర్శనం కోసమే వస్తున్నా, వారు గొప్ప వేత్తలు, యెరుగుదువా యిదివరకు వారి సంగతి.

సంగ : ఇదివరకు వారి పేరు విన్నా. మహాజ్ఞానే అను కొంటాను. నిన్న భక్తియోగం వారికి చదవమని యిచ్చాను. అభిప్రాయ మింకా చెప్పలేదు.

రామ : అంటే జ్ఞాపకం వచ్చింది. రాసమండలమనే పటం అద్భుతంగా ఉన్నది.

సంగ : నాదగ్గర యింకొక పటం కూడ ఉన్నది. దానివి మననంచేస్తే ప్రేమ, భక్తి కుదురుతుంది. దానివంక చూస్తే పరుగెత్తే మనసు కూడా కట్టుబడుతుంది.

రామ : నాకు అనుభవంలోకి వచ్చింది, నీవు కృష్ణభక్తుడివి గావాలె.

సంగ : నేనా, నేను గోపికను.

రామ : గోపికవా ? సంగదాసూ, గోపిక వేమిటిరా ?

సంగ : నేను కానేమో అని పిలుస్తున్నావా ? సంగదాసునే, గోపికను గూడాసూ.

రామ : (యోచించి) గోపికలది ప్రేమభక్తి కదా.

సంగ : నాదీ అదే.

రామ : వాండ్లది స్త్రీల ప్రేమ.

సంగ : ప్రేమకు ఆడప్రేమా, మగప్రేమా అని విభాగ మున్నదా ?

రామ : వాండ్లు శ్రీకృష్ణుని నాయకునిగా కామించారు.

సంగ : నేనూ అట్లాగే ప్రేమిస్తాను. అయ్యగారున్న యిల్లిదే.

రామ : ఓ్. నాకు విషయం పూర్తిగా అవగాహనకాలేదు. మననం చేస్తేనేగాని మనస్సు కెక్కదు. విషయం మట్టుకు దొడ్డది.

## 2

రామ : (ఉత్తరీయం నడుముకు చుట్టుకొని) అయ్యా బుచ్చయ్యగారూ, దాసుడిని — [అని సాష్టాంగ నమస్కారం చేయును.]

బుచ్చ : అయ్యో. నాకు సాష్టాంగ నమస్కారం చేస్తున్నావా. లే, రామదాసూ.

రామ : (లేచి నిలబడి) ఇది బహు సుదినం. తమ దర్శనం చేయవలెనని యెంతకాలమునుంచో అనుకొంటున్నాను. మా అయ్యగారు తమరిని గురించి అనేకమాట్లు ప్రస్తావించారు. తమ మాట బహు చెప్పారు.

బుచ్చ : సీతయ్యగారు నాకు జ్యేష్ఠసోదరులు. వారి గురువు గారి దగ్గర నేనూ కొన్ని విశేషాలా గ్రహించా.

రామ : తమరు అన్నీ గ్రహించారు.

బుచ్చ : దూరంగా నిలుచున్నారేమి ? యిట్లా వచ్చి వసారాలో కూర్చోండి.

రామ : తమరు అచలపరిపూర్ణులు. తమకు యే భేదమూ లేదు. మాబోటి అజ్ఞానులను లోకవ్యవహార మొకటి బాధిస్తున్నదిగా. దానిని అనుసరించి పోకపోతే వీలులేదు.

బుచ్చ : నీవన్నీ తెలిసినవాడవు. నే చెప్పవలసినది యేమీలేదు. నీ అభిప్రాయంతో నీ కొడుకు ఏకీభవిస్తాడా ? నీ 'జ్ఞానం' సంగతి దేవు డెరుగు, యీ భేదాలు ముందు కొట్టివేయమంటాడు.

రామ : ఇంతకూ నే నొక్కసంగతి మనవిచేస్తా. కర్రె వంకలు పోయి తీరుస్తుంది. వాడిలో ఎన్ని లోపాలుంటే నేమి గనుక ? తమరు అనుగ్రహిస్తే అన్నీ చక్కబడుతవి.

బుచ్చ : దానిదేముంది ? రామానాయుడుగారు యిప్పుడు వస్తున్నారని కబురు వచ్చింది. వారు చాలా యోగ్యు లని వింటాను.

రామ : వారు నిశితయోగులు. మావూరి దుర్మార్గానికి వారు యీవూళ్లో ఉండబట్టే వర్షాలు కురుస్తున్నవి. మా పిల్లవాడు వారి దగ్గరనే ఉంటున్నాడు. బుద్ధి గరి పింది వారే.

బుచ్చ : అందరూ మీ పిల్లవాడే రామానాయుడుగారిని చెడ గొట్టుతున్నాడంటుంటే నీవు వారు నేర్పా రంటు న్నావా ?

రామ : యెవరు యెవరికి నేర్పినా నడవడిలో తప్పులేదు. ఒకరికి అపకారంచేసి యెరుగరు.

బుచ్చ : ఆమాట అందరూ వొప్పుకుంటారు గాని కొన్ని చర్యలు లోకానికి విరుద్ధ మంటారు.

రామ : ఆసంగతి నేను చెప్పేమాత్రపువాడిని కాను. తమరు దయచేశారు. తమరు అనుగ్రహిస్తే అన్ని వంకలూ తీరుతవి.

బుచ్చ : యథార్థం చెప్పుతాను. మీ పిల్లవాడు గొప్ప మేధావి. వారి ఉభయులతో గలిసి మాట్లాడుదామని నాకోరిక.

రామ : మా పిల్లవాడి విషయంలో తమరు గొప్పగా మాట్లా డడం వాడికి క్షేమంకాదు. అవన్నీ తమ ఆశీర్వచనా లుగా భావిస్తాను.

బుచ్చ : నే చెప్పినదాంట్లో అతిశయోక్తి ఏమీ లేదు. నాయుడు గారిని కూడా చూడవలెనని కుతూహలంగా ఉన్నది.

రామ : అదుగో వారే దయచేస్తున్నారు.

[కిర్రు చెప్పులతో రామానాయుడు ప్రవేశిస్తాడు]

రామా : రామదాసు కూడా వచ్చాడే.

రామ : అయ్యవారి దర్శనం కోసమే వచ్చాను. ఎన్నాళ్లనుంచో ఉన్న కోరిక ఇప్పుడు ఫలించింది.

రామా : నమస్కారమండీ.

బుచ్చ : కూర్చోండి. నల్లబోతువారి కుటుంబం అంటే మన జిల్లాలోకల్లా ఘరానా పొందింది. పాల సముద్రంలో అమృతం పుట్టినట్టు నాయుడుగారు జన్మించారు.

రామా : మా కుటుంబానికి కొంత గౌరవం ఉన్నదేమోగాని, నేను అమృతమువంటి వాడను గాను.

రామ : అయ్యగారికి నాయుడుగారు కొత్త. తమరు చెప్పిన సంగతులన్నీ నిజమే అయినా అవి వినడానికి నాయుడు గారికి ఇష్టంగా ఉండదు.

బుచ్చ : సంగదాసూ, ఏమున్నా సంగతులు చెప్పవోయ్.

సంగ : పెద్దలు తమరు సెలవియ్యండి.

రామ : అయ్యా, ప్రపంచంలో మానవుడు సత్కర్మచేస్తూ ఉండవలసిందేనా ?

బుచ్చ : వ్యావహారికంగా విచారిస్తే దుష్కర్మ చేయడం కంటే సత్కర్మ చేయడం మెరుగు. పారమార్థికంగా విచా రిస్తే రెండూ బంధహేతువులే.

రామా : నిష్కామకర్మ అయితేనో ?

బుచ్చ : నిష్కామకర్మ బంధహేతువు కానిమాటే. అది చేస్తూ ఉండవచ్చు.

సంగ : పారమార్థికంగా విచారిస్తే సత్రయాగాలు చేసిన ఋషులూ, రాళ్లుగొట్టిన రాక్షసులూ ఒక అంతస్తు వారేనా ?

బుచ్చ : నీవు చెప్పిన ప్రకారం ఉభయులవి నిష్కామకర్మ లయితే ఆయా కార్యములవల్ల పారమార్థిక విషయ మున కలుగగల ప్రతిబంధకములు వారికి లేవనే చెప్పుతాను.

సంగ : మంచి, చెడూ కార్యములవల్ల లోకమునకు కలిగే సాధక బాధకము లటుండనిచ్చి కర్మ ఫలములు నిష్కాము లను బాధించవా ?

బుచ్చ : ప్రారబ్ధం భోగంవల్ల నశిస్తుంది. సంచితము ముక్తి వచ్చినప్పుడు విడిపోతుంది. నిష్కామ కవచంవల్ల యిప్పుడు చేసే కార్యముల ఫలం అంటదు.

సంగ : పారమార్థికమునకూ మంచి చెడూ పనులకూ సంబంధంలేదా ?

బుచ్చ : ఇంతవరకుంటుంది. ఫలాపేక్షతో గూడినదైతే రెండూ సంచితమును వృద్ధిచేసి ఆ సంచితము నశించక పోతే ప్రారబ్ధంగా మారుతూ జనన మరణములకు హేతువవుతుంది. పరమార్థమునకు యివి రెండూ చాలావరకు సమానాంతరములనే చెప్పవచ్చు.

సంగ : పరమార్థమునకు పాప పుణ్యములు చాలావరకు సమా నాంతరములని శలవిచ్చారు. నాయందు దనుగ్రహముంచి రెంటికి గల తారతమ్యమును తెలుప వేడుతున్నాను.

బుచ్చ : పుణ్యకర్ములు పరలోకములో సౌఖ్యములను బొంది భుక్తశేషమును మర్త్యలోకములో అనుభవిస్తారు. సత్య లోకమును పొందినవారికి సద్యోముక్తి లేకున్నా బ్రహ్మ కల్పము లోపుగా పునరావృత్తి కలుగదు. ఇంద్రత్వ బ్రహ్మత్వముల సహితమూ పుణ్యవిశేషంచేత పొంద వచ్చును. పాపకర్ములు నరకంలో పాప ఫలము ననుభ వించి శేషమును మర్త్యలోకంలో ననుభవిస్తారు. పుణ్య కర్ములు భోగములకు కామించి అనుభవించి రోసి వాటిని నశ్వరములని, తుచ్ఛములని తెలుసుకొని, వాటిని అను భవంచేతనో, తపోమహిమనో సంచితమును నశింపజేసి బొగిలినట్టి గాని, లేక వేగినట్టిగాని గింజలు మొలవ నట్లు పునరావృత్తిరహితమైన పరమపదమును పొందు తారు. పాపకర్ములు వాల్మీకాదులవలె మహాపురుష

ప్రసాదముచే అరుదుగా సన్మార్గమును బొందినా సాధారణంగా పాపులు నిష్కాములు కాజాలరు. ధ్రువుడు భగవత్సాక్షాత్కారం బొంది మోక్షమును కోరలేదు.

# 3

[దూరంగా గొడ్ల అరుపులు, గొడ్ల కాపర్ల కేకలూ వినిపిస్తుంటయి.]

అప్పు : వొరే సాయిబు, నీ బర్రె అలుగుబండమీదిగా పోతున్నది.

వెంక : వాడిది దొంగమేతలు మరిగిన గొడ్డు.

సాయిబు : యహెూవ్, యహెూవ్, తిరిగిటూ—[అని కేకలు వేస్తూ బూతులు తిట్టేవరకు గిట్టున మళ్ళుతుంది.]

వెంక : మనకు పొగాకు యెక్కువ పెడతాడు. మండిగపాకు చుట్టలు తగలెయ్యండోయ్. అరె నిప్పులేదు గావాలె, అయితే యీపూట పస్తుకింద లెక్క.

అప్పు : ఇప్పుడు చుట్ట లెందుకు పెడతారుగాని యెవరన్నా కాసేపు పదాలు పాడండిరా ....

వెంక : పదాల నరిసిగాడె దానికి మొనగాడు.

[నలుగురు నరిసిగాడిని లాక్కువచ్చి మధ్య గూర్చోబెట్టారు.]

నరిసి : నేను పాటలు మరిచిపోయినారా, చిన్నప్పుడు బాగా వచ్చేవి. మీ రెవరైనా ఎగతాళిచేస్తే నేను పాడను.

అప్పు : ఇప్పుడు మహా పెద్దవాడివి అయినావు గావాలె. వచ్చి నంతవరకు కానియ్యి.

నరిసి : నాకు సుంగారం పాటలు వచ్చు.

వెంక : బూతులేనిది రుచిలేదు. మొదలుపెట్టరా.

నరిసి : ముందొక పద్యం జదువుతా.

జొన్నచేనికాడ సొగసుకత్తెను జూచి
విన్నటేల నుంచి నిదురలేదు
దాని నన్ను గూర్చి దయసేయు మాధవా
పొన్నపూలతోటి పూజసేతూ.

వెంక : ఒరే, వీడికి నిద్దుర పట్టటం లేదురా, ఎందుకో.

అప్పు : నీ చమత్కారాలు చాలించి వాడిని పాడనియ్యి.

సుబ్బ : పదంపాడరా, పద్దేలకేమి, నే దరువేస్తాలే.

సాయిబ్బు : గుండేలుగాడి పదమంత మంచి దింకొకటి లేదు.

నరిసి : గుండేలుగాడిపదం పాడతాగాని, మాదిగెముత్తా, నీవు చిందెయ్యరా.

గుండేలుగాడి తమ్ముడంట—మందపాటి కోటడంట
మారెళ్ల సుబ్బడంట—మందుబెట్టి చంపెరోరబ్బో గుండేలుగా
అబ్బో గుండేలుగా— ఓ రబ్బో గుండేలుగా
అబ్బో గుండేలుగో— ఓరబ్బో గుండేలుగో....

ముత్తడు : [దేహమంతా లయస్వరూపమయి చిందులు తొక్కుతున్నాడు.]

తక్కిసొక్కి—తక్కిసొక్కి—తక్కిసొక్కి—తక్కిసొక్కి.

సుబ్బ : ఇంకొకటను, పొద్దుగూకులూ ఒకటే అయితే బాగుండదు.

నరిసి : మొదలు జ్ఞాపకంలేదు, యిది బలేపాట వినండి.

నీకు నీవారు లేరు నాకూ నావారు లేరు
యేటిఒడ్డున యిల్లుగడదం పదరా
చల్ మోహనరంగా
యేరు వస్తే యీది పోదాం పదరా

[పిల్లలంతా విగ్రహమువలె నిశ్చేష్టులై వింటూ కూర్చున్నారు.]

మనిద్దరీ మనసొక్కటైతే మలెపూలా తెప్పకట్టి
తెప్పమీదనె తేలిపోదాం పదరా
చల్ మోహనరంగా....
తెప్పమీదనె తేలిపోదం పదరా....

సుబ్బ : (మనసులో) యింతపెద్దది పాడుతావేమిటి?

కంటా కాటిక బెట్టి కడవా చంకానా బెట్టి
కన్నీటా కడవ నింపితి గదరా.

నరిసి : ఎందుకు అప్పయ్యా చూస్తున్నావు

అప్పు : ఈపదం ఎందుకో నామనస్సును కుదుపుతూఉందిరా.

వెంక : ఒరే నరిసిగా, యీ యేడుపుపద్యాలు చాలించి రుచిగా ఉండేవీ కరకరలాడేవీ కానియ్యరా.

నరిసి : ఓరోరి బండోడ—ఒయ్యారిబండోడ

నీమీద నామోజు నిలవూ బండి, నీమీద నామోజా

వెంక : నీ మీద నా మోజా.... అంతమాత్రం తగలవద్దూ.

సుబ్బ : యల్లామ పదం నీకు వచ్చుటరా?

నరిసి : అన్నీ వచ్చు.

సుబ్బ : బలే అది అన్నిటికి కిరీటం.

మటీ యాల్లామే—మటీ యాల్లామే—(అని పయిగుడ్డ యెగురవేస్తూ అన్నాడు.)

అప్పు : యల్లామ పదమూ వద్దు. నాగులామ పదమూ వద్దు. ఛట్టిబూతు.

వెంక : మాకు అదే కావాలె. అప్పొయ వద్దంటే నే గావాలెనన్నా. బూతేమిటి? ప్రపంచంలో బూతేలేదు.

అప్పు : యెవరడిగింది వద్దుగాని, నీయిష్టంవచ్చింది ఏదో ఒకటి ఆఖరుపదం పాడు.

నరిసి : (లేచి పైగుడ్డ పమిటవేసుకుని) ఇదే ఆఖరుది. వినండి. ఇక న న్నడుగవద్దు.

తాన తంధాన, తాన తంధానానా,
అయ్యో, కావేటి వేంకట శౌయ్యా,
పెట్టెలోన చేయివేయ్యా, శాలు దీసి నాకీయ్యా
మసిబూసుకొని నీవు బోయి
అయ్యో, కావేటి వెంకట శౌయ్యా
నీ చెవుది చారెడు కమ్మ, కమ్మ దీసి నాకిమ్మ
బూడిదె బూసుక పొమ్మ.

ఇప్పటికింతే. ఇంకా జాంపొద్దున్నది. దున్న పోతు సవార్లు తీతాం పదండి.గొడ్లుయిగ నిలువవు. వాటిని మళ్ళవేసినట్టుగా గూడా ఉంటుంది.

## 4

సంగ : ఏమి తేలిందంటే దుష్కార్యములు సాపేక్షకములయినా నిరపేక్షకములయినా కర్తకో, లోకమునకో బాధాకర ములే. సుకృతములు సాపేక్షకములయితే లోకమునకు శ్రేయమూ, కర్తకు స్వర్గాదిభోగములూ యిస్తూ బంధహేతువు లౌతవి. ఫలాపేక్ష లేనియెడల లోకోప కారములు మాత్ర మవుతవి.

బుచ్చ : దానికది చేరిస్తే సరిపోతుంది. ఫలాపేక్ష లేకపోతే పాప కర్మములు చేయడానికి ప్రోత్సాహమే లేదు. అపుడు రాక్షసులూ సత్రములలో రాళ్ళుగొట్టరు. ఫలాపేక్ష లేకుండా సత్కార్యములు చేయడమున కలవాటు పడ్డవారు ధ్రువుడివలె సిద్ధములయిన సంపదలనే త్యజించి పరమపదమునుమాత్రమే ఆశించుతారు. స్వర్గాదిభోగములు లేకపోయినవని చింతించరు. ఇంతేకాకుండా ఫలాపేక్షలేని సత్కార్యములయందు ఆదరము హెచ్చు. ఫలాపేక్షలేనప్పుడు కర్తృత్వము భగవంతుడిదే అవుతుంది. చేసేవాడూ చేయించేవాడూ అతడే. కార్యస్వామ్యం ప్రత్యేకవ్యక్తినుండి మారి ప్రభువు దవుతుంది. ఒకనొకరు తన్స్వంతకార్యమును నెరవేర్చు కొనేటప్పటికంటె ప్రభువుకార్యమును నెరవేర్చే టప్పుడు యెక్కువ అధికారం చలాయించగలడు. ఫలాపేక్ష లేక అధికారవశమున చేసినపనులకు నౌకరు జవాబుదారీ లేదు. యితరులకు వర్తించే ధర్మములు అతనికి వర్తించవు.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచ.

అని శ్రీకృష్ణ భగవానుడన్నాడు. అదుగో, గుర్తు. అక్కడ నిలవండి.

సంగ : నా చిత్తం గోచరమయింది.

బుచ్చ : ఇప్పటికే కాలాతీతమయింది. శరీరమాద్యం ఖలు ధర్మసాధన మన్నారు. భోజనాత్పరం మీకందరికీ సావ కాశంగా వుంటే దయచేయండి. నాకింకా తనివితీర లేదు. మీతో యింకా సంభాషించవలెనని కోరికగా వుంది.

రామానా : మా పుణ్యంవల్ల తమరు దయచేశారు. మే మన వలసినమాట తమరే అంటున్నారు. మరి ఇప్పటికి సెలవు.

## 5

రాము:—మనిషి గొప్ప వేత్త.

సంగ:—గొప్ప భక్తుడు.

రా.నా:—గొప్ప యోగి. కమలాల్లాంటి కండ్లలోనుంచి బ్రహ్మ తేజం కురుస్తూవుంది.

రాము:—తమరిక ఉండండి నాయుడుగారూ, సంగణ్ణి వాళ్ల మ్మకి చూపి పంపుతా.

రా. నా:—త్వరగా రా సంగదాసూ. నీతో చాలా మాట్లాడాలి.

## 6

జ్యోతి:—అమ్మా, చిన్నన్నయ్య వచ్చాడే.

మా:—(పరిగెత్తుకొనివచ్చి) వచ్చావా నాయనా, మా అయ్యను చూచి ఎన్నాళ్లయింది. కండ్లుపోయినట్లుఉంది.

సంగ:—వారం రోజులేకా.

రాము:—నీ కట్లాగే ఉంటుందోయ్.

మా:—మా అయ్య జున్నుపాలకు అందుకున్నాడమ్మా.

జ్యోతి:—అన్నా! మనకు బుజ్జావు బుట్టింది.

సంగ:—పెయ్యదూడేనా?

మా:—కాదు. మాగాని దున్నేందుకు పుట్టింది.

సంగ:—అరంజోతీ, నీవు బాగా చదువుకుంటున్నావా?

జ్యోతి:—ఆ! నీవిచ్చిన పుస్తకమంతా అయింది. ఇంకొకటే తెచ్చి పెట్టు.

రాము:—వాకిట్లో మంచంమీద కూర్చుందాము రా—చల్లగాలిలో.

మా:—కాసేపు కూర్చోనిస్తూ ఇక్కడ. నిన్న నీవు చూచివచ్చావుగా.

సంగ:—అప్పాయ బాగా సాగుతున్నాడే.

మా:—నీ వట్లా అనగూడదమ్మా,దిష్టి తగులుతుంది.వాండ్లమ్మ లేవడంలేదు. మోచేతిమీదా, దండమీదా ఎవరో కొట్టా రట. బుజం వాచి బ్రహ్మలొడ్డయింది. ఊళ్లో మంగల వైద్యునికి చూపిస్తే లోపల ఎముక చిట్లింది, తనవల్ల కాదన్నాడు. మధ్యాహ్నంనుంచీ నీకోసం వొక్క మోయిన కలవరిస్తున్నది.

సంగ:—ఎవరు గొట్టారు?

మా:—ఎవరో బసివిరెడ్డట.

సంగ:—ఎందుకూ?

రాము:—మన కర్మం. మాల మాదిగలై పుట్టినందుకు. చేని గట్టుమీదిగా నడిచిందెట. ఇగెప్పుడూ ఇటు రావద్దని కొట్టి, గడ్డి వూడ దీసుకున్నాడు, సరేనా?

సంగ:—బాగానే వుంది. నే వెళ్ళి చూచివస్తా ఆమెను. రారా బావా...

మా:—నీవు కోమటింటికిపోయి జున్నుబాలల్లోకి కాస్త బెల్ల ప్రాయి కొనక్కురా. ఇంట్లో నిండుకొన్నది. కొద్దిగా ఉంటే పొద్దున అమ్మాయి వేసుకొన్నది.

రాము:—ఒక సవాసేరుతేనా?

మా:—తీసుకరా, లేనప్పుడు పరుగెత్తేదానికంటె.

రాము:—నాకు వట్టిదే పోశావుకదా, ఒకమ్మగన్న బిడ్డననే.

మా:—నే నొక్కదాన్నేకా పరాయిదాన్నిక్కడ. నేను తిన్నానో లేదో మీరు విచారించారా?

రాము:—నీవు తినకుండా మాకు పెట్టవచ్చావా? అనుకున్నాం.

మా:—తనకు మాలిన ధర్మమా. నే తినే మీకు పెడుతున్నా. అబ్బాయి వచ్చేలోగా రా, చీకటిలో ఎందుకు పంపేవని నామీద కోప్పడుతాడు. దొడ్లో చెట్లపాదు పెట్టినందుకు ఒక పొట్లకాయ కాసింది, కోసిచ్చి పో, తాలింపు వేస్తా.

## 7

[సంగదాసు మేనత్త ఇంటికి పోయినాడు. సుబ్బలక్ష్మి గుడిసెలో కుక్కిమంచం వేసుకొని పడుకున్నది.]

సంగ:—ఏ మత్తా, వంట్లో ఎట్లావున్నది?

సుబ్బ:—నాయనా వచ్చావా? నీ కోసమని ఎదురు చూస్తున్నా. మోచేతిదగ్గరనుంచి గూడదాకా పర్వతాకారంగా వాచింది. వల్లమాలినపోటు. నేను బతకననే దిగులులేదు. అప్పడు ఏణ్ణర్ధం వాడై ఉండగా మీ మామ చచ్చాడు. అప్పటినుంచీ అష్టకష్టాలుపడి పెంచా. చిటుక్కున ఒక దెబ్బగొట్టి ఎరుగను. నా కడుపు నాయగ్గట్టుకొని కరువు రోజుల్లో గూడా వాడికి ముప్పూటా అన్నం బెట్టాను. వారోజు లేమో అంత్యానికి వచ్చినవి. వాడిని నీవు చేయి వదలావా అంటే ఎందుకూ గాకుండా పోతాడు. ఈ దిక్కుమాలిన పక్షిని నీ వొళ్ళో వేస్తున్నా. మీ అమ్మ ఒకరి వంటిదిగాదు. జీతగాడని పేరేగాని ఈ రెండేళ్లనుంచి తన బిడ్డలతో వొకణ్ణిగా చూస్తున్నది. నీ చేతిలోబెట్టి దిగులు లేకుండా వెళ్ళిపోదామని కనిపెట్టుకొని ఉన్నా. అప్పడూ! యిట్లా నామంచంమీద కూర్చో నాయనా. వట్టి అర్భకుడు. ఇగ అత్తనే అమ్మనుకో. చెడు సావాసాలు పోబోకు. సంగ బావను దేవుడినిగా ఎంచుకో.

[అప్పడు ఏడుస్తాడు.]

సుబ్బ:—ఏడవవద్దు నాయనా, ఏడవవద్దు.

[సంగదాసుకు కండ్లని నీళ్ళు గిఱ్ఱున దిరిగినవి. మీద చేయివేసి,]

సంగ:—అత్తా, అప్పడికి వచ్చిన భయంలేదు. వాడికి మేము ఏ లోపమూ లేకుండా చేస్తాం. నీ విక్కడవుంటే లాభం లేదు. చీకటితో అయ్యనిచ్చి బండిలో ఆసుపత్రికి పంపిస్తాను. వాండ్లు ఏదయినా వెంటనే పని చేస్తారు.

సుబ్బ:—సరే కానియి. ఈ వూళ్లో మట్టెయ్యే ప్రాప్తం కూడా లేదు గావాలె. కళ్లం ఎక్కడవుంటే అక్కడకి నెట్టుకుని పోతుంది. అప్పణ్ణి నాతో పంపు.

సంగ:—అట్లాగే నత్తా. నీవూ పోయిరా బావా. అత్తా, అన్నం తిన్నావా?

సుబ్బ:—వదినె ఇప్పుడే అన్నం పెట్టి పోయింది. రాత్రి అన్న ఇక్కడే పడుకున్నాడు.

సంగ:—నేను వెళ్ళివస్తాను.

సుబ్బ:—సరే. అప్పడిని అండ వదలబోకు.

# ఆరవ సంవత్సరం....



ఆంధ్రప్రదేశ్ తొలి అయిదు సంవత్సరాలూ, రెండవ ప్రణాళికా ఏకకాలంలో గడిచాయి మన రాష్ట్రంలో రెండవ ప్రణాళిక కేటాయింపును మించి రూ. **14** కోట్లు అధికంగా ఖర్చు పెట్టగలిగాము. రాష్ట్రపు ఆరవ సంవత్సరం కూడా, రూ. **305** కోట్ల మూడవ ప్రణాళికా లక్ష్యాలను సాధించడానికై అదే అభివృద్ధిక్రమంలో పురోగమించింది.

* భారీ ప్రాజెక్టు అయిన నాగార్జునసాగర్‌కు క్రిందటి సంవత్సరం మొదట రూ. 9 కోట్లు ఖర్చు పెట్టాలనుకొనగా సుమారు రూ. 10 కోట్లు ఖర్చు చెయ్యడం జరిగింది.
* రాష్ట్రంలో సత్వర పారిశ్రామికాభివృద్ధిని సాధించడానికై రూ. 3 కోట్ల పెట్టుబడి ధనంతో నెలకొల్పబడిన పారిశ్రామికాభివృద్ధి సంస్థ, పది ప్రాజక్టుల పరిశీలనను చేపట్టింది. వీటికి సుమారు రూ. 19.65 కోట్లు ఖర్చు అవుతుందని అంచనా.
* లఘు పరిశ్రమల అభివృద్ధికై ప్రత్యేకంగా ఒక సంస్థను స్థాపించడం జరిగింది. దీనికి ప్రభుత్వం, వాటాధనంగా రూ. 20 లక్షలు, ఋణంగా రూ. 35 లక్షలు ఇచ్చింది.
* రాష్ట్ర గనుల అభివృద్ధిసంస్థ క్రింద ఏడు పని ప్రారంభించింది. కృష్ణా జిల్లాలో ముడిఇనుము నిలువలను వెలికితీసే కార్యక్రమంలో ఇది నిమగ్నమై ఉంది. ఈ ప్రాంతంలో 1961 డిసెంబరులో గనుల త్రవ్వకం ప్రారంభించి, లక్ష టన్నులకుపైగా ముడి ఇనుమును త్రవ్వి తీయడం జరిగింది. ఇంకా అనేక ఖనిజాలను వెలికి తియ్యడానికి, అస్బెస్టాస్, రాగి, గ్రాఫైట్ మొదలైనవాటి విషయంలో విస్తారంగా పరిశోధనలు గావించడానికి కూడా ఈ సంస్థ పెక్కు పథకాలను సిద్ధం చేసింది.
* సమాజాభివృద్ధి కార్యక్రమం 2.37 కోట్ల జనాభాతో 83,415 చదరపు మైళ్ల విస్తీర్ణంలో ఆవరించివున్న 24,417 గ్రామాలలో అమలుపరచబడింది. రాష్ట్రంలో 378 అభివృద్ధి మండలాలను ఏర్పాటు చేశారు.
* నిర్బంధ ప్రాథమిక విద్యా పథకంతోపాటు, బడికివెళ్లే పిల్లలకు మధ్యాహ్న భోజనం సరఫరా చేయడానికి సంబంధించిన రెండు పథకాలను కూడా ప్రవేశపెట్టడం జరిగింది.

మూడవ ప్రణాళికా పథకాలన్నింటికీ అవసరమైన సాధన సంపత్తులను సమకూర్చుకోడానికి నూతన చర్యలు తీసుకుంటున్నారు. అయితే నిశ్చయంగా దీని విజయం మాత్రం దృఢ సంకల్పబద్ధులైన ప్రజల స్వేచ్ఛాపూర్వక సహకారంపైననే ప్రధానంగా ఆధారపడి ఉంది.

—స. పౌ. సం. శాఖ, ఆం. ప్ర.

# అభినవ వాగనుశాసనులు
# శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

శ్రీ మ. సూ. మూర్తి

**1961** సెప్టెంబరు భారతిలో "బ్రహ్మశ్రీ" పూర్వకముగ ఆ వ్యాసమును వ్రాసిన చేతితోనే నేడు "కీ. శే." శబ్ద పురస్సరముగ ఈ వ్యాసమును వ్రాయవలసివచ్చుట విచారకరము. శాస్త్రిగారి అస్తమయము వారి కుటుంబమువారికేకాక, వారి శిష్యు



బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

లకు, ప్రశిష్యులకు, అభిమానులకు, చివరికి ఆంధ్రదేశమునకు, ఆంధ్ర సారస్వతమునకు ఒక గొప్ప లోపము నాపాదించినది. ప్రాచీన సంప్రదాయములలో జదువుకొని, అఖండమైన పాండిత్యమును గడించి, స్వప్రతిభా విశేషముతో 'యావదాంధ్ర ప్రశస్తి నార్జించిన పూర్వపు పండితులలో శాస్త్రిగారే బహుశః వయోవృద్ధులును, కడపటివారును గూడ నేమో!

శ్రీ శాస్త్రులవారే స్వయముగా "ఆత్మ జీవితము"నకు సంబంధించిన విశేషములను వ్రాసియుంచినారు. 1961 మే నెలలో వానిని దయలో నాకిచ్చి, వారితో సన్నిహిత సంబంధముగల పెద్దవారు చెప్పెడి సూక్ష్మ విషయములను జెప్పి "నీపేర ప్రకటించుకొమ్మ"ని ఆజ్ఞాపించినారు. నా అసమర్థతను దెలుపుకొన్నాను. వారు నవ్వుచు "పోనిరే" అన్నారు. గ్రంథమంతయు బ్రకటింపలేక పోయినను సంగ్రహముగ భారతీ ముఖమున నా పూర్వ వ్యాసములో ఆ యా విషయములను సంగ్రహించి యున్నాను. తక్కిన విషయములలో ముఖ్యమైన వానిని—వారి ప్రతిభకు, స్వభావమునకు, సన్మానములకు సంబంధించిన మరికొన్ని విశేషములను ఈ వ్యాసమున వ్రాసి, వారు నాపై నుంచిన బాధ్యతను కొంతవఱకైన దీర్చికొందును.

శాస్త్రిగారు ప్రైమరీ చదువులోనుండగానే విఘ్నేశ్వరపూజ, శ్రీసూక్త పురుష సూక్తాదులు అధీతమైనవని వెనుకతెలిపితిని. దీనికి సంబంధించిన ఒక విశేషము. శాస్త్రిగారప్పుడు తొమ్మిదేండ్ల వయసువారు. వీరి పెదతండ్రిగారు తమ పౌత్రునకు వారి వీథిఅరుగుమీద ప్రతిదినము స్మార్తము చెప్పుచుండిరి. వారికి వీరికి మధ్య ఒక వెదురు తడక అడ్డము. ఆ బాలునితోపాటు చదువ గుతూహలపడి శాస్త్రిగారు వారు పిలువకుండగానే పోయి చెప్పుకొన నారంభించినారు. అయిదారురోజులైనపిదప వారు "నీకు ఉపనయనము కాలేదు, పో" అన్నారట! శాస్త్రిగారు నిరుత్సాహము నొందక, తడకచాటున తమ యరుగుమీదనే కూర్చుండి వినుచు, లోలోన సంతచెప్పుకొనుచు, ఆ బాలునికంటె చాల ముందుగా గంఠస్థము గావించుకొన్నారట!

శాస్త్రిగారు రఘువంశములో నుండగానే ఏకసంధాగ్రాహిత్వమును, అష్టావధానాంగములను అభ్యసింప మొదలిడినారు. ఒకనాడు గురువుగారు (బ్రహ్మయ శాస్త్రిగారు) విద్యార్థులను వెంటబెట్టుకొని సిద్ధాన్తము గ్రామము వెళ్లినారు. ఆ ప్రాంత మందలి ఒక పండితుడు బ్రహ్మయశాస్త్రిగారిని దర్శింపవచ్చి, విద్యార్థులను బరీక్షించుచు—వినండి—అని :

"గంగావర్త సమాననాభి విలసద్వల్మీక రంధ్రాన్తరా....."
ఇత్యాది లక్షణ గ్రంథములలోని శ్లోకమును ఒకేసారి చదివి, విద్యార్థులను వ్రాసి చూపగోరినారట! అందరిలో ఒక్క తప్పు కూడ లేకుండ ధారణచేసి వ్రాయగలిగినవారు శాస్త్రిగారొక్కరే! ఈ బుద్ధి వికాసమే వారిచే 17 సంవత్సరముల ప్రాయమున మొదటి మారుగ అష్టావధానము చేయించినది. త దారభ్య శాస్త్రిగారు పెక్కుసార్లు ఉభయ భాషలలోను అష్టావధాన శతావధానములు నిర్వహించిరి.

ఆ బాల్యముగ దన్నెవరేని తొందరపడి యేమేనన్నచో ఇంచుకైనను సహింపని ఆత్మగౌరవపరాయణులు శాస్త్రిగారు. తమ ఈ స్వభావమును గూర్చి "వ్రాయదగిన దెంతేని కలదుగాని, గ్రంథ విస్తరముగాక, దానివలని ప్రయోజనమేమి—" అని వ్రాసి, శాస్త్రిగారే ఒక్క ఉదాహరణము నిచ్చినారు.

"అది అధికారులంటే క్రిందివారు గడగడలాడుచుండే కాలము. క్రిందివారిలో విధేయత ఎంత తక్కువో పైవారిలో నిరంకుశత్వ మంత హెచ్చు." ఇట్టి పరిస్థితులే ఉండిన అమలాపురం హైస్కూలులో శాస్త్రిగారు ఉద్యోగించుచుండిన తొలి నాళ్లలో ఒకరోజు సెలవు కావలసి హెడ్మాస్టరుగారి ఇంటికివెళ్ళి కాగితము నిచ్చినారు. ఆయన విసుగుకొనుటచూచి వీరు ఏదో మృదువుగానే సమాధానమిచ్చినారట! ఆయన వృథాగా గోపించి, "షేక్స్పియర్" అన్నారు. శాస్త్రిగారు చట్టునలేచి, "ఈ తప్పు మాట వచ్చిన నోటిని ముందు మందలించండి—జాగ్రత్త"— అని హెచ్చరించి వచ్చినారట! ఈ గొడవ చాలదూరము నడచినది. చివరికి హెడ్మాస్టరుగారు "గుఱ్ఱము దిగివచ్చి" రాజీకి దిగినారట! ఇట్లే రాజమండ్రి ఆర్ట్సు కాలేజి ప్రిన్సిపాలుచే ఒక విషయములో, అధ్యాపకు లందఱిసమక్షమున "క్షమించండి" అనిపించుకొన్నారట! తమ ఆత్మగౌరవమును గాపాడుకొను యత్నమున శాస్త్రిగారు చాల పట్టుదల చూపినట్లును, దాని వలన కట్టమంచి రెడ్డిగారు మొదలైన పెద్దల ఆగ్రహమునకు గూడ ఒక్కొక్కపుడు గుఱి కావలసి వచ్చినను స్థైర్యము వీడనట్లును తెలియుచున్నది.

అట్లని శాస్త్రిగారు మొండి పట్టుపట్టి, తా బట్టిన కుందేటికి గాళ్లు మూడే అనువారు కారు.

వారు తమ తప్పును గ్రహించినపిదప, దానిని సవినయముగ ఒప్పుకొని పశ్చాత్తాపము నొందగల సహృదయులు కూడ! ఆంధ్ర శబ్ద చింతామణి నన్నపార్య విరచితముగాదను వీరేశలింగము గారి వ్రాతను ఖండించుచు వీరొక వ్యాసమును ఆంధ్రపత్రికలో బ్రకటించినారు. కాని, మఱికొంతకాలమునకు వీరేశలింగముగారి అభిప్రాయమే సరియైనదని సప్రమాణముగ గ్రహించినపిదప, తమ పొరపాటును ఒప్పుకొనుచు మఱల ఆంధ్రపత్రికలో బ్రకటించినారట. "అది నన్నయార్య విరచితమే అని నేటికిని నమ్ముచున్న శ్రీ వజ్ఝల సీతారామశాస్త్రిగారివాదము మువ్వాటికి ప్రావాదికము, అప్రామాణికము, అసంగతము"—అని శాస్త్రిగారు నొక్కి చెప్పుచున్నారు.

సహృదయు లెవరును వ్రేలుపెట్టి చూపుటకు అవకాశమీయని ఋజువర్తనము గలవారు శాస్త్రిగారు. దీనికిదోడు బోధనాపటిమయు, ప్రశస్తతమ మైనది. అందువలననే విద్యార్థులకు వీరియెడల అమితమైన అనురాగ ముండెడిదట! రావు బహదర్ బండి శ్రీహరిరావు నాయుడుగారు ఉన్నత పదవిలో నుండగా (వీరు శాస్త్రిగారి ప్రియ శిష్యులలో నొకరు) ఒకసారి శాస్త్రిగారిని దర్శించి, ప్రశంసించి, సత్కరించినారట! ఇట్టి సన్నివేశములు శాస్త్రిగారి జీవితమున శతాధికములు!

శాస్త్రిగారి ఛలోక్తులు సహృదయులకు, సరసులకు సరసముగాను, అసూయాపరులకు పండితంమన్యులకు విరసముగాను కటువుగాను ఉండెడివట! ఎం. ఏ. పట్టభద్రులలో గొందరిని చూచి, "మీరంతా భండార్కరు పండితులయ్యా"—అనువారట శాస్త్రిగారు. "మేము భండార్కరు ఇంగ్లీషులో వ్రాసిన సంస్కృత వ్యాకృతిని మాత్రమే చదివిన అపండితుల"మని విన్నవారు నొచ్చుకొనువారట! కాని, "మీరు భండార్కరువంటి గొప్ప పండితులు"—అని నా అభిప్రాయము"—అని శాస్త్రిగారు తప్పించుకొనువారట !

ఒక వ్యక్తి మూలమునగాని, ఒక సంఘటన మూలమునగాని మనస్సు తాత్కాలికముగ వ్యాకులమై ఉన్నపుడు శాస్త్రిగారు సామాన్యముగ గాంభీర్యమును గోల్పోయి పరుషముగా మాటాడువారని చాలమంది ఆరోపింతురు. అయినను వారి హృదయము సత్యదయా ధర్మ శౌచములకు ఆలవాలమని కూడ వారే చెప్పుదురు. ఈ విషయమునుగూర్చి శాస్త్రులవారే స్వయముగా వ్రాసిన వాక్యముల నిట వ్రాసెదను.

# అభినవ వాగనుశాసనులు శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

"నా జాతకరీతి విచిత్రమైనది. వందలకొలది బంధుమిత్రులలోను, వేలకొలది నా శిష్యులలోను నా హృదయమును సరిగా కనిపెట్టినవారు ఏ కొందఱో! ఒక్కొక్కప్పుడు వాక్కెంత కఠినముగ నుండునో హృదయ మంత మృదువుగ నుండును.

"ఎంతటి క్రొత్తవానితోనైనను మనసిచ్చి మాటాడుదును. వాని మాటలు నమ్ముదును. తరువాత నతడు తుంటరి యని తెలిసెనా—నాటితో సరి! మరి వానితో మాటాడను. తోచినమాట వెంటనే అనివేయుదును. తలచినపని వెంటనే చేయ నారంభింతును. ఇట్టి తొందర నాకు సహజమే. కాని, న్యాయ విరుద్ధముగాను, ధర్మ విరుద్ధముగాను మాటాడను. అయితేనేమి? అధికారు లా రీతిని సమర్థింతురా? అది నా స్వభావము. దానిం గూర్చి నా ప్రియమిత్రుడు శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు నా షష్టిపూర్తి సభలోను, నా ప్రియశిష్యుడు దివాకర్ల వేంకటావధాని షష్టిపూర్తి సంచికలోను వర్ణించిన విధము లోకింత వరుసగా:—

"తొందర వాడండ్రు తొందరయే లేద
యేని నిర్మించునే ఇన్ని కృతులు,
సైరింప డింత దోషంబు తోచిన నండ్రు
దోసంబు మాటుట మోసగాదె
ఎంతవారిని గణియింప డండ్రు, మదాం
ధుల గణించుట స్వతంత్రులకు దగునె
తన మాట కెదురాడ గినుక పూనునటండ్రు,
రాడి తప్పని వాని కది తగదొకొ
గుణము గూడ దోషంబుగా గుటిలవృత్తి,
నన్వయింతురు గాక దోషైక దృక్కు
లంత మాత్రానఁ ద ద్గుణౌ దార్యములకు,
గొఱతయే వారి కడుపుబ్బె తొఱగుగాని
వెం. సూ. శా.

"శాస్త్రిగారిమాటకు మనసునకు వాక్కృతిని మిక్కిలి భేదమున్నది. ఎరుగనివారి కాయనమాట దారుణా ఖండల శస్త్రతుల్యము. వారి మనస్సు నవ్య నవనీతముకన్నను మెత్తన. నిండు మనంబు నవ్య నవనీత సమానము, పల్కుదారుణాఖండల శస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు—అన్న పంచమవేద వాక్య మాయనయెడ సమగ్రమైన లక్ష్యమును గాంచగల్గను. శాస్త్రిగారి హృదయము మిక్కిలి పరహిత ప్రవణము.

ది. వేం."

నిర్మాణాత్మకమైన సాహిత్య విమర్శనము సహృదయ రంజకమేకాని, అం దేమాత్రమైన వైయక్తిక ద్వేషభావము తొంగిచూచెనా, అందు పరస్పర దూషణమౌతక్క మ ఱేమియు నుండదనుట సత్యమేకదా! శాస్త్రిగారి ఇతర రచనలు ఏవిధము గాను చెప్పుకోదగినంతగా రచ్చకెక్కినట్లులేదు. కాని, వారి ఆంధ్ర భాషానుశాసనము మాత్రము కొందఱు పండితుల విమర్శకు గుఱియైనట్లు తెలియుచున్నది. అట్టి పండితులలో ముఖ్యులు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు. శాస్త్రిగారి వ్యాకరణము ముద్రితము కాగానే శ్రీపాదవారు దానిని నిరసించుచు, తమ వజ్రాయుధము పత్రికలో నేదో వ్రాసిరట! దానిపై శాస్త్రిగారు తగిన సమాధానము పంపిరి. మఱల ప్రత్యుత్తరము రాలేదు. అసూయాపరుల విమర్శ లిట్లేయుండునని తెల్పుచు, శాస్త్రిగారు వారి భారతమునుగూర్చి—"పూర్వ వ్యాకరణ విరుద్ధ సహస్ర సంఖ్యాక ప్రయోగములలో నా వ్యాకరణమునుబట్టి సాధువు లయినవి కొన్ని వందలు. కాని ఏ వ్యాకరణముగూడ సాధింపలేనివియు, ఏనాటి శిష్టుల వాడుకలోను లేనివియునైన అపశబ్దములు కొన్ని:—

"నాడి విన నాతఁడెట్లు బొరి నోయుచు......"

శ్రీకృష్ణభారతము ఆది. 4—188

ఇత్యాదులు. "గీతంమీది తప్పులను సమర్థించు వ్యాకృతి పుట్టలేదు. పుట్టబోదు. ఇక, తూళ్లు, పేర్లు, కూతురిపై, పన్నులు (దంతములు) మళ్లించెన్, ఆకలి వేయుచున్నది, లంగరేసి—ఇత్యాది శిష్ట వ్యవహార సిద్ధప్రయోగము లెన్నో లెక్కలేదు. ఇట్టివన్నియు శ్రీ కృ. శా. గారు ప్రాచీన వ్యాకరణ సమ్మతము లన్న భ్రాంతిలోబడి నా యనుశాసనమును నిరసించిరిగాని, చదువలేదు పాపము !"—అని శాస్త్రిగారి వాక్యములు.

శాస్త్రిగారు భాషా సారస్వత రంగమున ఎంత ప్రజ్ఞాధురీణులో లౌకిక వ్యాపారరంగమున గూడ అంతే ప్రజ్ఞగలవారు. విశాఖపట్టణమున 1934—1940 మధ్య నేర్పడి పని చేసిన కో—ఆపరేటివ్ బిల్డింగ్ సొసైటీకి శాస్త్రిగారే స్థాపకులు, అధ్యక్షులు, ఉపాధ్యక్షులుగానుండి ప్రస్తుతము డాబా గార్డెన్సు అనబడు పేట రూపొందుటకు గారణభూతులైనారు. అటు ప్రభుత్వమువారితో, ఇటు ప్రజలతో సంబంధముగలిగి, కొన్ని లక్షల రూపాయలతో నడచిన సంస్థ ఇది. ఆ పనులెల్ల అత్యంత సమర్థముగ నిర్వహించి శాస్త్రిగారు ప్రశంసాపాత్రులైనారు. శాస్త్రిగారి పరహితైకశీలమునకు ఉపాధ్యాయ పండిత పరిషత్తు ఇంకొక చక్కని నిదర్శనము. తెలుగు పండితులకు హైస్కూళ్లలోను, ఇతరత్ర నే డితరాధ్యాపకులతో తుల్యమైన ప్రతిపత్తి కలుగుచున్నదనగా అది శాస్త్రిగారి నిర్విరామ నిస్స్వార్థకృషి ఫలితమే. ఈ కృషిని పండితలోకము గుర్తించినది, ఆమోదించినది

ఈ ఆమోదమునకు గుర్తుగా ఎవ్వరెట్టి సన్మానము గావింపనెంచినను శాస్త్రిగారు సామాన్యముగ అంగీకరించువారు కారు. పండిత మహాసభవారు శాస్త్రిగారి పరోక్షమునందే వారికి "అభినవ వాగనుశాసన" బిరుదము నొసంగ నిర్ణయించుకొని, సర్వ సన్నాహములు పూర్తిగావించినపిదప వారికి తెలిపినారట! ఇక చేయునదిలేక, శాస్త్రిగా రంగీకారమును తెలిపిరి. అవకాశముండినచో అంగీకరించి యుండెడివారు కారను ధ్వని వారి వాక్యములలోనే వ్యక్తమగుచున్నది. ఒకసారి ఏలూరులో పండిత పరిషద్వార్షిక మహాసభ మహా కోలాహలముగ జరిగినపుడు సభ్యులు ఒక ఏనుగును రావించిరి. దాని నలంకరించిరి. శాస్త్రిగారిని అధిరోహింపజేసి ఊరేగింపదలచినట్లు తెలిపిరట! శాస్త్రిగారు నిరాకరించి పరిషత్తు రికార్డును మాత్ర మెక్కించి ఊరేగింపజేసి ఆనందించిరట !

ఇట్లని వారి శిష్యులు, అభిమానులు చేసిన ప్రతి సన్మానమును వారు నిరాకరింపలేదు. నాటి రాజులను మహారాజులను శాస్త్రిగా రైచ్ఛికముగనే సమాశ్రయించిరి. వా రొసగిన పారితోషికములను, వార్షికములను, ఇతర సన్మానములను స్వీకరించుచు, ఆ ధనాదికములో భాషాసేవ చేయుచునే తమ ఐహిక సంపదను బెంపొందించుకొనిరి.

శాస్త్రిగారి షష్టిపూర్త్యుత్సవము ఆంధ్ర జాతీయోత్సవమా అన్నంతగా దాదాపు అన్ని ప్రధాన నగరములలోను మహోత్సాహముగా జరుపబడినది. ఆ యా సన్మానసభలకు గారణభూతులైన ప్రముఖులలో శ్రీయుతులు సర్వేపల్లి రాధాకృష్ణయ్య, మామిడిపూడి వెంకటరంగయ్య, కట్టమంచి రామలింగారెడ్డి, తెన్నేటి సూర్యనారాయణ, మహారాజా విక్రమదేవవర్మ, దివాకర్ల వేంకటావధాని, ఆమ్నాయ వాచస్పతి వడలి లక్ష్మీనారాయణ శాస్త్రి, మారేపల్లి రామచంద్రశాస్త్రి, వేదాంతం శేషయ్య, బెజవాడ రామచంద్రారెడ్డి మొదలైన వారెందరో!

ఆ యా సభలలో కొన్ని సంస్థలవారు, కొందరు శిష్యులు కనకాభిషేకము గావించినారు. కొందరు పాదాభివందన మొనర్చినారు. కొందరు సన్మాన పత్రములు సమర్పించినారు. కొందరు శేలువలు, రజితపాత్రములు నిచ్చినారు. కొందరు వేలకొలది బీద సాదలకు అన్నప్రదానము చేసినారు. శాస్త్రిగారి శిష్యవాత్సల్యము, ఆ శిష్యుల గురుభక్తి శరీరమును బులకరింపజేయునట్టివి.

విశాఖపట్టణములో జరిగిన షష్టిపూర్త్యుత్సవ సమయమున, పూర్వ విద్యార్థి సంఘము పక్షమున శాస్త్రిగారి ప్రియతమాంతేవాసి శ్రీ దివాకర్ల వేంకటావధానులవారు సమర్పించిన పద్య సుమమాలలో ఒక్కటి:

"ప్రావృట్పయోధర ప్రకట గర్జాతిర
స్కారి నీ మధుర గంభీర వాక్కు
పైతృక ప్రేమ సంపదకు బొచ్చెము దీర్ప
జాలు నీ శిష్య వాత్సల్య గరిమ
అంతేవసత్తమోధ్వాంత సంతతి జీల్ప
నోపు నీ యుపదేశ దీపకాంతి
అధికార మర్యాద లతిగమింపక యెప్పు
డలరు నీ స్వాతంత్ర్య విలసనమ్ము
అన్నిటినిమించి శిష్య జనాభిలాష
నించు నవనీత మృదువు నీ నిండు మనసు
నిరతమును జెప్పికొందురు నీదు బోధ
నంది యలరెడి బహుళ విద్యార్థులెల్ల!

శాస్త్రిగారి నెఱిగినవా రందరు చెప్పుదురు ఆయన సారస్వత వ్యాసంగము చేయని నిముసమే లేదని! ఇంతేల! ఒక్క విషయము. పదేండ్లకు మున్నొకనాడు (ధవలేశ్వరములో) ఉదయము 7—30 గంటల ప్రాంతమున శాస్త్రిగారు గోదావరీ స్నానముచేసి ఇంటికి వచ్చుచుండుట చూచితిని. వారు నన్ను చూడలేదు. నేను వెంబడించితిని. వా రేదో మెల్లగా జదువుచు బోవుచుండిరి. నాకు స్పష్టముగా వినబడక "జపము" కాబోలు అనుకొని పలుకరించలేదు. కొంతదూర మట్లే వెంబడించితిని. మెల్లగా నా కిట్లు వినబడినది :

"అమితాఖ్యానక శాఖలం బొలిచి"........ఇత్యాది!

స్వార్థదృష్టిలేని సారస్వత వ్యాసంగమున కిది చరమావస్థ కాబోలును! ఇట్లు అనవరతము సాహిత్య తపస్సమాధిలో శబ్దబ్రహ్మను సంధాన పరాయణులై యుండగల్గుట పూర్వజన్మ సుకృత పరిపాకము!

ఇట్లు దాదాపు 65 సంవత్సరాలు నిరంతరాయముగ కొనసాగిన శాస్త్రిగారి సారస్వతసేవ సమాప్తమైనది. వారి భౌతిక శరీరము శిష్యులకు నయనానందకరముగ నింక కనబడదు.

శాస్త్రిగారి కే లోపమునులేదు. కొడుకులు, కూతుండ్రు, మనుమలు—అందరు అభ్యుదయపథము నందున్నారు. వారికా! తొంబదిమూడు సంవత్సరములు నిండినవి. వారు సంపాదించుకొన్న భౌతిక సంపద విపులకంటె, కీర్తిసంపద విలువ హెచ్చు! వారి అస్తమయమునకు ఆంధ్రలోకమంతయు అశ్రుతర్పణము విడువగలదు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# ఒక బాటసారి

**శ్రీ వాకాటి పాండురంగరావు**

విసవిసా నడుస్తున్నారు శేషయ్య.

ఆయన విశాల ఫాలభాగంమీద దక్షాధ్వరధ్వంసవేళ పరమశివుడి ఛాయలు వెలుగుతున్నాయి. ఆ అరుణిమకు అంచుల వలె అమరిన గంధపు రేఖల మధ్య—నిజం లాగున నిలిచివుంది కుంకుమబొట్టు.

విసవిసా నడిచి వచ్చేస్తున్నారు శేషయ్య.

ఆయన వస్తున్నది ఇంటికి.

ఆయన వస్తున్నది పదిహేడేళ్లు చేసిన ఉద్యోగం విడిచి.

అప్పటి కాయనకు నలభై ఏడేళ్లు. ఇద్దరు పిల్లలు—అబ్బాయి ప్రసాదు, అమ్మాయి అపర్ణ.

అసలు జరిగిం దేమిటంటే—

ఓ గంట క్రింద శేషయ్యగారు యథావిధిగా కార్ఖానా ఆఫీసులో తన గదిలోకి వెళ్లి కూచున్నారు.. టేబిల్ మీది గాజుపలక క్రింది రాజరాజేశ్వరి పటాన్ని చూసి, కళ్లు మూసుకుని తెరిచారు. అమ్మవారి ప్రసన్నవదనంమీద ఒక్క క్షణం ఏదో నీడ మసలిన ట్లనిపించింది. అర్థంకాలేదు ఆయనకు. 'ఇదంతా నీ పరీక్ష లేవమ్మా'—అని నవ్వుతూ మనసులో నమస్కరించుకొని ఆఫీసు పనిలోకి అడుగు పెట్టారు. అర ఘంట తర్వాత ఎవరితోనూ కబురు పెట్టకుండా హఠాత్తుగా వేంచేశాడు మధుసూదనరావు.

వచ్చిన అయిదో నిముషం—"పంతులుగారూ ! నేనో చిన్నమాట చెబుతాను. మీరేమీ అనుకోకండి. రేపటినుండి మేనేజరుగా మరొకరిని నియమిస్తున్నాను. కనుక ఈ కార్ఖానాలో మీ యిష్టం వచ్చిన శాఖలో మీరు గుమాస్తాగా పని చేయవచ్చు. అయితే మీ జీతం మాత్రం ఇప్పు డున్నంతే ఉంటుంది"—అన్నాడు మధుసూదనరావు.

అని శేషయ్యగారి మొహాన్ని చూడలేకపోయాడు.

"మంచిది !" అన్నారు శేషయ్య.

లేచి వెళ్లిపోయాడు మధుసూదనరావు.

శేషయ్య కోటు జేబులోనుంచి కలం తీశాడు. టేబిల్ మీది కాగితం తీయబోయి మానుకుని జేబులోవి భగవద్గీత పుస్తకం తీశారు. దాని మధ్య మడిచిఉన్న తెల్ల కాగితం తీశారు. ఆ క్షణానఆయనమనసు లాగున నలిగిఉన్నది ఆ కాగితం. ఆ పోలిక గుర్తుకు వచ్చి నవ్వుకున్నా రాయన. నవ్వుకుని అమ్మవారి వైపు చూస్తే ఆమె ప్రశాంతంగా చూచింది. గబగబా ఉత్తరం రాశారు శేషయ్య. సంతకం పెట్టారు. తర్వాత తారీకు వేయబోయి కేలెండరువైపు చూశారు.

ఆరోజు—1947 వ సంవత్సరం డిసెంబరు ఆరవ తారీఖు !

ఇంత నిబ్బరంపు నీటిమధ్య ఒక చిన్నరాయి వచ్చిపడింది.

దాదాపు పదిహేడేళ్ల క్రింద వినాయకచవితి రోజున కేవలం వెయ్యి రూపాయలతో చెన్నపట్నం చేరిన నారాయణయ్యను దైవం శేషయ్యతో కలిపాడు. నారాయణ ధనమూ, శేషయ్య ధీశక్తీ కలిసి—ఇనుపపెట్టెలు, ట్రంకులు చిల్లరగా అమ్మే వ్యాపారం మొదలయింది. అది రెండేళ్లలో టోకు వ్యాపారమయ్యింది. మరో అయిదేళ్లలో ఇనపపెట్టెలూ అవీ తయారుచేసే కార్ఖానాకు నారాయణ స్వంతదారు డయాడు. ఇంతటి అభివృద్ధీ కేవలం తన డబ్బువల్లే రాలేదనీ, శేషయ్య తెలివితేటలు, నిస్స్వార్థమయిన సేవా కూడా అందుకు కారణమనీ ఎరిగిన నారాయణ శేషయ్యని తన కార్ఖానాకు మేనేజరుగా నియమించి ఆయనకు నెలకు మూడు వందల జీతం ఏర్పాటు చేశారు. అంతేకాదు. ఆయనను అగ్రజుడి క్రింద భావించి గౌరవించాడు.

శేషయ్య కూడా కేవలం మేనేజరుగానే కాక, అది స్వంత వ్యాపార మయినట్లుగా శ్రద్ధ తీసుకొని దాని దినదినాభివృద్ధికి కృషిచేశారు. అవసర మయినప్పుడు రాష్ట్రమంతా తిరిగి తమ కార్ఖానా తయారుచేసే వస్తువులు బాగా వ్యాప్తిలోకి రావడానికి నిరంతర యత్నం చేశారు. అంతేకాదు—ఒక్కగానొక్క కూతురును పెళ్లిచేసి ఇంకొకరి ఇంటికి పంపివేసి వుండలేనని, నారాయణ బాధపడుతుంటే—ఆరు నెలలపాటు ఇనప చెప్పులు వేసుకుని తిరిగి, వూరూరూ గాలించి నారాయణ అమ్మాయి కో సంబంధం తెచ్చారు. సంబరం తెచ్చిన ఆ సంబంధం నిశ్చయమయింది. తల్లితండ్రులులేక, ఆస్తిలేక, ఉద్యోగంలేక ఉన్న మంచి అబ్బాయి-మధుసూదనరావు నారాయణకు ఇల్లరికపు టల్లు డయ్యాడు. నారాయణ అమ్మాయి ఒకయింటి దయింది. మధుసూదనరావు జీవితానికి గరిమశోభ ఏర్పడింది. నారాయణకు అల్లు డొచ్చాడు; కాని అమ్మాయి ఇంట్లోనే ఉంది. అతగాడి దిగులు తీరింది. పదివేలసార్లు పంతులుకు తన కృతజ్ఞత చెప్పుకున్నాడు. అమ్మాయి పెళ్లివేళ శేషయ్యనూ, పార్వతమ్మనూ ఘనంగా గౌరవించాడు నారాయణ. ఇదంతా అమ్మవారి చలవ అన్నారు శేషయ్య.

పెళ్లయిన తర్వాత మధుసూదనరావు భార్యతో కలిసి అయిదారు నెలలపాటు ఊళ్లు తిరిగాడు. ఆ సరదాలు తీరిన పిమ్మట

అతడిని తన కార్ఖానాలో అన్ని శాఖలూ తనిఖీచేస్తూ ఆ విధంగా పని తెలుసుకోమన్నాడు నారాయణ. శేషయ్యగారిని తండ్రిలా భావించమని కూడా చెప్పాడు. తల ఊపాడు మధుసూదనరావు.

ఈ లోపుగా భారతదేశం పరాయివాళ్ల పాలనను కాద న్నది. ఝాన్సీ లక్ష్మీబాయితో మొదలయిన కల నిజమయిన ఆ ఆగస్టు పదిహేను పర్వదినాన నారాయణ కార్ఖానాలో పండగ జరిగింది. అందరూ కలిసి ఆనందాన్ని కౌగలించు కున్నారు.

ఆ రోజుకు పక్షం తర్వాత ఒక రాత్రి నిద్రకని పడుకున్న నారాయణ మరి లేవలేదు. అల్లుడిని పిలిచి ఏదో చెప్పాడు. చెప్పి ఆఖరికి పంతుల్ని పిలవమన్నాడు. పరుగెత్తు కొచ్చారు శేషయ్య. ఆయన చేతులు పట్టుకుని "పంతులూ!" అని పిలిచి కన్ను మూశాడు నారాయణ. మధుసూదనరావు భోరు మన్నాడు. అతడి వీపు నిమిరారు శేషయ్య.

—అది, ఆరోజు, దాదాపు నాలుగు మాసాల క్రింద !

గత స్మృతుల పథం మీదికి వెళ్ళిన శేషయ్య వర్తమానం లోకి వచ్చి తా నింతసేపూ కేలెండరువైపు చూస్తున్నట్లు తెలుసు కున్నారు. రాజీనామా ఉత్తరంమీద తారీఖు వేశారు.

యాభై ఏళ్ల తర్వాత నారాయణ ప్రపంచాన్ని వదిలాడు.

తాను పదిహేడేళ్ల తర్వాత ఈనాడు ఉద్యోగం వదులు తున్నాడు—అనుకుంటూ కుర్చీలో నుండి లేచారు శేషయ్య. రాజీనామా లేఖను టేబిల్‌మీద ఉంచారు. గాజు పలక క్రింద అమ్మవారి పటాన్ని తీసి, కళ్ల కద్దుకుని, జేబులోని భగవ ద్గీత మధ్య పదిలపరచుకున్నారు. బయటకు నడిచారు.

—విసవిసా నడిచారు శేషయ్య.

ఇల్లు చేరిన శేషయ్య వసారాలో కుర్చీలో కూర్చు న్నారు. ప్రసాదూ అపర్ణా కాలేజీలకు వెళ్లిన వేళ చప్పు డేవిటా అని వసారాలోకి వచ్చిన పార్వతమ్మ ఆశ్చర్యపోయింది.

"ఏమండీ—ఆరోగ్యం బాగాలేదా ?"

తలెత్తి చూశారు శేషయ్య....పిండి విసరుతూ విసరుతూ మధ్యలో లేచి వచ్చిందేమో, పిండి మరకలతో నిండి ఉంది ఆమె మొహం. అక్కడక్కడ నెరసిన జుట్టుతో, చెమ టకు తడిసి చెదురుతున్న పెద్ద కుంకుమ బొట్టుతో—తన ఎదుట నిల్చిన పార్వతమ్మను చూడగానే—'నాతో జీవించ డానికి ఎన్నుకున్నదే ఈమె—' అన్పించింది శేషయ్యగారికి.

"పలకరేవండీ—?"

"పార్వతీ ! మనం ఇంత పెద్ద ఇంటో ఇకమీద ఉండ లేము".

"పోనివ్వండి చిన్న ఇంటోకే వెడదాము. కానీ—అసలు విషయం—"

"ఇవాళ నా ఉద్యోగానికి రాజీనామా యిచ్చాను—"

అక్కడే నేలమీద కూర్చుంది పార్వతమ్మ ....

...... మరో నెలరోజుల లోపుగా చిన్న వాటాలోకి మారారు శేషయ్య కుటుంబం. ప్రసాదు బి. ఏ. రెండో ఏడూ, అపర్ణ ఇంటర్మీడియేటుమొదటిఏడూ చదువుతున్నారు. వారి చదువుల మొక్కలకు, శేషయ్యగా రుద్యోగంలో ఉండగా నిలవచేసిన కొంత మొత్తం ప్రాణాధార మయింది.

శేషయ్య నాలుగు ట్యూషన్లు మొదలెట్టారు. చుట్టు పక్కల దగ్గర ఊళ్లు తిరిగి ఒక ఆయుర్వేద కంపెనీ మందు లమ్మే పనికి కూడా ఒప్పుకున్నారు. కాలం నడుస్తున్నది కొండ చిలువలా. జూన్ వచ్చింది. వేసవి సెలవులు వచ్చాయి. తాను బియ్యే మొదటి తరగతిలో పాసయినట్లు అనధికార వార్త అందినట్లు నాన్నతో చెప్పాలని సంకల్పించాడు ప్రసాదు.

కానీ—అయిదోఫారం చదువుతుండగా ఆరు నెలల పరీక్షల కొక వారం ముందు, శేషయ్య ప్రసాద్ కొక అధ్యాయం చూపించి దానిలోని లెక్క లన్నిటినీ రాత్రిలోగా చేసి చూపించ మని చెప్పి ఆఫీసు కెళ్లారు. ప్రాణమిత్రుల ప్రోద్బలంవల్ల, అభిమానతారలచిత్రం 'ఆఖరిరో' జవడంవల్ల ప్రసాదు ఆ సాయం కాలం సినిమాకు వెళ్లవలసి వచ్చింది. ఎలాగయితేనేం రాత్రి పదింటికి ఆ అధ్యాయం గురించి తండ్రి అడగ్గా, పుత్రుడు అధ్యాయంలో ఉన్న పాతికింటిలోనూ పది లెక్కలు మిగిలి ఉన్నాయని గొణిగాడు. అంతే ! శేషయ్యగారు చేతికందిన గొడుగు తీసుకున్నారు. పార్వతమ్మ అడ్డుపడింది. ఆవేళ అన్నారు శేషయ్య—"నీ యిష్టం వచ్చినట్లు చేసుకో వెధవా ! నీ బాగు, నీ బాధ్యత నువ్వు తెలుసుకోవలసిన వయస్సు వచ్చింది —ఇక చస్తే నీ చదువు గురించి నిన్నడగను ఫో !!"—అప్పటినుంచీ ఈనాటివరకు ప్రసాదు ఎస్సెస్సెల్సీగానీ, ఇంటర్ గానీ, మరోటిగానీ ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యాననో, డిస్టింక్షన్ వచ్చిందనో అని చెబితే—"ఓ !" అంటారు శేషయ్య.

—కనక బి. ఏ. పరీక్ష ఫలితాలు పత్రికలలో వచ్చిం తర్వాతే చెబుదామని నిర్ణయించుకుంటున్నాడు ప్రసాదు. కొడుకు తన సమీపంలో తచ్చాడుతుండడం గమనించిన శేషయ్య— "ఏరా ?" అన్నారు.

"ఓ పదిరోజులపాటు బొంబాయి వెళ్తాన్నా నాన్నా!"

"అక్క డెవరున్నారురా—"

"మా కాలేజీవాళ్లు నలుగురు వెళ్తున్నారు. అందులో ఒకతని బాబాయి అక్కడ ఉన్నారు. వాళ్లింటో దిగుతాం. బొంబాయి తర్వాత, మహాబలేశ్వర్, పూనా చూచి వద్దా మనుకుంటున్నాం నాన్నా !"

"ఎప్పుడు వెళ్తారు—"

# ఒ క బా ట సా రి

''ఎల్లుండి సాయంకాలం బయలుదేరాలని—''

''సరే ! అమ్మ నడిగి డబ్బు తీసుకో—''

నాన్నంటే ఉన్న భయంకొద్దీ ఈల వేయలేదు కాని, మహోత్సాహంతో బయటికి వెళ్ళిపోయాడు ప్రసాదు.

కొంతసేపటికి—పార్వతమ్మ అటు రాగా, శేషయ్యగారు ప్రసాదు యాత్ర విషయం ప్రస్తావించి, అడిగితే వాడికి డబ్బిమ్మన్నారు.

''ఇప్పుడు వీడు వెళ్ళడం ఎందుకట ?'' అని అడిగింది ఆవిడ.

''సరదాగా స్నేహితులతో కలిసి వెళ్ళొస్తాడట !''

''ఏవిటీ—సరదాగా బొంబాయికా !! బోడివెధవ !—రానివ్వండి. నేను చెబుతాను. ఓ ప్రక్కన ఆ ముాడు వేల లోనూ వెయ్యికి పైగా అయిపోయిందే, ఇంకా దాని చదువూ, పెళ్ళి ఉన్నాయే—ఇవన్నీ ఎలాగా అని సతమత మవుతుంటే వీడో వంద తగలేసి బొంబాయికి వెళ్తాడా—''

''పోనీ పార్వతీ—''

''అదేవిటండీ—ఇరవై యేళ్ళు మహరాజులా బ్రతికి ఇప్పుడేమో ట్యూషన్లనీ, మందులనీ, నానా చాకిరీ చేస్తుంటే వీడికి సరదా లేవిటండీ ?''

''ఒక్కొక్క వయస్సులో ఒక్కో సరదా ఉంటుంది. అది అప్పుడే తీరిపోవాలి తెలుసా—''

''మరి మీకు మాత్రం ఆ వయసులో సరదాలు లేవేమిటి—''

నవ్వారు శేషయ్య .... ఏడవఏట అమ్మ పోగా, ఆమె వెళ్ళిపోయిన పదోనెల నాన్న పోగా, స్వగ్రామం విడిచివచ్చి చెన్న పట్నం చేరి అప్పుడు 'అ ఆ' లు మొదలెట్టి మెట్రిక్ ఫెయి లయి, ఒక కోమటి కొట్లో గుమాస్తాగా చేరి, పెళ్ళి చేసు కున్నారు ఆయన. జీవితపు మొదటి మెట్టుమీద అనాథగా అడుగుపెట్టిన ఆయన, అందరిలోనూ తానూ ఒకడుగా అని పించుకోవడానికే అష్టకష్టాలూ పడవలసి వచ్చినప్పుడు—సర దాలకు సందెక్కడ ?—ఆ విషయం పార్వతమ్మకు తెలుసు. అందుకనే ఆ ప్రశ్న అడిగింది.

''ఆ రోజుల్లో కుర్రవాళ్లకు ఇన్ని ఊహ లుండేవి కావనుకో—'' అన్నా రాయన.

''అయితే కావచ్చు కాని, వీడో ఉద్యోగం సంపాదించి కుటుంబానికి సాయపడవలసినవాడు కదా—వాడి బాధ్యతలు వాడికి తెలియవద్దా— ?''

''వాడి ఉద్యోగం !—వాడి సంపాదనా !'' అన్నారు. శేషయ్య— ''వాడి కాళ్లమీద వాడు నిలబడగల్గితే చాలు పార్వతీ .... నా చెయ్యి ఆడినంతవరకూ నా కింకొక్కరి ఆధారం అక్కర్లేదు—''

''హుం .... ఎన్ని చెబుతే నేం .... మీ పట్టుదలే మీది... ఒకప్పుడు నా మాట విన్నారు గనుకనా .... నా మాటే విని ఉంటే ఆ ఏడువేలూ పొయ్యేవా—ఈనా డిట్లా ఉందుమా—'' అని లోపలికి వెళ్ళింది పార్వతమ్మ.

— శేషయ్య నారాయణ కార్ఖానాలో మేనేజరు ఉద్యోగం చేస్తుండగా, పొదుపుగా జీవించి దాదాపు పదివేల రూపాయలదాకా నిలవచేశారు. ఆయన మిత్రు డొకడు తన వ్యాపారం క్రుంగిపోతూన్నదని, తక్షణం గనుక ఏడువేల రూపాయలు ఎవరయినా ఇవ్వకపోతే వ్యాపారం దివాలా తీస్తుం దని, తాను పెళ్ళాం, పిల్లలతో వీథి మీదికి వెళ్ళవలసి వస్తుం దనీ ఏడిచాడు. కష్టాల నెరిగిన శేషయ్య తోటిమానవుడికి చేయూత నివ్వడం తన ధర్మంగా భావించారు. పిల్లలు ఇద్ద రున్నారనీ, వాళ్ల చదువులూ, పెళ్ళిళ్లూ ఉన్నాయనీ, డబ్బు నలా ఇచ్చేయవద్దనీ పార్వతమ్మ కోరింది. కాని ఆమె మాట వినపడలేదు శేషయ్యకు. పత్రమన్నా రాయించుకోకుండా ఏడు వేల రూపాయలు అప్పుగా ఆ మిత్రుడికి ఇచ్చారు.

అలా యిచ్చి ఆరేళ్లయింది. ఆ మొత్తంలో వందయినా వెనక్కు రాలేదు. ''ఆ ఏడువేలూ బ్యాంకిలో ఉంటే ఈ ఆరే ళ్లలో వడ్డీ మాత్రమే వెయ్యి రూపాయ లయ్యేది'' అని పార్వతమ అన్నప్పుడల్లా ''పాపం ! అతడు మాత్రం ఏం చేస్తాడు పార్వతీ .... వ్యాపారం బొత్తిగా పడిపోయింది కదా .... ఏదో ప్రయత్నాలు చేస్తున్నాడు. ఏదయినా కాస్త దారికి వస్తే మన డబ్బు మన కిచ్చేస్తాడు'' అంటూంటారు శేషయ్య.

—కాని ఆరోజు తన మాట వినివుంటే ఈనాడు ఈయ నిలా మందుల సంచులు పట్టుకుని ఊరూరూ తిరగ వలసి వచ్చేది కాదే—అని పార్వతమ్మ బాధ. ఎన్నిసార్లు వెళ్ళ గక్కినా ఆ ఆరాటం తగ్గేదికాదు. ప్రసాదు బొంబాయి యాత్ర విషయంలోనూ అదే అన్పించింది. 'ఆరుగురు పిల్లలు పోయిన తర్వాత అబ్బాయి పుట్టాడు. వాడూ బతికి బట్ట కడతా డనుకోలేదు. కాని అన్ని అరిష్టాలూ దాటి వా డీనాటికో మగాడయి, మోజుపడి బొంబాయి వెళ్తానంటుంటే—తాను, కన్నతల్లి, అభ్యంతరం చెప్పవలసి వస్తున్నదే—దారిద్ర్యం అన్నది ఎంత భయంకరం ! .... ఆయన 'వద్దు'—అంటే అబ్బాయి బొంబాయి వెళ్లడు .... అయినా ఆయన అలా అనలేదు. ఆయనకు డబ్బు పరిస్థితి తెలియకనా .... తాను ఎన్ని అవ స్థలు పడ్డా సరే, కనీసం జీవితంలోకి అడుగుపెట్టేదాకా అయినా అబ్బాయి నిర్విచారంగా ఉండాలని కాబోలు ! .... ఆ కన్నకడుపు తీపి తనకు తెలియనిదా—' అని కూడా అన్పిం చింది పార్వతమ్మకు. అనిపించిన వెంటనే వెళ్ళి ఆయనతో ''ఏమండీ ! ఇందాకా ఏదో అన్నాను కాని .... వాడికో వంద ఇస్తే చాలుతుం దంటారా—?'' అని అడుగుదామని తోచింది. వెంటనే లేచి గబగబా వెళ్ళింది.

శేషయ్య ధోవతి, చొక్కా, కోటూ ధరించి అంగ వస్త్రంమీద వేసుకుంటున్నారు—''పార్వతీ .... ఆ మందుల

సంచి ఇలా తే—! పొన్నేరిదాకా వెళ్లాలి; అక్కడొకతడు 'ద్రాక్షారుణ' కు ఆర్డరిస్తానన్నాడు. బహుశ రాత్రికి వచ్చేస్తాను" అన్నారు. పార్వతమ్మ మాట్లాడకుండా సంచి అందిచ్చింది. చేత బరువైన సంచి పట్టుకుని దారిద్ర్యపు ఎండలో నడిచిపోతూవున్న ఆయనను చూచిన చూపు చెమ్మగిల్లింది.

ఆ రాత్రి పది ఘంటలకు వచ్చారు శేషయ్య—"నాలుగు రోజుల తర్వాత రమ్మన్నాడు ఆ పొన్నేరి అతడు" అంటూ—

ఆ ప్రకటన విన్న పార్వతమ్మ ఉల్లం ఏమాత్రమూ చల్లగా లేదు.

మూడోరోజు పొద్దున్న ప్రసాదు బొంబాయి ఎక్స్‌ప్రెస్‌కు మిత్రులతో బయలుదేరాడు. అతడు బెడ్డింగుతో రిక్షా ఎక్కబోతుండగా అపర్ణ చెప్పింది—"అన్నయ్యా! క్షేమంగా వెళ్లి లాభంగా రా! అలాగే నీ చెల్లాయి కొకటో, రెండో వాయిలు చీరలు తీసుకురా—"

"ఉన్నవి చాలవటే—" అంది వాళ్లమ్మ.

"తెస్తాన్లేవే!" అని రిక్షా ఎక్కాడు తన జీవితంలో మొదటిసారిగా వంద మైళ్ల కన్న ఎక్కువ దూరం ప్రయాణం చేయబోతున్న ప్రసాదు. ఆ రిక్షా వీథి మలుపు తిరిగిం తర్వాత కూడా కాసేపు గుమ్మంలో నిల్చింది పార్వతమ్మ ....

నాలుగవ రోజు సాయంకాలం ఏడు దాటిం తర్వాత శేషయ్య యింటికి వచ్చారు. బట్టలు మార్చుకుని కాళ్లు చేతులు కడుక్కొని సాయంసంధ్య కుపక్రమించారు. పార్వతమ్మ దేవుడి దీపాలు రెండూ వెలిగించింది. శేషయ్యగారి సంధ్య, పూజ ముగిశాయి. శేషయ్యగారికి అరిటాకు పరిచి అన్నం వడ్డించింది పార్వతమ్మ.

"ఏమండీ! మీరో రెండు జతల పంచలు కొనుక్కో కూడదూ?

"అలాగేలే—"

"ఇప్పటికి నాలు గయిదుసార్లు చెప్పాను. మీరేమో 'అలాగేలే' అని వూర్కుంటారు. నలుగురి దగ్గరకూ వెళ్లవలసినవారు కదా—మీకు సరయిన బట్టలు లేకపోతే ఎలా ...."

"అవునవును."

"అలాగని ఈసారి కూడా వూర్కుంటిరా, రేపబ్బాయి రాగానే వాడితోబాటు వెళ్లి నేనే కొని పట్టుకొస్తాను."

"అన్నట్టు అపర్ణేదీ—?" అని అడిగారు శేషయ్య.

"అది స్నేహితురాండ్రతో కలిసి సినిమాకు వెళ్లింది."

"ఓ!" అని కాసేపాగి పలికారు శేషయ్య .... "పార్వతీ—పోయిన వారమే కదూ ఏదో సంగీత కచ్చేరికని వెళ్లి పదింటికి వచ్చింది అపర్ణ ...."

పార్వతమ్మ తల వూపింది.

"అంతకు ముందొకటి రెండు సార్లు కూడా డ్రామా అనీ, మరోటనీ ఇంటికి ఆలస్యంగా వచ్చింది. అమ్మాయిని నువ్వు కాస్త మందలించాలి పార్వతీ!"

".... మొన్నసారి కూడా తన తరగతికంతా సెకెండ్‌గా వచ్చిందండీ అపర్ణ ...."

"చదువు విషయం కాదు నే నన్నది—"

పార్వతమ్మ కనుబొమలు పైకెగిరాయి.

ఇంకా అన్నారు శేషయ్య— "అది చిన్నది. ఆ వయసు మనసుకు బలం చాలా తక్కువ. కనుక మనం దానిని హెచ్చరించుకోవాలి."

"మన కడుపున పుట్టిన బిడ్డ ఎన్నడూ మరోలా ప్రవర్తించదు. ఇదివరలో మన వంశాన ఒక్కరు కూడా...."

"అదికాదు పార్వతీ .... ఎంత మంచి లత అయినా పెద్ద గాలి వీస్తే కనబడ్డ ముళ్లకంచెమీద పడి అల్లుకుపోతుంది.... చాలా పొరబాట్లలో—వ్యక్తి ఆలోచనకన్న పరిస్థితుల ప్రభావం ఎక్కువ—" అని లేచారు శేషయ్య.

ఆ రాత్రి అపర్ణతో వాళ్లమ్మ అరఘంటసేపు మాట్లాడింది.

ఇది జరిగిన రెండు రోజుల తర్వాత, ఒక రాత్రి ఎనిమిది గంటలవేళ, శేషయ్యగారు వీథిలోంచి ఇంటోకి వచ్చి చెప్పులు విడిచారో లేదో—వీధిలో .... "టెలిగ్రాం సార్!" అన్న కేక విన్పించింది. పార్వతమ్మ దేవుడి గదిలో కూర్చునుంది. అపర్ణ నోట్సు వ్రాసుకుంటూంది.

శేషయ్యగారు టెలిగ్రాం నందుకుని చదివారు. గబగబ నడిచి కాళ్లు కడుక్కొని, పూజ గదిలోకి వెళ్లారు. దేవుడి దీపాలు వెలిగించి నమస్కరించి ఇటు తిరిగింది పార్వతమ్మ.

"పార్వతీ! ముకుందరావు ఎవరూ?" అని అడిగారు శేషయ్య.

ముకుందరావు ప్రసాద్ ప్రాణమిత్రులలో ఒకడనీ, మొన్న ప్రసాదు బొంబాయి వెళ్లినప్పుడు ఆ ముకుందరావు వాళ్ల బాబాయి ఇంటోనే దిగుతామని చెప్పాడనీ వివరించిన పార్వతమ్మ, శేషయ్య చేతిలోని కాగితంముక్క వైపు భయంతో చూసింది.

"అమ్మవారు మనల్నింకా పరీక్షిస్తూంది పార్వతీ!" అని తనచేతి కాగితపు బరువును మాటలలోకి మార్చి అందించార్షు శేషయ్య.

కుప్పగా కూలింది పార్వతమ్మ.

"వరుసగా ఆరుగుర్ని పోగొట్టుకున్న తర్వాత వీ డొక్కడు మిగిలా డనుకున్నాను. ఇరవై యేళ్లపాటు మమ్మల్ని మురిపించి మురిపించి ఇప్పుడు తీసుకువెళ్లావా అమ్మా .... కళకళలాడుతున్న నా బాబుకు పరాయి ఊళ్లో కారు ప్రమాదంలో ముగింపా తల్లీ—!' అని రోదించింది ఆమె అంతరంగం.

అది శిశిరం—

—ఇంకో శిశిరం వచ్చి వెళ్లింది.

పార్వతమ్మ ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడ్డం లేదు. శేషయ్యగారు మందుల అమ్మకానికి మునుపటికి మల్లే తిరగలేక పోయారు. ఆయన ట్యూషను కుర్రాళ్లలో ఇద్దరు ఎస్సెసెల్సీ పాసయారు. ఇపుడాయనవద్ద ఇద్దరే కుర్రాళ్లు చదువుకుంటున్నారు.

ఒకరోజు ఆయన ట్యూషన్లు ముగించుకుని దారిలోని అరుణాచలేశ్వరాలయంలోకి అడుగుపెట్టారు. అక్కడ అర్చన వైభవాన్ని చూచి ఆనందించి నెమ్మదిగా ఇంటికి వచ్చారు.

ముందు గదిలో ఎవరో ఒకతడు కూర్చుని ఉన్నాడు.

నుదుట కుంకుమబొట్టుతో, గళాన మంగళసూత్రంతో మధ్య హాల్లో నిలిచివుంది అపర్ణ.

వెక్కిళ్లతో ఒకమూల కూర్చునుంది పార్వతమ్మ.

''నన్ను క్షమించు నాన్నా! మరొక కులం వరుడితో నా పెళ్లిని మీరు అనుమతించరనే భయంతో మీకు చెప్పకుండా నేను ఆయన్ని భర్తగా స్వీకరించాను. ఆయన లేనినాడు నా మనుగడకే అర్థంలేదు. అందుకని నా మనస్సుకు నేనే వెయ్యి సమాధానాలు చెప్పుకుని ఇలా చేయవలసి వచ్చింది .... దేవతల వంటి మిమ్మల్నిద్దరినీ కాదనవలసి వచ్చింది. దురదృష్టవంతు రాలిని—'' అంటున్న అపర్ణ స్వరం కూడా వినకుండా లోప లికి వెళ్లి శేషయ్యగారు—''పార్వతీ!'' అన్నారు.

''పార్వతీ!—అక్కడ నిలుచున్న ఆ ఆడమనిషినీ, ఆ ఇంకో వ్యక్తినీ మనకు తెలియదు. వాళ్లిద్దరినీ వెళ్లిపొమ్మను—''

పార్వతమ్మ గుండె పగిలింది. దేవుడి గదిలో రెండో దీపమూ ఆరింది.

కాసేపటికి ఆ ఇంటో ఆమె ఆయన మాత్రమే మిగిలారు.

ఆ రాత్రి మంచంమీద పడుకున్న పార్వతమ్మ నెల రోజులదాకా లేవలేదు. శేషయ్య మందుల అమ్మకం మాను కున్నారు. ఆయన ట్యూషన్ కుర్రాళ్లు ఇద్దరూ ఇంటికే రాసాగారు. వాళ్లిద్దరిలో పెద్దవాడు నీలకంఠం ఇన్సూరెన్స్ కంపెనీ మేనేజరుగారబ్బాయి—అయిదోఫారం చదువుతున్నాడు. రెండోవాడు—బంగారుశెట్టి ఆఖరబ్బాయి కామేశం—మూడో ఫారం విద్యార్థి.

నెల రోజుల తర్వాత పార్వతమ్మ నెమ్మదిగా లేచి నీడలా తిరగసాగింది. శేషయ్యగారు ఇల్లు విడిచి కదలడంలేదు.

ఒక ఆదివారం పొద్దున కుర్రాళ్లిద్దరికీ చదువు చెబు తున్నారు శేషయ్య. తెలుగు పాఠం చదువుతున్న నీలకంఠం అడి గాడు: ''మరి మేష్టారూ! మహాభారతంలో భీష్ముడావిధంగా ప్రతిజ్ఞ చేయడంవలన తానన్ని కష్టాలూ పడ్డాడు. పైపెచ్చు అందువల్లే పాండవులూ, కౌరవులూ, భారత యుద్ధమూ వచ్చాయి. ఆయన గనుక పెళ్లే చేసుకుని వుంటే ఆయనా సుఖపడేవాడు, భారత యుద్ధం వచ్చేదే కాదేమో, కదండీ?''

శేషయ్య నవ్వారు. ''ఒరేయ్ అబ్బాయ్! భీష్ముడు నీలాటి నాలాటి వాడు కాడు. మహావ్యక్తి. ఆయనలాటివా రనున రించే మార్గం ఒక్కటే—అది ధర్మమార్గం. ఇహ మన కష్ట సుఖా లనేవి అంటావా వాటి స్వరూపం మన ఆలోచనలను బట్టి మారుతుంది. ఇహ భారతయుద్ధమా, అది జరుగ వలసి వున్నది. జరిగింది. అందుకు కౌరవులూ, పాండవులూ వగైరా అంతా కారణమాత్రులే—''అని కాస్సేపాగి— ''అవును—అంతా కారణమాత్రులే!'' అన్నారు. నీలకంఠానికి అర్థమయీ కానట్లుండింది.

అర్థమవకపోతేనేం గాక. వాడు ఆ ఏడు అయిదో ఫారమూ ఆ తర్వాత ఆరో ఫారమూ అద్భుతమయిన మార్కులతో పాస యాడు. పాసయిన సందర్భంలో అయ్యవారికి పండ్లూ, తాంబూలమూ పెట్టి ధోవతుల జత సమర్పించాడు. వాడి తల నిమిరిన శేషయ్యగారి కళ్లలోని మబ్బులను ఒక్కరే గుర్తించారు.

అయిదో ఫారంలో కొచ్చిన కామేశం గాక మరిద్దరు శేషయ్యగారి దగ్గర చదువు చెప్పించుకోసాగారు.

ఒకరోజు మధ్యాహ్నం భోజనంచేసి కునుకు తీశారు శేషయ్య. ఆయనకో కల వచ్చింది.

తనే .... ఎక్కడో కూర్చుని ఉండగా ....ఎర్రటి పావడా గౌనూ వేసుకుని, కిరణంలా వెలిగిపోతున్న అమ్మాయి గెంతు కుంటూ గెంతుకుంటూ వచ్చింది. లేచి అమ్మాయి నెత్తుకో పోయారు శేషయ్య. ఈ లోపుగా గాండ్రుమంటూ వచ్చింది ఒక పెద్ద సింహం. అంత భయంకరంగా వచ్చిన ఆ మృగం ఆ అమ్మాయిని చూడగానే తోక ముడుచుకుని తల వంచుకుని నిల్చుంది. చలాకీగా సింహంమీద కెక్కి ఠీవిగా కూర్చుంది అమ్మాయి. సింహం పరుగెత్తసాగింది. దాని వెంబడే పరు గెత్తసాగారు శేషయ్య ......

ఈలోపుగా పదవసారిగా పిలిచింది పార్వతమ్మ— ''ఏమండీ!'' అని. ఆమె చేతిలో ఓ కవరుంది.

కళ్లు నులుముకుంటూ లేచిన శేషయ్య—''అమ్మవారు కన్పించింది పార్వతీ!'' అన్నారు. అని ఆమె చేతిలోని కవరు అందుకుని, చింపి, ఉత్తరం తీసి చదువుకున్నారు.

''ఎవరిదగ్గరనుండీ?'' అని అడిగింది పార్వతమ్మ.

''మా మందుల కంపెనీ నెల్లూరు ఏజెంటు రాశాడు. ఆ దురదృష్టవంతురాలు—అపర్ణ—ఒక అమ్మాయిని కని సంవత్సరం క్రిందట చనిపోయిందట. దాని మొగుడు తాగుడు లోకి దిగాడట. పోషణలేక కృశించిపోతున్న ఆ ఏడాది పసి కూనను తన దగ్గరకు తీసుకొచ్చుకుని ఇతడు నాకు రాశాడు.''

చీరె చెంగుతో కళ్లొత్తుకుంది పార్వతమ్మ.

జగన్మాతయే తల్లియై, తండ్రియై ఆ పసిపాపను చిరంజీవిగా చేయాలని అర్థించింది ఒక హృదయం.

# స్వాతంత్ర్యం తరువాత తెలుగులో కొత్తపోకడలు

"సుదర్శన"

దేశానికి స్వాతంత్ర్యం వచ్చి పదిహేను సంవత్సరాలయింది. ఇది ఏమంత దీర్ఘకాలం? ఈ కాలంలో ఉత్తమ సాహిత్యం వచ్చిందా లేదా? అన్నప్రశ్నకు ఎవరు ఏ అభిప్రాయ మిచ్చినా అదికేవలం వ్యక్తిగతమైన అభిప్రాయంగానే ఉండి తీరుతుంది. ఒకకొత్త గ్రంథాన్ని ఇవ్వేళ నలుగురూ మెచ్చుకున్నా, వంద లాది ప్రతులు అమ్ముడుపోయినా, అది ఇంకో ముప్ఫై అయి దేళ్లతర్వాత నిలుస్తుందో నిలవదో చెప్పటంకష్టం. అంతేకాదు, ఒక ఉత్తమకావ్యం ఈ పదిహేనేళ్లలో ఒకవేళపుట్టివుండినా అది ప్రస్తుతం ఉన్న అభిరుచుల్ని ఆకర్షించలేకపోవటంతో, దాని రేఖ బయట పడటానికికూడా ఇంకోముప్పైఏళ్లో ఎక్కువ కాలమో పట్టవచ్చు. విమర్శకులు పాఠకులుకూడా ఎప్పుడూ కొన్ని సమకాలికమైన సాహిత్యాభిరుచులకు లోబడి వానిద్వారానే ఒక క్రొత్తకావ్యాన్ని ఆస్వాదించగలుగుతారు. ఒకరకం అభి రుచులు మారి ఇంకోరకం అభిరుచులు ప్రవేశిస్తేగాని, కేవలం అభిరుచులమీద ఆధారపడని శాశ్వతమైన విలువ ఒక కావ్యానికి ఉందో లేదో నిక్కచ్చిగా తేలదు. అభిరుచులు మారడానికీ, నిజమైన విలువ బయడటపడటానికీ పదిహేనేళ్ల బహు స్వల్పకాలం. కనీసం 50 ఏళ్ల వ్యవధిఅయినా అవసరం అనిపి స్తుంది. ఉదాహరణకు— స్వాతంత్ర్యంముందుఉండిన అభి రుచులు ఈ పదిహేనేళ్లలో బాగా మారిపోయాయి; అందు వల్లనే ఈ శతాబ్దపు మొదటి 20 సంవత్సరాలలో వచ్చిన సాహిత్యంలో ఏది నిలిచేది ఏది కాదు అన్ననిర్ణయం ఇవ్వేళ ధైర్యంగా చేసుకోవడానికి వీలవుతోంది. అలానే 1947—62 మధ్య ఏదైనా ఉత్తమసాహిత్యం వచ్చిందా? అన్నవిషయంపై అందరూ అంగీకరించే నిర్ణయం జరగటానికి 1990—2000 దశాబ్దిదాకా ఆగాలి. ఈలోపల క్రొత్తకావ్యాలమీద విమ ర్శలూ అభిప్రాయాలు ఎవరివివాళ్లవిగా మాత్రమే ఉంటాయి.

సాహిత్యంలో విలువలు (Values) వేరు; అభిరుచులు (tastes), తరహాలు (Fashions) వేరు. అభిరుచులు, తర హాలు మారుతూ వుంటాయి. అవి మారినా మారనివే విలువలు. ఒకకావ్యంలోని విలువల్ని గుర్తించటానికి కాలంపట్టుతుంది; ఒకరకం అభిరుచులు మారి యింకోరకం ప్రవేశించినప్పుడు శాశ్వతమైన గుణమేదో - అశాశ్వతమైన ఆకర్షణ ఏదో గట్టిగా తెలిసిపోతుంది. అప్పుడే ఒకకావ్యం యొక్క 'చేవ' బయట పడుతుంది. A good book creates the taste it satisfies. చేవగల కావ్యం క్రొత్త అభిరుచిన్ని తనే సృష్టిస్తుంది. అది ఏటి కెదురీత వంటిది. అలాంటికావ్యం ఏదైనా వస్తే వెంటనే అది సర్వజనగ్రాహ్యం కావడానికి వీల్లేదు. కాని క్రమంగా, అటువంటి కావ్యాలవల్ల, కవులవల్లనే ఒక క్రొత్త ఉద్యమం, క్రొత్త తరహా ప్రారంభమవుతవి కూడా. ఇది కొన్ని దశాబ్దాల్లో జరిగే పని. ఒక్క పదిహేనేళ్లలో ఏమీ తేలదు.

'సాహిత్య విద్యార్థి' చేసిన పరామర్శలో ఆయన ఇంతో అంతో విలువ ఇచ్చిన కావ్యాలు 1947—62 కాలానికి చెందక పోవటం బాగా గమనించదగిన విషయం. 1947 పూర్వమే పేరు తెచ్చుకొని సాహితీరంగంలో స్థిరపడిన కవులూ, రచయి తలూ, తర్వాత కూడా రంగంమీదే ఉండినా, 1947 తర్వాత గొప్ప కావ్యాలేమీ రాలేదు అన్న సంగతే 'సా. వి.' తన వ్యాసంలో తేల్చిన విషయం. పోతే ఆ కవులూ, రచయితలూ ఈ పదిహేనేళ్ల లోనూ, ముఠాల్నీ, వర్గాల్నీ సంతరించుకొని పరస్పరం కలహా నికి కాలు దువ్వుకుంటున్నా రన్నారు. సాహిత్యంలో రాచకీయాలు పెచ్చుపెరగటంతో ప్రాతవాళ్ల శిష్యవర్గాలు, అనుకరణలూ, నకళ్లూ వ్రాసి, గురువుల వారసత్వం తమకు లభించిందని తృప్తిపడుతూ, వాళ్ల ఆశీర్వాదములతో సన్మానాలు, ప్రభు త్వపు బహుమతులు, బిరుదులు సంపాదించుకోవటం జరుగు తోంది. వీళ్లు క్రొత్తగా చెప్పగలిగిందేమీ కనిపించటం లేదన్నారు. ఈ పరిస్థితిలో "ఆడంబరత, అపహరణ, అర్థక్లిష్టత" అన్న మూడు గుణాలు కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయని 'సా. వి.' చేసిన విమర్శ సూటిగానూ, సమంజసంగానూ ఉంది.

కాని, 'అర్థక్లిష్టత'ను గూర్చి ఒక విషయం చెప్పాలి. ఒక కావ్యంయొక్క అర్థక్లిష్టత ఆ కావ్యంయొక్క దోషమైనా కావచ్చు; గుణమైనా కావచ్చు. మనం ప్రస్తుతం అలవాటుపడిన ధోరణిలో ఒక క్రొత్త కావ్యం వ్రాయబడలేదనుకోండి; అప్పుడు కూడా అర్థక్లిష్టతే కనిపిస్తుంది! ప్రతిభగల కవి ఆత్మ విశ్వాసం కలవాడైనప్పుడు తన కావ్యానికి వ్యాఖ్యానం, విమర్శ అన్నీ తనే వ్రాసుకోడు (బెర్నార్డ్ షా లాగ ఆత్మవిశ్వాసంపాలు ఎక్కువైతే తప్ప!). నిండుకుండ ఎప్పుడూ తొణకదు. ద్రష్ట అయిన సాహితీ పరుడు బాజాభజంత్రీలను గూర్చి ఎక్కువ పట్టించుకోడు! మరొకరకం కవి, ప్రతిభావంతుడై ఉంటాడు. కాని ప్రచారం చేయాలి, నేను విప్లవం తెస్తున్నానని అందరికీ తెలియాలి. నా కవిత్వం ఎలా క్రొత్తదో నేనే జనానికి వివరిస్తాను అంటూ, ఆ సంగతే కవిత్వంగా వ్రాస్తాడు. అతను నిజంగా చేసిన దానికంటే చేస్తానని చెప్పటమే క్రొత్తతరహాలో అలా చెప్పటమే ఎక్కువగా కనిపిస్తుంది. అలాంటి కవిని "యుగకర్త" అనటంకంటె 'ఫాషన్—కర్త' అనటం సబబు. ఏదైనా ఉత్తమ సాహిత్యం వస్తే మొదటిరకం ప్రతిభావంతునినుంచే రావాలి. రెండవ రకం ప్రతిభావంతుడు ఒక సంచలనానికి దోహదం మాత్రమే చెయ్యగలడు. పై కారణాలవల్ల ఒక రకం సాహిత్యాన్ని 'అర్థక్లిష్టత'ను బట్టి త్రోసి రాజనటం భావ్యంకాదు.

1947 తర్వాత సాహిత్యరంగంలో అవ్యవస్థ ('అరాచకం' అన్నారు 'సా. వి') ఏర్పడినమాట వాస్తవం. ఇది అభిరుచులు, తరహాలు మారుతున్న వనటానికి సూచన. మారుతున్న అభిరుచుల్లో ముఖ్యంగా నాకు కనిపించేది—పద్య కావ్యాలనుంచి పాఠక లోకం గద్య కావ్యాలవైపు మనసు మళ్లించుకోవటం. ఇందులో దుఃఖించవలసిన కారణం కనిపించదు—(పండితులూ, మేధావులూ గ్రాంథిక భాషావాదులూ, ఉపాధ్యాయులూ దుఃఖిస్తున్నారు కాబోలు!) ఉదాహరణకు: 1940 దశాబ్దిలో కాలేజి విద్యార్థులు ఎక్కువగా చదువుతూ ఉండినది భావ కవిత్వం. 1960 లో వాళ్లు ఎక్కువగా చదువుతున్నది నవలా సాహిత్యం. భవిష్యత్పరిణామాన్నిగూర్చి సాహసించి ఒక అభిప్రాయానికి రావాలంటే రాబోయే యుగం నవలాయుగం అని చెప్పక తప్పదు. ఛందోనియమాల్ని పాటించము అనే కవులు 1947 కు పూర్వమే బయలుదేరటం కూడా రాబోయే గద్య యుగానికి నాందీ ప్రస్తావనే అనిపిస్తుంది. అయితే కవిత్వం గతేమిటి? అని ప్రశ్నిస్తే దీర్ఘమైన పద్య కావ్యాల్ని ఇకమీద నవలల దృష్టితోనే చూడవలసి వస్తుంది. కాగా రాబోయే 'కొత్త నవల' గద్యమే అయినా 'కవిత్వం' స్థాయిని అందుకునే సూచనలు ప్రబలంగా ఉన్నాయనీ తోస్తుంది. ఆంగ్లసాహిత్యంలో ఫాక్నర్, లారెన్స్, జాయ్స్, వర్జీనియ వూల్ఫ్ వ్రాసిన నవలలు 'కవిత్వ' స్థాయిని అందుకునే నవలలు. Prose-poems. తెలుగులో 'వేయి పడగలు' ఈ కోవకు చెందిన నవల. దానిని గూర్చిన, సరియైన విమర్శ ఇంతదాక రాలేదు. అందుకు అభిరుచులు మారడం అవసరం. శ్రీ సత్యనారాయణగారు "రామాయణం నిలవకపోతేనేం? వేయిపడగలు నిలుస్తుంది" అన్న వాక్యంలో ఎంతైనా సత్యం ఉంది!

క్రొత్తరకం నవల విషయం స్పృశిస్తూ, 'సా. వి.' తన వ్యాసంలో ఎగ్జిస్టెన్షలిజమ్‌ను గూర్చి కొన్ని వాక్యాలు వ్రాశారు. ఒక క్రొత్తవాదాన్నిగూర్చి, అది ఇంకా చాలమందికి తెలీని పరిస్థితిలో, కేవలం కొన్నివాక్యాలు వ్రాసివూరుకోవటం, క్లిష్టమైనదాన్ని ఏవో నాలుగు ముక్కల్లో తేల్చివేయటం, అపోహలకూ, దురభిప్రాయాలకూ మాత్రమే దారితీస్తుంది. ఎగ్జిస్టెన్షలిజమ్ కేవలం జీన్‌పాల్‌సార్త్రే యొక్క దృక్పథమేకాదు. దీనికి నాస్తికత్వం, ఆస్తికత్వం కూడా కాదు ముఖ్యం. ఎగ్జిస్టెన్షలిస్టులైన తాత్త్వికుల్లో, రచయితల్లో నాస్తికులూ (సార్త్రే నాస్తికుడు) ఉన్నారు. ఆస్తికులూ (మూల పురుషుడు కర్కెగార్డ్ ఆస్తికుడు) ఉన్నారు. (చూ. Existentialism and Religious Belief by Roberts). ఎగ్జిస్టెన్షలిజమ్ దృక్పథానికి మూలం "నేను" అన్న వస్తువును గూర్చిన జిజ్ఞాస. Existence precedes Essence అన్నది మూల సిద్ధాంతం. భావాలు, ఊహలు, తర్కం, నమ్మకాలు, కట్టుబాట్లు అన్నీ "నేను" తర్వాతివే అని! నైతిక సూత్రాలుకూడా అంతేమరి. అయితే ఈ "నేను" ఏమిటి ? మనం "స్వార్థం" అంటామే అదా? కాదు! "నేతి, నేతి" అనుకుంటూ జిజ్ఞాస చేసుకుంటూ వెళ్ళవలసిందే. (దీనికీ మన వేదాంతదృక్పథానికీ ఎక్కువ దూరం లేదు). చివరకు మిగిలేది సార్త్రేప్రకారం: ఒక వ్యక్తి "నేను"గా చేసే కర్మ, అదే ఆ వ్యక్తికి సంపూర్ణ స్వాతంత్ర్యసిద్ధి. బాధ్యతా, ఫలితమూ రెండూ "నేను" కు చెందినవే. మరి ఈ విముక్తి ప్రసాదించే "నేను" కూ భగవంతుడికీ సంబంధంలేదా? అని ప్రశ్నిస్తే సార్త్రే "ఉందో లేదో నాకు అవసరంలేదు" అంటాడు. ఈ దృక్పథంతో సార్త్రే చిత్రించే పాత్రలు ఎలాంటివంటే— "నేను" అనే ఆత్మ సాక్షాత్కారం పొందలేక మథనపడే వ్యక్తులు: వాళ్ళు చిత్తశుద్ధి లోపించినట్టి (Bad Faith) తో కర్మ చేస్తూవుండే అసమగ్ర జీవులు. నవలద్వారా సార్త్రే చూపించే మార్గం—సమగ్రంగా చిత్తశుద్ధితో కర్మ చెయ్యమని, నీతి—అవినీతి, ధర్మాధర్మ భావ సంఘర్షణలోపడి అసమగ్ర జీవిగా, అస్వతంత్రజీవిగా మనవద్దనీ హెచ్చరిక మాత్రమే!

ఈ దృక్పథంతో ఆ రచయితలు ఉద్దేశించి వ్రాసినా, వ్రాయకపోయినా తెలుగులో వచ్చిన నవలలు—బుచ్చిబాబు

"చివరకు మిగిలేది", గోపీచంద్ "మబ్బుల మరకలు". భాస్కరభట్ల కృష్ణారావు ఎగ్జిస్టెన్షలిజమ్‌ని తెలుగులోకి తీసుకురావాలని ఉద్దేశపూర్వకంగా చేసిన భగీరథయత్నం—"వెల్లువలో పూచిక పుల్లలు"—విఫలమైందనే చెప్పాలి. ఆ నవలలో ఎగ్జిస్టెన్షలిజమ్ బదులు బాధ్యతా రాహిత్యం, పరారీతత్వం (escapism) వ్యక్తమయ్యాయి. తను వ్రాసిన మూడు నవలల్లో ఆయన తీసుకున్న సమస్య ఒక్కటే—ముగ్గురు యువతులూ, ఒక యువకుడూ—ఈ సమస్యమీద మొదటి రెండు నవలలు 'వింత ప్రణయం', 'యుగసంధి' మూడవదైన "వెల్లువలో......" కంటె అర్థవంతంగా, బాధ్యతాయుతంగా ఉన్నాయి.

"చివరకు మిగిలేది" అచ్చంగా ఎగ్జిస్టెన్షలిస్ట్ నవల. పేరులోనే వుంది ఆత్మాన్వేషణ. "నేను" స్వరూపం ఏమిటో దాన్ని సాక్షాత్కరింపజేసుకుని, సమాధానపడేదాకా దయానిధికి శాంతీ, సౌఖ్యమూ లేదు. పుట్టుకతో అంగవైకల్యం కలిగిన వ్యక్తి ఉన్నాడు. తనకు అంగవైకల్యంలేదనీ, తను అందరిలానే ఉన్నాననీ నమ్మటానికి ఎంతగా ప్రయత్నించినా అడుగడుగునా ఆ కఠిన సత్యం గుర్తు వస్తూంటుంది: చివరకు ఆ విషయాన్ని మనస్ఫూర్తిగా అంగీకరించి "అంగవైకల్యం వుంటేనేం? నేనూ మనిషినే!" అన్న ఆత్మవిశ్వాసానికి అతడు రాగలుగుతాడు. "చివరకు మిగిలేది" లోని దయానిధి ఇలాంటివాడు. అతని తల్లి పతివ్రత కాదు. ఇది పుట్టుకతో వచ్చే అంగవైకల్యంలాంటిది. పోగొట్టుకోవడానికి వీల్లేనిది. భార్య చెడ్డదైతే విడాకులిచ్చి సంబంధం లేదనవచ్చు. కాని, తల్లి అటువంటి వ్యక్తి అయినప్పుడు అది వదలించుకొనలేని, వ్యక్తిత్వంలో భాగమైన సంగతి. చివరకు దయానిధి పతిత అయిన కోమలిని స్వీకరించటంతో 'తనతో తను సమాధానపడి' శాంతిని సాధిస్తాడు. సమగ్రంగా, సత్యపూర్ణంగా చిత్రింపబడిన ఆత్మాన్వేషణ వుంది ఈనవలలో. దీనికీ, నీతి—అవినీతి ప్రసక్తికీ సంబంధంలేదు! కాని ఈ నవలని చలం నవలల కోవలో అర్థం చేసుకునే వాళ్ళున్నారు. చలం నవలలు ఎగ్జిస్టెన్షలిస్ట్ నవలలుకావు. చలం సాంఘికమైన కట్టుబాట్లను, నీతినీ విమర్శిస్తానంటాడు, సడలిస్తానంటాడు తన నవలల ద్వారా! నిజమైన ఎగ్జిస్టెన్షలిస్టు తను చేసిన కర్మనే ఇంకొకర్ని చెయ్యమని ఎన్నడూ చెప్పడు. అలా చెప్పటం, వ్యక్తి ఆత్మాన్వేషణకు అడ్డు రావటమే అవుతుంది! 'చివరకు మిగిలేది' ఒక వ్యక్తి ఆత్మాన్వేషణ ఎలా జరిగిందో మాత్రమే సూచిస్తుంది. ఆ వ్యక్తి ఆంతర్యాన్ని సానుభూతితో అర్థం చేసుకొమ్మంటుంది. ఆ వ్యక్తి చేసిన కర్మను ఆచరించమని చెప్పదు.

అలాగే "మెరుపుల మరకలు"లోని ఉషారాణి. ఆమె పోయిన పోకడలో అడుగడుగునా ఆత్మవిశ్వాసం, స్వచ్ఛంద ప్రవృత్తి, మానవత్వం కనిపిస్తాయి. 'భయం, సంశయం, ఏ కోశానాలేవు. కేవలం శారీరిక తృప్తికోసం 'యావ' లేదు. సమగ్ర వ్యక్తిత్వంతో, నీతి విరుద్ధంగానే అయినా, ఆమె అన్వేషణ సాగటంవల్ల ఆమె చివర యోగిని కాగలిగింది.

పై రెండు నవలలూ, మరికొన్నీ ఈ 1947—62 కాలంలో వచ్చిన మంచి కావ్యాలనీ, అవి క్రొత్తదనాన్ని తెలుగు సాహిత్యంలో ప్రవేశపెట్టాయనీ నా అభిప్రాయం. మొదటే చెప్పినట్లు ఏ అభిప్రాయంకాని, ఇప్పట్లో అది కేవలం వ్యక్తిగతాభిప్రాయంగానే ఉండితీరుతుంది. క్రొత్త సాహిత్యం విషయంలో కనీసం ముప్ఫైఏళ్ళు పోవాలి ఏది నిలుస్తుందో, నిలవదో తెలుసుకోవటానికి.

"చివరకు మిగిలేది", గోపీచంద్ "మబ్బుల మరకలు". భాస్కరభట్ల కృష్ణారావు ఎగ్జిస్టెన్షలిజమ్‌ని తెలుగులోకి తీసుకురావాలని ఉద్దేశపూర్వకంగా చేసిన భగీరథయత్నం—"వెల్లువలో పూచిక పుల్లలు"—విఫలమైందనే చెప్పాలి. ఆ నవలలో ఎగ్జిస్టెన్షలిజమ్ బదులు బాధ్యతా రాహిత్యం, పరారీతత్వం (escapism) వ్యక్తమయ్యాయి. తను వ్రాసిన మూడు నవలల్లో ఆయన తీసుకున్న సమస్య ఒక్కటే—ముగ్గురు యువతులూ, ఒక యువకుడూ—ఈ సమస్యమీద మొదటి రెండు నవలలు 'వింత ప్రణయం', 'యుగసంధి' మూడవదైన "వెల్లువలో......" కంటె అర్థవంతంగా, బాధ్యతాయుతంగా ఉన్నాయి.

"చివరకు మిగిలేది" అచ్చంగా ఎగ్జిస్టెన్షలిస్ట్ నవల. పేరులోనే వుంది ఆత్మాన్వేషణ. "నేను" స్వరూపం ఏమిటో దాన్ని సాక్షాత్కరింపజేసుకుని, సమాధానపడేదాకా దయానిధికి శాంతీ, సౌఖ్యమూ లేదు. పుట్టుకతో అంగవైకల్యం కలిగిన వ్యక్తి ఉన్నాడు. తనకు అంగవైకల్యంలేదనీ, తను అందరిలానే ఉన్నాననీ నమ్మటానికి ఎంతగా ప్రయత్నించినా అడుగడుగునా ఆ కఠిన సత్యం గుర్తు వస్తూంటుంది: చివరకు ఆ విషయాన్ని మనస్ఫూర్తిగా అంగీకరించి "అంగవైకల్యం వుంటేనేం? నేనూ మనిషినే!" అన్న ఆత్మవిశ్వాసానికి అతడు రాగలుగుతాడు. "చివరకు మిగిలేది" లోని దయానిధి ఇలాంటివాడు. అతని తల్లి పతివ్రత కాదు. ఇది పుట్టుకతో వచ్చే అంగవైకల్యంలాంటిది. పోగొట్టుకోవడానికి వీల్లేనిది. భార్య చెడ్డదైతే విడాకులిచ్చి సంబంధం లేదనవచ్చు. కాని, తల్లి అటువంటి వ్యక్తి అయినప్పుడు అది వదలించుకొనలేని, వ్యక్తిత్వంలో భాగమైన సంగతి. చివరకు దయానిధి పతిత అయిన కోమలిని స్వీకరించటంతో 'తనతో తను సమాధానపడి' శాంతిని సాధిస్తాడు. సమగ్రంగా, సత్యపూర్ణంగా చిత్రింపబడిన ఆత్మాన్వేషణ వుంది ఈనవలలో. దీనికీ, నీతి—అవినీతి ప్రసక్తికీ సంబంధంలేదు! కాని ఈ నవలని చలం నవలల కోవలో అర్థం చేసుకునే వాళ్లున్నారు. చలం నవలలు ఎగ్జిస్టెన్షలిస్ట్ నవలలుకావు. చలం సాంఘికమైన కట్టుబాట్లను, నీతినీ విమర్శిస్తానంటాడు, సడలిస్తానంటాడు తన నవలల ద్వారా! నిజమైన ఎగ్జిస్టెన్షలిస్టు తను చేసిన కర్మనే ఇంకొకర్ని చెయ్యమని ఎన్నడూ చెప్పడు. అలా చెప్పటం, వ్యక్తి ఆత్మాన్వేషణకు అడ్డు రావటమే అవుతుంది! 'చివరకు మిగిలేది' ఒక వ్యక్తి ఆత్మాన్వేషణ ఎలా జరిగిందో మాత్రమే సూచిస్తుంది. ఆ వ్యక్తి అంతర్యాన్ని సానుభూతితో అర్థం చేసుకొమ్మంటుంది. ఆ వ్యక్తి చేసిన కర్మను ఆచరించమని చెప్పదు.

అలాగే "మెరుపుల మరకలు"లోని ఉషారాణి. ఆమె పోయిన పోకడలో అడుగడుగునా ఆత్మవిశ్వాసం, స్వచ్ఛంద ప్రవృత్తి, మానవత్వం కనిపిస్తాయి. 'భయం, సంశయం, ఏ కోశానాలేవు. కేవలం శారీరిక తృప్తికోసం 'యావ' లేదు. సమగ్ర వ్యక్తిత్వంతో, నీతి విరుద్ధంగానే అయినా, ఆమె అన్వేషణ సాగటంవల్ల ఆమె చివర యోగిని కాగలిగింది.

పై రెండు నవలలూ, మరికొన్నీ ఈ 1947—62 కాలంలో వచ్చిన మంచి కావ్యాలనీ, అవి క్రొత్తదనాన్ని తెలుగు సాహిత్యంలో ప్రవేశపెట్టాయనీ నా అభిప్రాయం. మొదటే చెప్పినట్లు ఏ అభిప్రాయంకాని, ఇప్పట్లో అది కేవలం వ్యక్తిగతాభిప్రాయంగానే ఉండితీరుతుంది. క్రొత్త సాహిత్యం విషయంలో కనీసం ముప్ఫైఏళ్లు పోవాలి ఏది నిలుస్తుందో, నిలవదో తెలుసుకోవటానికి.

# దుఃఖ యాత్ర

శ్రీ తుమ్మపూడి కోటేశ్వరరావు

నా భ్రుకుటి మధ్యమున చిరంతన మరీచి
ఎప్పుడెప్పుడు వెల్గునో ఎఱుగలేక
మాయదునకండ్లు చీకట్లు ముసరుకొనును
పథముతోచని ఈ యాత్మ పరితపింప

ఇదియొక ముండ్లడొంక ఇరులేచినవిట్లు దిశాంచలమ్ములన్
గదుముచు వచ్చెడిన్ ప్రళయకంధరముల్ వితతోగ్రఝుంఝులన్
చెదరెడు గుండెతోడ పయనించుచు ఎచ్చోగా రాలిపోదునా!!
సదమలమైన నీ వెలుగుచాయయు తోచని కారుచీకటిన్

కడు దవ్వుదవ్వునన్ విమలకాంతి ఎదో కనిపించు నీవటం
చెడ ముదమంది బాటబడి చెచ్చెర పగ్గాలు వాఱి రాగ నా
అడుగులు బొబ్బలెక్కెను-ప్రయాణము సాగదు-నీవు తోచ వె
ప్పుడో దయరాకపోదని ప్రభూ! పయనింతును దుఃఖమూర్తినై

ఈ పరితప్తమౌ హృదయమే దివసానకు చల్లనౌనో గా
నీ పడలేనయా ఎడద నిత్యము పొందుచున్న యట్టి రా
రాపిడికిన్ భవచ్చరణరమ్యసరోజపరాగ మార్చునే
శ్రీ పరిణద్ధ కాంతి సుపరీవృత చంద్రకళాలికస్థలా !

పరిరంభం బొనరింతు తావక పదాబ్జాతంబులన్ బట్టి యు
త్సరసీజాక్ష గళత్స్రవంతికలలో తూలించి రవ్వంత నీ
మెఱపుం గాంతుల కోసమై బ్రతుకు స్వామీ కారుచీకట్లలో
పరిదీనాకృతి నీడ్చుచుంటిని కృపావ్యావర్తితాపాంగకా!!

# మహత్తర పరివర్తన పథం - VI

## [భారతదేశంలో వ్యవసాయము]

శ్రీ జాన్ స్ట్రాచీ

ఇప్పుడు నేను భారతదేశపు రెండు, మూడు ప్రణాళికలను గురించి మాట్లాడుతాను. అంకెలు అర్థములేనివి కావు. భారతీయులు గూడా తమ పెట్టుబడిని పెంచుకో గలిగారు. ఏ దేశమైనా సరే, విధిగా తన పెట్టుబడిని హెచ్చు రేటు చొప్పున పెంచుకోవలసి ఉంటుంది. తాము తమ పెట్టుబడి రేటును తమ జాతీయ ఉత్పత్తిలో (రెండవ ప్రణాళిక పూర్తి అయ్యేనాటికి) 8% దరిదాపులకు పెంచుకోగల్గినామని భారత ప్రణాళికా నిర్మాతలు నాతో చెప్పారు. మూడవ ప్రణాళిక పూర్తి అయ్యేటప్పటికి దీనిని 11% దాకా పెంచాలనుకుంటున్నారు. నాల్గవ ప్రణాళిక పూర్తి అయ్యేసరికి ఇది 16% కావాలని వారి ఆశ. ఈ రకమైన అభివృద్ధిని గురించి హెచ్చుమంది ఆర్థికవేత్తలు కలిగివున్న అభిప్రాయములతో దీనిని మీరు పోల్చవచ్చును. జాతీయ ఉత్పత్తిలో 10—12 శాతం పెట్టుబడి రేటు సాధించినప్పుడే ఒక దేశపు అభివృద్ధిలో పని జరుగుతున్నట్లని వారు అంటారు. అప్పుడే నిజమైన అభివృద్ధికి అంకురార్పణ జరుగుతోంది. భారతీయులు ఇంకా అక్కడిదాకా రాలేదు. ఈ పంచవర్ష ప్రణాళిక కాలంలో అక్కడికి రావాలని ఆలోచిస్తున్నారు.

ఈ రకమైన పెట్టుబడి రేటు వారి జాతీయ ఉత్పత్తిలో సం॥ ఒకటికి ఏ రకమైన అభివృద్ధిని వారికి సమకూర్చి పెడుతున్నది? ఇప్పుడు తాము తమ జాతీయ ఉత్పత్తిని సం॥ ఒకటికి 4% చొప్పున పెంచుకోగల్గుతున్నామని భారత గణాంకవేత్తలలో ప్రముఖులు చెబుతున్నారు. వచ్చే పంచవర్ష ప్రణాళికలో ఈ రేటును 6% దాకా పెంచుకోగలమన్న ఆశ గూడా వారి కుంది. ఇది నిస్సంశయంగా—ఇది నేను దాటవేయదంలేను.—చైనావారు తాము 1952—58 సం॥ల మధ్య సాధించినట్లు చెప్పుకుంటున్న 12% సాలుసరి రేటు కన్నా తక్కువగా ఉంది.

అయితే భారతీయుల ఈ ప్రగతి—ఇప్పుడు 4% గా ఉన్నది, 6% వరకు పెరగడము—నిజముగా బాగా తక్కువగా ఉన్నదా? ప్రపంచంలో సాధింపబడుతున్న ప్రగతులతో పోల్చి చూస్తే ఈ రేటు తక్కువగానే ఉందనవలసి ఉంది. జాతీయ ఉత్పత్తిని రష్యా పెంచుకుంటున్నంత తొందరగా ఏ దేశము పెంచుకోలేకపోతున్నదని తరచు అనుకుంటారు. కాని అది నిజముకాదు. మనము అసలు విషయాన్ని తెలుసుకోవలసి ఉంటుందని నేను భావిస్తున్నాను. (అది మనలో కొందరికి నచ్చకపోవచ్చును). ఇప్పుడు ప్రపంచంలో జాతీయ ఉత్పత్తిని శీఘ్రం పెంచుకుంటున్న దేశం జపాను. నిరుడు ఈ ఉత్పత్తిని సం. ఒకటికి 17% చొప్పున పెంచగల్గినట్లు వారు చెబుతున్నారు. ఇది నిజము కావచ్చును. కాకపోవచ్చును. అది నాకు తెలియదు. ఇది ఆశ్చర్యకరంగా, నమ్మ శక్యంకానిదిగా కన్పిస్తున్నది. కాని వారు శీఘ్రగతిని ఈ ఉత్పత్తిని పెంచుకుంటున్నది మాత్రము నిజము.

ఇప్పుడు భారతీయులు మూడవ ప్రణాళికలో సాధించవలసివున్న 6% రేటు గూడా 18 సంవత్సరాలలో వారి జాతీయ ఉత్పత్తిని రెట్టింపు చేస్తుంది. అట్లా ఈ రేటు గూడా రెండు పది సంవత్సరాల లోపల చెప్పుకోతగిన ఫలితాలను తెచ్చిపెడుతుంది. ఎప్పుడూ దారిద్ర్యంలో ఉంటూవున్న మనుష్యులకి ఈ 20 సంవత్సరాలు అతి దీర్ఘమైన కాలంగా కన్పించవచ్చును. కాని భారతదేశం చరిత్ర దృష్ట్యా అది అల్పమైన కాలము. ఆ మాటకు వస్తే, చైనా చరిత్రనుబట్టి చూచినా, 18 సం. లలో జాతీయ ఉత్పత్తిని రెట్టింపు చేయడం దిగ్భ్రాంతిని కల్గించే వేగము గల ప్రగతి అనే చెప్పవలసి ఉంటుంది. అక్షరాలా కొన్ని శతాబ్దాలపాటు ఈ రెండు బృహద్దేశాల జీవన ప్రమాణము ఒకసారి లేస్తూ, ఒకసారి పడుతూ, ఊగిసలాడుతూ వచ్చాయి. వానికి ఒక ప్రత్యేక లక్షణం అంటూ ఏమీ లేదు. ఒక ప్రత్యేక ముఖంగా గాని, మరో విధంగాగాని అది జరుగలేదు. అందువల్ల ప్రపంచంలోని ఇతరదేశాల ప్రస్తుతపు అభివృద్ధి రేటులతో పోల్చిచూస్తే భారతీయ ప్రగతి మందకొడిగా ఉన్నట్లు కన్పించినా, భారత చరిత్ర దృష్ట్యా, లేక ఏ గత చరిత్ర దృష్ట్యా అయినా, ఆ అభివృద్ధి విపరీతమైన వేగం కలది అని జ్ఞాపకం ఉంచుకోవాలి.

భారతీయులు నిజంగా విజయము పొందబోతున్నారా? వారు నిజముగా ఈ 6% చొప్పున ప్రగతిని సాధించబోతున్నారా? సహజముగా ప్రత్యుత్తరము అనేక విషయములమీద ఆధారపడి ఉంటుంది—రాజకీయ స్థిరత్వము, ఏకమత్యము మొదలగునవి. ఇవి విధిగా ఉండవలసినవి. అయితే నేను రెండు ముఖ్య విషయాలను ఎత్తుకుంటాను. వీటిని మామూలుగా బయటికి తీసుకురారు. కాని ఇవి చాలా ముఖ్యమయినవని నా అభిప్రాయము. ఒకదానికి ఒకదానికి దగ్గర సంబంధముఉంది. ఒకటి భారతదేశపు వ్యవసాయము — దాని విషయములో వారు సాధించకలిగే అభివృద్ధి ఎంతో అది. తరువాత ఇతర దేశాలనుండి వారు పొందగలిగిన సహాయము ఎంత, వారు దిగుమతి చేసుకోగలిగిన పెట్టుబడి ఎంత?

నేను మీకు యిచ్చిన అన్ని అంకెలు ఒకే ఒక ముఖ్యమైన అంకెమీద ఆధారపడి ఉన్నాయని భారత ప్రణాళికా కర్తలు అంటున్నారు. వ్యావసాయోత్పత్తిని సం. ఒకటికి 4% చొప్పున పెంచుకోగలరా లేదా అన్న దానిమీద ఇది ఆధారపడి ఉంది. వారి పారిశ్రామిక పథకం విజయం పొందటానికి ఇది చాలా ముఖ్యమైనది. భారతదేశపు జనసంఖ్య శీఘ్రం

# మహత్తర పరివర్తనము - VI

పెరుగుతోంది. సం. ఒకటికి 2% చొప్పున పెరుగుతోంది. (సింగపూరులో పెరుగుతున్నంత తొందరగా పెరుగడములేదు.) కాని, భారతదేశంయొక్క జనసంఖ్య పెరుగుదల రేటును గూర్చి భయపడవలసిన పనిలేదు. జనులు మరిచిపోతూ ఉంటారు. ఉదాహరణకు అమెరికా జనసంఖ్య కూడా దాదాపు ఇదే రేటులో పెరుగుతోంది. అంతమాత్రంతో అమెరికా పసిబిడ్డల వెల్లువలో దివాళా తీయబోతోందని ఎవరు అనటం లేదు. త్వరితగతిని పెరుగుతున్న తన జనాభాను తనకు ఉన్న అమితమైన సంపదతో సర్దుబాటు చేసుకోవడం అమెరికాకు ఎంతో తేలిక అన్నది పూర్తిగా నిజము. అయినా ఈ విషయం చెప్పవలసిన విషయము. ఎందుచేతనంటే అమెరికావారే ముఖ్యంగా ఈవిధంగా అనే పిలుపుంది. "భారతదేశానికి సహాయముచేసి ఏమి లాభము ? ఏ సహాయము చేసినా దానిని భయంకరమైన ఈ పసిబిడ్డల వెల్లువ పీల్చివేస్తుంది." ఆమాట కొస్తే అమెరికలో గూడా "పసిబిడ్డల వెల్లువ" ఇంత "భయంకరం" గాను ఉంది. ఏమైనా సాలుకు 2% చొప్పున భారతదేశపు జనాభా పెరుగుదల ఆహార పదార్థాల సరఫరా పెరుగుదలను అతి ప్రధానమైన విషయంగా చేస్తోంది. వారు తమ ఆహారోత్పత్తిని సం. ఒకటికి 4% చొప్పున పెంచుకోటము ముఖ్యము. అప్పుడు కాని తల ఒకటికి ఆహారము సం. ఒకటికి 2% చొప్పున వికరంగా పెరగటము సాధ్యపడదు. వారు ప్రతి సంవత్సరము 2% అధిక జనసంఖ్యకు ఆహారాన్ని సమకూర్చడము ఒక్కటే గాక అంతకంటె ఎక్కువగా కూడా చేయవలసి ఉంది. వారు తమ దేశాన్ని పారిశ్రామికము చేయదలిస్తే పల్లెల నుండి పట్నాలకు జనము ఎక్కువగా ఎక్కుతారు. అప్పుడే ఈ కదలిక భారతదేశంలో వేగంగా సాగుతోంది. ఒక నెల రోజుల క్రిందట దీన్ని గూర్చి కొంత చూచాను. కొంత విన్నాను. అందువల్ల అక్కడి ఎక్కువ జనాభాకు ఆహారాన్ని సమకూర్చడమే కాక ఆ ఎక్కువ జనాభాలో పట్టణాలలో నివసించబోతూ వారంతటవారు ఆహారాన్ని ఉత్పత్తి చేసుకోని ఎక్కువ భాగాన్ని పోషించవలసి ఉంటుంది. వ్యవసాయకాభివృద్ధి ముఖ్యముగా అవసరమయినది.

మార్గాంతరము ఏమిటి ? ఇతర దేశాలనుండి ఆహార ధాన్యాలను కొనడము. అత్యవసర పరిస్థితులు ఏర్పడితే ఆ పని వారు చేయవచ్చు. చైనావారు ఈ సంవత్సరం ఆపని చేస్తున్నారు. అందువల్ల వారి యిక్కట్లు నిజమే అయిఉండాలి. లేకపోతే వారు తమకు ఉన్న పరిమితమయిన విదేశీ ద్రవ్యాన్ని కెనడా, ఆస్ట్రేలియా గోధుమలను కొనడముమీద ఇంత ఇదిగా వెచ్చిస్తూ ఉండరు. ఈ వెచ్చింపు పెద్ద ఎత్తున జరుగుతున్నది. ఈ ఇక్కట్టే గనుక లేకపోతే వారు యంత్రాలను, లేకపోతే మీ మలయా రబ్బరును, ఇంకా పరిశ్రమలకు కావలసివచ్చే అన్ని రకాల సామగ్రులను కొని ఉండేవారు. కాని చైనాలో వ్యవసాయం ఇక్కట్లుంపాలైనందువల్ల విదేశాలలో గోధుమలను వారు కొనవలసినవారైనారు. (కొన్ని సంవత్సరాల క్రిందట భారతదేశము కూడా ఇట్లాగే చేయవలసి వచ్చింది). వారిట్లా చేయవచ్చు. కాని అభివృద్ధిచెందుతూ ఉన్న ఒక దేశానికి తనకు, లభిస్తున్న పరిమితమయిన విదేశీద్రవ్యాన్ని ఇట్లా ప్రజల భోజనార్థము వినియోగించటము నాశనాన్ని కొనితెచ్చుకోవడమే.

అందువల్లనే భారతీయులు యితర దేశాలనుండి ఆహార ధాన్యాలను కొనకుండా ఉండటానికి శాయశక్తులా ప్రయత్నము చేస్తున్నారు. యంత్రాలను, యంత్ర పరికరాలను, కొత్త ఉక్కు కర్మాగారాలను, భారీ విద్యుత్ కర్మాగారాలను, ఇంకా పరిశ్రమలను స్థాపించుకొనే మొదటి దశలలో కావలసిన అనంతమైన సామగ్రిని, కొనుక్కోడానికి తమ చేతికి అందే ప్రతి ఒక్క రూపాయి వారికి కావలసివుంది. ఇప్పుడు ఇందులో ఏదో ఒక్క ముఖ్య విషయాన్ని గూర్చి పట్టించుకోదలిస్తే అది ఈ వ్యవసాయకోత్పత్తిని సం. ఒకటికి 4% చొప్పున పెంచడము అనేదే బహుశా అతిముఖ్యమైనదిగా తేలుతుంది.

ఇటువంటి పరిస్థితులలో దట్టమైన జనసంఖ్యను కలిగి ఉన్న ఈ వ్యావసాయిక దేశాలు తమ ఆహారోత్పత్తిని పెంచుకొనడానికి ఎట్లా పనిచేయవలసి ఉంటుంది? ఇక్కడ నేను ఒక అభిప్రాయాన్ని మాత్రమే వ్యక్తము చేస్తున్నాను. మీకు అది యిష్టము అయితే పందెం కూడా వేస్తాను. నా పందెము యిది. భారతీయులు ఈ విషయములో అనుసరిస్తున్న పద్ధతే సరియైనది. వారు ఈ కార్యము సాధించడములో అనేక రకములైన వైఫల్యములను పొందవచ్చును. అనేక రకములుగా ఇబ్బందులకు లోను కావచ్చును. అయినా వారు అనుసరిస్తున్న పద్ధతి సమిష్టి వ్యవసాయపు పద్ధతులకన్నా ఎక్కువ నికరమైన, ఎక్కువ ప్రయోజనకరమైన ఫలితాలను తెచ్చి యిస్తుంది.

భారతదేశాన్ని యావత్తు "వ్యవసాయ విస్తరణ కేంద్రాల" తో నింపడానికి భారతీయులు ప్రయత్నం చేస్తున్నారు. సూక్ష్మంలో ఇవి గ్రామ వ్యవస్థలు. వీటిల్లో రైతులకు ఎరువులు లభిస్తాయి. నీటి వనరులను గురించి సలహా, సహాయము లభిస్తుంది. విత్తులను నాటడమును గురించి సలహా, సహాయము లభిస్తుంది. చేపల పెంపకమును గురించి కోళ్ల పెంపకమును గురించి, ఇంకా ఒక వెయ్యి వ్యవసాయపు పద్ధతులను గురించి సలహా, సహాయము లభిస్తాయి.

ఈ కార్యక్రమాన్ని భారతీయులు అమెరికావారిదగ్గర నుంచి ఎరువుతెచ్చుకున్నారు. ఈ శతాబ్దం మొదట్లో అమెరికా వారు తమ "వ్యవసాయ విస్తరణ కార్యక్రమాలను' ప్రారంభం చేసి వున్నారు. కొంతకాలంవరకు ఈ కార్యక్రమం చెప్పుకోదగిన పెద్దఫలితాలను ఇవ్వలేదు. ఆ తర్వాత అమెరికను శాస్త్రవేత్తల సహాయముతోను, ఎరువులు అధికముగా దొరకడము వల్లను, ఈ కార్యక్రమము అమెరికాలో వ్యవసాయోత్పత్తిని పూర్తిగా విప్లవాత్మకముగా మార్చివేసింది. ఈ ఉత్పత్తి ఆధిక్యము అమెరికా ప్రభుత్వాన్నిగూడా ఇరుకున పెట్టింది. అమెరికా వ్యవసాయము పండిస్తున్న అంతపంటను ఏమి చేయాలో తోచనంత అధికంగా ఈపంటలు పండుతున్నాయి. ఈ పంటలో చాలాభాగాన్ని రాకీ పర్వతాలలోని నేలమాళిగలో నిల్వపోసుకుంటున్నారు. అమెరికాలో వ్యవసాయంచేస్తున్న జనసంఖ్య పెద్దగా చెప్పుకో తగిందేమీకాదు. జనాభాలో అల్పమైనభాగం మాత్రమే ఈవృత్తిలో నిమగ్నులైయున్నారు.

అయినా ఇది ఇట్లా సంభవిస్తున్నది. ఎరువులు వాడటమువల్ల శాస్త్రీయమైన పద్ధతులను అనుసరించడమువల్ల, అమెరికను ఆహారపువంటల దిగుబడి అధికముగా వుంటున్నది.

భారతీయులు ఇప్పుడు ఇటువంటి బ్రహ్మాండమైన ఫలితములను సాధించగల అవకాశములేదు. కాని వచ్చే పది ఏళ్లలోను ఈ వ్యావసాయక విస్తరణ కార్యక్రమమువల్ల భారత దేశములో కొన్ని అద్భుత ఫలితాలు కన్పించగలవనిమాత్రం నేను నమ్ముతున్నాను. ఈ కార్యక్రమములో పెద్దవిశేషము ఏమీలేదు. ఇక్కడ రైతులకు సహాయంచేయడం ఒక్కటే వుంది. వారిపొలాలు వారిచేతుల్లోనే వుంటాయి. అట్లా పొలాలను రైతుల హక్కు భుక్తాలలోనేవుంచి వారికి సహాయం చేసేపద్ధతే,వ్యవసాయ విస్తరణ కార్యక్రమమనుటంటే.అయితే ఒక్క కార్యక్రమంవల్ల అంతపని జరుగుతుందని నేను చెప్పడములేదు. ఎక్కువపంటలు పండించేందుకు వీలుగారైతుకు ఆర్థికరూప మైన ప్రోత్సాహాన్నిగూడా కల్పించాలి. భారతదేశములో ఈ ప్రోత్సాహము ఆ రైతులకు లభిస్తున్నదనే నేను అనుకుంటు న్నాను. నేను ఒక అయిదు సంవత్సరాల క్రితం ఒకసారి ఆదేశం వెళ్లినప్పుడు, అక్కడ భూమితరములనుగురించి, జమీందారీల రద్దునుగురించి, ఇంకా అట్టివిషయాలనే గురించి పెద్దగా తర్జన భర్జనలు కొనసాగుతువున్నాయి. భూమితరములో మార్పు తూంచి ఇదిగా కొనసాగినట్లు ఇప్పుడు కన్పిస్తున్నది. ఇప్పుడు భారత కర్షకునికి తనభూమిమీద అన్నిహక్కులు వున్నాయి. అతను ప్రభుత్వానికి శిస్తు చెల్లిస్తాడు. డబ్బువిలువలో వచ్చిన మార్పువుూలంగా, ఆ శిస్తున్నా పెద్దభారమైందిగాలేదు. విపరీతంగా తక్కువవన్ను అది. భారతదేశంలో రైతుపై ఎక్కువపన్ను పడుతోంది అని మీరంటే, అది నిజముకాదు. అది నిజానికి పూర్తిగా విరుద్ధమైనది. ప్రపంచంలో అతి తక్కువపన్ను చెల్లిస్తున్న రైతుల్లో భారదేశపురైతు ఒకడు. అతనిమీదపన్ను అతిలఘువుగా వుంది. నిజమే, అక్కడ భూవసతులు అతిచిన్నవి. గ్రామంలో అసమానత్వం అధికంగా వుంది. కొందరికి వందల ఎకరాలచొప్పున పొలాలువుంటే, కొందరికి కుటుంబాలను పోషించుకోలేనంత తక్కువగా పొలాలు వుంటాయి. (అటువంటి కుటుంబం వ్యవసాయకూలీచేసుకో వలసిగూడా వస్తున్నది). నేను చెబుతున్నది అభూతకల్పన మేమీ కాదు. భారతదేశంలోని గ్రామాలలో తరతమాలు అధికంగా వున్నాయి. ఇది సంతోషకరమైనదికాదు. ఈ తర తమాలు మనకు అన్యాయముగాగూడా కన్పించవచ్చు. అయితే ఇందువల్ల అక్కడవున్న పెద్ద చిన్న రైతులకు ఎక్కువగా పంటలు పండించేందుకు తగిన ప్రోత్సాహము లభించకుండా పోవడములేదు. ఈ ఎక్కువపంటలవల్ల వచ్చేఫలమును వారుఅనుభ విస్తున్నారు. ఇతరులకష్టముయొక్క ఫలాన్ని దోచుకొనే భూస్వా ములుగాని, లేక అట్టిదే అయిన ప్రభుత్వంగాని వారి ఎక్కువపం టను కాజేయడం అంటూ అక్కడలేదు. ఇదిచాలాప్రధానమైనది.

ఇది అంతా ఇట్లావుంటే, మీరు అందువల్ల కలిగే ఫలితాలను చూస్తారనే నేను అనుకుంటున్నాను. ఇదిచాలా మంద గొడి పద్ధతి. భారతదేశపు కర్షకులు వట్టి మితవాదులు. తొంద రగా దేనికీ ఎక్కరు. వ్యవసాయ విస్తరణ కార్యక్రమముగూడా ఇంకా పూర్తికాలేదు. రెండోపంచవర్ష ప్రణాళిక పూర్తిఅయ్యే ప్పటికి దీన్ని పూర్తిచేయవచ్చుననుకున్నారు. 50 లక్షలగ్రామాలు వుంటే, అందులో ఇప్పుడు 60% గ్రామాలలోనే ఈ కార్య క్రమము అమలు జరుగుతోంది. మూడవ ప్రణాళిక కాలంలో తక్కిన గ్రామాలనుగూడా దీనిక్రిందకు తీసుకువచ్చేయాలని అనుకుంటున్నారు.

తాము పెట్టుకున్న లక్ష్యాలను భారతీయులు ఎల్ల ప్పుడు సాధించగల్గుతున్నారని మీరు అనుకోవద్దు. ఆ విషయాన్ని నన్నే చెప్పనీయండి. కాని, ఇక్కడ గూడా ఒక విషయుండుంది. వారు విఫలులైనప్పుడు, తాము అట్లా విఫలులమైనామని వారు చెప్పుకుంటున్నారు. ఆ వాస్తవాన్ని బహిరంగపరుస్తు న్నారు. ప్రకటిస్తున్నారు. అది మనకు అందరకు గూడా తెలు స్తున్నది. ఇప్పుడు బహుశా ఛైనావారికి ఇట్లా విఫలం కావడం అంటూ లేదేమో! వారు పెట్టుకున్న లక్ష్యాన్ని నూటికి నూరు పాళ్లు వారు సాధిస్తున్నారేమో! కాని ఇందులో నిజానిజాలు ఏమిటో మనకు తెలియదు. ఎవ్వరికి తెలియదు. అది నిజమో కాదో తెలుసుకొనే అవకాశం మనకులేదు. భారతదేశం సంగతి అట్లాకాదు. వారు పొందిన ప్రతివైఫల్యము ప్రకటించబడు తున్నది. దానినిగూర్చి మన కందరికి తెలుసు. భారతీయులకు కూడా తెలుసు. ఇది అంతా పనికిమాలిన ప్రచారంగా కన్పించవచ్చు. మంచిదిగూడా కాకపోవచ్చు. కాని, ఇది పోల్చడానికి వీలులేనంత మంచిపని. మంచి పరిస్థితి. కారణము నీ తప్పులుమీకు తెలిసి నప్పుడు, వాటిని దిద్దుకోడానికి మీరు ప్రయత్నిస్తారు.

వ్యవసాయ విస్తరణ బ్లాకుల పద్ధతిని భారతదేశము అంతటా అమలుపరచడము తక్కువ పని అని, తేలిక పని అని మీరు ఎప్పుడూ భావించవద్దు. భారతదేశంలో దాదాపు 50 లక్షల గ్రామాలు ఉన్నాయి. ఇందులో ప్రతి గ్రామంలోను ఒక విస్తర్ణ కేంద్రాన్ని పెట్టడము వారి ప్రయత్నంకాదు. 60, 70 గ్రామాలకు కలిపి ఒక్కొక్క కేంద్రం చొప్పున పెడు తున్నారు. నాకు తెలిసినంతలో—అది అట్లా జరుగుతున్నది. ప్రతి గ్రామం సమీపంలో, ప్రతి గ్రామానికి అందుబాటులోను ఒక కేంద్రాన్ని పెట్టి, ఆ కేంద్రములో నిపుణులతో ఒక కార్యా లయాన్ని ఏర్పాటుచేసి, అక్కడే ఎరువుల డిపోను నెలకొల్పి, విత్తులను నిల్వచేసి, రైతులకు సహాయపడుతూ, వారికి నీటి వసర్ల విషయములోనేమి, పనిముట్ల విషయములోనేమి, ఇంకా ఇతర విషయములలోనేమి సలహా ఇస్తూ ఉండేట్లుగా ఈ కేంద్రాన్ని రూపొందించాలని వారు అనుకుంటున్నారు. భారత కర్షకులను దీనిని గూర్చి, ఇదంతా ఏమిటని మీరు అడిగితే చమత్కారంగా ఉంటుంది. వారు ఇట్లా చెబుతారు. "అవును. మాకు మా ఎడ్లబండీ పోయు, ఒక్కపూటలో తీసుకువచ్చే అంత దూరంలో ఎరువులు దొరకాలి." అంటే మరీ కుగ్రామా నికి అది 10—20 మైళ్ళ లోపుగా ఉండాలని భావం. మరి మూడో ప్రణాళిక పూర్తిఅయ్యేసరికి అటువంటి వ్యవసాయ విస్తరణ కేంద్రముల కార్యక్రమం భారతదేశము అంతకూ విస్త రిస్తుంది. ఇందులో అనుమానములేదు.

# మన ప్రాచీన జానపద వినోదాలు

శ్రీ రావూరి ప్రసన్నసత్యనారాయణ

వస్తుతః మానవ ప్రకృతి సుఖప్రవణమైంది. మానవుడు తన నిత్య నైమిత్తిక జీవిత వ్యాపృతిలో స్వతస్సిద్ధంగా సంతృప్తుడైనాడా సరేసరి. అలా అన్నిచోట్ల అందరికి జీవితం సుఖసముద్రం కాదు. లోకంలో ఎప్పుడూ ఏదో ఒక లోపం ఉంటూనే ఉంటుంది. ప్రతి మానవుడి జీవితంలో ఏదో ఒక అసంతృప్తి వెనకాడుతూనే ఉంటుంది. కాబట్టి తన అసంతృప్తిని గురించిన చింతను అనుసరించి తాత్కాలికంగానైనా కొంత వినోదాన్ని కల్పించే ఉపాధులను అతను అన్వేషిస్తాడు. తీరికవేళల్లో ఉబుసుపోక కొర్కి కార్యోపక్రమములాన్నహానికి ఉద్బోధకంగా అలాంటి వినోద కాలక్షేపాల అవసరం ఎంతైనా ఉంది. 'విశ్రాంతి జననం కాలే నాట్య మేత ద్భవిష్యతి' అని నాట్యశాస్త్రం చెబుతూన్నది. ఆనుషంగికంగా వాటిల్లో కొన్ని కొన్నిట్లో కొంతకొంత వైజ్ఞానిక ప్రతిపత్తి, ధర్మ ప్రబోధం కూడా ఉంటై. ఈ మూడే ఆ వినోద కాలక్షేపాల ప్రధాన ప్రయోజనాలు.

వినోదపరాయణత అన్నది నగరవాసులకు జానపదులకు సమానమే. అయితే నాగరక వినోదాల్లో ఉన్నంత నాజూకు జానపదమైన వాటిల్లో లేకపోవచ్చుగాని వాటిల్లో ఉండే కృతక ప్రవృత్తి యిందులో తక్కువే. అనేక వినోదాలు ఉభయతారకాలైనవి ఉన్నవి.

ప్రపంచంలో మానవుని మనుగడ కాస్పదమైన ప్రతి ప్రదేశంలోను ఈ వినోద కాలక్షేపాలు ఎన్నో వెలిసినవి. ఆయా మానవసమాజం యొక్క అభిరుచులు అవసరాలు పరిసరాలు మొదలైన వాటిని బట్టి వాటిల్లో ఎన్నెన్నో వింత వింతలు రకరకాలు ఏర్పడుతూ వచ్చినవి. వాటిని గురించిన విపుల విచారణకు ఇక్కడ అవకాశంలేదు. ప్రకృతం మన తెనుగు మాగాణంమీద ప్రాచుర్యం వహించిన కతిపయ వినోద కాలక్షేపాలకు మాత్రమే యిక్కడ ప్రసక్తి. శ్రీనాథుడి భీమేశ్వర పురాణంలో హరి విరించులతో మహాదేవుడు ఇలా అన్నాడట (V. 15) : 'ఆంధ్రక్షమాస్థలికిం బోదమె యూసువోకకు వినోదంబుల్ పరీక్షింపఁగన్' అని. అంటే ఆ నాడు ఆంధ్రదేశంలో వినోద కాలక్షేపాలు ఎంత ప్రచురంగా ఉన్నయ్యో వూహించవచ్చు.

ఈ వినోదాలు ముఖ్యంగా మూడు విధాలుగా కనిపిస్తున్నవి. అవి క్రీడలు, ద్యూతాలు, కాలక్షేపాలు. ఇవి కేవలం పరస్పర నిరపేక్షాలు కావు. ఒకదాని తత్వం మరోదాంట్లో లేనివికావు. సందర్భం, దేశం, కాలం మొదలైన అంశాలను బట్టి ఒకదాని రూపం మరొకటి పొందనివీ కావు. ఒకదాంట్లో మరోదాన్ని అంతర్భూతం చెయ్యటానికి అనువుపడనివి కావు. క్రీడలు ద్యూతాలకు దారితీస్తవి. ద్యూతాలు కాలక్షేపాలు కావచ్చు. కాలక్షేపానికి ద్యూతాలు క్రీడలు ఉపాధేయాలే. ద్యూతం ఒక్కొక్కప్పుడు క్రీడ కావచ్చు. మరొకప్పుడు కాలక్షేపం కావచ్చు. క్రీడ ఒకప్పుడు ద్యూతం కావచ్చు—వేరొకప్పుడు కాలక్షేపం కావచ్చు. అయితే అన్నిటిలోను మౌలికమైన బీజం వినోదం. ఉపాధి భేదం, సందర్భం మొదలైనవాటినిబట్టి అది బహు భంగులుగా ఉంటుంది. అది కొందరికి వేడుక—మరికొందరికి వ్యసనం. వేడుకలే క్రీడలు—వ్యసనాలే ద్యూతాలు. అది ఒకప్పుడు వ్యష్టిగా—వేరొకప్పుడు సమిష్టిగా ఉంటుంది. అది ఒకప్పుడు ఐచ్ఛికం—వేరొకప్పుడు నైమిత్తికం.

## క్రీడలు

వీటిల్లో పాల్గొనేవారి వినోదానికి ప్రాధాన్యం. ఇందులో శిశుక్రీడలు తారంగంతారంగం—గుడుగుడుగుంచాలు, అప్పలప్పలతాండ్ర, దాగిలిమూతలు, ఉయ్యాల లూగటం, బంతులాట, బొమ్మరిల్లు మొదలైనవి. వీటిల్లో స్త్రీపురుష భేద పరిగణనం లేదు. అచ్చనగండ్లు, ఒప్పులకుప్ప, చెమ్మచెక్క, సిలసిలబండి మొదలైనవి కేవలం బాలికలవి. కేవలం బాలకులవి చెడుగుడు, ఉప్పనబట్టేలు, కోలికొమ్మచ్చి, గాలిపటం, బొంగరాలు, బిల్లగోడు మొదలైనవి. బాల బాలిక లాడేవి దాగుడుమూతలు, తుమ్మెండలేమిండు, తూరీతాపిల్లి, ఓమనగుంటలు, పుట్టచెండ్లు మొదలైనవి. పచ్చీస్‌పాళి, వైకుంఠపాళి, అష్టాచెమ్మా మొదలైనవి కేవలం స్త్రీ క్రీడలు. పులిమేక, చదరంగం మొదలైనవి మగవారి ఆటలు. సొగటాలాట మొదలైనవి స్త్రీ పురుషులు కలిసి ఆడేవి. నాగరిక క్రీడలు అనేకం వాత్స్యాయన కామసూత్రం (1—4—42)లో పేర్కొనబడినవి.

## ద్యూతాలు

ఖేలనంలోని పంతమే పందెమై అభినివేశమే వ్యసనమై అవతరించినవి ఈ ద్యూతాలు. అప్రాణి ద్యూతంలో ఫలభాక్కుల—ప్రాణిద్యూతంలో ప్రేక్షకుల వినోదానికి ప్రాధాన్యం. పులిజూదం, చదరంగం, సొగటాలాట (ఈ అక్షక్రీడ అతి

ప్రాచీనం. ఋగ్వేదం 10 మం. 34 సూ.లో ఇది దుర్వ్యసనంగా పరిగణింపబడి ఖండింపబడింది.)—పగడసాల, గెంజిపాడి మొదలైనవి అప్రాణిద్యూతాలు.

ఇక ప్రాణి ద్యూతాలు : కుస్తీ క్రీడే కాక ద్యూతం గూడా. ఇందులో ఫలభాక్కులు సాధారణంగా పురుషులే. కాని శ్రీ కృష్ణదేవరాయల కాలంలో నవరాత్రోత్సవ మధ్యాన్న సమయాల్లో కళావతులు కూడా కుస్తీపట్టేవారని విదేశి యాత్రికుల వ్రాతలు తెలుపుతున్నవి. కుస్తీ అనేది మల్లయుద్ధ రూపంలోను, ముష్టియుద్ధ రూపంలోను ఉండవచ్చు. సాము గరిడీలు ఈ కోవలోవే. (వీటిని గురించి ప్రత్యేకంగా శాస్త్ర గ్రంథాలు వెలిసినయ్యంటే దేశంలో వీటికి ఉన్న ప్రాచుర్యం తెల్లం అవుతుంది. మనిషి ఏనుగు, పులి, సింహం, ఎనుబోతు, ఎద్దు, పొట్టేలు మొదలైన తిర్యక్కులతో వినోదార్థం పోరాడటమూ ఉంది. కోళ్ళ, పికిలి పిట్టలు, ఎద్దులు, పోతులు, పొట్టేళ్ళు, గుర్రాలు మొదలైనవాటి పందాలు కేవల తిర్యగ్ ద్యూతాలు పండగ పబ్బాల్లో పల్లెసీమల్లో ఈనాటికి ప్రత్యక్షం అవుతున్నవి. ఇందులో కోడిపందెం, మేష యుద్ధం క్రీడాభిరామంలో చక్కగా వర్ణింపబడినవి.

## కాలక్షేపాలు

జానపద వినోదాల్లో ఇవి ప్రధానం అయినవి. తెలుగు వారి సొంత ఆస్తి వీటిల్లో చాలా ఉంది. కేవలం పొద్దు బుచ్చటం అనే అర్థమే యిందులో ఉద్దిష్టం అయినప్పటికీ వినోదంతోబాటు విజ్ఞానాన్నీ ఇవి చాలావరకు ప్రసాదిస్తున్నవి. కాలక్షేపాల్లో ప్రదర్శకులకంటే ప్రేక్షకుల వినోదానికీ ప్రాధాన్యం. గీత నృత్యాలకు ఎక్కువ ప్రసక్తి.

వీటిని మూడు విధాలుగా విభజించవచ్చు. ప్రవర్తకుల దృష్టితో, ఫలభాక్కుల దృష్టితో, ప్రయోగ సందర్భాన్ని బట్టి. మళ్లీ ఇందులో కొన్ని వైయక్తికాలు, సామూహికాలు, కొన్ని కేవల వినోదాలు, నైమిత్తికాలు అనే భేదం ఏర్పడుతున్నది.

ప్రవర్తకుల దృష్టితో పానసీలాట, ఇంద్రజాలం, విప్రవినోదం మొదలైనవి వైయక్తిక కాలక్షేపాలు; నాటకం, యక్షగానం, కలాపం మొదలైనవి సామూహిక కాలక్షేపాలు.

ఫలభాక్కుల దృష్టితో చిత్రలేఖనం మొదలైనవి వ్యష్టి కాలక్షేపాలు; పులివేషాలు, పగటి వేషాలు, గంగిరెద్దుల ఆట, కోతి ఆట, బొమ్మలాట, గారడీ, రూపకాలు మొదలైనవి సమిష్టి కాలక్షేపాలు.

గ్రామదేవతల జాతరలు—ఆ సందర్భంలో సిడిబ్రేలటం, గుండాలు త్రొక్కటం—; ఉగాది, ఏరువాకపున్నమ, నవరాత్రాలు, దీపావళి, నాగుంచవితి, సంక్రాంతి, రథసప్తమి, శివరాత్రి మొదలైన పండగ పబ్బాలు, తిరునాళ్ళు, ఉత్సవాలు, పెళ్లి పేరంటాలు, నోములు, వ్రతాలు మొదలైన సందర్భాలలో సాగే వేడుకలూ, వినోదాలూ నైమిత్తికాలు.

ఇక ప్రయోగఫక్కికనుబట్టి కేవల వినోదాలు : ఇవి గీత కాలక్షేపాలు, నృత్య కాలక్షేపాలు, రూపక ప్రక్రియలు అని మూడు విధాలు.

## గానరూప కథాఖ్యానాలు

ఇందులో జానపద వినోద ప్రపంచాన్ని గుత్తగొన్నవి గానరూపకథాఖ్యానాలు. జక్కులు, జంగాలు, పంబవారు, బవనీలు, పిచ్చుకగుంటల్లు, శారదకాండ్రు, వీరముష్టివారు, బీరన్నలవారు, హరిదాసులు, దాసరులు, గొల్ల భాగవతులు మొదలైనవారు జానపద గీత కథా కాలక్షేప ప్రవర్తకులుగా ప్రసిద్ధులు. ఒక్కొక్కరి కథాఖ్యాన ఫక్కీ ఒక్కొక్క తీరుగా ఉంటుంది. కొందరిది కేవలం పాట. కొందరిది ఆటతో పాట, పాటతోపాటు పక్కవాద్యం. ఊరూ, వాడా తిరిగి తరతరాలనుంచి నిరక్షర కుక్షులైన మన జానపదులకు వినోద ప్రసాదంతోపాటు విజ్ఞానభిక్ష పంచిపెడుతున్న మహనీయులు వీరు. గ్రంథ విజ్ఞాన గంధానికి నోచుకోని ఆ పరమ పామరులకు మన భారత భాగవత రామాయణాది మహేతిహాసాలతో మంచి పరిచయ భాగ్యం ఏర్పడింది అంటే ఆ భాగధేయ ప్రదాతలు వీరే. వీరు ఆ పురాణేతిహాస కథలనే కాదు, పలనాటి చరిత్ర, కాటమరాజు కథ, బంగారు తిమ్మరాజు కథ, దేసింగురాజు కథ, బొబ్బిలియుద్ధం మొదలైన ఆంధ్ర జాతీయ వీరగాథలను, కామమ్మ, లక్ష్మమ్మ, ముసలమ్మ మొదలైన సాధ్వీ శిరోమణుల జాలి కథలను గూడ చక్కగా, ధర్మ ప్రబోధ పురస్సరంగా ప్రవచిస్తారు. కరుణ వీర రసాలక్కు పండిత వాఙ్మయంలో లేని ప్రతిపత్తి వీరి జిహ్వాంచలాల్లో—వీరి కథలు విన్న జానపదుల ముగ్ధ హృదయాల్లోను సమృద్ధిగా ఉంది. కొంత పచ్చి శృంగారం, మోటు హాస్యం ఉన్నప్పటికి అవి వారి వినోదపు వియ్యాలలో విందు నంజుళ్ళు. ఈ కాలక్షేపాలు మత ప్రచారానికి కూడా తోడ్పడినవి.

## బొ మ్మ లా ట

బొమ్మలాట ఒకటి ఈ కథా కాలక్షేపాల కంటె అతి ప్రాచీనకాలంనుంచి దేశం అంతటా విపుల ప్రచారం పొంది జనపదాల్లో వినోదపు జాతరలు చేసింది. జానపదులచేత తన కోసం అహోరాత్ర జాగరం ఒక భోగంగా నిద్రాదేవిని నిర్లక్ష్యం చేయించింది. ఇది సామాన్య కాలక్షేపం గాదు. రూపక ధర్మ గర్భితమైంది. ఇందులో గంధోళిగాడు, జుట్టుపోలిగాడు, బంగారక్క మొదలైనవి కేవలం జానపదుల వినోదం కోసం సాంప్రదాయికంగా రూపొందించబడ్డ పాత్రలు. బొమ్మలాటలు గూడ భారతాది కథల ప్రచారానికి సాంప్రదాయిక విజ్ఞాన వ్యాప్తికి విశేషంగా ఉపకరించినవి.

అల్లికి, పదబాళి, చిందు, చౌపదం, జక్కిణి, జోగిణీ పంతు, దురుపదం, పేరణి (పేరడి), గుజరాతి, గుజ్జరి, నాట్యకదంబం, ప్రబంధజక్కిణి, దండలాసకం, మదనబల

దూత్యం, మైసిరి, వార్ప్రిచి, విళ్ళేదు, శారదా సామ్రాజ్యం, శుభళీల, నవతివచ్చరం, కొరం మొదలైనవి కేవల నృత్య కాలక్షేపాలు. ఇందులో ఎక్కువ 17, 18 శతాబ్దాల్లో తంజావూరు, మధుర మొదలైన దక్షిణదేశ సంస్థానాల్లో ఆంధ్ర నాయక రాజుల పరిపాలన కాలంలో ప్రయోగ ప్రాచుర్యాన్ని పొందినవి.

ఇక తరతరాలుగా మన ఆంధ్ర ప్రజానీకాన్ని వినోదాబ్ధి వీచికల్లో ఓలలాడించిన రూపక ప్రక్రియలు.

### బహురూపం

ప్రసిద్ధ లక్షణ గ్రంథాల్లో దీని ప్రసక్తి లేదు. మన వాఙ్మయంలో మాత్రం దీని ప్రసక్తి పలుతావుల కానవస్తుంది. దాన్నిబట్టి అది చతుర్విధ అభినయాత్మకమైందని, సాంగ భాషాంగ క్రియాంగాభిరామమైందని, యవనిక, మేళగాండ్రు, తౌర్యత్రికం, సూత్రధారుడు ఉన్నట్టి ఒక విశిష్ట రూపక ప్రక్రియ అని తేలుతున్నది.

### పెడ్డంగం

పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణాన్ని బట్టి ఇది ఒక రూపక విశేషమై ఉంటుందని వూహించవచ్చును. దీని స్వరూపం ఇదమిత్థం అని తెలియరాదు.

### వీథినాటకం

నాటక కళాలక్ష్మిని వీథివీథులా వూరేగించి జనసామాన్యానికి సన్నిహితం చేసింది. బసవపురాణంలో పేర్కొనబడ్డ సిరియాళ నాటకం, క్రీడాభిరామంలో పేర్కొనబడ్డ మాచలదేవి నాటకం, వీరనరసింహరాయల దగ్గర కూచిపూడివారు ప్రదర్శించిన సంబెట గురవరాజు నాటకం, కృష్ణరాయల కాలం నాటి తాయికొండనాటకం మొదలైనవి నాటి వీథి నాటకాలు కావచ్చును. ఇందులో ప్రాచీనగాథలే కాక సమకాలికోదంతాలు గూడా ఇతివృత్తాలు కావటం గమనింపదగింది. రాజకీయాధికారి అయిన గురవరాజుయొక్క ఘోరకృత్యాలను ప్రజల ఘోషను అప్పటికప్పుడు నాటకం కట్టి సమ్రాట్టు ఎదుట ప్రదర్శించిన కూచిపూడి కళాకారుల సాహసం శ్లాఘనీయం. ఇలా ఆనాడు వీథినాటక కళ వినోదమాత్రమే కాక ఉన్నతసాంఘిక ప్రయోజనాలను గూడా సాధించింది అని చెప్పవచ్చును.

### కలాపం

ఇది కూచిపూడి కులపతి సిద్ధేంద్రయోగి సృష్టించిన అద్భుత కళాఖండం. ఇది ద్వివిధం. భామకలాపం ఆత్మాశ్రయ ఫక్కికం అయిన రసవేద నాట్యవేద నవనీతం. గొల్ల కలాపం బ్రహ్మవిద్యా పీయూష చషకం. సిద్ధేంద్రుని కృతికి మానస పుత్రికలుగా పలుతావుల వెలసినవి—కలాపరచనలు, ప్రదర్శనలు. సిక్కుశుద్ధే కాక డొక్కశుద్ధి కూడా ఉన్నట్టి నట్టవోజుల చేత ప్రదర్శింపబడినవి. ప్రజామోదాన్ని అశేషంగా చూరగొన్నవి. ప్రజలలో ఉత్తమ కళాభిరుచి, ఉదాత్త తత్వ జిజ్ఞాస పెంపొందటానికి తోడ్పడినవి. సిద్ధ సంకల్పుడు ఆ మహాయోగి ఉద్దేశం అదే కాబోలు. భామాకలాపంలో సత్యా రుక్మిణుల సవతి కయ్యం ఘట్టం—గొల్ల కలాపంలో విదూషకప్రాయుడైన బ్రాహ్మణుడి ప్రసంగాలు తరువాతి గొల్ల కలాపాల్లో సుంకరి కొండయ్య, గొల్లభామల సరస సల్లాపాలు జానపదుల వినోద పీఠాతంత్రులు. (For details-see 'Kalapam', an article by Dr. S. V. Joga Rao, Published in 'Triveni'Silver Jubilee Spl. November 1955).

### యక్షగానం

ఇది మొదట జక్కుల పురంధ్రుల గీతాభినయాత్మక కథా కాలక్షేపంగా ఉండి తరువాత వీథినాటక సాహచర్యంవల్ల రూపకంగా రూపొంది బహువిధ సంగీత భంగీ తరంగితం అయి కూచిపూడి నటరాజుల చేతిలో ఉత్తమ భరత విద్యా పరిష్కారాన్ని పొంది ఉజ్జ్వల కళాఖండమై దక్షిణ దేశంలో రాచ ప్రాపు, రంగభోగం పొంది, అటు కోటలోని రాజుగారికి, పేటలోని ప్రజలకు సమానంగా ఆదరపాత్రమైంది. ఆంధ్రుల స్వతంత్ర ప్రక్రియ. అన్యులకు కూడా అనుకార్యమైంది. విశాలమైన విషయ వైవిధ్యంతో ఛందస్సంగీత వైవిధ్యంతో తరతరాల ఆంధ్ర ప్రజకు వినోదాన్ని చూరలిచ్చి దేశ సంస్కృతి కోశానికి ఎత్తిన పతాకగా విలసిల్లింది. ఇందులో ఆనాటి సామాన్య జన జీవన ప్రతిబింబనం, వివిధ ప్రాంతీయ భాషా వ్యవహార ఫక్కీలు, సాంప్రదాయిక హాస్య పాత్రలు కానవస్తవి. కందుకూరి రుద్రకవి, అప్పకవి, తంజావూరు ప్రభువైన విజయరాఘవుడు, త్యాగరాజు ప్రభృతులు ప్రసిద్ధ యక్షగాన కర్తలు కావటమే కాక తమిళనాడు నడిబొడ్డయిన తంజావూరి నేలిన శహాజీ ప్రభృతి మహారాష్ట్ర ప్రభువులు గూడ తెనుగు రుచిమరిగి అందులో యక్షగాన రచన చేయటమే దాని విశిష్టతకు తార్కాణం.

### కొరవంజి

ఎరుకసాని పాత్రకు ప్రాధాన్యం ఉన్న యక్షగానమే కొరవంజి. ఎరుకసాని సోదె ఘట్టం వినోద విజ్ఞానాలు రెంటికి ప్రతీక. ఆమె దేశదిమ్మరి. ప్రయాణం సుకరంకాని ఆ రోజుల్లో ఒక ప్రాంతంవారికి ఇతర ప్రాంతాల విశేషాలు

కొన్ని తెలియటానికి ఇందులో అవకాశం ఏర్పడేది. సింగీ సింగళ్ల వాదం ఒకటి జానపదులకు మిక్కిలి ఉల్లాసం కొలి పేది.

## మెలట్టూరు భాగవత మేళ నాటకాలు

ఇవి తళ్లికోట యుద్ధానంతరం దక్షిణ దేశానికి తరలి పోయిన బ్రాహ్మణ భాగవతులవల్ల ప్రవర్తిల్లినవి. ఈ భాగవత మేళ నాటక కర్తలు ప్రవర్తకులు కూచిపూడి సంప్రదాయంవారే. కూచిపూడి వారికి సిద్ధేంద్రయోగి ఎలాగో మెలట్టూరువారికి వెంకటరామశాస్త్రి అలాగ. కూచిపూడివారి వలెనే వీరివీ నృత్య రూపకాలు అయి ప్రజలలో భాగవతధర్మ ప్రచారానికి ఎక్కువ వుపకరించినవి. శతశాత సమగ్రంగా నాట్య కళా సంప్రదాయ రజ్జువు పైననే గమనంచేసేవి కావటమే వీటి విశిష్టతకు ప్రబల హేతువు. మెలట్టూరు వలెనే నాట్య కళామతల్లి గజ్జెల ఘలంఘలలతో దిశలు మారుమ్రోగిన ప్రదేశాలు నూత్తుక్కాడు, శూలమంగళం.

ఇలా తెలుగు మాగాణం మీద తరతరానా జానపద వినోదాలు ఎన్నో వెలిసినవి. జనపదాలే మన సంప్రదాయానికి ప్రాణస్నాయువులు. ఆ ప్రాచీన జాతీయ సంస్కృతికి ప్రతినిధులే యీ జానపద వినోదాలు. అయితే యీనాడు జనపదాల్లోను ఒక కృతకమైన నాగరికతావాసన పాకి, వింత అభిరుచులు ప్రబలి, ప్రాచీనం అన్న ప్రతిదానిమీద ఈసడింపు బయలుదేరి ఈ ప్రాచీన సరస్వతీవ్రతికలు ఒక్కొక్కటే క్రమక్రమంగా కాలయవనిక వెనక తిరోహితం అవుతున్నవి.

# కాకతీయులు వేల్పుకొండవారా?

## శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

ఈ సంవత్సరము ఏప్రిలు నెల భారతిలో నేను 'కాకతిపురమ్ము హనుమకొండయేనా ?' అన్న శీర్షికతో ఒక వ్యాసము వ్రాసినాను. నా అనుమానమునకు కారణాలు రెండు ఒకటి, ప్రతాపచరిత్రమనే చిరకాలమునాటి వచన గ్రంథము 'అనాదినుంచీ కాకతి వంశీయుల పూర్వులు—వెన్నడు దగ్గర నుండి హనుమకొండలోనే ఉండినా'రని చెప్పే మాటలు. రెండు, జనగామ తాలూకా గూడూరు గ్రామములోని శిలమీది శాసనము. ఈశాసనము శ్రీ మారేమండ రామారావుగారి పర్యవేక్షణతో ప్రచురించబడిన 'తెలంగాణా శాసనములు' మొదటి సంపుటములో 96 వ పుటలో ప్రచురించబడినది. అది అయిదు పద్యాల శాసనము. మొదటి పద్యము విరియాల వంశములో వెన్నడు, వానికి ఎఱ్ఱడు పుట్టినారని చెపుతుంది. రెండోది ఎఱ్ఱనికి భీముడూ అతనికి ఎఱ్ఱనరేంద్రుడూ పుట్టినా రంటుంది. మూడో పద్యము ఎఱ్ఱనరేంద్రుడు బొట్టుబేత వసుధాధిపుణ్ని యుద్ధములో చేతబట్టి వాని శత్రువును చంపి, వానిని కొఱవి దేశములో ప్రతిష్ఠచేసె నంటుంది. ఇంతవరకూ ఈ అర్థము పరిశోధకు లందరికీ సబబే అనిపించింది.

అయితే మారేమండవారు గాని, వారి తరువాత ఆంగ్లములో తెలింగానా శాసనాలను నిజాము ప్రభుత్వమువారు అచ్చు వేయించుటకు కారకులైన పుట్టపర్తివారు గాని ఈ గూడూరు శాసన ప్రతిబింబాన్ని వలసినంత శ్రద్ధతో చూచినట్లు లేదు. ఫలము తప్పులు మిగిలిపోడమూ, విజ్ఞాన వినోదము కొరకు ఈ శాసనాలు చదివి తీర్మానాలు చేసే నావంటివారూ, దేవరపల్లి వంటివారివారూ జారిపడడమూను. అయితే పెద్ద పొరబాటు ఏదీ రాలేదులెండి రక్షించి. పై శాసన పాఠములోని నాలుగో పద్యము "ఎఱ్ఱనివునంగన గామమసాని .... చేత భూవిభుని గాకతివల్లభుజేసి వానితా బరగగ జేతబెట్టి ఘను బల్లవరాయని యాగిజొచ్చె భాస్కర విభు చక్రవర్తిగని కాకతి నిల్పుట కోటి సేయదే" అని ఉన్నది. నేను ప్రతాపచరిత్రములోని కుంతలియే ఈ కామమసాని అనుకున్నాను. ఆచార్య లక్ష్మీరంజనముగారు చరిత్ర పరిశోధకులు కొల్లూరి హర్షవర్ధనశర్మగారూ కూడా అలాగే అనుకున్నారు. ప్రతాపచరిత్రము ఈ కుంతలి కొన్నాళ్లు రాజ్యము చేసి యెఱుకు దేవరాజును (బేతరాజును) హనుమకొండ సింహాసనము నెక్కించిన' దంటుంది. ఈ పలుకులను ఇందాకటి శాసన (పాఠ) ములోని 'కాకతి వల్లభుజేసి' అన్న భాగముతో సమీకరించి, "హనుమకొండయే కాకతిపురము. బేతరాజును కుంతలిదేవి (అనగా కామమసాని) కాకతి వల్లభుని చేసినట్లు గూడూరు శాసన సాక్ష్యము" అని తేల్చాను నేను. అయితే పై శాసన పాఠము తప్పట ! తక్కినవాటి మాటకేమి, ఈ నాలుగో పద్యములో "ఎఱ్ఱనివు నంగన గామమసాని ..... బేత భూవిభుని గాకతి వల్లభు బింన్న వాని దా బరగంగ జేతబట్టి" అనుటయే సాధువట. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక 50 వ సంపుటము ఐదూ ఆరు భాగాల సంచికలో శ్రీ హర్షవర్ధనశర్మ గారు ఆ శాసన ప్రతిబింబాన్నీ సాధుపాఠాన్నీ ఇచ్చినారు. దీని ప్రకారము బేతరాజు స్వతహాగానే 'కాకతి వల్లభుడు' అనగా కాకతి వంశపురాజు. కామమసాని ఈతణ్ణి చేతబట్టి .... కాకతి రాజ్యాన్ని నిల్పింది.

అయితే నా అనుమానానికి మాత్రము పట్టు జారిపోలేదు. కామసాని చేతబట్టకముందు బేతరాజు కొఱవి దేశమునందు ప్రతిష్ఠితుడు. ఆమె ఇతని చేతబట్టి కాకతి నిల్పినది, అనగా కాకతి వంశపు రాజరికాన్ని నిల్పింది హనుమకొండకు రాజునుచేసి. అతడు (కాజీపేట శాసనములో) కాకతిపురాధినాథుడని ప్రశంసించబడ్డాడు. హనుమకొండతో సంబంధము లేని రాజ్యాన్ని పాలించిన గుండ్యన కాకర్త్యగుండ్యన మాత్రమే. బేతరాజే మొట్టమొదటగా కాకతి పురాధినాథుడు. మరి కాకతి పురము హనుమకొండయే నన్న అనుమానానికి అడ్డేమున్నదీ ?

శ్రీ హర్షవర్ధనశర్మగారు అలా కాదంటున్నారు. వారి గూడూరి శాసనపు సాధు పాఠములోని నాలుగో పద్యపు చివరిభాగ మిది ! ''కామవసాని .... బేత భూవిభుని .... జేత బట్టి ఘను బల్లవరాయని యోగి జొచ్చి భాస్కరవిభు చక్రవర్తి గని కాకతి నిల్పుట గోటిసేయుదే.'' దీనికి శ్రీ శర్మగారు చెప్పిన అర్థము ఏమిటీ ?—కామము బేతరాజును చేతబట్టి, ఘనుడైన పల్లవరాజును ఎదిరించి, భాస్కరుడనే చక్రవర్తి కొడుకునుగన్న కారణముచేత, అనగా ఆ కొడుకు చేసిన ఖడ్గ సాయమువల్ల వేలుపుకొండలో వుండిన రవ్వనృపుని (అనగా బేత రాజునేనట) వేలుపుకొండలోనే నిలిపి, తద్వారా కాకతిరాజును నిలిపి కోటి చేసిందనీ ! ఇక్కడ శర్మగారు 'బేతని చేతబట్టి, పల్లవరాయని ఎదిరించి' వరకూ ఘటనం గతిని అనుసరించి, 'భాస్కరవిభు చక్రవర్తి గని' అని రాగానే, ఇందాకటి రెండింటి తర్వాతది ఇది అన్న సబబును వదిలేసి, ''ఈ భాస్కరవిభు చక్రవర్తిని కనుట ఎన్నడో జరిగిపోయిన ఘటన'' అని అన్వయించి, 'ఇప్పుడు జరిగిన బేతనికరగ్రహణమూ, పల్లవ రాయో పాలంభమూ లకు ఎన్నడో జరిగిన కాన్పు సాయమై కాకతి నిల్పినది'' అని వాదిస్తున్నారు. ఇలాగ వాదించడములో 'చక్రవర్తి' అన్న పదాన్ని పూర్తిగా తోసేశారు. అంతటి బరువైన పదము సామంతరాజుకి, రాజైనా కాదు, మండలికునికి--ఎంత అభిమానమున్నా వాడడము సంభవమా ? అని వారు విచారించలేదు.

''కామువ పల్లవరాయని నిర్జించి, కళ్యాణి చాళుక్య రాజు—భాస్కరవిభు చక్రవర్తి—ని దర్శించి గుండ్యన పోగొట్టు కొన్న కాకతి నగరములో బేతరాజును నిల్పింది. కాకతిని కాకతి వల్లభునికి నిల్పినది'' అని అనుకోడము న్యాయమని నా కని పిస్తున్నది.

శర్మగారు తమ వాదానికి ఇంకొక సాక్ష్యము చూపు తున్నారు. గూడూరు శాసనములోని అయిదో పద్య మిది! కారకకాలుడై పడసె గాడయ నాయకు జంపి, సూర దవ్వేలుపు గొండ రవ్వ(నిపు వేలుపుగొండన నిల్పి .... '' దీనిలోని 'సూరుడు' పై 'భాస్కర' విభు చక్రవర్తియేనట. యథా లాభంగా కాబోలు పద్యంలో పడిన 'భాస్కర' పదమును సూరుడుతో సమీకరించారు గాని చక్రవర్తి ఈ సూరుడుని మింగేటి వాడే ? వాడి మాటేమిటి ? మీదుమిక్కిలి ఈ పద్యంలోని వేలుపుకొండ : రవ్వ నృపుడు బేతరాజే ననడము ఇంకొక వింత ! యెఱ్ఱనకు • బొట్టుబేతడూ, కామమకు బిడ్డవాడూ, సూరనికి రవ్వనృపుడూ అయి ఈ ముసాల బాలుడు ఎవ రెక్కడ నిల్పితే అక్కడ దేవరలాగు నిలబడ్డాడా ? ఖాజీపేట శాసనములలో ఒకదానిలో బేతరాజు ''చోడక్ష్మా పాల చమూవార్ధి ప్రమథన మార్జితోర్జిత లక్ష్మీ'' యుతుడని ప్రశంసింపబడినాడు, సూరుడే. గూడూరు శాసనములోని రవ్వ నృపుడు ఆ పేరింటివాడే ఎవరో, బేతరాజు కాదు. సూరడు— ఈ శాసనము విరియాల వంశజులను ప్రశంసించేటిది కనుక— విరియాల వంశజుడే కావచ్చును. అతడు చేసిన వీరకృత్యాలు ఆఖరి పద్యములో ఉన్నాయి. రవ్వ నృపుడు బేతరాజే ననడానికీ, ఈ బేతరాజు వేలుపుకొండలో ఉండినా డనడానికీ, కాకతీయులు తొట్టతొలుత వేల్పుకొండనే రాజధానిగా చేసికొని యుండవచ్చుననడానికీ ఆధారము ఏదీలేదు. రవ్వనృపుడు అంటే 'బిడ్డరాజు' అని అర్థము తీశారు శర్మగారు, ఆ అవ సరమే లేదు. అది నామధేయమే. రవ్వమాంబ అన్న పేరు ఉప్పరపల్లి శాసనములో కనబడుతున్నది. ఆమె ప్రజ్ఞాశాలి ప్రసిద్ధ నాయకుని భార్యయే, జానపదులలోనిది కాదు. ఆ శాసనము హైదరాబాదు ఆర్కియాలజీ సీరీసులో మూడవది. 'తప్పులతడికె' కాదనే నా ఆశ. రవ్వమాంబ అన్న పేరున్నప్పుడు రవ్వ నృపతి ఉండడములో వింత ఏమున్నదీ ?

శర్మగారి వాదములో ఒక విశేషము అందరికీ వెడ గట్టుతున్నది. ఈ గూడూరు శాసనము విరియాలవారి ప్రశంస. వెన్నడు, ఎఱ్ఱడు, భీముడు, ఎఱ్ఱడు అని నాలుగు పురుషాంతరాలు చెప్పి సూరడు అని అయిదోవాణ్ణి చెప్పి నప్పుడు, వాడున్నూ విరియాల వంశంవాడే అయివుండాలి, కామమ్మ తరువాతివాడయి ఉండాలి. కామమ్మ కొడుకు కాగండా అని చూచారు వారు. 'భాస్కరవిభు', 'గని', అన్న రెండు పదాలు ఈ అనుమానానికి అనుకూలంగా కనపడ్డాయి. సూరడు కామమ్మ కొడుకే నన్నారు. ఇంతవరకూ సరళంగా వెళ్లింది వాదము. ''భాస్కరవిభు చక్రవర్తి'' చాళుక్యరాజే నన్నవారు కూడా 'సూరడు ఆమె కొడుకు అయినా కావ చ్చును'' అంటారు తరవాతి ప్రశంస సూరని గురించినది కనుక. రవ్వనృపుడు బేతరాజే ననడానికి ఆధారము 'రవ్వ' అన్న మాటకు—ఈ నాడు వాడుకలో ఉన్న—పిసరు, కొంచెము, అన్న అర్థము. కాకతీయ రాజ్యములోనే రవ్వమాంబ ఉన్న ప్పుడు రవ్వనృపతికేమీ ? వేలుపుకొండ రవ్వనృపతి బేతరా జన డానికి ఆధారము పోలేంది, దానితోపాటే వేలుపుకొండ కాక తీయుల మొదటి రాజధాని అన్న వాదము కూడాను.

## దధివామన స్వరూపము


శ్రీ పరాశరం గోపాలకృష్ణమూర్తి


వసు చరిత్రములో నల్లసాని పెద్దన ''ప్రత్యూష పవనాంకురములు పైకొనువేళ వామనస్తుతి పరత్వమునలేచి'' యని ప్రవరుని నిత్యకృత్యములం జెప్పు పట్టున వ్రాసెను. రాయవాచ

కములో శ్రీ కృష్ణదేవరాయలు ప్రభాతమునఁ జేయు స్తోత్ర పారాయణాదికములో దధివామన స్తోత్ర మొకటిగా జెప్పఁబడినది.

సుప్రసిద్ధ పండితులు, పరిశోధకులు కీ. శే. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మను చరిత్ర 'గ్రంథ గ్రంథుల'ను వివరించుచు; "ప్రత్యూష......వామనస్తుతి పరత్వమునలేచి" ఇక్కడ 'వామనమూర్తి స్తోత్రమునందలి యాసక్తిచేత, విష్ణుమూర్తి స్తోత్ర పారాయణములో ననుట' అని వ్యాఖ్య. కాని ఇక్కడ వామనస్తుతి యనగా 'దధివామనస్తోత్ర మను సంస్కృత స్తోత్ర గ్రంథమగును. శ్రీ కృష్ణదేవ రాయలవారు నిద్ర లేవఁగానేతఃదధివామన స్తోత్రముఁ బారాయణము చేయుట పరిపాటి. రాయవాచకమునఁ జాచునది. దధివామనుఁడనఁగా 'వెన్నముద్ద బాలగోపాల కృష్ణమ్మ' —ఆంధ్రదేశమంతటను సామాన్యముగా స్త్రీ, పురుషులు తెల్లవారుజామున నిద్రలేచి భూపాల రాగములో 'గుమ్మడేడే గోపిదేవీ" ఇత్యాదిగా దధివామన (వెన్నముద్ద బాలగోపాలకృష్ణమ్మ) స్తుతినే చేయుచుందురు" అని వ్రాసి, మనుచరిత్రములోని వామనస్తుతిని, రాయవాచకములోని దధివామనస్తోత్రమును సమన్వయించిరి.

అంతటితో నాగక 'దధివామనుఁడనఁగా వెన్నముద్ద బాల గోపాలకృష్ణమ్మ' యని నిర్ణయించిరి. దానినిబట్టియే కాఁబోలు వావిళ్లవారి మనుచరిత్ర వ్యాఖ్య ప్రస్తుత ముద్రణమున "వామన స్తుతి పరత్వమునన్ = దధివామనునియొక్క ధ్యానమునందలి యాసక్తిచేత, లేచి = శయ్యను విడిచి లేచి, ప్రాతఃకాలమున నిదుర సెజ్జనుండి లేచునపుడు శ్రీ కృష్ణుని స్మరించుచుండునని భావము" అని యున్నది. 'గుమ్మడి పదములఁ బట్టియు, దధి పదము వెన్నముద్ద కుపలక్షకమని భావించియు, దధివామనుఁడన 'వెన్నముద్ద బాల గోపాల కృష్ణమ్మ' యనియు, వామనస్తుతి కృష్ణ స్మరణ యనియూ సూచించుట జరిగినది.

"వామనం ఖడ్గినం చైవ దుస్స్వప్నేషు సదాస్మరేత్" అను వైద్యనాథ దీక్షితీయ ప్రమాణమునుబట్టి ప్రభాతమున వామనస్తుతి దుస్స్వప్నదోష పరిహారమును జేయునని తెలియు చున్నది. అయినను పెద్దనగారి 'వామనస్తుతి'యు శ్రీ కృష్ణ దేవరాయల 'దధివామనస్తోత్రము'ను దక్కిన సాక్ష్యమును బట్టి యొకటేయనుకొనవచ్చునుగాని, దధివామనుఁడనఁగా వెన్న ముద్ద బాల గోపాలకృష్ణమ్మకాఁడు. వామనస్తుతి కృష్ణ స్మరణ కాఁ బనిలేదు.

దధివామనుని స్వరూప విశేషాదులు మంత్రధ్యానాదికమును మంత్ర శాస్త్ర గ్రంథములలోఁ గలవు.

"ముక్తాగౌరం నవమణిలసద్భూషణం చన్ద్రసంస్థం
భృఙ్గాకారై రలకనికరైశ్శోభివక్త్రారవిన్దమ్
హస్తాబ్జాభ్యాం కనకకలశం శఙ్ఖతోయాభిపూర్ణం
దధ్యన్నాఢ్యం కనకచషకం ధారయన్తం భజామః"
(శారదా—15 పటలే—58 శ్లో)

అని 'శారదా తిలకము' పంచదశ పటలమున దధివామన మంత్ర ప్రకరణమున ధ్యానశ్లోక మున్నది. శంఖతోయాభిపూర్ణమగు కనకకలశము నొకచేతను, దధ్యన్నాఢ్యమగు కనకచషకము (పాత్రము) నొక చేతను ధరించినవానినిగా దధివామనుని ధ్యానించుట ఇందు విదితము.

దధ్యన్నాఢ్యమగు కనకచషకమును ధరించిన వామనుఁడగుటవలన దధివామనుఁడనుట యన్వర్థము. శాక్తేయమున నన్నపూర్ణామూర్తికిఁగల స్థానము వైష్ణవమున దధివామన మూర్తికిఁ గలదు. అన్నపానాదులకు లోటు లేకుండుటకై దధివామను నుపాసించుట యొక్క విశేషము.

పై శ్లోకమున చంద్ర సంస్థితునిగా దధివామనమూర్తిని ధ్యానించుట కలదు. నారాయణుని సవితృమండల మధ్యవర్తిగా ధ్యానించుటకు, దధివామనుని జంద్రమండలవర్తిగా ధ్యానించుటకు సంబంధ మేమైనఁ గలదేమో?

దధివామన మంత్రోద్ధారము మహా నారాయణోపనిషత్తు నందును గలదు. శ్రీ వైఖానస మంత్ర సంహితయందు విష్ణు దైవత్యమును నవమప్రశ్నమున

"సదన్నసం* పాత్రగ్ం సౌవర్ణం దధానో దధి పూర్ణగ్ం
సంభరతాం ఫలదాయ వామనాయ స్వాహా"
(విష్ణుదైవత్యము 4 వ అనువాకము 9 వ మంత్రము)

అని దధి పూర్ణమగు నన్నముతో నిండిన సువర్ణ పాత్రను ధరించిన వామనుఁడు స్తుతింపఁబడినాఁడు. కావున దధివామనుఁడనఁగా, వామనావతారమూర్తివిశేషమేకాని, కృష్ణావతారలీలా విశేషముకాదని స్పష్టమయినది. శ్రీవైఖానసాగమము నందు 'ప్రతిష్ఠా విధి దర్పణ' మను గ్రంథమునఁ గూడ కేశవాది చతుర్వింశతి మూర్తుల స్వరూప నిర్ణయము చేయు సందర్భమున వామన స్వరూప నిర్ణయము పై విధముగనే చేయఁబడినది.

ప్రత్యేకముగఁ బారాయణమున కక్కరకు వచ్చు విధమున 'దధి వామన స్తోత్ర' మను స్తోత్ర గ్రంథ మెచటనైన నుండి యుండవలయునని రాయవాచకమునుబట్టి యనిపించుచున్నది. కాని, యట్టి దింతవరకు నాకు లభింపలేదు.

దధివామనుఁడనగా దధ్యన్నపూర్ణమగు సువర్ణచషకమును గేల ధరించిన ద్విభుజమగు వామనావతారమూర్తి విశేషమేయని సిద్ధము. తన్నాను రూపాదు లాయా ప్రమాణ గ్రంథములయందుఁ బ్రత్యేకముగను నిస్సందేహముగను వర్ణింపఁబడినవి. ఇట్లు దధివామన స్వరూప వివరణము మంత్ర సంహితాదులలోఁ బేర్కొనబడినఁ విధముగా వెల్లడింపఁబడినది. ఇంకను విశేషము లున్న విజ్ఞులు తెలుపవలెనని మనవి.

* సదన్నసం=మంచియన్నముకలిగినది, అన్నప్సు=అన్నము

# శ్రీకాకుళక్షేత్ర చరిత్ర

## డాక్టరు శ్రీ గొట్టిపాటి వెంకటనరసయ్య

కృష్ణాజిల్లా, దివి తాలూకా యందలి దేవరకోట సీమలో కృష్ణానదికి తూర్పు తీరమున "శ్రీకాకుళము' అను ప్రసిద్ధ పుణ్యక్షేత్ర మున్నది. ఇది ఆంధ్ర సామ్రాజ్యమునకు ప్రథమ రాజధానీ నగరము. ఇక్కడ దేవుడు శ్రీ కాకుళేశ్వరస్వామి. ఈయనకు ఆంధ్రవిష్ణువని, ఆంధ్ర వల్లభుడని, ఆంధ్ర నాయకుడని, తెలుగురాయుడని, తెలుగువల్లభుండని, సిరికా కొలని నాథుడని పేరులు గలవు. ఈ యాంధ్ర వల్లభుని పట్టమహిషి "రాజ్యలక్ష్మి" అమ్మవారు. ఈమె ఆంధ్ర సామ్రాజ్యానికి లక్ష్మీదేవి. క్షేత్రపాలకుడు ఏకరాత్రి ప్రసన్న శ్రీ మల్లికార్జునస్వామి, కనకదుర్గ వేరొక గుడిలో ప్రతిష్ఠితు లైనారు. ఈ క్షేత్రమున ఒక్కరాత్రి దీక్షగా ఆయన సమక్షంలో ధ్యానముచేసిన ప్రసన్నుడై భక్తుల కోర్కెలు తీర్చుటచేత నీ దేవునికి "ఏకరాత్రి ప్రసన్న" డని, "ఏకరాత్రి ప్రసన్నాఖ్యోదేవదేవ శ్రీ మల్లికేశ్వరః" అని, "తత్రైవ వసతిం చక్రే పూజయిత్వాంధ్ర నాయకమ్" అని వర్ణింపబడినది. బ్రహ్మాండ, స్కాందపురాణములలో నీ క్షేత్ర మహాత్మ్యము వర్ణింపబడినది. నూట యెనిమిది దివ్య తిరుపతు (క్షేత్రము) లలో 55వ క్షేత్రముగా యీ క్షేత్రము పేర్కొనబడినది. ఈ క్షేత్రమందు కళేబరమును వదలినవారికి మోక్షము నిత్తునని స్వామి పలికినట్లు స్థలధ్యానమున గలదు.

"శ్రీకాకుళే తిష్ఠతి లోకనాథే
రమాపతే లాలిత చక్రతీర్థే
తత్రైవ వసత్యామపి కృష్ణవేణ్యాం
నరాః కిమర్థం నరకం వ్రజంతి"

"సహ్యజా విరజా తోయం
కాకుళం పరమం పదమ్
యోగానందో ధర్మపుర్యాం
కాకుళే త్వాంధ్ర నాయకః
సహరిః కాకుళక్షేత్రే
యో జహాతి కళేబరం
బ్రహ్మహత్యా విముక్తస్తు
మోక్షం ప్రాప్నోతి నిశ్చయమ్"

ఆంధ్రవిష్ణువు శ్రీకాకుళం రాజైన సుచంద్ర మహారాజు కుమారుడుగా జన్మించి, నిశుంభుడను రాక్షసుని సంహరించి సర్వదేవ పూజితుడైనట్లు బ్రహ్మాండ పురాణమున గలదు.

"ఆంధ్రనాథో మహావిష్ణుర్నిశుంభ దనుజాపహా
స్వాయంభువమనోః కాలే పురా కలియుగే హరిః
కాకుళే రాజవర్యస్య సుచంద్రస్య తనూభవః
అభవత్సర్వ దేవైశ్చ వేష్టితో లోకపూజితః."

ఈ విధముగా ఆంధ్రవిష్ణువును మన పండితులు వర్ణించిరి.

"నిరీశ్వరాః పరేదేశాః
ఆంధ్రస్త్వేకోస్తి సేశ్వరః
యత్రాస్తే భగవాన్ విష్ణుః
ఆంధ్రనాయక సంజ్ఞయా"

శ్రీకాకుళేశ్వరస్వామి శ్రీ వైఖానస మహర్షులచే ప్రతిష్ఠింపబడినట్లును, ఆలయ గోపురాదులు "శశిబిందు" మహారాజు వారిచే నిర్మింపబడినట్లు ఆంధ్రవిష్ణువును గురించి బ్రహ్మ ఇక్కడ తపస్సు చేసినట్లు పురాణ ప్రసిద్ధి గలదు. శశిబిందు మహారాజుచే కట్టింపబడిన ఆలయగోపురాదులు నదీపాలము కాగా తిరిగి పల్లవ ప్రభువుల కాలమున ప్రతిష్ఠింపబడెను. అదియు కృష్ణవేణి గర్భమున లీనమయ్యెను. పిమ్మట యిప్పటి ఆలయము షుమారు ఏడు శతాబ్దాల క్రిందట చోడరాజైన అనంతదండ భూపాలుని" చే కట్టింపబడినది. ఈ దేవాలయంలోని ఆంధ్రవిష్ణువు విగ్రహాన్ని శాలివాహన శక 1205 లో శ్రీ మురుపళ్ల అనంతభోగయ్యగారు చేయించిరని ప్రతీతి గలదు.

శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1519 సం. బహుధాన్య సం॥ర ఫాల్గుణ శుద్ధ ఏకాదశి శుక్రవారమున యీ ఆంధ్రవిష్ణువును దర్శించి నిత్య నైవేద్యములకు ఐదు గ్రామములను సమర్పించినట్లు శాసనము గలదు. ఆంధ్రవిష్ణువు శ్రీ కృష్ణదేవ రాయలకు కలలో సాక్షాత్కరించి ఆయనను "ఆముక్తమాల్యద" రచియింప నాదేశించెను. విజయనగర రాజ్య పతనానంతరం ఈ క్షేత్రం గోలుకొండ, హైదరాబాదు నవాబుల పరిపాలన క్రింద ఉన్నట్లు తెలియుచున్నది. తరువాత దేవరకోట (చల్లపల్లి) ప్రభువులగు శ్రీ రాజా యార్లగడ్డ కోదండరామన్న ప్రభువుగారు సదరు దేవాలయములు జీర్ణోద్ధరణ గావించి పెక్కు ఈనాములు ఇచ్చినట్లు దేవరకోట సంస్థాన చరిత్రయందు గలదు. అప్పటినుంచి శ్రీ దేవరకోట (చల్లపల్లి) ప్రభువులు వంశ పరంపరగా ధర్మకర్తలుగా వచ్చుచున్నారు. ఈ క్షేత్రమున ప్రతి సంవత్సరం వైశాఖ

శుద్ధ పౌర్ణమినాడు బ్రహ్మోత్సవము మహావైభవముగా జరుగును. ఈ ఉత్సవములను గురించి శ్రీనాథుడు క్రీడాభి రామములో వర్ణించెను. నేటికిని దేవరకోట ప్రభువుల అధ్వర్య మున మహా వైభవముగా జరుగుచున్నది.

# రామశతకము

## శ్రీ ఎ. వి. రమణరావు

ఆంధ్ర సాహిత్యమున రామకథ శతకోటి విస్తర ప్రవహితము. ఏ కవియైనను రామాయణరూపముననో, శతక రూపముననో మరే యుపాఖ్యానరూపముననో రామచరిత స్పృశింపక మానలేదు. అట్టివానిలో ముక్కామల ఆదిలక్ష్మమ్మచే రచియింపఁబడిన రామశతక మొకటి.

ఈ శతకముంగూర్చి శ్రీమతి ఊటుకూరి లక్ష్మీ కాంతమ్మగారు తమ ఆంధ్ర కవయిత్రులను గ్రంథమున నిట్లు వ్రాసియున్నారు. (పు 126—128) 'భారతి పత్రికయందలి వాఙ్మయ సూచికలో కవయిత్రి లగపడుచున్నారు. వారి కావ్యములంగూర్చిన సంకువ కానరాదు. ముక్కామల ఆదిలక్ష్మమ్మ—రామశతకము. ఈ పుస్తకము లెటనున్నవో కాలము తెల్ప వలసియున్నది.'

శతకకవుల చరిత్రము నందుగాని, తదనుబంధమునందు గాని యీ గ్రంథ ప్రస్తావనలేదు. కాని గ్రంథాంతమందున్న అకారాద్యనుక్రమణికయందుమాత్రమిది యీబడినది. ఈ గ్రంథమింతకు పూర్వము 1921 సంవత్సరములో ముద్రిత మైనది. నావద్దనున్న ప్రతియాధారముగ పరిచయమొనర్చెదను.

ఇది 107 పద్యముల శతకము. అన్నియు కందపద్యములు. గ్రంథకర్త్రి విషయము 106, 107 పద్యములలో నీవిధముగ నిచ్చినది.

ముక్కామలమరేశ్వరు ఘను
నెక్కువ తత్త్వార్థయోగినిశ్చలమయు డీ
మక్కువ ఆదిలక్ష్మియు
మ్రొక్కెను వరదుండగావె మురయుచురామా
కాశ్మీన గోత్రమునాదియు
శాశ్వతముగ నిల్పగాను సాకారతనూ
నాశీర్వదించి గావవె
ఈశ్వర మోక్షంబు లొసగు యిలపై రామా

ఈ రెండవపద్యమున ప్రాసభంగము. శ్రీరాముని జీవిత చరిత్రము నందలి ఘట్టముల కైకొనక యాతని భగవత్తత్త్వ నిరూపణమునకే పాటు పడినది. శ్రీరాముని యాధ్యాత్మిక చింతనతో ప్రార్థించుచున్నట్లే ప్రతిపద్యము గోచరించును. రాముని దశావతారములతోగూడ ప్రస్తుతించినవి. కామాంధులు భక్తుల నిందింతురని యాక్రోశించినది. ధనికులకు సుఖములు, దీనులకు దండనలుననుచు లోక ధర్మముల కొన్నింటి జొనిపినది. అటనట రమ్యమౌ నలంకారములును, ఉపమానములును గూడ గలవు. మచ్చునకొకటి

కలహంసల జీవనములు
నెలగుల రత్నములుగానె యిలలోపలనూ
తెలివిగల నరుంకెప్పుడు
ఫలములు · హరిసేవగాదె పార్థివరామా

దుష్కర ప్రాసములతో గూడ కొన్ని పద్యములు నడచినవి.

'నిబ్బరము నిజమనిదోప,' 'శ్రీరామ మధుర వాక్యము చిరమయెరామా' మున్నగు గణభంగములును, చూచి భూనాథులు, కామితయర్థములు, మున్నగు విశృంఖల ప్రయోగములును, అరహము, హరుషము (అర్హము, హర్షము ననుటకు) మున్నగు పదములును, నాకూ, సత్యాసంధుడవు మున్నగు గణపూరణార్థ దీర్ఘములును ఒండు రెండుచోట్ల కన్పట్టుచున్నవి.

మొత్తముమీద శైలిధారాళము. సరళసుందరమౌ రచనము. కవిత్వాడంబరమునకు తావియలేదు. భక్త్యావేశమున స్తుతియే ప్రధానముగ గోచరమగుచున్నవి—

# గ్రంథ విమర్శనము

## భాసుని రామనాటక మూలములు

[రచయిత: శ్రీ జీరెడ్డి చెన్నారెడ్డి ఎం. ఏ., తెలుగు శాఖ; విశ్వవిద్యాలయ కళాశాల: తిరుపతి; ఆనందభవన గ్రంథ మాల—1; వెల రు. 7–50 లు]

ఈ గ్రంథ రచయిత శ్రీ జీరెడ్డి చెన్నారెడ్డి ఎం. ఏ. గారు. ఈ గ్రంథము మూడు రామనాటకములను గురించిన విమర్శ. యజ్ఞఫలనాటకము, ప్రతిమా నాటకము, అభిషేక నాటకము—మూడును రామకథాశ్రితములు. వీనిలో యజ్ఞ ఫలము భాసకృతముగునా కాదా యను వాదప్రతివాదములు బహుళముగా నున్నవి. శ్రీ చెన్నారెడ్డిగారు ఈ నాటకము భాస కృతముకాదని, సుదీర్ఘముగా విమర్శించి నిర్ణయించినారు. చెన్నారెడ్డిగారి గ్రంథములోని మొదటి 62 పుటలు యజ్ఞఫల నాటకము భాసకృతము కాదనుటకు వినియుక్తమైనది. తరువాతి 314 పుటలు ప్రతిమాభిషేకములను గురించి వ్రాయబడ్డవి. ప్రతిమాభిషేకములయందు వాల్మీకికృత రామగాథకు కన్పించు కథాభేదములకు మూలములు ఆనంద రామాయణము, పద్మ పురాణమునందలి రామగాథ, భారతములోని వనపర్వమునందలి రామగాథలలో నున్నట్లు చూపించుటయేకాక, భాసుని ప్రయోగ కౌశలము, పాత్ర చిత్రణము మొదలైన పెక్కు విషయములను గురించి రెడ్డిగారు, గుణదోష విచారము చేసినారు. ఈ గ్రంథము కేవలము భాసుని రెండు నాటకములలో కల కథా సంవిధానమునందలి భేదములకు 'మూలగాథలను' నిర్ణయించుటవరకే పరిమితమై యుండలేదు. గ్రంథనామమునుబట్టి గ్రంథకర్తగారు తమ విమర్శనమును, మూలకథలను నిర్ణయించుటవరకే పరిమితము చేయవలసియున్నట్లు మన కనిపించును. యజ్ఞఫలము భాసకృత మగునా, కాదా యన్న విచారమునకు ఈ గ్రంథమునందు ప్రవేశము యుక్తము కాదనిపించును.

యజ్ఞఫలనాటకమును పరిశీలనముగా చదివిన వారెవ్వరైనను, దానిని భాసకర్తృకమని యనుకొనజాలరు! భాసుని తక్కిన నాటకములకు దానికి నూరెడుదూరము. దానిని ప్రకటించిన శ్రీ జీవరామ కాళిదాసశాస్త్రిగారు దానిని భాసకృత మనుటకు కొన్ని కారణములు చెప్పిరి. 1. భాష ప్రాచీన సంస్కృతము, 2. శ్లిష్టమైన వస్తు కల్పనము, 3. రసభావాలంకారః నాట్యాంగములు మనోహర తమములుగా నుండుట. 4. బాణుడు మొదలైనవారు చెప్పిన భాస నాటక సామాన్య లక్షణములు సంవదించుట. ఈ నాల్గింట, చివరి కారణము అంత బలవత్తరమైనది కాదు. స్థూలముగా కన్పించు లక్షణములను ఎవరైనను చొప్పించవచ్చును. రెండు, మూడు కారణములు వట్టి యాభాసికములని రెడ్డిగారు సుదీర్ఘముగా విమర్శించి నిరూపించినారు. వస్తు కల్పనమునుబట్టి భాసకర్తృత్వమును నిరసించుచు, వీరు చెప్పిన కారణములన్నియు, అప్రతిసమాధేయములు, సుసంగతములు. ఈ నాటకమునందలి వస్తుకల్పనమంతయు మిక్కిలి విరుద్ధముగను, అనుచితముగను నున్నది. ఈ విరుద్ధాంశములను, అనౌచిత్యములను, శ్రీ రెడ్డిగారు విపులముగా స్పష్టము చేయుచున్నారు. మరి, భాష ప్రాచీన సంస్కృత మగునా, కాదా యన్న విషయమునుగూర్చి వీరు చేసిన విమర్శ సమగ్రముగా లేదు. ఏదో ఉటంకింపుగా రెండు మూడు ప్రాకృత శబ్దములను కూర్చి వ్రాసినంతమాత్రమున చాలదు. భాసునియొక్క రూపకములందలి సంస్కృతభాషతో యజ్ఞఫలములోని భాష ఎట్లు భేదించుచున్నదో రెడ్డిగారు విపులముగా వివరించియుండ వలసినది.

ప్రతిమా నాటకమునందు వాల్మీకీయకథకు భాసుడు చేసిన మార్పులకు, నూత్న కల్పనములకు, పెక్కింటికి ఆనంద రామాయణమునందలి సారకాండము మూలమని నిర్ణయించిరి. భాసునికంటె ఆనంద రామాయణ మర్వాచీనమని చెప్పు వాదములను వీరు పరామర్శించియుండలేదు. ఆ విషయము తేలునంతవరకు, భాసుడు సారకాండమునుండి పరిగ్రహించెనా, లేక భాసుని కల్పనములనే సారకాండకర్త సంగ్రహించెనా యను విషయము నిర్ణయించుటకు వీలులేదు. ఇటువంటి విషయములు తేలునవి కాదు. ఒకవేళ భాసునికంటె ఆనంద రామాయణమే ప్రాచీనమని యనుకొన్నను, భాసునికంటె అర్వాచీను డెవరో ఆ ఈ విషయములను దానియందు చొప్పించి యుండవచ్చును. అందుచేత వట్టి యూహల కేమియు విలువలేదు. రెడ్డిగారు చూపించిన కథా సంవాదములు మూలములనుటకంటె సదృశ్యములనుట యుక్తముగా నుండును. ఆ యా సందర్భముల పౌర్వాపర్యములు విచారించకుండ రెడ్డిగారివంటి విమర్శకులు వానిని మూలములనుట యుక్తముకాదు. రెడ్డిగారు చూపించిన సాదృశ్యములు చాలవరకు సుసంగతముగనే యున్నవి. కొన్నిమాత్రము ఏదో పరిపెట్టినట్లుగా నున్నవి.

ప్రతిమా నాటకమునందలి ఇతివృత్తమునకు మూల కథతో భేదములు తొమ్మిది. 1. వల్కల వృత్తాంతము. 2. ప్రతిమాగృహ కల్పనము. 3. సూర్యవంశక్రమము. 4. లక్ష్మణ

జ్యేష్ఠ్యము. 5. శ్రాద్ధకల్పనము. 6. శ్రీరాముడు మాయా మృగము వెంటునపుడు లక్ష్మణుడు ఆశ్రమమున లేకుండుట. 7. శ్రీరామునికి సహాయముగా భరతుని సేనా సమీకరణ ప్రయత్నము. 8. కైకేయి శీలము. 9. జనస్థానమున శ్రీరామపట్టాభిషేకము. వీనిలో ప్రతిమా గృహకల్పనము శ్రాద్ధకల్పనము ప్రధానములు. తక్కినవి అప్రధానములు. పాత్ర చిత్రణమునకు, నాటక ప్రయోగమునకు ఉపకరించునవి. సూర్యవంశక్రమము, లక్ష్మణ జ్యేష్ఠ్యము, భరతుని సేనా సమీకరణము మొదలైనవానికి రెడ్డిగారు చూపించిన సాదృశ్యములు బాగుగనే యున్నవి. వల్కల వృత్తాంతము మొదలైనవి నాటక ప్రయోగ దృష్ట్యా, చేసిన యలతి మార్పులని రెడ్డిగారు నిర్ణయించుట సమంజసమే. శ్రాద్ధకల్పనము నూత్న కల్పనని రెడ్డిగా రంగీకరించిరి. ప్రతిమా గృహ కల్పన విషయమున మాత్రము రెడ్డిగారి నిర్ణయము సమంజసముగా లేదని చెప్పకతప్పదు. "మూలములోని తైల ద్రోణి యందలి దశరథశవము ఈ నాటకమునందలి ప్రతిమా గృహగత ప్రతిమయైనది." "ప్రతిమానాటకము దృశ్యమైనందున భరతుని శోకమునకు ఆలంబన విభావమును రంగ స్థలముపై చూపుట అవసరము. సౌకర్యము కూడను. అట్లు ప్రదర్శించుటకు శవముకంటె ప్రతిమ ఎక్కువ యనుకూలము". "ఇది ప్రయోగానుకూలమైన మార్పేగాని, చేర్పుగాదు"—అని రెడ్డిగారు నిర్ణయించిరి. ప్రతిమా గృహములోని దశరథ ప్రతిమ భరతుని శోకమున కాలంబన విభావ మనుకొనుట పొరపాటు. రస సిద్ధాంతరీత్యా "భరతుని శోకమున కాలంబన విభావన" మనుమాట కుదురునదికాదు. విస్తరభీతిచేతను, అప్రకృత మగుటచేతను ఈ యంశము నిచ్చట వివరించుటలేదు. కథా పురుషుల శోకమునకు ఆలంబనము రంగముపై చూపించవలసిన యవసరములేదు. పితృ మరణాదులు సూచ్య వస్తువులో చేరును కాని, అసూచ్య వస్తువులోనివికావు. వేణీసంహారమునందువలె నేపథ్యమునుండి సూచించుట చాలును. భరతుని దుఃఖావేగమును చూపుటయే ప్రధానమైనచో దానికొఱకు ప్రతిమా కల్పన మక్కఱలేదు. కాబట్టి ప్రతిమాకల్పనము భరత శోకమున కాలంబనముగా చేసిన మార్పనుట సరికాదు. అది విభావ మనుట కూడ పొసగదు. శవమునకు, ప్రతిమకును ముడిపెట్టుట బట్టతలకును, మోకాలికిని ముడిపెట్టుట వంటిది.

మఱి ఈ ప్రతిమా కల్పనముపైననే నాటకమంతయు నాధారపడియున్నది. ఈ నాటకమునకంతకు నీ కల్పనమే కీలకమని ప్రతిమయను గ్రంథనామమే సూచించుచున్నది. ఈ పేరు భాసుడు పెట్టినది కాదని కొందఱందురు. మఱి ఎవరు పెట్టి యుండవలయును? ఎవరు పెట్టినను, ఆ నాటకమున కా పేరే తగియున్నదని అంగీకరింపని వారుండరు. ఎందుచేత? అదియే కవి పెట్టిన పేరై యుండునని భావించుటచేతకదా! రెడ్డిగారు కూడ నామ సామంజస్య మంగీకరించిరి. సంస్కృత మహాకవు లందఱు తమ నాటక రచనా శిల్పమునకంతకు కీలకముగా నొక నూత్న కల్పనమును కథయందు గావించుట పరిపాటి. ఆ కథ యందలి రహస్యమంతయు ఆ కల్పనయం దిమిడియుండును. దానిపై నాధారపడిచి వారు కథా నిర్మాణమును చేయుదురు. కవియొక్క నాటక శిల్పమునకంతయు నది ఆయువుపట్టు. ఇచ్చటనుండి రెండు విషయములు కవి దీపింపజేయును. ఒకటి రసము, రెండవది వస్తుతత్త్వము. ఈ రెండింటిని కలిపి కవి ఇచట ముడి వేయును. ఇచ్చట కీలకమున్నదని, దానిని పట్టుకొని ముడిని విప్పుకొనవలెనని, ఆ నామమును గ్రంథమునకు పెట్టును. గ్రంథమనగా ముడి. ఈ ప్రకృత నాటకమునందలి ముడి ఈ ప్రతిమా కల్పనము. దీనిని పట్టి ప్రయోగానుకూలమైన మార్పని రెడ్డిగారు నిర్ణయించిరి.

మఱి, దీని నాశ్రయించి నాటకమునందు రెండు శాఖలు వ్యాపించినవి. 1. రూప సంవాదము. 2. శ్రాద్ధకల్పనము. రూప సంవాదమునకు కూడ రెడ్డిగారు సారకాండమునందు సాదృశ్యమును చూపించుచు, అది మూలమని నిరూపింప ప్రయత్నించి నారు. రూపసంవాద మన్నది పరమ సహజమైన విషయము. ఒకవేళ సారకాండమే పూర్వమయినను, దీనిని కూడ భాసు డచ్చటి నుండియే గ్రహింపవలసెనా? తండ్రి కొడుకులకు, నన్నదమ్ము లకు, రూపసంవాదము లోక సహజమైనది. దీనికి లోకజ్ఞత చాలును. ఆకర మక్కఱలేదు. మఱియును, దీనికి ప్రయోజనమేమియు లేదనినారు. ప్రయోజనము కావలసినంత యున్నది. అసలు ముడినే రెడ్డిగారు వదలివేసినారు. రూప సంవాదము, శ్రాద్ధ కల్పనము రెండును ఆ నాటకము ననుసరించి వచ్చిన యను కల్పనములు. ప్రధానమగు ప్రతిమాకల్పనమునందలి ప్రాణ భూతమైన రహస్యమును వికసింపజేయునవి. ఆ రహస్యము వంశ లక్షణము. పుత్రుని కుండవలసిన విశిష్ట గుణములను వ్యాఖ్యానించుట. ఇది చేసినచో వంశ లక్షణము వ్యాఖ్యానించినట్లగును. భాసుడు ప్రతిమయందు రామకథకు చేసిన వాఖ్యాన మిది. ప్రతిమా కల్పనమునుండి ఆ వ్యాఖ్యానము మొదలైనది. రూప కల్పనము, శ్రాద్ధకల్పనములలో వికసితమైనది. అందువల్లనే భరతుని గుఱించి శ్రీరామునినోట "ఆత్మజ విశిష్ట గుణః" అని పించినాడు భాసుడు.

"తం చింతయామి నృపతిం పరలోక యాతం
ఏ నాయ మాత్మజ విశిష్ట గుణో న దృష్టః"

ఈ వ్యాసమున సమీక్ష ప్రధానముకాని, భాస మహాకవి రచనా శిల్పమును వివరించుట ప్రధానముకాదు. విమర్శకునికి ప్రతిమా నాటకమునందలి గ్రంథగ్రంథివిడలేదని చెప్పుట కీ ప్రసక్తి కొంత తెచ్చితిని. అభిషేక నాటక విషయమున కూడ రెడ్డిగారు భారత వన పర్వమునందలి కథతో కొన్ని సాదృశ్యములు చూపించిరి. వారు చూసిన సాదృశ్యములు కొన్ని దూరముగను, కొన్ని దగ్గరగను ఉన్నవి. ఆయా మార్పుల ప్రయోజనమును పాత్ర చిత్రణము దృష్ట్యా, రంగ ప్రయోగ దృష్ట్యా, రెడ్డిగారు సమర్థించుటయో, విమర్శించుటయో చేసిరి. రెడ్డిగారి విమర్శనము చాల భాగము పాశ్చాత్యుల విమర్శనా మార్గమును బట్టి నడచినది. ఏ పాత్ర కాపాత్ర తీసికొన్న, ఆ యా పాత్రల చిత్తవృత్తులు స్వతంత్రములుగా నుండునట్లు దీపింపజేయవలయు

నని సంస్కృత కవు లెవ్వరును అనుకొన్నవారుకారు. సంస్కృత నాటకములందు పాత్ర చిత్రణము ప్రధాన ప్రయోజనము కాదు. పాశ్చాత్యుల విమర్శనాధోరణి ప్రాచ్య నాటకముల కతుకదు. ఈ ధోరణి ననుసరించియే రెడ్డిగారు గ్రంథారంభమున కొన్ని సిద్ధాంతములు ప్రతిపాదించిరి.

శ్రీరాముని కథ వాల్మీకి గ్రామ వృద్ధుల గోష్ఠులలో నుండి, వ్యాసుడు కర్ణార్జునులయొక్కయు, భీమ దుర్యోధనుల యొక్కయు కథలు, సూతులనుండి గ్రహించి, గ్రంథస్థము చేసియుందురని రెడ్డిగారు వ్రాసిరి. ఇది ఇతరుల భావముల యొక్క అనువాదము. ఇది పాశ్చాత్య విద్యా ప్రభావము. వాల్మీకి వ్యాసుల కా యా కథలతో ప్రత్యక్ష సంబంధమున్నదని తిరుగు లేని సాక్ష్యము వలసినంత యున్నది. సాంప్రదాయకమైన ప్రతిదానిని కాదనుటయే విమర్శ యనుకొనుట ఆధునిక విద్యా నిష్ణాతులయందు ప్రబలిపోయినది. ఆ ప్రభావము రెడ్డిగారి గ్రంథమునందు అచ్చటచ్చట లేకపోలేదు. మన పూర్వ కవుల రచనా ప్రౌఢిని, అత్రాపి సంస్కృత కవుల గొప్పతనమును గ్రహించుటకు మన యాలంకారిక సంప్రదాయములు చక్కగా నర్థము చేసికొనవలయును. మహా కవుల రచనా మార్గములను పరీక్షా బుద్ధితోకాక, జిజ్ఞాసతో నర్థము చేసికొనుటకు ప్రయత్నింపవలయును. భాసకాళిదాసాది మహాకవులను 'పరిశీలించుటకు మన కొలబద్దలు చాలవు. చేయవలసినది అనుశీలముకాని, పరిశీలనముకాదు. మహా కవుల కావ్యములందు దోషములవలె కన్పించి నంతమాత్రమున అవి దోషములు కావు. వానిని దోషములనుట తొందరపాటు. రెడ్డిగారు భాసునియందు కొన్ని దోషములు చూపించిరి. వారు చూపించినవన్నియు దోషములని అంగీకరింపము. ఏ విషయమైనను కవి హృదయమునుబట్టి విమర్శింపవలసి యుండును. "యదభిముఖముగా చెప్పిరో యల్లదానిని తదభిముఖముగ చూచిన ధర్మ మొప్పు." భాసుడు యదభిముఖముగ వ్రాసెనో రెడ్డిగారు తదభిముఖముగ చూచినట్లు నాకు తోచ లేదు. రెడ్డిగారి విమర్శయందు గొప్ప పరిశ్రమ, చిత్తశుద్ధి, విషయైకదృష్టి కన్పించుచున్నవి. విమర్శకుల కుండవలసిన ఈ మూడు ముఖ్య గుణములు రెడ్డిగారియందు చక్కగా దీపించు చున్నవి. ఇవిగాక, ఉదాత్తత, పక్షపాత రాహిత్యము, సంయమనమ్ము వీరి రచనయందు కన్పించుచున్నవి. మృదువుగను, మధురమ్ముగను వీరి వచన రచన హుందాగా ఈ గ్రంథమునందు నడచినది. రెడ్డిగారి ఈ గుణములను గురించి శ్రీమాన్ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు ప్రస్తావనయందు పేర్కొన్నారు. వారన్నట్లు, ప్రతిమాభిషేకముల సమీక్ష లోతుగా నడచినదని నే నంగీకరింప లేకున్నాను. రెడ్డిగారి నిర్ణయములతో మన మేకీభవింపలేకపోయినను, ఈ గ్రంథము సహృదయులు చదువదగినదే!

—ధూళిపాళ శ్రీరామమూర్తి.

# విశ్వాంతర

[నాటకము. రచన : ఆమంచర్ల గోపాలరావు, ప్రచురణ : శ్రీ వాణీ పబ్లికేషన్సు, విజయవాడ—2, 1/8 క్రౌను సైజున 120 పుటలు. వెల : రెండు రూపాయల పావలా.]

గౌతముడు పూర్వ జన్మలో విశ్వంతరుడై — అత్యంత దానశీలుడై తన సమస్త ఐశ్వర్యములతోపాటు, భార్య అయిన 'మాద్రి' ని కూడ దానం చేశాడు. ఇదే సన్నివేశం అజంతాలోని 17 వ గుహలో అందంగా చిత్రితమైనది. ఆ సందర్భం, ఎనిమిదవ శతాబ్దంలో జరిగినట్లు భావించి దానిని ఆధారంగా ఆమంచర్ల గోపాలరావుగారు ఈ నాటకాన్ని రచించారు. వీరు బౌద్ధ వాఙ్మయంలోను, వాస్తు శిల్ప చిత్రలేఖనా కళలలోను గొప్ప పరిశోధనలు చేశారు. బౌద్ధ ధర్మం—వజ్రయానంలో పడి క్షీణదశలో పడి హింసాత్మక స్వరూపం చేపట్టిన సమయంలో తమ కథావస్తువును కల్పించుకొన్నారు. అజంతా గుహలలో 'విశ్వంతర' చిత్రం లిఖిస్తున్న లేఖకుడు విజయశ్రీ ఈ నాటకంలో ధీరోదాత్తుడైన నాయకుడు. ఇందలి ఖల నాయకుడు ధర్మదేవుడు, విహార మహానాయకుడు, వజ్రయాన పంథాను అనుసరించి ఆ ధర్మ ప్రచారం కోసం ఎట్టి ఘోరములు చేయుట కయినను వెనుదీయని కుటిలుడు. విజయశ్రీకి, ఉపసంపద (బౌద్ధభిక్కు దీక్ష) యిచ్చే సమయంలో కథ ప్రారంభ మవుతుంది. పవిత్రమైన కాచపాత్ర పగిలిపోవడం ఒక వ్యంగ్య సూచనగా రానున్న రసాభాసను వ్యక్తపరుస్తుంది. విజయశ్రీకి వజ్రయానంలోని వామాచారాలు, ముద్రలు, మకార పంచక సేవనములు నచ్చవు. దీక్ష తీసికోవడానికి నిరాకరిస్తాడు. దానితో ఆ నాయకులకి కోపం వస్తుంది. విజయశ్రీకి దెబ్బలు తగులుతాయి. విజయశ్రీ అంటే జాలిపడి అతనితో కష్టసుఖాలు పంచుకొనే రాగిణి యశోద కథానాయిక—ఈ నాయకీ నాయకుల సాహచర్యము ప్రత్యర్థుల దుష్కచర్యల నెదుర్కొని నిలుస్తుంది. అది వివాహంగా ఫలించి మంగళగానంతో అంతమందుతుంది.

బౌద్ధగాథగానంతో ప్రారంభమైన నాటకం ఉపనిషత్ వాక్యం :

సహనావవతు సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై,
తేజస్వినా౽ వధీతమస్తు
మావిద్విషావహై : అను శ్లోకంతోను, బౌద్ధ జయమంగళ గానంతోనూ ముగుస్తుంది. బౌద్ధమతంలో పాడే పాటలు గాథ లంటారు. అవి ప్రాకృతంలో ఉన్నవి. వాటినే తెనుగులో వింజమూరి శివరామారావుగారు అనువదించారు.

గోపాలరావుగారు, క్రొత్తరకం నాటక రచన చేయుటలో ప్రయోగాలు చేసి, మల్లమదేవి ఉసురు, మాట పట్టింపు వంటి నాటకాలు వ్రాశారు. ఇంకా చేయి తిరిగిన

తరవాత యీ నాటకం వ్రాశారు. దీనిని—కే. వి. గోపాలస్వామి గారు ఆంధ్ర విశ్వవిద్యాలయ విద్యార్థులచేత ప్రదర్శింప జేశారు. నాటకం భావ సంఘర్షణతో ఉదయిస్తుంది. ఇక్కడ చూపిన భావ సంఘర్షణ, బౌద్ధ ధర్మంలోని అహింసా సూత్రాలకు హింసాత్మక దురాచారాలకు మధ్య జరిగినది. ఇది చక్కగా విశదమయి సహృదయులకు సరసానుభూతిలోకి వచ్చే టట్టు చక్కని సన్నివేశాలు పాత్రలు రచయిత కల్పించి, అవి సత్యమని తోచేటట్టుగా చారిత్రిక ప్రాతిపదికలో వానిని ప్రదర్శించారు. అందుకే 'విశ్వంతర' చిత్రము, ఆ చిత్రలేఖకుడు ఈ నాటకానికి జీవనదీప్యతలు. ఈ నాటకమంతా మూడు అంకాలలో ముచ్చటగా నిర్వహించారు. నాటకం బౌద్ధ ధర్మానికి సంబంధించిన ఉగుటచేత, దాని పరిభాష విపులంగా వాడియున్నారు. అందరి ఆచార వ్యవహారములు వాని ప్రాము ఖ్యమును గూర్చి అధఃస్థానికలలో విపులముగా తెలిపియున్నారు.

బౌద్ధధర్మములో పూర్తి పరిశోధన చేసిన వారికి గోపాల రావుగారు తెలిపిన కొన్ని అంశములను వింతగొల్పవచ్చును. బౌద్ధధర్మంలో హీనయానం, మహాయానం, నవయానం ఉన్నవి. టిబెట్టులో నేపాలులో వచ్చినది—తాంత్రిక సంబంధమైన ధర్మమే. జపానులో వృద్ధి అయినది జెన్ బౌద్ధము. (ధ్యానబుద్ధి) వజ్రయానము అనునది కాక వజ్రచ్ఛేదిక స్మాత్రమును అనుసరించిన పద్ధతి యున్నది. దీని కంతకీ మూలము "థేరవాద" ధర్మము. అయితే యీ నాటకంలో ప్రసక్తికి తెచ్చినది, మంత్రయానం లేక వజ్రయానం, దానిని ప్రచారంచేసిన వజ్రాచార్యులున్నా. అష్టశీలాలు గురించి అధోజ్ఞాపికలో—గోపాలరావుగా రిలాగ తెలిపియున్నారు.

"అష్టశీలాలు: క్రైస్తవుల పది కమాండుమెంట్లు లాగ బౌద్ధులకు అష్టశీలాలున్నాయి. నిర్వాణ మార్గానికి ఈ అష్టశీలాలు అవసరం. (1) సత్యదృష్టి, (2) సత్యాశయం, (3) సత్యవాక్కు, (4) సత్యశీలం, (5) సత్యజీవనం, (6) సత్య పరిశ్రమ (7) సత్యబుద్ధి (8) సత్యధ్యానం అని పేటికనవచ్చును. నిజానికి పాళీలో చెప్పిన మాటలు—(1) సమ్మదిత్తి (సమ్యక్ దృష్టి) (2) సమ్మ సంకప్ప (సమ్యక్ సంకల్పము), (3) సమ్మ వచ (సమ్యక్ వచనము), (4) సమ్మ కమ్మంత (సమ్యక్ కర్మ) (5) సమ్మ ఆజీవ (సమ్యక్ జీవనము) (6) సమ్మవాయామ (సమ్యక్ ప్రయత్నము), (7) సమ్మసాతి (సమ్యక్ భావన, (8) సమ్మ సమాధి (సమ్యక్సిద్ధి, సమాధి లేక నిర్యాణము) మూలసూత్రాలకు — యీ గ్రంథములో తెలిపినదానికి ఎంత అర్థభేదమున్నదో దీనినిబట్టి గ్రహించవచ్చును. ఇలాగే కొన్ని వివరణములు ఇంగ్లీషులో చదివి—ఏదో భాషలో తేట పరచినట్లు తోస్తుంది. అంతకంటె మూలములోని శబ్దములే ప్రయోగించవలసింది.

ఈ నాటకములో వివరణ పొందిన భావములన్నీ కల్పనాత్మకములే అయినా ఇది ఒక ధర్మానుశీలనము గురించినవి కాబట్టి యింతకంటె శ్రద్ధతోను, జాగరూకతతోను వ్రాసి యుండవలసినది.

సంభాషణల శైలి— వ్యవహారభాషలో నున్నా కాని సందర్భములకు, సన్నివేశములకు, పాత్రలకు, భావములకు తగిన ఔచిత్యము పొందని కారణంచేత—అసహజముగానున్నది.

ఈ నాటకము 1946 లో 'నవోదయ' పత్రికలో ప్రకటిస్తూ నీలంరాజు శేషయ్యగారు తమ అభిప్రాయమును ఈవిధంగా వివరించారు అని సూచనలో ప్రకటించారు.

"సంస్కృత నాటక రచనా సంప్రదాయాలు ఆధునికులు తప్పనిసరిగా అనుసరించతగ్గవని రావుగారి అభిప్రాయము. కాల, స్థల, కార్య ఐక్యతలకు సమన్వయం కుదిరేంత వరకు ఆ సంప్రదాయాలను ఈ నాటకంలో అనుసరించారు.

విఖ్యాత ఇటాలియన్ నాటకకారుడైన పిరాందిల్లో శిల్పం విశ్వంతర నాటకంలో కనిపిస్తుంది.. ఇబ్సెన్ నాటకాలలో కథ క్లయిమాక్సుతో ముగుస్తుంది. శ్రీ గోపాలరావు అనుసరించిన శిల్పంలో క్లయిమాక్సులు నాటకానికి మూలాలు."

తెనుగు నాటకాన్ని పరిచయం చేసేటప్పుడు, ఇటాలియన్ నాటకకర్త పిరాందిల్లో శిల్పం కాని, నార్వేజియన్ నాటకకర్త ఇబ్సెన్ క్లయిమాక్సులుగాని పోలికలు తెస్తే— మన నాటకం ఎక్కడ నిలుస్తుందో! షేక్స్పియర్ అన్నట్లు తారతమ్యాలు దుర్గంధపూరితాలు. అంటే దుఃఖపూరితాలు. (Comparisons are odorous odious-Dogberry.)

'విశ్వంతర' చారిత్రిక పాత్రలతో రచించిన చక్కని నాటకంఅంటే చాలునేమో!

—శ్రీవాత్సవ.

# జూనా ప్రణయగాథ

[గేయకావ్యం : రచన : దుర్గానంద్, ప్రచురణ : దేశి కవితా మండలి, విజయవాడ—2.]

లైలా మజ్నూ, షిరీన్ ఫర్హాద్, అనార్కలీ సలీముల ప్రణయ కథల వంటిదే జూనా వల్లీల ప్రణయగాథ. దీనికి చారిత్రకాధారం లేదు. "కావ్యంలో ముందు భావం పుట్టి తరువాత మనిషి పుట్టాంది" అని రచయితే చెప్పుకొన్నారు. దేశాలమీద ప్రయాణంచేసే లక్షల ఓడారీ వ్యాపారుల్లో ఒకని పేరు వల్లీ. లోయల్లో పుట్టే కోటి సౌందర్యాల్లో ఒక సౌందర్యం పేరు జూనా. అవి రెండూ కలుసుకున్నచోటు హిందూకుష లోయ. "అతడును వేళులచిగురాకుల అందముగా జార్చుచు దువ్వలువలు, కొలిచి కొలిచి ఘుకు నూటిగ తిన్నగ క్రొత్త ప్రాత దీవుల కమ్ముచుండు." వల్లీ అటు వంటి బేహారి. ఒక పూరికొంపలో వున్న జూనా యను కన్యకు తన దువ్వలువలు అమ్ముతాడు. ఆమె ఆ రాత్రి అతని గుడారంలో ప్రవేశించి కలుసుకొంటుంది. అక్కడ ప్రారంభ మవుతుంది వారి ప్రణయగాథ. వల్లీ వ్యాపారం నిమిత్తం వెళ్లిపోతాడు. జూనా వద్దకు రాడు. జూనా తండ్రి ఆ గుడారం దగ్గర త్రవ్వి

రత్నాల రాసులు తెచ్చుకొంటాడు. వానితో రెండు ఒంటెలతో తిరునాళ్లకు బయలుదేరుతాడు. అక్కడ తన ప్రియుని కలుసుకోవాలని జూనా ప్రయత్నిస్తుంది. కాని కనిపించడు. ఆమె తండ్రితో యింటికి తిరిగి వచ్చివేస్తుంది. తండ్రి పెద్ద రాజమహాలు నిర్మిస్తాడు. ధనవంతుడై—ఆ సిరిసంపదలు అనుభవించకుండానే మరణిస్తాడు. ఆమె మాత్రం ఆ భవనానికి భాగ్యానికీ వారసురాలుగా మిగిలిపోతుంది. తన ప్రియుడు 'వళ్లీ' కోసం దారి తెన్నులు చూస్తూ ఉంటుంది. చివరికి ఏనాటికో ఆమె వృద్ధురాలయిన తరువాత ఒక ముదుసలి వ్యాపారి ఆ దారిని పోతూ వచ్చి ఆగి ఆ త్రోవలో ఉన్న కుటీరం సంగతి అడుగుతాడు. ప్రతిరోజూ సంజెవేళ వచ్చి ప్రశ్నిస్తాడు.

ప్రతి సంజెన ఆవృద్ధు డీలువడి
పరుండ తడగొళ్లు బడుచుండు నట
ప్రమోల నిలిచి క్షణ మాగి యవ్వయును
అను. వో "పాంథా, చలిరేల నేల
ఆరుబయట రారమ్మ లోనికిని"

*　　*　　*　　*

"అట్లే యొక కొంతకాల మేగినది
ఆ పలుకులు వినలేదు ఎవ్వరును."

అన్ని ప్రణయగాథలలాగే జూనా ప్రణయగాథ కూడ విషాదాంతమే. మాత్రాచ్ఛందస్సులో గేయ ఫణితిలో నడిచిన యీ రచన కొన్నిచోట్ల త్ర్యస్రంలోను, కొన్నిచోట్ల చతురస్రంలోను నడిచింది. బ్లాంకువర్స్ అనే అమిత్రాక్షరీ ఛందములు వ్రాయుటచేతనేమో, ఆ గేయములో కూడ సమానసంఖ్యగల మాత్రలు లేవు. ఉదాహరణకు పాటవలె పాడుకోదగిన ఈ పంక్తు లెంత ఎగుడు దిగుడుగా నున్నవో చూడండి.

శిలనుగాను మానవతా
వని గదలిక గని నేటికి తలి
రాకు మొలకనైతి, న
న్నురిని రాచి శిల్పించబోకు
కఠినశిల్పీ !

ఇలాగే కావ్యమంతా నడిచింది. కావ్యమంతా తొమ్మిది భాగాలు చేసి ఒక్కొక్క భాగానికి ఒక కావ్య నాయిక పేరు కవి పెట్టుకుని "జూనా" ను తొమ్మిది రకాల నవనాయికగా పరిచయం చేయడంలో క్రొత్తదన మున్నది. జూనా, భగ్న, ఉద్విగ్న, వివర్ణ, భ్రాంత, పృచ్ఛిక, ఆహత, గేహిని, సాంధ్య, ఇవి జూనాపొందిన నవనాయికా స్వరూపాలు. ఈ ప్రేమగాథను—పర్షియా దేశంలో జరిగినదని చూపడంచేత అచ్చటి ఆచార వ్యవహారాలు, అచ్చటి పండ్లు, ఫలాలు, జంతువులు వర్ణించుటలో కవి చక్కని కల్పనలు చేసి క్రొత్త కవి సమయాలు ప్రయోగించాడు.

నిన్న వంటి ముల్లుమీద
నేడు కూడ నిలుచున్నది
నిన్న వంటి కొండమీద
నేడు ప్రొద్దు జారుతుంది
దిటవులేని మనసు పొంగి
తవిణ గొట్టి చెప్పుతుంది
చక్రడోల వంటి బ్రతుకు
చుట్టివచ్చు నెన్నిసార్లు.

వ్యావహారికం వాడటంచేత 'పెదిమలు' వంటి శబ్దాలు, 'మతపిచ్చి' వంటి సమాసాలు, "విడిదీల" వంటి బహువచనములు 'అటనుం డింకెచ్చటికో' వంటి సంధులు ఎడనెడ దర్శనమిస్తూ ఉంటాయి. యతిప్రాసలు పాటించకపోయినాకాని శ్రుతికటువులయిన కొన్ని ప్రయోగా లెందుకు చేశారో తెలియదు. ఒక మంచి ప్రణయగాథ—చదవాలంటే ఈ పుస్తకం చదువవచ్చును. ఈ పుస్తకంలో రెండు మూడు బొమ్మలు వేసి రచయిత—"జూనా వళ్లీల విషాద రూపాలను అక్షరాలతోనే కాదు 'రేఖలతో కూడ సృష్టించగలమని" నిరూపించుకొన్నారు కాని కవితలో కల్పించిన అందాన్ని, యీ రేఖలలో పరిమితంచేసి, తన కవితాసృష్టికి కొంత హద్దు లేర్పరచికొన్నట్లున్నది. కావ్యములో పొడగట్టిన సుందర పాత్రలు ఈ రేఖలలో రూపుకట్టలేదు. మన దేశానికి చెందని ఒక ప్రేమగాథ కాలక్షేపం కోసం చదువగోరేవారికి కొంతవరకు ఈ కావ్యం సంతృప్తి నీయవచ్చును. "జూనా వళ్లీల ఆత్మరోదన ప్రతి పుటలోను నీరవంగా నిశ్చల ప్రణయ సమాధిపై నుండి వచ్చే హోరుగాలిలా వినిపించుతుంది" అని పరిచయం వ్రాసిన ఆర్. కె. మొగసాటి అన్నారు. "నీరవంగా వినిపించే ఆత్మరోదన" వినిపించుకోగల సహృదయు లెవరైనా ఉంటారేమో చూడాలి ?

—శ్రీవాత్సవ

# జ్వా లా ము ఖి

[మూలం: శ్రీ అనంత గోపాల శేవడే. అనువాదం: భారతుల మార్కండేయశర్మ. నేషనల్ బుక్ ట్రస్టు గ్రంథము. వెల: రు. 3—50 లు.]

జ్వాలాముఖి అనే ఈ గ్రంథం ఒక నవల. దీనిని శ్రీ అనంత గోపాలశేవడే హిందీలో రచించారు. నేషనల్ బుక్ ట్రస్టు గ్రంథంగా దీనిని 'భారత ప్రభుత్వ రేడియో, సమాచారమంత్రిత్వశాఖ

# గ్రంథవిమర్శనము

ప్రచురణవిభాగంవారు శ్రీ భారతుల మార్కండేయశర్మచే తెలుగు చేయించి ప్రకటించారు.

శ్రీ శివడేను గురించి తెలుగు పాఠక లోకానికి అంతగా తెలియదు. అందువల్ల ప్రచురణకర్తలు ఆయననుగూర్చి ఇచ్చిన కొంత ఉదంతాన్ని ఇక్కడ ఉదహరిస్తాను. "ప్రఖ్యాత హిందీ నవలాకారుడు ప్రేమ్‌చంద్‌కు తరువాతి తరమునకు చెందిన క్రొత్త నవలాకారులలో అనంతగోపాల్ శివడేకు ప్రముఖ స్థానమున్నది. ఆయన జన్మతః మహారాష్ట్రుడు. అయినను రచనలను మాతృభాష మరాఠీలో కాకుండ, హిందీలో కొనసాగించినాడు."

ఈ గ్రంథాన్ని హిందీ పండితులు చాలామంది మెచ్చుకున్నారు. డా. రాజేంద్రప్రసాద్‌గారి కితాబు గూడా దీనికి వుంది. 1957 లో ఈ నవలకు, అంటే హిందీ మూలానికి, ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం బహుమతి గూడా ఇచ్చింది. ఇందులో 1942 నాటి జాతీయ విప్లవం ఇతివృత్తంగా గ్రహించబడింది.

కాని ఆ మహా విప్లవాన్ని ఇతివృత్తంగా తీసుకుని, ఈ నవల రచింపబడినా, కథ పాకంలో నడిచిందనడానికి వీలు కన్పించడం లేదు. నవలలో కొన్ని అసందర్భపు సంఘటనలు వున్నాయి. భార్యాభర్తలు ప్రథమ సమాగమపువేళలో, పడకగదిలో రాజకీయాలు మాట్లాడుకుంటారు. పాత్రలు మాట్లాడ్డానికి బదులు ఉపన్యాసాలు ఇస్తాయి. శ్రీ శివడే మహారాష్ట్రంలోకాక, హిందీలో వ్రాసినందువల్ల ఇది గొప్పదయితే అయిందేమోగాని, ఇందులో రచనాశిల్పం పరమ మట్టంగాఉంది. అది తర్జుమా లోపమో, కాక మూలగ్రంథంలోవున్న దోషమో చెప్పలేము.

హిందీలో ప్రేమచంద్ నవలలు ఏవిధంగా చూచినా, బాగుంటాయి. తెలుగు అనువాదాల్లో గూడా—అవి ఎంత చచ్చుగా తర్జుమా అయినప్పటికీ—వాటి శక్తి ప్రతి బంతిలోను కన్పిస్తూనే ఉంటుంది. ఈ నవలలో ప్రేమ్‌చంద్‌లో కన్పించే ఔన్నత్యంగాని, గంభీరతగాని, లేక మానవ ప్రవృత్తిని అర్థం చేసుకొని దానిని రచనా శిల్పంలో ఇమిడించడంగాని ఏమీ కన్పించదు. అందువల్ల ప్రేమచంద్ తరువాతితరంలో శ్రీ శివడే ప్రముఖ రచయిత అయితే, హిందీలో నవలా రచన ఎంత దిగజారిపోయిందో ఈ నవలవల్ల తెలుస్తుంది.

అసలు ఇందులోని ఇతివృత్తం ఒక మోస్తరు చిన్నకథగా వ్రాయడానికి మాత్రమే యోగ్యమైంది. దానిని ఒక నవలగా విస్తరించడంవల్ల, ఆ విస్తరణకు తగినవిధంగా కథాగమనం లేకపోవడంవల్ల, నవల పూర్తిగా దెబ్బతినిపోయింది. అంతేగాక, రచననుబట్టి చూస్తే ఇది 19 వ శతాబ్దంలో నవలా శిల్పాన్ని అనుసరించి ఉన్నట్లు ఉంటుందిగాని, అధునాతన రచనాశిల్పం ఎరిగి రచించినట్లు గూడా కన్పించదు. పాత్రలకు మూఢనమ్మకాలు మొదలైనవి అధికం. బొంబాయి సినిమాలలోవలె హారతిపళ్లెంలో దీపం ఆరిపోవడం, వెంటనే కథకు నాయక అయిన చదువుకున్న పడుచుపిల్ల భర్తతో "నాకు చాల భయమగుచున్నది. నీరాజనము చల్లారినది. (ఆరిపోయిందనో, కొండఎక్కిందనో, అనడానికి వచ్చిన తిప్పలు). ఇది అపశకునము. అనిష్టమునకు సూచన" అంటుంది. కథకు నాయకుడైన అతడు 'ఈ అపశకునమువలన ఇంతకంటె క్రొత్త విషయ మేమి రాగలదు" అని ప్రపంచ యుద్ధాన్ని గురించి ఉపన్యాసం ఇస్తాడు. ఇది వారి జీవితంలో తొలి సమాగమ వేళలో, శయన మందిరంలో ప్రవేశించగానే జరిగిన సంభాషణ. "పృష్టతాడనా, దంతభంగా" పద్ధతిలో ఉంది.

ఇట్టి అసహజమైన ఘట్టాలు ఈ నవలలో చాలా ఉన్నాయి. ఏ పట్టులోను పాఠకుని హృదయం స్పందించే ఘట్టం లేదు. ఆఖరికి కథానాయకుని అండర్‌గ్రౌండ్ జీవితాన్ని గూర్చిన ఉదంతం గూడా పరమ నిరుత్సాహంగా చెప్పబడింది. కథానాయకుని విచారణ ఘట్టంలో పాటవంలేదు. కథనాయకుని ఆత్మార్పణ ఘట్టములో పసలేదు. అనగా ఆ ఘట్టమును చదువుచుండగా మనస్సు ద్రవించదు. అక్కడ ఏ రసమూ లేక నీరసంగా ఉంది.

కథ అంతం గూడా జుగుప్సాకరంగా ఉంది. కథానాయకుని తల్లి ఏల గంగలోపడి ఆత్మహత్య చేసుకొనవలయునో, దేశమునకు స్వాతంత్ర్యము రాగా, ఆ ముదుసలితల్లిని ఆత్మహత్యపాలు చేయుటలోగల శిల్పమేమో, ఔచిత్యమేమో చింత్యము.

ఇట్టి నవలలను దేశ భాషలలోనికి అనువదించి ప్రకటించుటలో ప్రభుత్వం వారి సాహిత్యసేవకన్నా, ఇతరమైన లక్షణములు మాత్రమే అధికంగా గోచరిస్తున్నాయి.

—హా. శి.

## గ్రంథపరిచయము

### 1. తిలోత్తమా సాహసికము
### 2. ఉషారాజ్ఞి

ఈ రెండును వైద్యవిద్వాన్ పండిత సత్కవి శ్రీ నారు నాగనార్య ఖండ కావ్యములు. ఆర్యకవిగ్రంథమాలలో తొమ్మిదవ కుసుమముగా ఉషారాజ్ఞి ప్రకటించబడినది. వెల రు: 1—50 లు. తిలోత్తమా సాహసికమును కవిగారే ప్రకటించుకున్నారు. గ్రంథములకు శ్రీ ఆత్మారామ విహారము, నాగవరము, కడప జిల్లాకు వ్రాసుకొనవలెను.

### 3. విశ్వకవి

శ్రీ లేళ్ల సాంబశివరావు కవి రవీంద్రకవిని గూర్చి వ్రాసిన పద్య గ్రంథం. కవి వేటపాలెంలోని శ్రీ బండ్లబాపయ్య హిందూ హయ్యర్ సెంకడరీ స్కూలులో హిందీ పండితులు. గ్రంథము మూల్యం: 50 నయాపైసలు.

## 4. వేంకటేశ్వర గీతాంజలి

శ్రీమత్తిరుపతి వేంకటనాథుని మేలుకొల్పుగా, ప్రార్థనగా రచింపబడిన పద్య గ్రంథం. కర్త శ్రీ తాడిపూడి శ్రీ రామచంద్ర కీర్తి. ప్రాప్తిస్థానం: మహేంద్రవాడ పబ్లిషింగ్‌హౌస్, యానాం. వెలలేదు.

## 5. వేంకటేశ సుప్రభాతము

శ్రీమత్తిరుమల వేంకటనాథుని గూర్చిన సుప్రభాత శ్లోకములకు విశ్వనాథ నరసింహం (విద్వాన్; ఎం. ఎ., బి. ఇడి.) అనువాదం: మూలంతో సహా ఉంది. ప్రాప్తిస్థానం: శ్రీ వి. నరసింహం. పార్వతీపురం, శ్రీకాకుళంజిల్లా. వెల రు. 1—00

## 6. రామాంజనేయ యుద్ధం

శ్రీ గునాపు రచించిన 9 రంగములుకల నాటకం. వెల: రు. 1—50 లు. శ్రీ సాయీ నాట్యమండలి, ఏలేశ్వరం, తూర్పు గోదావరిజిల్లావారు ప్రకటించారు.

## 7. మాటలంటే మాటలా

స్ఫూర్తిశ్రీ రచించిన వచన గ్రంథం. కాకినాడ విపంచికా ప్రచురణలువారు ప్రకటించారు. వెల అర్థ రూపాయి.

## 8. మలయాళ సద్గురు శతకం

రచయిత సాహిత్య శిరోమణి శ్రీ సముద్రాల లక్ష్మణయ్య. ప్రకాశకులు శ్రీ ముప్పాళ్ల రంగారెడ్డి—పద్మావతమ్మ దంపతులు, మేకొల్లు, నెల్లూరుజిల్లా. వెల: 25 నయాపైసలు. ప్రాప్తిస్థానం—వ్యాసాశ్రమం, ఏర్పేడు, చిత్తూరుజిల్లా.

## 9. హనుమత్ప్రభు శతకం

## 10. నారసింహప్రభు శతకం.

ఈ రెండు శతకములను కవిసింహ శ్రీ పోకూరి కాశీపత్యవధాని రచించారు. వెల తెలియదు. ప్రాప్తిస్థానం శ్రీ కాశీపత్యవధాని, బోదిలవీడు, గుంటూరుజిల్లా.

## 11. సౌందర్యలహరి

శ్రీ శంకర భగవత్పాదుల సంస్కృత సౌందర్యలహరికి ఇది శ్రీ పురాణం కుమార రాఘవశాస్త్రి అనువాదము. పబ్లిషరు: శ్రీ గూడూరి నమశ్శివాయ, గాంధినగరం, విజయవాడ—3. వెల: ఒకరూపాయి.

## 12. విజయవీణ

ఆంధ్ర విశారద, కవితా కళానిధి, సహజ పండిత శ్రీ పొత్తూరి వీర రాఘవ వరప్రసాదరాయశర్మ ఈ కావ్యమును రచించారు. ప్రకాశకులు గూడా వారే. వివరములకు వీరరాఘవ గ్రంథాలయం, సంతమాగులూరు (గుంటూరుజిల్లా) వ్రాసుకోవలసిఉంటుంది. గ్రంథం క్వాలిటీ పబ్లిషర్స్, విజయవాడ—2 వద్ద దొరుకుతుంది. వెల: ఒక రూపాయి.

## 13. భూలోకమాత శతకం

ఈ శతకాన్ని గూడా శ్రీ పొత్తూరి వీరరాఘవ వరప్రసాద రాయశర్మయే రచించారు. ఇది వీరరాఘవరాయ గ్రంథమాలలో ఆరవపుష్పము. వెల: 50 నయాపైసలు.

## 14. కుట్టి శతకము

రచయిత కీ. శే. పొత్తూరి వీరరాఘవరాయకవి. వీరరాఘవ రాయ గ్రంథమాల (సంతమాగులూరు పోష్టు)లో ప్రథమ పుష్పంగా ఇది ప్రకటింపబడింది. వెల 50 నయాపైసలు.

## 15. శ్రీరామతారావళి

దీనిని గూడా కీ. శే. పొత్తూరు వీరరాఘవరాయకవి రచించారు. వీరరాఘవరాయ గ్రంథమాల ద్వితీయపుష్పంగా ఇది ప్రకటింపబడింది. వెల: 8 అణాలు.

* * * *

తెలుగు మహాజనసభ సప్తమ వార్షిక సంచిక (1962) మా కార్యాలయమునకు చేరింది. ఇందులో శ్రీ రావికొండలరావు శ్రీ సింగమాచార్య, శ్రీమతి నిడుమోలు ప్రసూన, శ్రీమతి ఇల్లిందుల సరస్వతీదేవి, శ్రీ దాశరథి, ఆరుద్ర, శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు, శ్రీమతి పద్మావతీ గంగాధర్‌ల తెలుగు రచనలు, శ్రీ పి. గంగాధరరావు, ప్రొఫెసర్ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారల ఇంగ్లీషు రచనలు ఉన్నాయి.

# లేఖలు

# నవ్యాంధ్రసాహిత్యమునకు యుగకర్త ఎవరు?

"భారతి" సంపాదకులకు :

అయ్యా!

నవ్యాంధ్ర సాహిత్యానికి యుగకర్త ఎవరు? అన్న ప్రశ్న ఈనాడు ఉదయించింది. ఇటీవల జరిగిన ఒక సాహిత్య సభలో "నిజానికి ఈ యుగకర్త వీరేశలింగంకాదు, చిన్నయ సూరి" అని సుప్రసిద్ధ పరిశోధకులు శ్రీ నిడదవోలు వెంకటరావు గారు అనడం, వారు అన్నదానిని ఆంధ్రులందరూ జ్ఞాపకముంచుకోవాలని కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు చెప్పడంతో యుగకర్త ఎవరు అన్న మీమాంస వచ్చింది.

ఈ విషయంలో ఆంధ్రదేశంలోని సాహితీపరుల అభిప్రాయాలను గమనించితే మూడు వర్గములవారు ఉన్నట్లూ, మూడు రకాల అభిప్రాయాలు ఉన్నట్లూ విశదమవుతున్నది. ఒక వర్గంవారు నిడదవోలు వెంకటరావుగారివలె యుగకర్త చిన్నయసూరియే అని అంటారు. మరొకవర్గంవారు యథార్థానికి తెలుగు సాహిత్యంలో నవీన యుగానికి కర్త వీరేశలింగం పంతులుగారే అని చెబుతారు. ఇక సాహిత్యరంగంలో వామపక్షం వారు అనగా అభ్యుదయ రచయితలు వీరేశలింగం, గిడుగు, గురజాడలు ముగ్గురూ నవ్యాంధ్ర సాహిత్య యుగ పురుషులు అని ఉద్ఘాటిస్తారు. వీరి నాయకుడు శ్రీశ్రీ ఒకమారు "నవ్యాంధ్ర సాహిత్యానికి ఏకైక నాయకుడు గురజాడ అప్పారావు. తెలుగు వారికి జాతీయకవి ఆయనే. ఆధునిక సాహిత్య విప్లవ నాయకుడు అప్పారావుగారే" అని వ్యక్తిగతాభిప్రాయం వెలువరచినప్పటికీ, అభ్యుదయ రచయితల సంఘం అధ్యక్షుడుగా "వీరేశలింగం,గిడుగు, గురజాడ—ఈముగ్గురూ మార్గదర్శకులు. వీరే ఆంధ్రావనిలో విజ్ఞాన బీజాలు చల్లారు. ఆంధ్ర అభ్యుదయ రచయితలు వీరేశలింగం విప్లవ ధోరణులలో, గిడుగు సంప్రదాయాలలో, గురజాడ కావ్య వాహినులలో ప్రాణవాయువులు పీల్చుకుంటున్నారు' అని ఆ ముగ్గురు నాయకుల వ్యక్తిత్వాలను వివరించారు. కనుక ఈ మూడు విధములైన అభిప్రాయాలను విశ్లేషణచేసి వీరి వ్యక్తిత్వములను తులనాత్మక పరిశీలన చేసినప్పుడే యథార్థం మనకు బోధపడుతుంది.

భాషాభివృద్ధికి గద్య గ్రంథము అత్యంతావశ్యకములని మొదట కనిపెట్టినది చిన్నయసూరి అని కొమర్రాజు లక్ష్మణ రావుగారు అన్నమాట నిజమే. సూరిని వీరేశలింగంపంతులుగారే 'అనుపమాధునికాంధ్ర గద్య నిర్మాత'గా పరిగణించారు. చిన్నయ సూరి బాల వ్యాకరణము వ్రాయనిచో ప్రాచీన వాఙ్మయ మడుగంటిపోయి యుండెడిదని కళాప్రపూర్ణ వఝ్ఝల చిన సీతారామ శాస్త్రిగారు అన్నమాటలు యథార్థములే. సూరి యంత మధుర లయాన్వితముగ తెలుగు వచనమును వ్రాయగలాడు ఆంధ్ర వాఙ్మయమున నగపడడను అభిప్రాయము పూర్తిగా నిజము కాక పోయినను, కొంతవరకు సబబే. శబ్దరత్నాకరము రచించిన శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులు సూరిగారి అంతేవాసులని చెప్పబడు మాటనుబట్టి సూరి గొప్ప పండితుడని వ్యక్తమవుతున్నదీ నిజమే. ఆంధ్రభాషకు వ్యాకరణ వ్యవస్థాపకుడైన మహా పురుషుడుగా సూరిని కీర్తించాలి అని విశ్వనాథ వారన్నమాటకూ పెద్ద అభ్యంతరము ఉండబోదు. (పెద్ద అభ్యంతరము ఎందుకంటున్నానంటే సూరి వ్యాకరణమునకు పూర్వము కొన్ని వ్యాకరణములు లేకపోలేదు. దాదాపు ఐదుగురు మహనీయులు రచించిన వ్యాకరణములు క్రీ. శ. 1880 వరకు ప్రచారములో ఉన్నవి. కాని, పాణిని పద్ధతిపై సూరి 1858 లో రచించిన వ్యాకరణము ప్రాధాన్యము వహించి ప్రామాణికమైంది. అది కూడా శ్రీ వేదము పట్టాభి రామశాస్త్రిగారు పద్యములలో వ్రాసిన 'పట్టాభిరామ పండితీయము' అను వ్యాకరణము నాధారముగా విరచింపబడిందని శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రులుగారు 'నీతి చంద్రిక' పీఠికలో తెలిపి ఉన్నారు. పైగా సూరి వ్యాకరణము సంస్కృత లక్షణ గ్రంథముల ననుసరించి ఉందేగాని, ద్రావిడ భాషా కుటుంబములోని తెలుగు భాషకు వ్రాయవలసిన విధంగా లేదని ఆరుద్ర అన్నారు.) తెలుగుకు సూత్రకర్త అనేపేరు ఒక్క సూరికితప్ప, ఇతరులకు దక్కదని శ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగా రన్నారు. సూత్రకర్త అన్నమాట సబబు కావచ్చేమో గాని, సూరి నవ్యాంధ్ర సాహిత్య యుగకర్త అని చెబితేమాత్రం అంగీకరించడానికి వీలులేకుండా ఉంది.

ఎందుకూ అంటే—మొదట ఆంధ్ర సాహిత్యంలో నవీన యుగమంటే యేమిటి? అది ఎప్పుడు ఎలా వచ్చిందీ విచారించాలి.

ఆంధ్ర వాఙ్మయ పంథ మారినప్పుడే నవీనయుగం మొదలయింది. ప్రబంధాలలోని పచ్చి శృంగారము, మూసపోసినట్లుండే వాని రచనా పద్ధతి, వాటి శబ్దాలంకారములు తెచ్చికోలు అర్థాలంకారములని సాహితీప్రియులు విసుగు చెందారు. ఈ అసంతృప్తి ప్రతికూల విమర్శనములోనే వ్యయమైపోక

వాఙ్మయ నిర్మాణానికి తోడ్పడింది. ఆంగ్లేయుల సంబంధము వలన వారి వాఙ్మయము, వారి విజ్ఞానము మన దృష్టి నాకర్షించాయి. మొదట కందుకూరి వీరేశలింగంపంతులుగారు ఆంగ్ల వాఙ్మయములోని కొన్ని రచనా విధానములను సంప్రదాయము లను తెలుగులో వెలయించారు. ఆయన గద్య రచనలు—నవలు, కథలు, జీవితచరిత్రలు, ఆత్మకథ, వ్యాసములు, ప్రహసనములు గ్రంథ విమర్శనములు, చారిత్రక గ్రంథములు, పత్రికా రచనలు, వాచకములు, శాస్త్ర గ్రంథములు, ఉపన్యాసములు అని నిడద వోలు వెంకటరావుగారే ''ఆంధ్ర వచన వాఙ్మయము'' అను గ్రంథములో విభజన చేశారు. ఈ గ్రంథమున కీ పేరు పెట్టి, దీనిని ఆంధ్ర గ్రంథమాల ప్రచురణముగా ప్రకటించిన శ్రీ శివ లెంక శంభుప్రసాద్‌గారు ఆంధ్ర సాహిత్య చరిత్ర తెలుసుకొన గోరు విద్యార్థుల కెంతేని ఉపకారము గావించారని చెప్పాలి. ఇందులో వచన వాఙ్మయమునకు సంబంధించిన అనేకాంశములు, ఎందరివో పేర్లు గ్రంథస్థములైనవి. పై విభజనమునుబట్టి ప్రక్రియా వైవిధ్యమే నవ్యాంధ్ర సాహిత్యముయొక్క ప్రధాన విశేషమని విశద మవుతున్నది. అంతేగాని, వ్యాకరణంకాదు. అసలు ఈ ప్రక్రియ లేవీ చిన్నయసూరికి తెలియవు. ఆయన వచన రచనకు మాత్రమే బాట వేశాడు. ఆ వచనము కూడ కఠినశైలిఅనీ, వీరేశలింగం గారి భాష పదలాలిత్యము, గాంభీర్యము, భావనాపటిమ కలిగి ఉంటుందనీ, ఆంగ్ల వాఙ్మయంలో రస్కిన్‌తో తులదూగగల వాడు వీరేశలింగమని నిడదవోలువారు పై గ్రంథమున చెప్పి ఉన్నారు. అంతేగాక, ''నవీన పథకమున ప్రధానమైనది గద్య రచన. ఎట్టి సూక్ష్మ తరములగు శాస్త్రీయ విజ్ఞానాంశముల నేమి, ఎట్టి మహోన్నత భావములనేమి, సర్వజన సులభముగ గ్రహించు వచన రచనకు సృష్టికర్త వీరేశలింగము. ఆ రచన సంస్కృత సంపర్కమున్నను, తెలుగుదనము కలిగియుండుటచే నీతనికి 'గద్య తిక్కన' యను బిరుదు సార్థకము'' అని అభిప్రాయ మిచ్చివున్నారు. ఈ బిరుదు ఇచ్చినవారు శ్రీ కొమర్రాజు లక్ష్మణ రావుగారు.

అయితే లోకమంతా వీరేశలింగంపంతులుగారే నూత్న సాహితీ రూపములను వెలయించారని అంటూవుండగా, స్వయముగా నిడదవోలువారే వారి రచనలను అన్ని ప్రక్రియలుగా విభజించివుండగా, ఆ శాఖల కన్నిటికీ వీరేశలింగముగారే ఆద్యులు కారనీ, ఆయన తొక్కిన నూతన మార్గములన్నీ అంతకుముందు వెలసినవేననీ నిడదవోలువారు అన్నారు. అన్నారేకాని ఆధునిక వచన శైలిలో మొదటి ప్రహసనము ఎవరు వ్రాశారో, మొదటి శాస్త్రగ్రంథము ఎవరు రచించారో చెప్పినవారుకారు. తెలుగున మొట్టమొదటి నవల కొక్కొండ వెంకటరత్నంపంతులుగారి ''మహాశ్వేత'' అన్నారు రావుగారు. ఇదిగో అసలు ఇక్కడే వారు తికమకపడ్డారు. అది మొదటి కథ కావచ్చునేమోగాని, నవలకాదు. మన మొదటి సాంఘిక నవల వీరేశలింగంగారి 'రాజశేఖర చరిత్రమే. అయితే కొన్ని సంగతులను మాత్రము నిడదవోలువారు ఒప్పుకున్నారు. 'స్వీయచరిత్ర రచనకు వీరేశలింగమే మార్గదర్శి. అంతకు ముందున్న స్వీయ చరిత్రలు పద్యాత్మకములు.' అంతకుపూర్వము మన భాషలో తిట్టు కవిత్వములున్నవిగాని, ప్రహసనములులేవు. వీరేశలింగము ఈ రచనమున సిద్ధహస్తుడు. ఆయన 58 ప్రహసనములు రచించెను.' 'ఆయన రచించిన ఆంధ్ర కవుల చరిత్రలు సాహిత్య విమర్శనమున కాధారమై యున్నవి.' 'వ్యాస రచనా పథకమును తీర్చిదిద్దినది వీరేశలింగమే.' 'వీరేశలింగము పత్రికా సారస్వతమునకు నవీన వాఙ్మయమున ప్రథమ స్థానము సంపాదించినారు.' 'శాస్త్రీయ గ్రంథము లను సులభశైలిలో రచించి, యా విజ్ఞానము నందజేసిన వ్యక్తి వీరేశలింగము.' 'వీరేశలింగము ఉపన్యాసములు తెలుగునాట ప్రసిద్ధములు'. (కాకపోతే 'కన్యాశుల్కం' నాటకంలో గిరీశము తన ప్రియశిష్యుడితో విధవా వివాహం ప్రసక్తి వచ్చినప్పుడల్లా 'దీనిపై వీరేశలింగంపంతులుగారు వ్రాసిన ఉపన్యాసం పైకి తీయవోయ్' అంటాడా?). పై వాక్యములన్నీ పైన పేర్కొన్న గ్రంథములో రావుగారు వ్రాసినవే.

వీరేశలింగంగారు సాహిత్యరంగంలో ప్రవేశించినప్పుడు సాహిత్యం పండితపరమై ఉండేది. పంతులుగారు దానిని ప్రజల కందుబాటులోకి తెచ్చి, ఆంధ్రావనిలో ఒక మహత్తర శక్తిగా తీర్చిదిద్దారు. నిడదవోలువారు ఈ విషయాన్ని గుర్తించే ఇలా వ్రాశారు: ''సంకుచితమగు పాండిత్య దృక్పథమునుండి సాహిత్యమును తప్పించి, ప్రజానీకము వైపున నవ్య సంస్కార వాహినిని మరల్చిన మహావ్యక్తి వీరేశలింగము. ప్రజలలోగల నిసర్గమగు నఖండశక్తిని గుర్తించి, పండితాధీనమునందున్న విజ్ఞానమును పండితులకేగాక, పామరులకు, బాలురకేగాక బాలికలకు అగ్రవర్ణములకేగాక హరిజనులకు, పురుషులకేగాక స్త్రీలకు, సమస్తమైనవారికి జాతిమత విచక్షణ ననుసరింపక తమ మాతృ భాషలో అతి సులభగ్రాహ్యమగు రీతి నందించి, వారిని విజ్ఞాన వంతులుగ నొనరించి భాషాభివృద్ధి గావించి, తన్మూలమున సంఘ సంస్కరణము గావించి జాతీయాభ్యుదయమునకు, దేశాభ్యుదయమునకు మూల పురుషుడగుటచే వీరేశలింగము నవ్య యుగమునకు శకకర్త యైనాడు.'' సాహిత్యానికి ఒక ప్రయోజనము, లక్ష్యము ఉందని నిరూపించి సమాజ శ్రేయస్సుకోసం సాహిత్యాన్ని ఆయుధంగా చేపట్టిన యోధుడు వీరేశలింగం. అయితే సాహిత్యాని కొక ప్రయోజనం ఉందని నన్నయ, తిక్కన, పాల్కురికి సోమనాథుడు వంటి మహామహులు పూర్వమే గుర్తించారు. కాని మధ్యయుగాలలో సాహిత్యం భోగవస్తువు అయింది. అసలు భావస్ఫోరకమే కాకుండా పోయింది. అటువంటిది ఉపదేశం ఎలా చేయగలదు. మన సాహిత్యమును నవీన కాలమున ఆ స్థితినుండి ఉద్ధరించిన వ్యక్తి వీరేశలింగం. అనగా మన కొక కొత్త దృక్పథమునిచ్చి సాహిత్యగతినే మార్చిన మనీషి ఆయన.

నవీన యుగమున నూత్న సాహితీ రూపములు, నూత్న దృక్పథముతోపాటు మరొక కొత్త విశేషం కూడా వచ్చింది. అది వ్యావహారిక భాష. దీనిని ప్రతిపాదించి, ఉద్దండులైన పండితుల నెదుర్కొని, పూర్వ ప్రయోగములను చూపించి, దీని కొక స్థితిని కల్పించినవారు గిడుగు రామమూర్తిపంతులుగారు. చిన్నయ సూరి గ్రాంథిక భాషను అనుశాసించాడు. అది ఈ యుగ లక్షణానికే విరుద్ధం. కాని, వీరేశలింగంపంతులుగారు వ్యావహారిక భాషావాదమును గుర్తించారు. "ఉత్తమ గ్రంథములయందు సహితము అర్థము సుబోధముగా నుండుటకొరకు కొన్ని గ్రామ్య పదములు, వ్యావహారికములు పారిభాషికములు నైన అన్య దేశ్య పదములను వాడవచ్చును" అని వారు వ్రాశారు. 1919 లో స్థాపితమైన వర్తమాన వ్యావహారిక భాషా ప్రవర్తక సమాజమునకు వీరేశలింగంపంతులుగారే మొదటి అధ్యక్షులు. అయితే సమాజము స్థాపితమైన మూడు నెలలకే వారు కీర్తిశేషులయ్యారు. వ్యావహారిక భాషావాదమును స్వీకరిస్తూ, గురజాడ అప్పారావుగారు "నాది ప్రజల ఉద్యమం. ఎవరిని సంతోష పెట్టడానికీ, దీనిని నేను వదలుకోలేను" అని ఉద్ఘాటించి ఉన్నారు. వ్యావహారికభాష వాడుకలోకి వచ్చుటచేత నవీనయుగమే నిర్మితమైంది. ఒక కొత్త రూపురేఖ సాహిత్యానికి వచ్చింది. పత్రికలకు సౌలభ్యం ఏర్పడింది. జన బాహుళ్యం నాగరికతా మార్గంలోకి వచ్చింది. వచన సాహిత్యం—ముఖ్యంగా కథలకు, నవలలకు అది కొత్తజీవం పోసి పాఠకుల సంఖ్య నధికం చేసింది. ఆంధ్రావని కొత్త యుగంలోకి ప్రవేశించింది. ఇదీ పరిణామము.

అయితే వీరేశలింగంపంతులుగారి ముఖ్య లక్ష్యం సంఘ సంస్కరణ. అందుకు సాహిత్యమును సాధనముగా ఆయన పెట్టుకున్నాడు. వివిధ ప్రక్రియలలో వ్రాసి పడవెయ్యడమే ఆయన పని. అందులో కళ, సాహితీమూల్యం ఉందా అని ఆయన వెనక్కి తిరిగి చూచుకోలేదు. ఆ పనిని వారు గురజాడ అప్పారావు గారికే వదిలినట్లయింది. సంఘ సంస్కరణమును పురోగమింప జేయడానికీ, వ్యావహారికభాషకు స్థిరమైన స్థానం కల్పించడానికీ గురజాడ రచనలు చేశారు. అంటే గురజాడకు భావనా గురువు వీరేశలింగమే. అప్పారావుగారి రచన లన్నింటిలోనూ వీరేశలింగం ప్రవేశపెట్టిన మానవోద్యమ ప్రభావమే కనపడు తుందని శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు చెప్పిఉన్నారు. అప్పారావు గారి కన్యాశుల్కమునకు వీరేశలింగముగారి వ్యవహార ధర్మ బోధిని బ్రాహ్మ వివాహము మొదలగు రచనలే పునాదులైనవని సమీక్షకారు లంగీకరించి ఉన్నారు. అయినప్పటికీ, కళ, శిల్పం సాహితీమూల్యం, ప్రయోజనం మున్నగువాటిని బాగా మనస్సుకు పట్టించుకొని శాశ్వతంగా ఉండే రచనలను మొదట్ట చేసినవారు అప్పారావుగారే. అందుకే కాబోలు, కీ. శే. దువ్వూరి రామిరెడ్డి గారు ఒక వ్యాసంలో "అప్పారావుగారి ముత్యాల సరములతో అభినవ కవిత్వోద్యమము ప్రారంభమైనది" అని చెప్పారు. కొందరు దీనికి రాయప్రోలు సుబ్బారావుగారు ప్రారంభకులని అంటారు గాని ఆద్యులు అప్పారావుగారే. "ప్రబోధకావ్యము, ఆత్మపర కావ్యము, ప్రేమగీతము, కథా కావ్యము—అన్నీ తరువాతతరం వారికి మచ్చున కందించినట్లు ఆయన వ్రాశారు" అని కృష్ణశాస్త్రిగారే అంగీకరించి ఉన్నారు. అధునాతన రూపంలో తెలుగు కథానికకు ఒరవడి పెట్టిందీ అప్పారావుగారే. అత్యంత వాస్తవమైన సాంఘిక ఇతివృత్తాలను స్వీకరించిందీ ఆయనే. వ్యంగ్య వైభవంతో కూడిన హాస్యమును చొప్పించిందీ ఆయనే. సజీవమైన పాత్రలను నిర్మినదీ ఆయనే. మాండలికములతో పాత్రోచిత భాషతో నాటకంలో ఇంద్రజాలం చేసిందీ ఆయనే.

కట్టమంచి రామలింగారెడ్డిగారు వీరేశలింగంపంతులుగారిని గూర్చి వ్రాస్తూ "ఆయనే మొట్టమొదటి ఆధునికుడు. కొందరు వారు ఏ యుగంలో జీవిస్తున్నారో ఆ యుగానికి వన్నె తేకుండానే మరణిస్తారు. వారు తాము వెలుగు నివ్వరు; వెలుగువస్తే స్వీకరించరు. వెలుగును చేజిక్కించుకొని, కొత్త పోకడలు పోయి, కొత్త జీవము పోసినవాడే ఘనుడు. అతడే నాయకుడు. కొత్త జీవ మనగా మార్పు—పురోగతి. అంటే యేవి లేకపోతే జీవితం నిలువ నీరైపోయి, విసుగెత్తిస్తుందో వాటిని చేకూర్చినవాడు" అన్నారు. డాక్టర్ వేమూరి రామకృష్ణారావుగారు "వీరేశలింగం అడవులను, దుబ్బులను, ముళ్ళ కంచెలను నరికి, చెత్తా, చెదారం తగులబెట్టి, క్రూరమృగాలను పారద్రోలి మార్గాన్ని సుకరం చేసి, జనపదములను నిర్మించినవాడు. ఆయనకుముందు ఈపని చేపట్టినవారు లేరు. ఆయన తరువాత మళ్ళీ అంతటి ప్రజ్ఞాశాలి అవతరించలేదు" అని స్పష్టం చేశారు.

దీనినిబట్టి నవ్యాంధ్ర సాహిత్య యుగకర్త వీరేశలింగం పంతులుగారేనని తేటతెల్లమవుతున్నది. ఆయన మార్గమును సుకరంచేసి, వెలుగుబాటగా తీర్చిదిద్దినవారు గిడుగు, గురజాడలు. వీరిద్దరుగాక, మరొక్క మహనీయుడు ఈ పురోగతికి సాధనములు సమకూర్చి, నైతిక, ఆధ్యాత్మిక విలువలను పైకెత్తి నవ్యాంధ్ర సాహిత్య సౌధమును పూర్తిచేశాడు. ఆయన కళా ప్రపూర్ణ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు. నవీన యుగమునకు ఈ నలుగురూ మూలపురుషులు. వీరి యుగానికి పూర్వమువాడు చిన్నయసూరి—సాహిత్య చరిత్ర రీత్యా.

—డి. రామలింగం

## కాళహస్తీశ్వర మాహాత్మ్యపాఠ పరామర్శ సమీక్ష

"భారతి" సంపాదకులకు:

అయ్యా!

ప్రాచీన ప్రబంధాల్లో కొన్ని దోసగులు దొర్లుటచే వాటి బరిష్కరింపబూనుట పాఠకులలో బరిశోధనోత్సాహాన్ని కలుగు జేయడంలో ప్రధానపాత్ర వహిస్తున్నది. 1962 జులై భార

తిలో శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు "కాళహస్తి మహాత్మ్య పాఠపరామర్శ" మను పేర నొక వ్యాసము వ్రాసినారు. ఆ వ్యాసమున వారు చూపిన కొన్ని సవరణ లసమగ్రములుగా దోచుటచే వాటి నిటఁ గొన్నింటి నుదహరించుచున్నాను. విజ్ఞులు పరిశీలింతురుగాక!

## (1) "పరిహృత సంతత భ్రమణ భారపదశ్రమ భానుఘోటముఁ...."

పాత, క్రొత్త ముద్రణములలో బాఠమిట్లే యున్నట్లు దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు దెల్పియేయున్నారు. ఈ సమాసమునకు నూతనముద్రణ ప్రతిలో శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారి టీకయు, నది యసమంజసమనుచు పిచ్చయ్యశాస్త్రిగారు చేసిన సవరణమున్ను, నిట నుదాహరించుచున్నాను.

చిలుకూరి వారి టీక:—"పరిహరింపఁబడిన, ఎల్లప్పుడు తిరుగుటచే భారముతోఁ గూడిన పాదముల యంసటగల సూర్యాశ్వములు గలది. ఈ టీకపై "తిరుగుటచే భారముతో గూడిన పాదములు" అనగా నర్థమేమి? పాదములు ఏమి భారముతో గూడినవి?" అని శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారి ప్రశ్నలు. ఈ విధముగ ప్రశ్నలువేసి సవరణను చేసినారు. ఆ సవరణతోఁ గూడిన పిచ్చయ్యశాస్త్రిగారి వివరణము:—

"పరిహృత = తొలగింపఁబడిన, సంతత భ్రమణ భార= ఎడతెగని ప్రయాణము వలని పథశ్రమ= మార్గాయాసముకల, భానుఘోటమున్ = సూర్యాశ్వములు గలది." ఈ వివరణమున "పదశ్రమ" "పథశ్రమ"గా మార్చబడినది. "పథశ్రమ" యనునదే యుక్తమయినచో "సంతత భ్రమణ భార" యనున దెందులకు? "పరిహృత పథశ్రమ భాను ఘోటమున్" యని యున్ననే చాలునుగదా! పథశ్రమము సంతత భ్రమణముచేతనే వచ్చునుగదా? అందువలన 'పథశ్రమ' యని యున్న "సంతత భ్రమణ భార" యనున దుండరాదు. అయినను భారము నిట నేది వహించుచున్నది? "పథము" వహించుచున్నదా? ఈ సవరణము వలన అన్వయ క్లిష్టత, పునరుక్తి యను దోషములు వాటిల్లును. అందుచే "పదశ్రమ" యనుటయే ఒప్పు. "పథశ్రమ" తప్పు. ఇంక వివరణము నీ విధముగఁ జేయవచ్చు. పరిహృత= పోగొట్టబడిన, సంతతభ్రమణ = ఎల్లప్పుడు తిరుగుటచే గలిగిన భార= బరువుగల, పద = పాదములయొక్క, శ్రమ= శ్రమగల, భానుఘోటమున్ =సూర్యుని గుర్రములు గలది. సంతత భ్రమణముచే బరువైనవి పాదములు. ఆ పాదముల శ్రమయే పరిహృతము. పరిహృత పాదశ్రమ గలవి భానుఘోటములు. ఈ విధముగఁ బూర్వ పాఠమువలననే అన్వయము సరిపోవుటయు, పునరుక్త్యాది దోషములు దొలఁగుటయుఁ జరుగును. పూర్వపాఠమే శ్రేయముగాఁ దోచెడిని.

## (2) పనిలేదా? శరణార్థిఁజేసి

"అని యక్కన్యలఁ జేరగాఁ బిలిచి యేలా తల్లితోఁ బోరఁగాఁ
బనిలేదా? తిరుకాళహస్తిపతిఁ జూపన్మాది భారంబు మా
వెనువెంటం జనుందెండు....దండన భక్తిన్ శరణార్థిఁజేసి"

ఈ పద్యమున "పనిలేదా?" యనుచోటగల ప్రశ్నార్థక చిహ్న మక్కరలేదని శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారి సవరణ. "మీ కింకేమీ పనిలేదా?" అను నర్థమున్నా, ప్రకరణోచితము గాదనినారు. ఇంచుక పరిశీలింతము. ఆ ప్రశ్నార్థక చిహ్నము' దొలగిన వేరొక యర్థము స్ఫురించుట గమనీయము. ఏలా తల్లితోఁ బోరగాఁ బనిలేదు = ఏల తల్లితో వాదులాడఁబనిలేదు?" అని అర్థము గోచరించును. "పనిలేదు" అని నిర్ధారించిన ఏమి పని లేదు? "పోరగాఁ బనిలేదు?" అను అన్వయమును జేయవలెను. అట్టిచో "యేలా" అనున దెట నన్వయించును? అందువలన "ఏలా పోరఁగా? = పోరనేల? పనిలేదా? = ఇతర కార్యమేమియును లేదా? తిరు కాళహస్తిపతిఁ జూపు భారము మాది. ఈ విధముగ అన్వయము ప్రశ్నార్థక చిహ్నముననే సుగమము యుక్తము. ఇఁక "శరణార్థిఁజేసి" యనుచోట పిచ్చయ్యశాస్త్రిగారు "శరణార్థిచేసి" యని సవరించినారు. ఈ సవరణ యుక్తముగఁ దోచుటలేదు. "శరణ" యను పదమే యుండదు. "అర్థిచేసి" యనునది యసమాపక క్రియుగా భావించినను, "శరణ" పదముతో సమసింపదు. అట్లు సమసింపఁజేయుట తప్పు. "శరణ" పదము మిత్రాదులలో పఠితము. "క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబు లగు"—సూ. 18 బా. వ్యా—తత్సమము—మిత్రాదులను వివరించుచు, నా సూత్రము క్రిందనే "మిత్ర శరణ ప్రధాన పాత్రాదులు మిత్రాదులు" అని సూరిగారి వివరణము. దీని ప్రకారము "శరణము" "శరణుడు" అను రూపములు మాత్రమేయుండును. శరణుఁజొచ్చి, శరణువేడి యను నట్టి ప్రయోగములు సుప్రసిద్ధములు. శాస్త్రిగారి సవరణ ప్రకారమైనచో "శరణ మర్థిచేసి" "శరణు నర్థిచేసి" యను నట్టి రూపము లుండవలెగాని "శరణార్థి చేసి" యని యుండరాదు. అందువలన "శరణార్థిఁజేసి" యను పాఠమే యుక్తము. "శరణు గోరిన వానినిగఁజేసి" యను నర్థమున్నా సరిపోవును.

శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారు పరిశోధనానిష్ణాతులు. అట్టివారి సవరణలో దోషము లెన్నుట నా తలంపుగాదు. నాకు శక్యమునూ గాదు. నా సందియములను దెల్పుటయే లక్ష్యము. కావున శ్రీ శాస్త్రిగారు వేరుగాఁ దలంపక నా సందియములు బోగొట్టి, యథార్థ్యము నిర్ణయింపవలసినదిగా వేడుచున్నాను.

—ఎస్. టి. పి. వి. రామానుజాచార్యులు.

## "రాజగోపాల విలాసము"

### "భారతి" సంపాదకులకు :

మహాశయా!

భారతి' 39 వ సంపుటము 7 వ సంచిక (జూలై 1962) 'కలగూరగంప'లో శ్రీ బండి నాగరాజుగారు 'రాజ గోపాల విలాసము'పై నొక లఘు వ్యాసమును వ్రాయుచు:

1. "గమనింపవలసి యున్న"దని కొన్ని యంశములను నుడివిరి. అందు (i) రుక్మిణి స్వీయయని "ప్రత్యేకముగ" ఏప్రిల్ 1962 లో నేను వ్రాసిన లఘు వ్యాసమున జెప్పితిననిరి. (ii) నా యెఱుకకై స్వీయ, పరకీయ, జారిణి యను నాయికా భేదములును, స్వాధీనపతిక మొదలగు అవస్థా భేదములును భిన్నములని వివరించుటకు మిక్కిలి శ్రమించిరి. "అష్ట మహిషులను అష్టవిధ శృంగారనాయికలనుగా అవస్థా విశేషమునుబట్టి నిరూపించునపుడు రుక్మిణి—స్వీయ, భద్ర—పరకీయ, లక్ష్మణ—జారిణి యనిచెప్పుట ఎట్లు పొసగును?" అని వారనిరి. మరియు (iii) "అష్టవిధ శృంగార నాయికలనుగా వారిని నిరూపించునపుడు 'రుక్మిణి—స్వీయ' యను మొదలగు వ్రాతలు ప్రామాదికములని యు శ్రీ రాజగోపాల్‌గారు గ్రహింప వేడెదను" అని రచించిరి.

నాకు "దెలిసినట్లు లేదు" అని యూహించి తెలియుటకై పడిన శ్రమతోబాటు నా వ్యాసమును మరొక పర్యాయము సావధానముగ పఠించిన బాగుండి యుండును.

(i) నా వ్యాసమునం దెచ్చటను 'రుక్మిణి స్వీయ యని "ప్రత్యేకముగా జెప్పుట" యు, తక్కిన యష్ట మహిషులు స్వీయలు కారనుటయు లేదు. రుక్మిణియు, ఆమెతోబాటు తక్కిన అష్ట మహిషులందరును కృష్ణుని భార్యలు. కావున వారందరును స్వీయలే. (ii), (iii) వ్యాసమునం దెచ్చటను రుక్మిణి స్వీయ యనియు, భద్ర పరకీయయనియు, లక్షణ జారిణి యనియు నేను వివరింపబూనలేదు. రుక్మిణి కృష్ణుని భార్య యగుటచే స్వీయ, ఆమె యనుభవించిన యవస్థా విశేషము ననుసరించి 'కలహాంతరిత' యగును. నా వ్యాసమునందు రుక్మిణియొక్క లవస్థా విశేషమునుబట్టి ఆమె 'కలహాంతరిత' యని తెల్పి తదాధార భూతమగు పద్యము నొకదాని నిచ్చి యున్నాను. అట్లే అష్టవిధ నాయికలలోని తక్కిన స్వీయలందరును అవస్థా భేదములచే వివిధశృంగార నాయికలుగ కాళయచే చిత్రింపబడిరి.

2. "శ్రీరాఘవాచార్యులవారు చూపిన పొరపాట్లను పొరపాట్లేయని శ్రీ రాజగోపాల్‌గారు వాస్తవము నొప్పికొనిరి" అని సంతోషించిరి. శ్రీ రాఘవాచార్యులు అవి పొరపాట్లని 1962 ఫిబ్రవరి భారతిలో సూచించుటకు పూర్వమే శ్రీ వెంకటరావుగారు వానిని గుర్తించి, 1959లో 'The Southern School in Telugu Literature' లో సవరించి యున్నారు. మరల శ్రీ నాగరాజుగారు "శ్రీ రాఘవాచార్యుల వారు చూపినపొరపాట్లు" అనుటఅసంగతము.

3. "శ్రీ రాఘవాచార్యులవారి సవరణలనుబట్టియు, శ్రీ నిడదవోలువారి నిరూపణలనుబట్టియు లక్ష్య లక్షణముల నేకరువుపెట్టిరి; పిష్టపేషణము!" అనిరి. "శ్రీ రాఘవాచార్యులవారి సవరణలను" అనుట అసంగతము. ఆయా అవస్థలకు లక్ష్యములుగా అన్ని అవస్థలకు లక్ష్యములను రాజగోపాల విలాసమునుండి శ్రీ రాఘవాచార్యులవారు చూపలేదు. శ్రీ వెంకటరావు పంతులుగారుగూడ అట్టి లక్ష్యము నన్నింటిని తమగ్రంథమున నుదహరించుటకు ప్రయత్నింపలేదు. పాఠకలోకము నుద్దేశించి చేసినయట్టి వివరణము శ్రీ రాఘవాచార్యులవారు చెప్పినవిషయములను శ్రీ వెంకటరావుగారు చూపినవిషయములను మరల "నేకరువు" పెట్టుట యెంతమాత్రమునుగాదు. దీనింగూర్చియు శ్రీ నాగరాజుగారి వ్రాతలు అసంగతములు.

4. "కాని, వారు (శ్రీ వేంకటరావు పంతులుగారు) ఏమని గుర్తించిరో ఆ గుర్తింపుకు ప్రస్తుతముతో నేమాత్రము ప్రశక్తియున్నదో తెలుపరైరి. వారు చెప్పిన యాంగ్లగ్రంథమునగల ప్రస్తుతాంశములను దెలుపక ...... లక్ష్య లక్షణముల నేకరువుపెట్టిరి; పిష్టపేషణము!"

ఒకవిషయమునుగూర్చి విమర్శించునపుడు అవిషయమునకు సంబంధించిన వ్యాసములు, గ్రంథములు మున్నగు వానిని సావధానముగను సాంతముగను చదివి, విమర్శకు గడంగుట విమర్శకు డాచరింపవలసిన ప్రాథమిక సూత్రములం దొకటి. శ్రీ రాఘవాచార్యులు శ్రీ వేంకటరావుగారి "The Sou-thern School in Telugu Literature" గ్రంథమునుగూర్చి వినియుండకపోవచ్చును. శ్రీ బండి నాగరాజుగారా గ్రంథమునుగూర్చి వినినట్లెమ్మట, దానిని పరిశీలించుటకు యత్నింపకయే విమర్శించుటకు బూనుకొనుట సాహసము. మరియు దాని నాంగ్ల గ్రంథమనిరి. అది తెలుగు గ్రంథమే. మద్రాసు విశ్వవిద్యాలయ ప్రచురణమగు నాగ్రంథముఖపత్రముపై విశ్వవిద్యాలయము వారి యాచారము ననుసరించి "The Southern School in Telugu Literature" అని యుండును. ఈ గ్రంథముపై జూన్ 1962 'భారతి' యందు 'గ్రంథవిమర్శనము

గూడ వెలువడినది. ఇకపైన శ్రీ బండినాగరాజుగారా గ్రంథమును పరిశీలింతురని విశ్వసించుచున్నాను.

—ఆర్. రాజగోపాల్

## పెదతూర్కనకవి

**"భారతి" సంపాదకులకు :**

మహాశయా!

నమస్కృతులు. 'పెద తూర్కన కవి'ని గురించి ఈ క్రింది పంక్తులు తమ పత్రికలో ప్రకటింప ప్రార్థన.

శ్రీ తిమ్మావఝ్ఝుల కోదండరామయ్యగారు గడచిన నెల భారతిలో వ్రాసిన వ్యాసమున ఇతనింగూర్చి ప్రశ్నించుచు, తూర్కన యనుపేరు వింతగా కూడ నున్నదనియు, అట్టికవి తిక్కనకు తర్వాతను, జక్కనకు ముందును ఉండియుండుననియు, కాబట్టి ఈతడు దగ్గుబల్లి దుగ్గన (దుర్గన—తూర్కన) కానేరడనియు వ్రాసియున్నారు. పెదతూర్కన మంత్రి నొకవిని శ్రీనాథుడు శృంగార నైషధమున మామిడి సింగనామాత్యుని మూలపురుషునిగా పేర్కొనియున్నాడు.

"ఆ మునినాథు నన్వయము
నం దుదయించెఁ బయఃపయోనిధిన్
యామవతీ కళత్రుఁ డుద
యంబయి నట్లుగఁ గల్పవృక్ష చిం
తామణి కామధేను సమ
దాన నిరూఢుఁడు విద్విషత్తమ
స్తోమ దివాకరుండు పెద
తూర్కన మంత్రి కులాగ్రగణ్యుఁడై"

ఆశ్వా. 1—ప. 20

పెదమార్కన మంత్రి భారద్వాజగోత్రుడు. తర్వాత శ్రీనాథుడు 'తత్సంతానక్రమంబున' అని నెల్లూరి చిటిపెద్ద ప్రభుని అతని కుమారుని మామిడన్నను—ఇట్లు క్రమమున మామిడి సింగన్నవరకు చెప్పియున్నాడు. శ్రీనాథుని కాలమునుండి వెనుకకు లెక్కపెట్టుకొందమన్న ఇన్ని తరము లనుటకు సాధ్యము కాక, తూర్కన తర్వాత ఎప్పుడో చిటిపెద్దప్రభు వనుటచే చాల పూర్వుడని మాత్రము కుదురుచున్నది. తిక్కనకు తర్వాతి వాడనియే యనుకొన్నను మామిడివారి నందరిని శ్రీనాథుడు వీరాగ్రేసరులనుగానే వర్ణించినాడు గాని, ఎవరినిగాని కవులనుగా గ్రంథరచయితలనుగా పేర్కొనలేదు. కావున కవి యనుటకు కుదురకున్నది.

తూర్కన యనుపేరు వింతగానే యున్నది గాని మనకు లేకపోలేదు. నైషధమే సాక్షి. తమిళదేశములో నేటికిని కలదు. 'తులుక్కాణం చెట్టియారులు' ఎందరో కలరు. 'తులుక్కాణం అమ్మన్' అను గ్రామదేవత కలదు. ఈ తులుక్కాణదేవియే దుర్గయు కావచ్చును గాని, అది తుర్క శబ్దముకాక, తూర్క శబ్దమగుటచేతను, 'పెద తూర్కన మంత్రి' 'నెల్లూరి తూర్కరాజ' అను ప్రయోగము లుండుటచేతను విచారణీయము. మా తాతగారు సూర్యరాయాంధ్ర నిఘంటు సంపాదకులుగా నుండిన కాలమున వెలువరించిన 'నిఘంటుకతిపయవు'లలో శబ్దసిద్ధి యెట్లు అను శీర్షిక క్రింద 15—వ సూత్రమున నిట్లు ప్రశ్నించినారు (1914—16 సం॥)—'కొన్ని మనుష్యాది నామములకు అర్థ ఉత్పత్తుల నరయవలయు—ఉ. ఎలమంద, పల్లాలు, తూర్కన, పళ్లయ్య.'

మంత్రులుగానుండిన నియోగులే ఆ కాలమున కవిత్వము చెప్పుచుండినందున ఈ పెద తూర్కనమంత్రియే ఆ పెద తూర్కనకవిగా నుండునేమో. ఉభయులును శైవులుగానే యున్నారు. కాళహస్తి, నెల్లూరు ప్రాంతాలవారే. శ్రీనాథుని కాలమునకు మఱచిపోయి యుందురు.

—వేదము వెంకటరాయశాస్త్రి.

# వార్తలు

జులై 1:—పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి డా. బి. సి. రాయ్, మాజీ కాంగ్రెస్ అధ్యక్షుడు బాబూ పురుషోత్తమ్‌దాస్ టాండన్‌లు మరణించారు.

—భూమిశిస్తు పెంపకాన్నిగూర్చి ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ శాసనసభాపక్షం చర్చించింది. చర్చలో పలువురు ఈ విధింపులను విమర్శించారు.

జులై 2:—భూమిశిస్తు విషయంలో ప్రతిపక్షాల బెదిరింపులకు ప్రభుత్వం లొంగదని ఆంధ్ర ఆర్థికమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి బడ్జెట్‌పై చర్చకు సమాధానం ఇస్తూ, రాష్ట్ర శాసనసభలో విశదం చేశారు.

జులై 3:—ఆధునిక పద్ధతులకు తగినట్లుగా రాష్ట్రంలో జైళ్ల సంస్కరణలు అమలు జరపడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు న్యాయశాఖమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు శాసనసభలో ప్రకటించారు.

—3 వ తరగతినుంచీ ఇక ఇంగ్లీషు ఉంటుందని రాష్ట్ర విద్యామంత్రి ప్రకటించారు.

—అల్జీరియా స్వతంత్రరాజ్యంగా ప్రకటించబడింది

జులై 4:—రాష్ట్రంలో కొత్తగా నెలకొల్పే పరిశ్రమలకు అమ్మకంపన్నులో రాయితీలు చూపించగలమని ఆంధ్రప్రదేశ్ పరిశ్రమలమంత్రి డా॥ లక్ష్మీ నరసయ్య శాసనసభలో ప్రకటించారు.

—బ్యాంకుఉద్యోగుల జీతాలను హెచ్చు చేస్తూ శ్రీ దేశాయ్ అవార్డు ఇచ్చారు. ఆ అవార్డు ప్రకటించబడింది.

జులై 5:—అల్జీరియాలో అంతర్యుద్ధం ప్రారంభంకాగల లక్షణాలు కన్పించాయి. విముక్తి ఉద్యమ నాయకులలో తగాదాలు ఏర్పడ్డాయి.

జులై 5:—గోదావరి ఆనకట్టతలుపుల ఎత్తు పెంచే పంకల్పానికి ప్రభుత్వం పూర్తిగా స్వస్తి చెప్పినట్లేనని ఇరిగేషన్ మంత్రి శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి ప్రకటించారు.

—పంటల భీమాను గురించి ఆలోచించడానికి ఆంధ్రప్రభుత్వం నిశ్చయించినట్లు వ్యవసాయమంత్రి శ్రీ బలరామ రెడ్డి ప్రకటించారు.

—భూమిశిస్తు హెచ్చింపు బిల్లుతో శాసన పరిషత్తుకు సంబంధం లేదని సభాపతి శ్రీ సుబ్బారెడ్డి తీర్పు ఇచ్చారు.

—గోదావరి ఆనకట్ట విషయమై ప్రభుత్వ విధానాన్ని విమర్శిస్తూ శ్రీ అల్లూరి ప్రసంగించారు.

జులై 6:—కాకినాడలో ప్రత్యేకం చేపలరేవు నిర్మాణానికి కార్యాచరణ బృందం ఏర్పాటు చేయబడినట్లు, ముఖ్యమంత్రి వెల్లడి చేశారు.

జులై 7:—విజయవాడ—బందరు బ్రాడ్‌గేజి మార్గానికి రైల్వేమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

—ప్రాజెక్టుల అవసరాల దృష్ట్యానే రైల్వే సౌకర్యాల అభివృద్ధి అని రైల్వేమంత్రి ప్రకటించారు.

—6—8 సంవత్సరాలమధ్య పిల్లలకు ఈ సంవత్సరం నుంచే నిర్బంధ ప్రాథమిక విద్య ప్రారంభం అవుతుందని విద్యామంత్రి శ్రీ పి. వి. జి. రాజు ప్రకటించారు.

జులై 8:—జున్నార్ విమానప్రమాదంలో 94 మంది మరణించారు.

జులై 9:—కేరళలో మిశ్రమ మంత్రివర్గం కొనసాగా లన్న లాల్‌బహదూర్‌శాస్త్రి సూచనను అన్నివర్గాలవారు ఆమోదించారు.

చైనా—భారత సరిహద్దులలో గాల్వాన్ లోయలో చైనా కొత్త స్థావరాన్ని నెలకొల్పింది.

జులై 9:—నాగార్జునసాగర్ ఆయకట్టు అభివృద్ధిని సహకార పద్ధతిని కొనసాగించడానికి ప్రభుత్వం ఒక బృహత్పథకాన్ని తయారుచేయదలచినట్లు రాష్ట్ర ఆర్థికమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి ప్రకటించారు.

జులై 10:—గాల్వాన్‌లోయలోని భారత సైనిక స్థావరాన్ని చైనా సైనికులు చుట్టుముట్టారు.

—మాస్కో శాంతిసభలో శ్రీ కృశ్చేవ్ ప్రసంగించారు. విదేశాలలో సైనిక స్థావరాలు తొలగించడం శాంతికిమార్గం కాగలదని ఆయన అన్నారు.

జులై 10:—మూడవ ప్రణాళిక పూర్తిఅయ్యేనాటికి రాష్ట్రంలో ఆహారోత్పత్తి 50% పెంచాలని సమాజ వికాస మంత్రి శ్రీ చెన్నారెడ్డి ప్రకటించారు.

జులై 11:—సీలేరు ప్రాజెక్టు విషయంలో ఒరిస్సా పెడుతున్న పేచీలను ఏ. సి. సుబ్బారెడ్డి శాసనసభలో వివరించారు.

—1964 కల్లా విజయవాడ డ్రైనేజి స్కీము అమలు జరుగుతుందని శాసనసభలో పురపాలక వ్యవహారాలమంత్రి ప్రకటించారు.

—ఖండాంతరాలలో టెలివిజన్ ప్రదర్శనకు మార్గాన్ని వేస్తూ, అమెరికా కొత్త రకం ఉపగ్రహాన్ని వదిలింది.

జులై 12 :—భారతదేశానికి ఆర్థిక సహాయంచేసే బిల్లును అమెరికా దిగువసభ ఆమోదించింది.

—కాంగోలో ఆదౌలా ఉత్తరకటాంగా రాష్ట్రాన్ని సృష్టించారు.

—పుదుచ్చేరిమీద సర్వాధికారాలను భారతదేశానికి ఇస్తూ, ఫ్రెంచి పార్లమెంటు ఒక శాసనం చేసింది.

జులై 13:—సింగరేణి గనులను కేంద్రానికి ఇచ్చేది లేదని ముఖ్యమంత్రి ప్రకటించారు.

జులై 14:— గాల్వాన్ లోయలో చైనా సేనలు వెనక్కు తగ్గాయి.

—బ్రిటిష్ మంత్రివర్గంలో ప్రధానమంత్రి శ్రీ మాక్మిలన్ పెద్ద మార్పులు చేశారు.

జులై 14:—రాష్ట్ర శాసనసభలో రివిన్యూమంత్రి సమగ్ర కౌలుదారీ చట్టాన్ని ప్రవేశపెట్టారు. శాసనసభ దానిని సెలెక్టు కమిటీకి పంపించింది.

జులై 16:—జనీవాలో తిరిగి నిరాయుధీకరణ సమాలోచనలు ప్రారంభమైనాయి.

జులై 17:—నిరాయుధీకరణ సమావేశంలో బ్రిటన్ 11 సూత్రాల ప్రతిపాదనను చేసింది.

జులై 17:—వంశధార ప్రాజెక్టు నిర్మాణానికి ఒరిస్సాతో పాటు, కేంద్ర జల విద్యుత్ సంఘం గూడా అడ్డు తగులుతున్నట్లు ఇరిగేషన్ మంత్రి శ్రీ సుబ్బారెడ్డి శాసనసభలో వెల్లడి చేశారు.

జులై 18:—ఆంధ్ర, కేరళ రాష్ట్రాల నదులలోని అదనపు నీరును తమ రాష్ట్రానికి ఇచ్చేట్లు చూడాలని మద్రాసు రాష్ట్రం కోరింది.

—పెరూలో అధికారం సైన్యం హస్తగతమైంది.

—జపానులో శ్రీ ఇకేడా ప్రధానిగా కొత్త ప్రభుత్వం ఏర్పడింది.

జులై 18:—పోచంపాడు ప్రాజెక్టుపై ప్రాథమిక కార్యకలాపాల నిర్వహణకు ఈఏడాది 50 లక్షలు ఖర్చు కానున్నట్లు శ్రీ ఏ. సి. ప్రకటించారు.

—పర్షియా ప్రధాని రాజీనామా ఇచ్చారు.

జులై 19:—శ్రీశైలం ప్రాజెక్టు మంజూరు కాకపోయినా పనులు జరుగుతాయని శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి ప్రకటించారు.

జులై 20:—అధిక ధరలకు వ్యతిరేకంగా మద్రాసులో డి. ఎం. కే. ఉద్యమం ప్రారంభమైంది.

—తృతీయ ప్రణాళికాకాలంలో 12 విశ్వ విద్యాలయాలను స్థాపించాలని విశ్వవిద్యాలయాల గ్రాంటుల సంఘం వేసిన పరిశీలక సంఘం సూచించింది. ఇందులో ఒకటి ఆంధ్రప్రదేశ్‌లో నెలకొల్పాలని గూడా ఆ సంఘం అన్నది.

—భారత ఆర్థిక సహాయ శాసనాన్ని అమెరికా కాంగ్రెస్ ఆమోదించింది. కోతలు తొలగింపబడినాయి.

జులై 21:—1951 ఒప్పందంపై నదీ జలాల విషయంలో రాజీపడేదిలేదని శ్రీ ఏ. సి. సుబ్బారెడ్డి శాసనసభలో ప్రకటించారు.

జులై 22:—చైనా భారత సరిహద్దుల్లోఉన్న చిప్‌చాప్ లోయలో భారత సైనికులపై చైనీయులు కాల్పులు సాగించారు.

—లావోస్ తాటస్థ్యాన్ని గూర్చి ఒప్పందం కుదిరింది.

—రష్యావద్ద మిగ్ విమానాలు కొనడానికి భారత ప్రభుత్వం నిశ్చయించుకుంది.

—బుక్సార్ రైలుప్రమాదంలో 42 మందిచనిపోయారు.

—విదేశాలలో పర్యటన ముగించుకొని ఆర్థికమంత్రి శ్రీ దేశాయ్ స్వదేశానికి వచ్చారు.

జులై 22:—తిరిగి అణ్వస్త్ర పరీక్షలకు రష్యా ఉత్తర్వులు జారీ చేసింది.

—డుమ్రైన్ రైలు ప్రమాదంలో 48 మంది మరణించారు.

జులై 23:—లావోస్ తాటస్థ్య సంధిపై సంతకాలు జరిగాయి.

—సింహళంలో డి. ఎం. కె. ను నిషేధించారు.

—అల్జీరియాలో బెన్‌బెల్లావర్గం దేశంలో చాలా భాగాన్ని ఆక్రమించుకున్నది.

—విదేశాలలో సైనిక స్థావరాలను తొలగించాలన్న రష్యా వాదాన్ని అమెరికా తిరస్కరించింది.

జులై 23:—శ్రీశైలం ప్రాజెక్టు స్థలాన్ని రాష్ట్రపతి దర్శించారు.

—తెలంగాణాలో మద్యనిషేధం అమలుకు ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు మంత్రి శ్రీ ఎం. ఆర్. అప్పారావు ప్రకటించారు.

జులై 26:—రాష్ట్ర బడ్జెట్టును శాసనసభ ఆమోదించింది.

—ఖమ్మంజిల్లాలో కిన్నెరసాని ప్రాజెక్టును 1965 నాటికి పూర్తి చేయాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు ఇరిగేషన్ మంత్రి ప్రకటించారు.

28:—భూమిశిస్తు బిల్లుపై పరిశీలక సంఘం నివేదిక ప్రకటింపబడింది.

జులై 30:—కాంగోలో ఫెడరల్ పద్ధతి రాజ్యాంగాన్ని అమలు జరపడానికి అదౌలా ఆమోదించారు.

—ఆహార ధాన్యాల ఉత్పత్తి అనుకున్నట్లు సాగడంలేదని ప్రణాళికల మంత్రి శ్రీ నందా అంగీకరించారు.

జులై 30:—భూమిశిస్తు బిల్లుపై రాజధానిలో ప్రతిపక్షాలు వ్యతిరేక ప్రదర్శనలు చేశాయి.

**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.**